# భూమిక

శాహపురాధీశులైన శ్రీమహారాజాధిరాజ నాహరసింహావర్మగారి ప్రేరణచే విశ్వేశ్వరానంద నిత్యావములీగ్రంథమును హిందీభాషయందు రచించిరి. ఇట్టిపుస్తకమును వ్రాయవలయునని యిదివఱకే నేదలచియుంటిని కాని దీనిజూచినతరువాత స్వయముగనైన నిట్టిదాని వ్రాయజాలననెడి యుద్దేశముతో దానినే తెనిగించితిని. హిందీభాషయందు నాకుగావలసినంత పాండిత్యములేకపోయినను ప్రస్తుతము మనయాంధ్రదేశమందెల్లయెడల వ్యాపించియున్న సంఘసంస్కరణ సంబంధములైన వాదవివాదముల కత్యవసరమై తగినరీతి సహాయమొనరించుననెడియాశయే నాయసమర్థతను గణింపనీయక దీనిదెనుగుజేయునట్లు ప్రేరేపించినది. సమాజోన్నతియెడల ధ్యానముగలిగి సంఘసంస్కరణమందభిలాషఁబూనియుండు నిష్పక్షపాతమనస్కులగువారల దృష్టికిది యుపయోగకరమైన గ్రంథముగనే తోఁపవచ్చును గాని యందులకు విపరీతదృష్టితోఁ జూచువారలకు నికృష్టముగ ప్రతీతమగుటయగాక కొంచెము మనసుబట్టులేనివారలకైనచో పుస్తకమును నేల విసరికొట్టునంతటి యుద్రేకము జనింపజేసినను జేయవచ్చును. కానిండు, ఎవరికెట్టిజ్ఞానసారము వారికి బుద్ధులుగాని యభిప్రాయములుగాని గలుగుచుండుట మనుష్యసమాజమందు స్వభావసిద్ధమైయుండుట.

సి యట్టి పరస్పరభిన్నాభిప్రాయంబులు గలుగుటకు వగవవలసి నపనిలేదు. నిశ్చయముగ నెవరిమనస్సునకు గానినొప్పిగలిగింపవలయుననెడి యభిప్రాయముతో నిదియొంతమాత్రము వ్రాయబడలేదు. కేవలము సామాజకోన్నతియెడల ధ్యానముగలిగియే వ్రాయబడినది. ఇందలిప్రమాణములన్నియు వేదాదిసత్యశాస్త్రములనుండియేగాక "విషాదప్యమృతంగ్రాహ్యం" అను న్యాయముననుసరించి వేదమునకు విరుద్ధములైన విషయములతోడనే విస్తారభాగమునిండబడి మధ్యమధ్య గొన్నిచోట్లవేదానుకూలములైన సంగతులుగల యసత్యగ్రంథములనుండియు గైకొనబడినవి. ఈసత్యాసత్యగ్రంథములవిషయమై తెలియఁగోరువారు దయానందసరస్వతివ్రాసిన సత్యార్థప్రకాశమను గ్రంథమునుండి తెలిసికొనవచ్చును. శరీరమందును, బుద్ధిబలమందును, నీతిబలమందును మనమత్యంతహీనస్థితియందున్నారమనుట కనేకనిదర్శనములుగలవు. అందులకుగారణము తాత్కాలికావసరములనిమిత్తము నిర్మింపబడుచువచ్చిన కల్పితములైన యసత్యగ్రంథములనే ప్రమాణములుగ దీసికొని వానిననుసరించి నడచుకొనుటయే గాని వేరుగాదు. కావున దీనిజదువుకొనువారందరట్టి సమాజోన్నతికాటంకములైన యాచరణంబుల బరిత్యజించి యిందువివరింపబడినరీతి బ్రాచీనఋషిసమ్మతములగు యాచారములనే యవలంబించి సంఘమునభివృద్ధిజేసి

కొనుచు విశ్వేశ్వరానంద నిత్యానందులపరిశ్రమను సఫలముజే సెదరని నమ్ముచున్నాడను. ఇందలివిషయములగురించి న్యాయదృష్టితోనడుగు సందేహములదెలిసినంతవరకు దీర్పబ్రయత్నించెద గాని పక్షపాతమనస్కులగువారలు చేయునట్టియాక్షేపణములకు బ్రత్యుత్తరమీయదగినంత సామర్థ్యము నాకడ లేదుగాన నట్టిపనికిబూనుకొనసాహసింప నందులకు జదువరులుమన్నింపవలయును.

ప్రూఫులుదిద్దువారలకిదియే ప్రథమప్రయత్నమగుటవలన నిందు విస్తారముగనచ్చుతప్పులుబడియున్నవి. శుద్ధపత్రముం జూచి సవరించుకొన బ్రార్థితులు.

సికింద్రాబాదు
12—5—1913

ఇట్లు విన్నవించు
సజ్జనసేవకుడు
వేలాల సుబ్బారావు.

# ఇందలి గ్రంథసంకేతముల వివరము

| | | | |
|---|---|---|---|
| ఋ. | ఋగ్వేదము. | ని. | నిదానస్థానము |
| అ. | అష్టకము. | వి. | విమానస్థానము |
| అ. | అధ్యాయము. | శా. | శారీరస్థానము. |
| వ. | వర్గము. | చి. | చికిత్సాస్థానము. |
| మం. | మండలము. | క. | కల్పస్థానము. |
| సూ. | సూక్తము. | అ. | అధ్యాయము |
| య. | యజుర్వేదము. | పా. | పాదము. |
| అ. | అధ్యాయము. | సు. | సుశ్రుతము. |
| సా. | సామవేదము. | ఛాం. | ఛాందోగ్యము. |
| పూ. | పూర్వార్చికము. | ప్ర. | ప్రపాఠకము. |
| ప్ర. | ప్రపాఠకము. | ఖం. | ఖండము, |
| దశ. | దశతి. | బృ. | బృహదారణ్యకము, |
| ఉ. | ఉత్తరార్చికము. | ఉ. | ఉపనిషత్తు. |
| పూ. ప్ర. | పూర్వార్ధప్రపాఠకము. | అ. | అధ్యాయము. |
| ఉ. ప్ర. | ఉత్తరార్ధప్రపాఠకము. | బ్రా. | బ్రాహ్మణము. |
| అథ. | అథర్వవేదము. | అ. | అష్టాధ్యాయి. |
| కాం. | కాండము. | అ. | అధ్యాయము. |
| అను. | అనువాకము. | పా. | పాదము. |
| వ. | వర్గము. | మహా. | మహాభాష్యము. |
| ఐ. | ఐతరేయబ్రాహ్మణము. | అ. | అధ్యాయము. |

| | | | |
|---|---|---|---|
| పం. | పంచిక. | పా. | పాదము. |
| అ. | అధ్యాయము. | ఆ. | ఆహ్నికము. |
| శ. | శతపథబ్రాహ్మణము. | ని. | నిరుక్తము. |
| కాం. | కాండము. | పూ. | పూర్వపక్షము. |
| ప్ర | ప్రపాఠకము, | ఉ. | ఉత్తరపక్షము. |
| బ్రా. | బ్రాహ్మణము. | అ. | అధ్యాయము. |
| కం. | కండిక. | ఖం. | ఖండము. |
| గోప. | గోపథము. | గో. | గోభిలీయసూత్రములు. |
| పూ. | పూర్వభాగము. | పా. | పారస్కరసూత్రములు. |
| ఉ. | ఉత్తరభాగము. | ఆ. | ఆశ్వలాయనసూత్రములు. |
| ప్ర. | ప్రపాఠకము. | శాం. | శాంఖాయనసూత్రములు. |
| చర. | చరకము. | లా. | లాట్యాయనసూత్రములు. |
| సూ. | సూత్రస్థానము. | ఆప. | ఆపస్తంబసూత్రములు. |
| కా. | కాత్యాయనసూత్రములు. | మీ. | మీమాంసము. |
| అ. | అధ్యాయము. | పా. | పాదము. |
| వే. | వేదాంతము. | న్యా. | న్యాయము, |
| వై. | వైశేషికము. | ఆ. | ఆహ్నికము. |
| సాం. | సాంఖ్యము. | యో. | యోగశాస్త్రము. |
| మను. | మనుస్మృతి. | వా, రా. | వాల్మీకరామాయణము. |
| భార. | భారతము. | భ. | భగవద్గీత. |
| శు. | శుక్రనీతి. | | |

ఇట్లియాయాగ్రంథముల మొదటియక్షరములుపయోగింపఁబడినవి. చదువరులూహించుకొందురుగాక.

# శుద్ధపత్రము

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3. | 1. | కర్త్రా౹ | కర్త్రా. |
| 9. | 19. | తమమూనధనంబు | తనమనధనంబు. |
| 20. | 5. | ప్రమాణజ్ఞాన | ప్రమాజ్ఞాన. |
| 20. | 13. | బథార్థము | బదార్థము. |
| 23. | 13. | తసమాన | తనమన. |
| 29. | 13. | రయోభవేత్ | రత్రోభవేత్. |
| 31. | 13. | విద్యై | విద్రై. |
| 31. | 20. | పవాసే | ప్రవాసే. |
| 83. | 2. | థృష్టత్వము | దృష్టత్వము. |
| 42. | 17. | కోసగాం | మోసగాం. |
| 47. | 7. | విద్యాధ్యయన | విద్యాభ్యయన. |
| 49. | 16. | విశ్యామిత్రు | విశ్వామిత్రు |
| 56. | 16. | విద్యార్థి | విద్యార్థి. |
| 60. | 18. | అర్థవనాస్య | అర్థవణాస్య. |
| ” | ” | తిశంతి” | దిశంతి”. |
| 61. | 14. | యన్ని స్తో | యగ్ని స్తో. |
| 62. | 6. | రయిక్కు | రయిక్వు. |
| 65. | 20. | మీా ంసమున | మీామాంసమున. |
| 67. | 4. | సామర్థ్వాత్ | సామర్థ్యాత్. |
| 90. | 5. | రాజ్యమప్పుడు | రాజ్యమిప్పుడు. |
| 98. | 16. | పశులె | పశువై. |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 103. | 10. | విధమున | ధనము. |
| 104. | 13. | పడియున్నది | పడియున్నవి. |
| 105. | 5. | కులులకు | కులకు. |
| 111. | 11. | భూమితిన | భూమితివి. |
| ” | 12. | కళజ్ఞులు, ప | కళజ్ఞులు, స. |
| ” | 20. | భూమివిద్య | భూమితివిద్య. |
| 124. | 3. | పరీక్షోత్తర్ణుడు | పరీక్షోత్తీర్ణుడు. |
| 124. | 19. | భలము, | ఫలము, |
| 133. | 6. | దియకేని | అతనికే. |
| 133. | 7. | యింద్రామలజయింపగలిగిం. | యింద్రి (యములజయింపగలిగి.) |
| 134. | 4. | సభ్యసించు | నభ్యసించు. |
| 172. | 13. | పిద్యావిషయంబును. | విద్యావిషయంబున. |
| 185. | 2. | భేషములు | భేదములు. |
| ” | 19. | మొదవకర్తవ్యము శ్రేష్ఠములగుటం జేసి | (మొదవకర్తవ్యములకంటెనొకటివ, రెండవకర్తవ్యము శ్రేష్ఠములగుటం జేసి.) |
| 189. | 8. | లొక్క | నొక్క. |
| 193. | 16. | రక్షీద్ధనైరపి | రక్షేద్ధనైరపి. |
| 194. | 2. | ధనరక్షణము | దనరక్షణము. |
| 199. | 17. | యోచిభర్తి | యోబిభర్తి. |
| 206. | 9. | చత్తునను | చచ్చెదను. |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 207. | 19. | మాతవ్యః | మంతవ్యః |
| 211. | 8. | సోలుత్తర | స ఉత్తర. |
| 213. | 6. | కాకతాళ | కాకతాళీ. |
| 218. | 10. | నీశరీరంబున | శరీరంబున. |
| 224. | 8. | వయును | వలయును. |
| 228. | 9. | ష్టమునకు | ష్ణమునకు. |
| 232. | 14. | దూషితమైనేవి | దూషితమైనవి |
| 246. | 16. | నత్యాగియు | త్యాగియు. |
| 256. | 16. | నొందక తననసేక | నొంద కతన ననేక. |
| 272. | 16. | తన కెల్లప్పుడు | తల కెల్లప్పుడు. |
| 277. | 12. | యిట్టటు | యిటునటు. |
| 280. | 1. | మాధారముల | మాహారముల. |
| 285. | 4. | నీరోగముగ | నిరోగముగ. |
| 291. | 9. | అట్టివారికి క్షయమగుచుండును. | అట్టివా (రికిఆయువు క్షయమగుచుండును) |
| 291. | 19. | మనుజుండికార్యంబును. | మనుజుండీకా (ర్యంబును) |
| 294. | 15. | చేసెల | చేసికొ |
| ” | 17. | సకాది | సకాల. |
| 300. | 8. | వానికే | దానికే. |
| 300. | 20. | నాటివాని | నాటువాని. |
| 306. | 6. | చుర్నారు. | చున్నారు. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | 19. | శ్రీంగోడ | స్త్రీంగోడ. |
| 312. | 17. | లులుగా | లలుగా. |
| ,, | ,, | మైకూ | సుకూ. |
| 317. | 5. | యుదరమాగలు | యుదరమాగలి. |
| 318. | 19. | జౌష్టిక | జౌష్టిక. |
| 319. | 19. | సిలాంశినదియు,( | సిరాడినదియు, |
| 340. | 13. | దానిపోషణము | వానిపోషణము. |
| 345. | 1. | శాలునిసం | శాలుని స్వ. |
| ,, | 15. | గళంకితము | గళంకము. |
| 347. | 13. | బకులు | బకులు. |
| 350. | 15. | నష్టముం | నష్టముం. |
| 364. | 10. | సిన్యాయాంబులు | నన్యాయాంబుల. |
| 366. | 17. | యుశికాశమును | యనకాశమును. |
| ,, | 19. | బల్లెలను, పవనంబులు | బల్లెలనుపవనంబుం. |
| 368. | 15. | సీరిలో | సీసిలో. |
| 370. | 8. | సాకర్య్యమై | సాకర్య్యమై, |
| 381. | 6. | యుక్తిగతి | యుక్తిగతి. |
| 382. | 10. | గశినాతీతము లైన | గణనాతీతము లైన. |
| 391. | 3. | భలకపట | ఫలకపట. |
| ,, | ,, | దోషసంవృత్తి | దోషసంవృత. |
| 892. | 20. | టంబు | నాటంబు. |
| 401. | 6. | పరిమాణపుల | పనమాణపుల. |

ఓం.




## బ్రహ్మచర్య ప్రకరణము.



యాదంతి యచ్చదూరకే భయం విందతి మామిహ,
పవమాన వితజ్జహి. ఋ. అ, 7. అ, 2. వ, 17. మం, 21.

పూజనీయుడవైన పరమేశ్వరా! ఈజగత్తులో దూర సమీపప్రదేశములందు మాకగు భయమెయ్యదికలదో దానిని నాశనము చేయుము.

యస్మాన్న జాతః పరో అన్యో అస్తి య ఆవివేశ భువనాని
విశ్వా, ప్రజాపతిః ప్రజయా సంరరాణస్త్రీణి జ్యోతీంషి
సచతే స షోడశీ. య. అ, 8 మం, 36.

ఎవనికంటె నధికుడెవడును గలుగడో, ఎవఁడు లోకము లన్నింటియందు వ్యాపించియున్నాఁడో యట్టియాపరమాత్మయే సమస్తసంసారమునకుఁ బతియై సకలప్రాణులకు సర్వపదార్థముల నొసంగువాఁడు. మఱియు నెవఁడు సూర్యాగ్నివాయువులనెల్ల కడలవిస్తృతముగావించెనో, యెవఁడు పదియాఱుకళలచే నీప్రపంచమునంతయు రచించెనో యట్టియాపరమాత్మయే మనుష్యమాత్రునకుపాసనీయుఁడు.

స్వస్తినఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినః పూషావిశ్వవేదాః
స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు.
సామ. ఉ. ఊ, ప్ర, 11. మం, 3.

సర్వేశ్వరా! జ్ఞానమయా! సర్వపోషకా! సర్వజ్ఞానాధికరణా సర్వశక్తిమాన్! సర్వనియంతా! సర్వరక్షకా! పరమాత్మా! మాకు అఖండమైన సౌఖ్యమును ప్రసాదింపుము.

శ్లో॥ అభయంమిత్రా దభయమమిత్రా దభయంజ్ఞాతాదభయం
పరోక్షాత్, అభయంనక్తమభయం దివానః సర్వాఆశామ
మమిత్రంభవంతు. అథర్వ. కాం, 19. అను, 2. వ, 15. మం,6

ఈశ్వరా! మిత్రామిత్రులనుండియు, జ్ఞాతాజ్ఞాతపదార్థములనుండియు, రాత్రిందివములనుండియు, మమ్ము భయరహితులుగాఁజేయుము. నీయొక్క కృపవలన సమస్తదిశలు మాకుమిత్రములై సుఖప్రదంబులగుఁగాక.

శాంతాద్యౌః శాంతాపృథివీశాంత మిదముర్వంతరిక్షమ్,
శాంతాఉదన్వతీరాపః శాంతానః సంత్వోషధీః.
అథర్వ. కాం, 19. అను. 1. వ, 9. మం, 1.

పరమేశ్వరా! నీయొక్క కృపవలన ఆకాశ, పృథివీ, అంతరిక్ష, జలములు, నోషధులు మాకు సౌఖ్యప్రదములగుఁగాక.

అట్టి యాసచ్చిదానంద, నిరాకార, నిర్వికార, నిరాధార నిగమప్రద, సర్వాధార, సర్వేశ్వర, సర్వవ్యాపక, సర్వాంత

ర్యామి, అజర, అమర, నిత్య, శుద్ధ, పవిత్ర, సృష్టికర్త్రాద్యనేక విశేషణవిశిష్టుండగు నప్పరమాత్మ కనేక ప్రణామంబు లాచరించి పురుషార్థ ప్రకాశమను గ్రంథము ప్రారంభించెదము.

విచారించిచూడ జగత్తునందు జడములనియు, చేతనములనియు రెండుప్రకారములగు పదార్థములు ప్రతీతములగుచున్నవి జ్ఞానము మొదలగు గుణములు కలిగియుండనివి జడములనియు, జ్ఞానాదిగుణసమేతములైనవి చేతనములనియు బిలువఁబడును. ఈశ్వరుండనియుఁ జీవుండనియు మరల చేతనములు రెండు విధములు.

అజన్మ, నిరాకార, నిర్వికార, నిర్గుణ, నిరవధి, నిరవద్య, నిత్య, నిరంజన, నిరామయ, నిరవయవ, నిరుపద్రవ, నిర్భర, అజర, అమర, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావ, సర్వేశ్వర, సర్వవ్యాపక, సర్వనియంత, సర్వాంతర్యామి, సర్వసుఖద, సర్వజ్ఞ సర్వసాక్షిభూత, విశ్వవంద్య, విశ్వంభర, విశ్వవినోద, విశ్వకృదాద్యనేక విశేషణయుక్తంబగు సచ్చిదానంద స్వరూప మెయ్యది కలదో యదియే ఈశ్వరరూపము. ప్రాణాంతఃకరణాంబులఁగూడికొని కర్మానుసారంబుగ మనుష్య, పశు, పక్షి, మృగాదుల శరీరములఁ దాల్చుచు, శుభాశుభకర్మంబులకు సుఖదుఃఖరూప ఫలముల ననుభవించుచుండునది జీవస్వరూపము. ప్రపంచమందలి సమస్తప్రాణికోటిలో

శ్లో॥ భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాంబుద్ధి జీవినః,
బుద్ధిమత్సునరాః శ్రేష్ఠా నరేష్వపి ద్విజాతయః.
భార, ఉద్యో ప. అ. 6. శ్లో, 1.

పృథివ్యాదిభూతములకంటె ప్రాణులుత్తమములు; అట్టి ప్రాణులలో బుద్ధినికలిగియుండునవి శ్రేష్ఠములు; వానిలోమను ష్యుఁడు శ్రేష్ఠుఁడు. అట్టిమనుజులలో ద్విజాతు లుత్తములను భారతవచనమునుబట్టి మానవుఁడే శ్రేష్ఠుఁడుగాన యతని కర్తవ్య మును గూర్చి వ్రా[illegible]దను.

ఆయిదారు సంవత్సరములు వచ్చినతో[illegible] [illegible]నకు గొంచెము నిజానిజముల విషయమై జ్ఞానము[illegible] అట్టి జ్ఞానముకలుగునో యప్పుడే యతని[illegible] యుట కర్హుఁడగును. [illegible]హ్వాదివిధియోగుల యా[illegible]నప్పుడే విశేషకర్తవ్యము లొనరింప సమర్థుఁడగును. కాని యుపనయనా నవజన్మమునకుఁ బ్రథమకర్తవ్యమేదియో యని విచా[illegible] [illegible]షయమై యుక్తిప్రమాణ పూర్వకముగ, మనుజునకు మొదటి కర్తవ్యము బ్రహ్మచర్యమని సకల విద్వాంసుల యంగీకారము తో సిద్ధమైయున్నది. ఏలయన జనులందఱు సౌఖ్యము కావల యునని యే కోరుకొను చుండుటంబట్టి యట్టి సాంసారిక, పార మార్థిక సౌఖ్యములకు ముఖ్యకారణము బ్రహ్మచర్యమే. ఈ బ్రహ్మచర్య శబ్దమున కర్థమేమన,

బ్రహ్మణే వేదాదివిద్యాయై చర్యతే ఇతి బ్రహ్మచర్యమ్॥
వేదవిద్య బ్రహ్మయనఁబడును. ఆవిద్యల నేర్చుకొనుటకొరకుఁ జూనుష్ఠింపఁదగిన యాచరణము బ్రహ్మచర్యము. ఆనియమమును ననుష్ఠించువాఁడు బ్రహ్మచారి. మఱియు,

బ్రహ్మణి చరితుం శీలమస్యాస్తీతి బ్రహ్మచారీ;
బ్రహ్మ వేదస్తదధ్యయనార్థం యద్వ్రతం తదపి బ్రహ్మ;
తచ్చరతీతి బ్రహ్మచారీ.

వేదవిద్యను బొందుటకుఁ దగిన శీలమొననియందుండునో వాఁడు బ్రహ్మచారి యనఁబడును. ఇంతియకాక వేదవిద్య నభ్యసించు నిమిత్తము అవలంబింపఁబడు జితేంద్రియత్వాది నియమములకుఁగూడ బ్రహ్మయని పేరుకలదు. కావున ఆనియమముల దాల్చినతఁడును బ్రహ్మచారి యనఁబడును.

బ్రహ్మచర్యమునవలన నుభయలోకసౌఖ్యములు కలుగునని యుపనిషత్తులయందు వ్రాసియుంటిమిగదా. ఏవిధమున విచారించినను అదినిశ్చయమే. ఎట్లనఁగా సమస్తసౌఖ్యముల ప్రాప్తికి హేతువు జీవనము. ఆజీవనమునకు ముఖ్యహేతువు ప్రాణరక్షణము; ఆప్రాణరక్షణమునకు ముఖ్యసాధనము బ్రహ్మచర్యమే యని వేదాదిశాస్త్రములు వక్కాణించుచున్నవి చూడుఁడు.

పృథక్ సర్వే ప్రాజాపత్యాః ప్రాణానాత్మసు బిభ్రతి,
తాన్త్సర్వాన్ బ్రహ్మ రక్షతి బ్రహ్మచారిణ్యాభృతమ్,
అథర్వ. కాం, 11; అను, 3; వ, 15.

జగమునకంతయుఁ దండ్రియగు పరమాత్మచే సృజింపఁబడిన మనుష్యాది నానావిధ జీవసంచయములు వేరువేరుగఁ దమతమ యాత్మలందుఁ బ్రాణములంబూని పోషించుకొనుచున్నవి. అట్టి యాప్రాణపోషణమునకు ముఖ్యసాధనము, విద్యార్థిచేత ననుష్ఠింపఁబడు బ్రహ్మచర్యనియమమేది కలదో యానియమమేకాని యన్యముకాదు. అనఁగా సకలజీవుల ప్రాణములు రక్షించునది ముఖ్యముగ బ్రహ్మచర్యమని దీని తాత్పర్యము. రెండియు

బ్రహ్మచారీనకాంచనార్తి మార్ఛతి. శత. కాం, 11.
ప్ర, 3, బ్రా, 6. కం, 2

బ్రహ్మచర్య నియమము బూనుటంజేసి యేప్రకారమగు దుఃఖము కలుగనేరదను శతపథవచనమువలన దుఃఖనివారణార్థముకూడ ఈనియమపాలన మావశ్యకమనుట స్పష్టము. ఇట్లే పుణ్యము, శరీరారోగ్యము మొదలగువాని కొఱకును దీనిసే యవలంబింప వలయును.

పుణ్యాతమమాయుః ప్రశస్తకరంజరావ్యాధి ప్రశమనం
ఊర్జస్కరమమృతం శివంశరణ్యము దాత్తంమత్యః ప్రోత్తుమర్హంథోః ధారయితుం ప్రకాశయితుంచ ప్రజానుగ్రహార్థ-
మార్షం బ్రహ్మచర్యం. చర,చి; అ. 1. రసాయన పాదము,4.

"తపోధనులైన ఋషులారా! సకలమానవులకుఁ బుణ్యములన్నిటికంటె నుత్తమపుణ్యముగునది బ్రహ్మచర్యము. మఱి

యు సంపూర్ణమగు నాయువు నొసంగునదియు ముసలితనమును శీఘ్రముగ రానీయనిదియు రోగముల నాశనము జేయునదియు, తేజము నభివృద్ధిబరచునదియు, నకాలమృత్యువునుండి తప్పించునదియు, కళ్యాణమొనగూర్చునదియు శరీరాదుల రక్షించునదియు, మనస్సునెల్లవేళల నానందమందు నిలుపునదియునగు బ్రహ్మచర్యమును మీరునావలనం దెలిసికొని యవలంబింపుడు సనాతనమైన యీనియమమును జనులకందఱకు సౌఖ్యములు గునిమిత్తము జగమునందుం బ్రచారము సేయుడు;" అని భృగు, అంగిరస, అత్రి, వసిష్ఠ, కశ్యప, అగస్త్య, పులస్త్య, వామదేవ, అసిత, గౌతమాది మహర్షులతోడ నింద్రుడు వచించియుండె. ఇట్లే,

శ్లో॥ ఆహారశయన బ్రహ్మచర్యైర్యుక్త్యా ప్రయోజితైః,
శరీరంధార్యతే నిత్యమాగారమివధారణైః.

అష్టాంగ, సూ. అ, 7.

గృహమునకుం గంబము లెట్లు ధారములగునో యట్లే బ్రహ్మచర్యముకూడ నిద్రాహారములతోం బాటు శరీరమున కాధారమని యాష్టాంగహృదయమునం జెప్పబడినది. అహా! ఏమను యమండీ ఆర్యావర్తంబను ప్రాసాదరాజంబున బ్రహ్మచర్యనామకస్తంభములు దృఢతరముగ నెలకొనియుండిన కాలమందీదేశము సమస్తప్రకారముల నైశ్వర్యశిఖరము నా

హించి యుండెను. కాని యెప్పుడు వానికి భంగము కలిగెనో యప్పుడే దేశమును భ్రష్టమయ్యెను. ఏలయన.

ఆయుస్తేజోబలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహాయశః
పుణ్యం చ మత్ప్రియత్వం చ హన్యతేఽబ్రహ్మచర్యయా

గౌ. స్మృ, అ, 4.

ఆయువు, తేజము, బలము, వీర్యము, బుద్ధి, శోభ, సౌందర్యము, ధనము, యశము, పుణ్యము, ప్రీతి మొదలగు వాని నబ్రహ్మచర్యము నాశనము చేయునని వృద్ధగౌతమస్మృతిలో వ్రాయఁబడియున్నది. అనఁగా బ్రహ్మచర్యనియమముఁ బాలింపనిచోఁ బైనవచించిన వన్నియు నష్టమగును. వాస్తవమున నీవ్రతపరిత్యాగమువలననే మనదేశమునకిట్టి దుర్దశ కలిగియున్నది. వెండియు నెంతపర్యంత మీదేశనివాసులైన జనులు మరల బ్రహ్మచర్యవ్రతమును బాలింపకుందురో యంతపర్యంత మీదేశమున కున్నతి కలుగుట యేవిధమునఁజూచినను నసంభవమే.

ఆచార్యుఁడు మొదలుగాఁగల గొప్పగొప్ప పదవులఁబొందుటకును, రాజ్యప్రాప్తికిని నీనియమపాలన మావశ్యకము.

ఆచార్యో బ్రహ్మచారీ బ్రహ్మచారీ ప్రజాపతిః
ప్రజాపతిర్విరాజతి విరాడింద్రో భవద్వశీ.

అథర్వ. కాం, 11. అను, 3. వ, 14.

బ్రహ్మచర్యవ్రతముచేతనే మనుజుండాచార్యపదమునం దుననియు, నందుమూలముననే ప్రజాపతియన రాజపదము గాంచుననియు, రాజపాలకుండై యధికారముం జెల్లించుచు జనులనందఱిం దనవశము చేసికొని ఇంద్రుండను పేరం బ్రసిద్ధికెక్కుననియు నథర్వవేదమునం బ్రతిపాదింపంబడి యున్నది. ఇంతయేల

బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రంవిరక్షతి.

అథర్వ. కాం, 11. అను, 3. వ, 14.

ఆవేదముననే రాజు తనరాజ్యమును రక్షించుకొనం గలుగునది బ్రహ్మచర్యముచేతనేగాని యితరవిధమునం గాదనియు, బ్రహ్మచర్యేణ వైలోకాన్ జయంతిపరమర్షయః

భార, శాం, అ, 243.

ఆ నియమపాలనముననే మహర్షిజనులు లోకలోకాంతరములంగూడజయింతురని భారతమందును లిఖింపఁబడి యున్నది బ్రహ్మచర్య వ్రతప్రభావంబున శాత్రవులు పరాజితులగు చుండుటంబట్టి పూర్వకాలమున మనయార్యావర్తమందలి ఋషులు మహర్షులు మొదలగు వారెల్లరు తద్వ్రతమును జక్కఁగఁబాలించి విరోధులపై గెలుపుగొనుచు వచ్చిరి. కాని ప్రస్తుతకాలమున దుష్టులు, మూర్ఖులు, మిథ్యావాదులు, ఛలకపటయుక్తులు, సాహసులు, తమమానధనంబులితరులచేదమకర్పణముంజేయించుకొనువారలు, మోసగాండ్రు, కూటసాక్షులు, స్వార్థులు, వ్య

భిచారులు, భారతవర్షంబు నార్తినొందించువారలు, తుచ్ఛులు
నగు జనులు తమయొక్క లాభమునిమిత్తము వేదవిరుద్ధమైన
మిథ్యామతమును వ్యాపింపఁజేసి యమాయికులగు జనులనందఱిఁ
ధర్మమునుండి పడఁగూల్చి యధర్మమందు ముంచియున్నారు.
ఇట్టిపాషండ వ్యాపారములు పూర్వకాలమున లేవు, ప్రాచీనకా
లమున ఋషిమహాత్ములు రాజాధిరాజులు మొదలుకొని సమ
స్తప్రజలు బ్రహ్మచర్యమునే పరమధర్మముగనెంచి దానిసం
పూర్ణముగఁ బాలించి తమశత్రువుల నోడించుచు వచ్చిరి
ఈవిషయములన్నియు మహాభారతాది ఇతిహాసములఁజూచుట
వలన స్పష్టముగఁదెలియనగుచున్నవి మరియు

బ్రహ్మచర్యంపరోధర్మః సచాపినియతస్త్వయి,
యస్మాత్తస్మాదహం పార్థరణేఽస్మిన్ విజితస్త్వయా,

భార, ఆ, ప, అ. 170,

గంధర్వుఁడొకఁడు అర్జునునిచే నోడింపఁబడి " అర్జునా! బ్ర
హ్మచర్యము పరమధర్మము. దానిప్రభావమువలననే నీవునన్ని
పుడు జయింపఁగలిగితి" వనిపార్థునితోఁబలికినట్లు వ్రాయఁబడి
యుండుటచే, చదువరులార! శాత్రవపరాజయంబునకు బ్రహ్మ
చర్యమెంత ఆవశ్యకమో యోజింపుఁడు. ఇంతియకాదు

వైఖానసా వాలఖిల్యాస్సైకతం చాన్యేతపోధనాః
రసాయనమిదం ప్రాశ్యబభూవురమితాయుషః

బ్రాహ్మంతపో బ్రహ్మచర్యం చేరుశ్చాత్యంతనిశ్చయాః
రసాయనమిదం బ్రాహ్మమాయుష్కామః ప్రయోజయేత్
చర. చి. అ, 1. పాద, 1.

వైఖానసులను పేరుగల వానప్రస్థతపస్వులు, వాలఖిల్యులను మునిజనులు, తక్కుంగలఋషులుమహర్షులు, మహాత్ములు మున్నగువారెల్లరు నిశ్చయపూర్వకముగ బ్రహ్మచర్యనామకరసాయనము సేవించియే దీర్ఘజీవులైరి. కావునమీయొక్కయాయువుల నభివృద్ధి బరచికొన నెంతురేని ఈబ్రహ్మచర్యమను రసాయనము సేవింపుఁడనిచరకాచార్యుఁడు సమస్తజనులకు నుపదేశము జేసియున్నాఁడు. ఈనియమము పాలించుటంజేసినే మహర్షిజనులు

వీతతంద్రాక్లమాశ్చ సన్నిరాతంకాః సమాహితాః,
మేధాస్మృతి బలోపేతాశ్చిర రాత్రం తపోధనాః
చర. చి. అ. 1. పా. 1.

వీతతంద్రులై యనగా నల్లమందు దినువారివలెఁగూర్కుచుండియే కునుకుపాట్లుపడువారు గాక పాపాచరణదూరులై రోగదుఃఖసందేహములవలన రహితులై, సమాహితస్వస్థాంతఃకరణులై, పురుషార్థులు, బుద్ధిమంతులు, స్మృతిమంతులు, బలవంతులునైయుండిరి. అటులే

కామాశ్చేష్టాః సమశ్నుతే. చర. చి. అ. 1. పా 1

క్రియాకుశలత్వమున వివిధములైన సౌఖ్యముల ననుభవించవలయునని యేపురుషుఁడుకోరునో యతఁడును బ్రహ్మచర్యమునే సలుపవలయునని అచోటనే వ్రాయఁబడియున్నది. ఇదేవిధమునధర్మయజ్ఞాదికామితముల యెడల నెవడు కోరికగలిగియుండునో యట్టిమనుష్యుఁడుకూడ ఈవ్రతమేయాచరింపవలయు. ఏలయన

ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వయ రసాయనం
అనుమోదా మహేబ్రహ్మచర్యమేకాంత నిర్మలమ్

అష్టాంగ. ఉ. అ. 4.

జగత్తులో ధర్మమునకు హితముగూర్చునదియు, కీర్తికలిగించునదియు, నాయువునభివృద్ధిపరచునదియు, నుభయలోకములఁ దరింపఁజేయునదియు ముఖ్యముగ బ్రహ్మచర్యమేకావున నట్టి నిర్మలనియమ మనుష్ఠించుటకు మేమును ననుమోదించుచున్నారమని యష్టాంగ హృదయకారుఁడగు వాగ్భట్టు వచించియున్నాఁడు. మరియు సంసారమునకు సంబంధించిన సౌఖ్యములన్నియు నాయువున కాధీనములైయుంట నెల్లరు నొప్పుకొను విషయమగుటం జేసి

బ్రహ్మచర్యమాయుష్యకరాణాం చర సూ. అ. 25

జగత్తులో మనయాయువు నభివృద్ధిపరచికొనుటకు సాధనములైన పదార్థము లెన్నికలవో వానినన్నింటిలో శ్రేష్ఠతమమైనది బ్రహ్మచర్యమే యను చరకమందలి వాక్యమువలన

నైహికసౌఖ్యములనిమిత్తము నీవ్రత మాచరించి తీరవలయు ను ప్రాచీనకాలమందలి మునులు, ఋషులు మొదలుగాఁగల జనులెల్లరు జ్ఞానవంతులు, గుణవంతులు, పరాక్రమవంతులునై యున్నతి శిఖరము నారోహించియుండుటకుఁ గారణమీని యమపరిపాలనమే కాని వేరొండేదియుఁగాదు. మనపూర్వులిక్కాలమందలి మూర్ఖులైన తలిదండ్రులంబోలి తమసంతానములకు బాల్యవివాహాది కుశిక్షలనొసంగియుండలేదు. వారలు తత్త్వజ్ఞులై యుండిన కారణమునఁ దమసంతానము లత్యుత్తమంబగురీతి బ్రహ్మచర్యము పాలించునట్లు జేసి వారిని పరాక్రమ వంతులు విద్యావంతులు, యోగ్యులునగునట్లు చేయుచువచ్చిరి. మరియు వారలు బ్రహ్మచర్యసేవనము జేయించక తమసంతానములఁ దమవద్దనుంచికొనఁగూడదని కులమర్యాదలంగిలిగియుండిరి, తమ సంతానములచేత బ్రహ్మచర్యము పాలనముచేయించుటయే తమకర్తవ్యముగ నమ్మియుండిరి. కొంతనియమితకాలము పర్యంతము తమబిడ్డలు బ్రహ్మచర్యము సలుపనిచో వారలు వర్ణసంకరులగుదురనియుఁ గులము కళంకితమగుననియుఁ దలంచుచు వచ్చిరి.

ఇందులకు నిదర్శనము చూడుఁడు,

శ్వేతకేతుర్హారుణేయఆసతగ్ంహ పితోవాచ శ్వేతకేతోవస
బ్రహ్మచర్యం నవైసోమ్యా స్మత్కులీనోనసూచ్యబ్రహ్మ
బంధురివభవతీతి. ఛాం. ప్ర. 6. ఖం. 1.

శ్వేతకేతూ! నీవు బ్రహ్మచర్యనియమ మవలంబింపుము దాని సేవింపనియెడల మనుజులు వర్ణసంకరులగుదురు. ఆవ్రతమును బాలింపనివారలు మనకులమునం దింతవరకెవరును జన్మించియుండలేదు. కావున నీవవశ్యముగ దీనిననుష్ఠింపుమని యుద్దాలకుఁడను ఋషి తనకుమారుఁడగు శ్వేతకేతున కుపదేశముగావించియుండెను. ఇంతియకాక

అథయద్యజ్ఞ ఇత్యాచక్షేత బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ యోజ్ఞాతాతం విందతేథయదిష్టమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవేష్ట్వాత్మానమనువిందతే అథయత్సత్రాయణ మిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవసత ఆత్మనస్త్రాణం విందతేథయన్మౌనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవాత్మానమనువిద్యమనుతే ఛాం ప్ర.8.ఖం.5

బ్రహ్మచర్యము యజ్ఞమనఁబడును దీనిసేవించుటఁజేసియే సమస్తమును గుర్తెఱిఁగి యుండు పరమేశ్వరుం దెలిసికొని యాయనను గ్రహింప శక్తికలుగును. ఈవ్రతమే సర్వసౌఖ్యములకు సాధనము. ఈనియమావలంబనమువలననే విద్య, బుద్ధిమొదలగు నుత్తమగుణములఁబొందనగును. దీనిననుష్ఠించుటచేతనే స్వాత్మకు యథావిధిపాలనము కలుగును. దీని నాచరించుటవలననే మననశీలుఁడై మనుజుఁడు పరమేశ్వరు ధ్యానింపఁగలుగు

వని ఛాందోగ్యమునందు లిఖింపఁబడియుండుటచే మనపూర్వు
లు బ్రహ్మచర్యమును యజ్ఞము మొదలగువానిగ నెంచుచుండి
నట్లు విదితమగుచున్నది. సత్యశాస్త్రములందెల్లెడల నింతగొ
ప్పగఁ జేర్కొనబడిన యీబ్రహ్మచర్యముయొక్క స్వరూపమెట్టి
దన

తదాహుర్బ్ర బ్రాహ్మణం బ్రహ్మచర్యముపనీయమిథునం
చరేద్గర్భో వా ఏషభవతి బ్రహ్మచర్యముపైతి.

శత.కాం,11 ప్ర, 3. బ్రా, 6. కం, 16.

స్త్రీసంభోగమునల్పకుండుట బ్రహ్మచారికత్యంత ముఖ్య
మైయున్నది. బ్రహ్మచర్యము విద్యా, బల, బుద్ధి, వీర్య, పరా
క్రమాదులయొక్క గర్భమగుటంజేసి, స్త్రీగర్భమునందెట్లు శి
శువుయొక్క శరీర మభివృద్ధిబొందుచుండునో యటులే విద్యా
బల బుద్ధి వీర్య పరాక్రమాది సహితంబగు బ్రహ్మచర్యావస్థ
యందు బ్రహ్మచారి యభివృద్ధి గాంచుచుండును; గావున శిశు
వు గర్భములోనుండు తరుణమునఁ గొంచెమేనియుఁగుచేష్ట సలు
పకయుండు రీతి బ్రహ్మచర్యము బూనియుండు విద్యార్థియు మై
థున మొనరింపఁగూడదు. ఇందువలన విద్యాభ్యాసము నిమిత్త
బల వీర్యముల రక్షించుకొనుటయే బ్రహ్మచర్యమైనట్లు స్పష్ట
మగుచున్నదిగదా. మరియు

బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః

యోగ. పాద, 2. సూ, 38

బ్రహ్మచర్యనియమధారణముచేతనే వీర్యలాభముగలుగునని యోగశాస్త్రమందును

ఏకశ్శయీత సర్వత్ర న రేతః స్కందయేత్ క్వచిత్
కామాద్ధి స్కందయన్ రేతో హినస్తి వ్రతమాత్మనః.
మను అ. 2

బ్రహ్మచారి యెల్లవేళల నొంటరిగఁ బరుండవలయు. వీర్యపతన మెప్పటికిఁ జేయఁగూడదు. ప్రమాదవశుఁడై సౌఖ్యమను తలంపున బ్రహ్మచారి యొక్క పర్యాయమయిన గానిండు వీర్యపతనము జేసినయెడల వానిబ్రహ్మచర్య వ్రతమంతయు నాశనమయిపోయినయట్లే యని మనుస్మృతియందును

లింగసంయోగహీనం యచ్ఛబ్దస్పర్శవివర్జితమ్
శ్రోత్రేణ శ్రవణంచైవ చక్షుసాచైవ దర్శనమ్
వాక్సంభాషా ప్రవృత్తం యత్తన్మనః పరివర్జితమ్
బుద్ధ్యాచాధ్యవసీయేత బ్రహ్మచర్యమకల్మషమ్.
భార. శాం. అ, 214.

జననేంద్రియమును జననేంద్రియముతోడ స్పృశింపఁగూడదనుట యేల, నిమిత్తములేకుండ జేతితోఁగూడ దాకఁగూడదు విషయసంబంధములైన పాటమాటలు వినుట కూడదు. బ్రహ్మచర్య నియమమునకు భంగముగలుగఁజేయు స్త్రీలనుగాని మరి

యేయితర విగ్రహములఁగాని కుదృష్టితోఁ జూడఁదగదు. విష యానుకూలములు, నబద్ధములు, నిరర్థకములు నగు వాక్యము ల నోటివెంట నెప్పుడు రానీయఁగూడదు. కామమును జనింపఁజే యునట్టియు, నితరులకు హానిగలిగించునట్టియు, తలంపులనుండి మనస్సును దూరముగ నుంచికొనవలయును. ఏదేనికార్యము చేయవలసివచ్చినప్పుడు మొట్టమొదలే బుద్ధితో బాగుగ నా లోచించికొని మఱియుఁ జేయుచుండవలయును. ఏదైనఁ జదువు నపు డందలి యర్థము గ్రహించుకొనుచుఁ జదువవలయు. ఇది యే బ్రహ్మచర్యమనఁబడును. విద్యాభ్యాసమేమియు లేక యూ రక వీర్యము రక్షించుకొనుచుండిన నది బ్రహ్మచర్యము కాఁ గూడదాయని యెవరైనఁ బ్రశ్నించునెడల నందులకు బ్రత్యుత్త రము వినుఁడు. విద్యాభ్యాసము లేక వీర్యరక్షణము కావించు కొంటయు నొకయంశముగ బ్రహ్మచర్యమగును కాని,

శిష్యవృత్తి క్రమేణైవ విద్యామాప్నోతియఃశుచిః,
బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమఃపాద ఉచ్యతే.

భార, ఉ. అ. 44.

ఏమనుజుఁడు జితేంద్రియతాది సదాచారములచేఁ బవి త్రుఁడై విద్యనభ్యసించుచుండునో యట్టివాని నియమమే బ్ర హ్మచర్యముయొక్క ప్రథమపాదమనఁబడునని వ్రాయఁబడియుం డుటవలనఁ జితేంద్రియుఁడై విద్యాభ్యాసమొనరించుటయేనిక్క

మయిన బ్రహ్మచర్యము. వెండియు,

ధర్మాదయో ద్వాదశయస్య రూపమన్యానిచాంగానితథా
బలంచ ఆచార్యయోగే ఫలతీతిచాహు బ్రహ్మార్థయోగేనచ
బ్రహ్మచర్యమ్. భార. ఉ అ. 44.

ధర్మము, సత్యము, తపము, దమము-జితేంద్రియతయు, అమాత్సర్యము-తనకంటె నధిక వైభవవంతునిగాంచియసూయ నందకుండుటయు, తితిక్షా-తనకేదేని దుఃఖము సంభవించినం జలింపకుండుటయు, అనసూయా-నిందసేయకుంటయు, దానమ్-విద్యాదిపదార్థముల నితరులకొసంగుటయు, శ్రుతం-లౌకికపారమార్థిక విషయంబులవినుటయు, ధృతిః-ధారణాశక్తి నభివృద్ధి బరచికొనుటయు, క్షమా-సహనశీలుండగుటయు మొదలుగాగల పండ్రెండులక్షణములు, యమనియమములు. శారీరక మానసిక బలములు మున్నగునవన్నియు బ్రహ్మచర్యముయొక్క రూపమైయున్నవి.

ఆచార్యుని సమీపమున నర్థసహితంబుగ వేదాది విద్యలం జదువుటవలననే ముఖ్యముగ నీబ్రహ్మచర్యమునకు సిద్ధికలుగును. ఈవిషయమైముందు వ్రాయఁబడును. సర్వప్రకారములగు సౌఖ్యములకు మూలకారణము బ్రహ్మచర్యమనియు, జితేంద్రియతాపూర్వకముగ విద్య నభ్యసించుటయే బ్రహ్మచర్య మనంబడుననియు, నింతపర్యంతము వ్రాసినదానివలన స్పష్టమగుచున్నదికదాకఇ. విద్యయన నెట్టిదో యోజింతము.

విద్యయామృతమశ్నుతే. యజు. అ. 4.

దేనిమూలమునఁబరమసౌఖ్యము ప్రాప్తమగునో యది యే విద్యయనఁబడునని యజుర్వేదమందును,

క్షరంత్వవిద్యాహ్యామృతంతువిద్యా. శ్వే. అ. 5.

నాశనము బొందునది యవిద్యయు, నాశనములేనిది విద్యయని శ్వేతాశ్వతరోపనిషత్తునందును,

అవిద్యాచ విద్యాలింగమ్. వై. అ, 7. ఆ. 1.

అవిద్యయే విద్యయొక్క లింగమనగా నవిద్యకంటె విపరీత స్వభావము కలదేదో యదియే విద్యయని వైశేషికమందును,

అనిత్యాశుచిదుఃఖానాత్మసునిత్యశుచిసుఖాత్మఖ్యాతిర విద్యా. యోగ. పాం. 2.

ఏకారణంబున మనుజుం డనిత్యమును నిత్యముగను, నిత్యము ననిత్యముగను, నశుద్ధము శుద్ధముగను, శుద్ధము నశుద్ధముగను, దుఃఖమును సుఖముగను, సుఖమును దుఃఖముగను, ననాత్మ నాత్మగను, నాత్మ ననాత్మగను, అనఁగా జడము చేతనముగను, చేతనమును జడముగను, భావించుట సంభవించునో యదియే యవిద్యయని యోగశాస్త్రమందును లిఖింపఁబడి యున్నది. ఏదేని నొకపదార్థము నున్నదాని నున్నట్లుగాక విపరీతముగ నెంచుటయే యవిద్యయని దీనితాత్పర్యము. ఎట్లనఁగా

నాత్మలేని జలపాషాణమృత్తికాది జడపదార్థములయెడల చేతనస్వరూపంబగు నీశ్వరభావము బూనియుండుటే యవిద్య.

తద్దుష్టంజ్ఞానమ్, అదుష్టంవిద్యా. వై. అ, 9. ఆ. 2.

అవిద్యయే దుష్టజ్ఞానమనబడును; దుష్టజ్ఞానమునకు వ్యతిరిక్తమైన యథార్థప్రమాణజ్ఞాన మెయ్యదికలదో యదియే విద్య.

విద్యాశబ్దముయొక్క-

విద్ జ్ఞానే

యనుధాత్వర్థముతోడ జూచినప్పటికి

వేత్తియయా సా విద్యా

యనుటవలన దేనిమూలమున

బథార్థముయొక్క యథార్థజ్ఞానము కలుగునో యదియే విద్యయని సిద్ధమగుచున్నది. మఱియు,

విద్యయాతదారోహంతి యత్రకామాః పరాగతాః

నతత్రదక్షిణాయాంతి నావిద్వాగ్ంసస్తపస్వినః.

శ. కాం, 1. ప్ర, 4. బ్రా, 2. కం, 16.

సమస్తసౌఖ్యములకు నివాసస్థానంబగుసీమ యేదికలదో యట్టి పదము మనుజుఁడు విద్యాప్రభావంబున బొందగలుగును। మఱియు ధనమువలనగాని, చాతుర్యముచేతగాని, విద్యావి

హీనతపంబునంగాని లభింపని యెట్టిపదార్థములైనను విద్యా మహిమవలన నవశ్యముగ జేకూరు నని శతపథమందును.

విద్యయాదేవలోకో వైలోకానాగ్ం శ్రేష్ఠ స్తస్మాద్విద్యాం ప్రశగ్ంసంతి. బృ, అ, 3. బ్రా, 5.

ఎవఁడు విద్యాభ్యాసము గావించునో వాఁడువిద్వాంసు లయొక్క స్థానమును బొందుకారణమున విద్య ప్రశంసనీయ మైనదని బృహదారణ్యకమందును,

కేన బ్రహ్మత్వం క్రియతే త్రయావిద్యయేతి,

ఐ, పం, 5. అ, 5.

త్రయీవిద్య నభ్యసించుటవలన మానవునకు బ్రహ్మ త్వపదము లభించునని ఐతరేయమందును,

విద్యాతః పురుషవిశేషోభవతి.

నిరు, పూర్వష, అ, 1, పా, 5. ఖం, 2.

విద్యవలననే పురుషుఁడు సమస్తమానవులలో శ్రేష్ఠుఁ డు, మాననీయుఁడు నగునని నిరుక్తమందును,

తపోవిద్యాచ విప్రస్యనిః శ్రేయస్కరంపరం

తపసాకిల్బిషంహంతి విద్యయామృత మశ్నుతే,

మను, అ, 12.

సత్యభాషణాది తపంబువలన మనుజుఁడు సకల పాపము లనుండి తప్పించుకొనియుండి విద్యవలన వివిధవిధములగు సౌ

ఖ్యముల బొందకలుగుటం జేసి సత్యభాషణాది తపశ్చర్యంబును విద్యయు, నీరెండే బుద్ధిమంతులగు వారలకు గళ్యాణ మొనగూర్చుననియు,

ఋషిభిర్బ్రాహ్మణైశ్చైవ గృహస్థైరేవ సేవితా,

విద్యాతపోవివృద్ధ్యర్థం శరీరస్యచశుద్ధయే. మను, అ, 6.

తపోవృద్ధికొరకును, శరీరశుద్ధినిమిత్తమును బూర్వకాలమున ఋషులు, బ్రాహ్మణులు, దక్కుంగల గృహస్థులులో నగువారెల్లరు విద్య నభ్యసించియుండిరనియు మనుస్మృతియందు లిఖింపబడియున్నది. పూర్వకాలమునందీ దేశవాసులు విద్యాభ్యాసమొనరించి సకలకళలయందు సంపూర్ణ పాండిత్యమంది నిపుణులై యుండిరో యాకాలమున నీదేశము బల, బుద్ధి, వీర్య, పరాక్రమ, రాజ్య, ఐశ్వర్యాది సర్వశ్రేష్ఠ సమాలంకృతమై సప్రమాత్ప్రదమునందియుండెను. కాని ప్రస్తుతకాలమున నీదేశమందలి మనుష్యులు పూర్వోక్త సుగుణభూషణములకుగాని దూరగులై యున్న కారణమున దేశమహోన్నత్యదశయందుండుటకుమాఱుగా మహాహీనమైన దీనదశయందున్నది. ఈయాపదలకన్నింటికి గారణమేమనగ మహాభారతయుద్ధము తరువాత నీదేశవాసులు తాము విద్యనభ్యసించుటయు, నితరుల నభ్యసింపజేయుటయు నన్నివిధముల బరిత్యజించి యవిద్యాహస్తమునం దగుల్కొనిరి. ఆకారణముచేతనే యిచటి జనులు

కూటికి గుడ్డకుఁగూడలేక యల్లాడుచున్నారు. ఏదేశమునం దెప్పుడు విద్య యభివృద్ధి నొంది యుండునో యప్పుడాదేశ మున్నతినంది యుండుననియు, విద్య కవనతి యెప్పుడు కలుగునో యపుడే దేశముకూడ హీనగతినందుననియు విశ్వమండలి సకల తత్వజ్ఞులగు విద్వాంసులయొక్క సర్వతంత్ర సిద్ధాంతమయి యున్నది. పూర్వకాలమున, నార్యావర్తమును, దానివలన మిస్రయూనాన్ దేశములు నెట్లున్నతి నందియుండెనో యట్లే ప్రస్తుతకాలమున సురూపపాతాలాదిదేశములు విద్యాప్రభావంబున నున్నతిఁబొందియున్నవి. మరల నార్యావర్త మెప్పుడు పూర్వకాలమునుంబోలి విద్యావంతమగునో యపుడే తన సురూపాది బాంధవులయున్నతి శ్రేణియందుఁ బదారోపణముఁ జేయఁగలుగును. కావున దేశోన్నతిమూలమునజనింపఁగలసకలసౌఖ్యసంపదలనిమిత్తము తనమానధనంబులతో విద్యనభివృద్ధిపర చికొంట యీదేశవాసులకు సముచితమైయున్నది. ఏలయన

విద్యయామృతమశ్నుతే. కే, ఖం. 2.

విద్యవలన బరమానందము సంప్రాప్తమగునని కేనోపనిషత్తునందును,

మాతేవరక్షతి పితేవ హితే నియుంక్తే,

కాంతేవచాభిరమయత్యపనీయ ఖేదమ్,

కీర్తించ దిక్షువిమలాం వితనోతిలక్ష్మీం
కింకిం నసాధయతి కల్పలతేవ విద్యా.

భోజప్రబంధము.

తల్లికుమారుని నేప్రకారముగఁ బోషించి రక్షించునో యదేప్రకారము విద్యమానవుని గాపాడును. తల్లి కేవలము బాల్యావస్థయందుమాత్రమే పుత్రునిరక్షణముసేయును. కాని విద్యయనిన మానవుని సకలావస్థలయందుఁగూడ పాలనముసేయును. తండ్రికుమారునెట్లు హితమందు వర్తించునట్లు జేయునో యటులే విద్యయు మనుజునకు హితాహితంబుల జ్ఞానము నొసంగి హితమందుఁబ్రవృత్తుఁడగునట్లు చేయును. అనేవిధముల బతివ్రతయగు కాంత నిజకాంతునకెట్లు దుఃఖమను మాటఁ బొసంగనీయక అన్నిప్రకారముల సౌఖ్యము సమకూర్చుచుండునో యటులే విద్యయు మనుష్యునకు సర్వవిధముల సౌఖ్యము కలుగఁజేయుచు దుఃఖములనుండి తప్పించుచుండునని భోజప్రబంధమందును, వ్రాయఁబడియున్నది. విచారించిచూడ నీవిద్య యనునది యెట్టియుత్తమపదార్థమనవచ్చును? ప్రపంచమెల్లయెడల మహాకీర్తిని వ్యాపింపఁజేసి విద్యయే మానవునకు యథేష్టముగ ధనముచేకూరునట్లుజేయును. ఈహేతువుచేతనే భోజప్రబంధకారుఁడు, "విద్యయను కల్పలతవలన బ్రాప్తము కానేరనిపదార్థమేదైనఁ బ్రపంచమునంగలదా" అనివర్ణించియున్నాఁడు. ఇటులే.

విద్యాబృంహణానామ. చర, సూ. అ, 3.

సమస్తపదార్థముల యభివృద్ధికి ముఖ్యహేతువువిద్య యని చరకమందును,

సర్వద్రవ్యేషువిద్యైవ ద్రవ్యమాహురనుత్తమమ్,
ఆహార్యత్వాదనర్ఘ్యత్వాదక్షయత్వాచ్చ సర్వదా. హి, ప్ర.

హరించుటకలవికాక యమూల్యమైనదగుటచే విద్య యను ధనంబ నుత్తమంబని హితోపదేశమందును జెప్పఁబడి యున్నది. దీనికినాశనములేదు, అమూల్యమగు కారణంబునఁ గొనుదమనిన నంగడియందు దొరకనేరదు. తులము లక్షరూప్యముల బోసినను గానిండు విద్యయో యంగడియందమ్మఁబడు చుండినయెడల ఆలసులగు రాజాధిరాజులు, ధనాఢ్యులు, వ్యాపారులు, వర్తకులుమున్నగు వారలే యెగబడి కొనిపోవుచుందురుకాని నిరుపేదలగు జనులకు రవమాత్రమైన దొరకనిచ్చి యుందురా? కావునవిద్య యనునది ద్రవ్యమువెచ్చించుటచేత లభించు పదార్థముకాదు. పరిశ్రమమువలననే యదిలభించును. ఈకారణముచేతనే విద్యయనర్ఘ్యమన వెలలేనిదని పిలువఁబడు చున్నది. లేశమాత్రమయినవ్యయములేక యునికిలభింపగలుఁగు నట్టివిద్యనభ్యసింపకుండిన యెడల సంతికంటెకర్మ హీనుఁడెవఁడు కానోపును? మఱియు

గమయతిసివిద్యైవ నీచగాపినరంసరిత్
సముద్రమివదుర్ధర్షం నృపంభాగ్యమతః పరమ్. హి, ప్ర.

దిగువకుఁ బ్రవహించుచుఁబోవునట్టివది యే ప్రకారము త నయందు వచ్చికలియు తృణకాష్ఠాది సకలపదార్థముల సము ద్రము జేర్చుచుండునో యటులే నీచకులమందు బుట్టినమనుజు నినైన విద్య రాజ్యాధికారమునకు నర్హునిగఁ జేయుటయకాకఁ యంతకు మించిన భాగ్యశాలునిగఁగూడ జేయుననియు.

విద్యాదదాతివినయం వినయాద్యాతి పాత్రతామ్.
పాత్రత్వాద్ధనమాప్నోతి ధనాద్ధర్మం తతస్సుఖం హి. ప్ర.

విద్యవలన. బురుషునకు వినయమును, వినయమువలన యోగ్యతయు, యోగ్యతవలనధనమును, దానివలనధర్మమును. ధర్మమువలనసౌఖ్యముకలుగుననియు,

అనేకసంశయోచ్ఛేది పరోక్షార్థస్యదర్శకం
సర్వస్యలోచనంశాస్త్రంయస్యనాస్త్యంధ ఏవసః హి. మిత్ర

సమస్తసందేహములఁబోలఁగించి కంటికగుపడని పరోక్షు పదార్థములగురించియు జ్ఞానముకలుగఁజేయుటచే జగత్తునకంత యు నేత్రమనందగు శాస్త్రవిద్య నెవఁడుకలిగియుండఁడో వా ఁడెయంధుఁడనియు హితోపదేశము వచించుచున్నది. అటులే భర్తృహరియందు

హర్తుర్యాతి నగోచరం కిమపిశం పుష్ణాతియత్సర్వదా
హ్యర్థిభ్యః ప్రతిపాద్యమానమనిశం ప్రాప్నోతివృద్ధింపరాం
కల్పాంతేష్వపినప్రయాతినిధనం విద్యాఖ్యమంతర్ధనమ్

యేషాంతాః ప్రతిమానము జ్ఞతనృపాకస్తైః సహాస్పర్థతే.
భ. సీ.

విద్యయనుసదిదొంగలకుఁగన్పింపదు. అభ్యసించువార లకెల్లవేళలఁ గళ్యాణమొసగూర్చును. అంతఃకరణాదుల రక్షించును. ప్రతిదినము విద్యార్థులకొసంగుటవలన నభివృద్ధిగాంచును. కల్పాంతమునందైన నాశనముకానేరదు. ఇట్టివిద్యారూప కగుప్తధనమెవనిదగ్గరనుండునో వానితో సమానుఁడన్యుఁడెవఁడు కానోపును? కావున రాజులారా! మీరువిద్వాంసులగువారల తో విరోధమూనకుఁడనియు

విద్యానామనరస్యరూపమధికం ప్రచ్ఛన్నగుప్తంధనం
విద్యాభోగకరీయశస్సుఖకరీ విద్యాగురూణాంగురుః
విద్యాబాంధవజనోవిదేశ గమనేవిద్యాపరందైవతమ్
విద్యారాజసుపూజితానతుధనం విద్యావిహీనఃపశుః.భ. సీ.

విద్యపురుషునకు గుప్తధనముంబోలియున్నది. మఱియు నదిమానవునకు రూపయశోభోగసౌఖ్యములనొసగూర్చును. విద్యయే పరదేశమున బంధువునింబోలె సమానముగా రక్షించును. విద్యరాజులచేతఁగూడ పూజింపఁబడుచున్నది. కావున నెవఁడువిద్య నేర్చియుండునో వాఁడెమనుష్యుఁడు. ఎవనియందువిద్యకలుగదో వాఁడు కేవలముపశువేయనియు వ్రాయఁబడియున్నది. సత్య

శాస్త్రములనవలోకించుటచేతను, ననుభవమువలనను విదితము గునదియేమన;

ధనహీనోనహీనస్తుహ్యా ధనవన్నిర్మలకులమ్
విద్యాదిహీనోయః కశ్చిత్సహీనః సర్వవస్తుషు నీ. శా.

ఎవనిదగ్గరధనముండదోనిజమునకట్టివాఁడు ధనహీనుఁడు కానేరఁడుకానియెవఁడువిద్యనభ్యసించియుండఁడోవాడేనిర్ధనుఁడు

రూపయౌవనసంపన్నా విశాలకులసంభవాః
విద్యాహీనా నశోభంతే నిర్గంధాఇవకింశుకాః హి. ప్ర.

ఎంతరూపయౌవనసంపన్నుఁడైననేమి?ఎంత విశాలకులమందుఁబుట్టినవాఁడైననేమి?సువాసనలేనిపలాశపుష్పమువలె విద్యలేనియెడలఁ బురుషుఁడుశోభగాంచనేరఁడు.

కోకిలానాంస్వరోరూపం స్త్రీనాంరూపంపతివ్రతమ్
విద్యారూపంకురూపాణాం క్షమారూపంతపస్వినాం

చాణక్యనీతి. అ. 3.

కోకిలలకు మనోహరమగు స్వరమేరూపము. స్త్రీలకుఁ బాతివ్రత్యమేరూపము. కురూపులకురూపము-విద్య. తపస్సులగువారలకు రూపము ఓర్పు

క్షుధాసమానాస్తి శరీరవేదనా-చింతా సమానాస్తి శరీరశోషణా, విద్యాసమానాస్తి శరీరభూషణా క్షమాసమానాస్తి శరీరరక్షణా. నీ. శా.

శరీరమునకు వేదనకలుగఁజేయుటయందు నాకలితో సరివచ్చునదియు, శరీరముశుష్కింపఁజేయుటయందు చింతతో సమమగునదియు, శరీరమునకుభూషణమగుటయందు విద్యతోఁదులతూఁగునదియు,శరీరమునురక్షించుటయందు క్షమకీడగునదియు, నన్యమేదియు లేదు.

కింకులేన విశాలేన విద్యాహీనేనదేహినాం
విద్యావాన్ పూజ్యతేలోకేనావిద్యః పరిపూజ్యతే. నీ. శా.

గొప్పకులమందుఁబుట్టుటవలన నవిద్వాంసుండగు బురుషుఁడు జగత్తునందెప్పటికి గొప్పవాఁడుకాఁజాలఁడు. ఏలయన విద్వాంసుఁడగువానికే ప్రపంచమునఁ బూజాప్రతిష్ఠలు కలుగుచున్నవి.

ధర్మాధర్మౌ నజానాతిలోకోయం విద్యయావినా
తస్మాత్ సదైవధర్మాత్మా విద్యాదానరతోభవేత్.
జ్యో. త. రఘు.

విద్యలేనియెడల ధర్మాధర్మములవిషయమై మనుజులకు యథార్థజ్ఞానమెప్పటికిఁ గలుగనేరదు కావున తామువిద్యనభ్యసించి యితరులకు విద్యాదానము జేయుచు విద్యనున్నతిపరచుచుండుట ధర్మాత్ములైనవారికుచితమైయున్నది. మఱియు

నాస్తివిద్యాసమంచక్షుః శాం. అ. 175.

ప్రపంచమందు విద్యతో సమానమగు నేత్రమేదియులే

కని భీష్ముఁడువక్కాణించినట్లు భారతమందును

ఉత్తమంహిధనం విద్యాదీయమానం నహీయతే
రాజదాయాదచౌరాద్యైర్గ్రహీతుం నాపిశక్యతే
పురుషంసాహసక్లేశాద్యర్జనాయాసకారిణాం
లక్ష్మీర్విముంచతిక్వాపి విద్యాభ్యస్తానముంచతి
కింతస్యమానుషత్వేన బుద్ధిర్యస్యననిర్మలా
బుద్ధ్యాపికింఫలమ్ తస్యయేనవిద్యానసంచితా పురుష. ప్ర.

విద్యయితరులకెంతయిచ్చినను నాశనముకానియంతటి యత్యుత్తమంబగుధనము రాజులుగాని, దాయాదులుగాని, దొంగలుకాని తీసికొనఁజాలరు. పెక్కుబాధలకోర్చి కూడఁబెట్టినధనము నాశనంబగుటసంభవమేకాని యుత్తమవిధానంబున నేర్చినవిద్య నాశనమెప్పటికికాదు. ఎవనికిబుద్ధియుండదో యట్టివాఁడు మనుష్యజన్మమెత్తియు వ్యర్థమే బుద్ధియుండి విద్యనభ్యసింపనిచో నట్టివిద్యాశూన్యమైనబుద్ధివలనఁగూడ మనుజునకు లాభములేదనిపురుషపరీక్షయందును

విద్యాధనంశ్రేష్ఠతరం తన్మూలమితరద్ధనమ్
దానేనవర్ధతేనిత్యం నభారాయనసీయతే. శు. నీ. అ. 3,

విద్యాధనమే తక్కిన యన్ని ధనములలో శ్రేష్ఠతమమైనది. ఏలయన నితరులకొసంగినకొలది నభివృద్ధి బొందుచుండును. మోయవలసినయావశ్యకమూ లేదని శుక్రనీతియందును 3 ప్రా

యబడియున్నది. ఇంతియకాక ధనము గాపాడుకొనవలసినను విద్యయే యవసరము. విద్యాశూన్యులైనకారణముననే రాజులనేకులు హరిరాజ్యములఁ బోగొట్టుకొనియున్నారు. విద్యాంసులగువారలు నూతనరాజ్యముల స్థాపింపఁగలిగిరి. ఇదియంతయు విద్యామహిమయే మఱియు

విద్యాప్రశంసా. పూర్వ. అ. 1. పాద. 2.

విద్యచేతమనుజుఁడు సుశోభితుఁడై ప్రశంసనీయుఁడగునను పూర్వమీమాంసవాక్యమున కర్థమువ్రాయుచు శబరస్వామి

శోభతేఽస్యముఖమ్

విద్యచేతనే ముఖమునకు శోభకలుగునని వ్రాసియున్నారు

మఱియు సాంసారిక సౌఖ్యములకుమించిన పారమార్థిక మోక్షసౌఖ్యముల ప్రాప్తియు విద్యవలననేకలుగుచున్నది.

విద్వైవతున్నిర్ధారణాత్. వే. అ. 3. పా. 3.

ముక్తికి సాధనము విద్యతక్క మరేదియు లేదను వేదాంత వాక్యమును వ్యాసుఁడు

తచ్ఛ్రుతేః, అ. 3. పా. 4.

యనుసూత్రమువలన వేదముకూడ విద్యవలననే మోక్షముకలుగునని విధించుచున్నట్లు మఱింతబలపరచియున్నాఁడు. ఇదేప్రకారముగ

కామధేనుగుణా విద్యాహ్యకాలేఫలదాయినీ
ప్రవాసేమాతృ సదృశీ విద్యాగుప్తంధనమ్స్మృతమ్. చా. అ. 4.

కామధేనువుంబోలి యెల్లవేళలఫలము నొసంగునదియు, తల్లివలె బరదేశంబున సౌఖ్యముగలుగఁజేయునదియు, విద్య యేయగుట నదియొక విధంబగు గుప్తధనంబనియు,

శునః పుచ్ఛ మినవ్యర్థం జీవితంవిద్యయావినా
నగుహ్యగోపనేశక్తం నచదంశనివారణే. చా. నీ అ. 8.

విద్యలేనియెడలమనుజునియొక్క జీవనముకుక్కతోకవలె నేవిధమునఁ జూచినను వ్యర్థమే. కుక్కతనతోఁకతోడ నీగలు దోమలు దోలికొనఁజాలక పోవుటయుటుండ గుహ్యంగమునైనఁ గప్పికొనఁజాలదు. అదేవిధమున మనుజుఁడు కూడవిద్యలేని చో నేకార్యము నెరవేర్ప నేరఁడని చాణక్యనీతియందును

విద్యావిహీనః పశుః. భర్తృ. నీ.

విద్యలేనియెడలమనుష్యుఁడు కేవలము పశువేయని భర్తృహరి యందును వ్రాయఁబడియున్నది కావున నిట్టిపశుపంక్తి నుండి విడివడి విద్యాభ్యాసమొనరించి యభ్యుదయముఁ నిఃశ్రే యసము బొందుడని సమస్తజనులతో నివేదనము జేసికొను చున్నాము,

ఇట్టి యుభయలోకంబుల దరింపజేయగల విద్యాప్రాప్తికి ముఖ్యోపాయము గురువుదగ్గరవసించి శ్రమపూర్వకముగ విద్యనభ్యసించుటయేగాని వేరేదియుగాదు, ఎట్లనగా

శ్రుతగ్ంహ్యేవమేవభగవద్దృశేభ్యః ఆచార్యాద్ధైవవిద్యా విదితాసాధిష్టంప్రాపయతీతి, ఛాం. ప్ర, 4. ఖం, 9.

భగవానుఁడా! ఆచార్యునివలనఁ జదివిన విద్యయే యం త్యంతవికాసమును, ధృఢత్వము, సాధుత్వము గాంచఁజేయునని మీబోంటి మహాత్ములనుండి వినియుంటినని జాబాలియను ఋషిగౌతమునితోడ వచించియుండె. మరియునిటులే,

యథాఖననఖనిత్రేణ నరోవార్యధిగచ్ఛతి
తథాగురుగతాం విద్యాశుశ్రూషురధిగచ్ఛతి, మను. అ, 2.

కుద్దాలముతోడ భూమిని ద్రవ్వఁద్రవ్వ మనుజునకెట్లు జలము లభ్యమగునో యటులే పూర్ణపరిశ్రమము చేతను గురువుయొక్క సేవనముచేతను విద్యసంప్రాప్తమగునని మనుస్మృతియందును ఆచార్యయోని మిహయేప్రవిశ్య, భూత్వాగర్భం బ్రహ్మచర్యంచరంతి ఇహైవతే శాస్త్రికారాభవంతి విహాయదేహం పరమంయాంతి యోగం భార, ఉ. అ, 44.

ఏమనుజుండాచార్యనామకయోనింబ్రవేశించి బ్రహ్మచర్యమను గర్భమును బొందునో వాఁడేజగత్తునందు విద్వాంసుఁడై గ్రంథకారుఁడగును. వాఁడే యీశరీరత్యాగానంతరము మోక్షముంగూడ గాంచునని భారతమందును,

ఆచార్యశ్శాస్త్రాధిగమహేతునామ్. చర, సూ. అ, 25.

విద్యాధ్యయనమునకుఁదోడుపడు సాధనములన్నింటిలో నాచార్యుఁడే ముఖ్యసాధనమని చరకమందును —

గ్రామాద్గ్రామంపృచ్ఛన్ పండితో మేధావీగాంధారానేవోప

సంపద్యేత్యైవమేవేహాచార్యవాన్ పురుషోవేద. ఛాం, ఉ.
ప్ర. 6. ఖం. 14.

విజ్ఞుండగు మనుజుఁడెట్లుగాంధారమార్గమునడిగి తెలిసి కొనుచు నొకగ్రామమునుండి మరియొకగ్రామమునకు బోవుచు దుదకు గాంధారము జేరగలుగునో యటులే గురువుదగ్గర జదువుటవలన విద్వాంసుఁడగునని ఛాందోగ్యమునందును వ్రాయఁబడి యున్నది.యిటులుండఁ జదువక పోయినప్పటికి మంత్రతంత్రజపానుష్ఠానంబుల మూలమునఁ విద్యలభించునని మూర్ఖులనేకులుఁనమ్మియున్నారు. అది యేవిధమున జూచినమిథ్యయే మహాభారతమందలి యితిహాసము జూడుఁడు. భరద్వాజుని కుమారుఁడగునవక్రీతుఁడనునతఁడువిద్వాంసుఁడగుటకొరకుఁ జదువుటమాని యూరకతపముగావింప మొదలిడెనఁట. అప్పుడింద్రుండేతెంచి

అమార్గఏషవిప్రర్షే యేనత్వం యాతుమిచ్ఛసి
కింవిఘాతేన తేవిప్ర గచ్ఛాధీహి గురోర్ముఖాత్.

భార, వ, ప, అ,135,

అవక్రీతా! చదువనియెడల విద్యరానేరదు. నీవమార్గమున నడచిపోవనెంచుచున్నావు, ఇదియుక్తముకాదు, కావున గురువుదగ్గిరకుఁబోయి విద్యనభ్యసింపుమని వచించెను, ఎంత చెప్పినను నవక్రీతుఁడువినక యుండిన కారణమున నింద్రుఁడే

తె॥ కగపడునట్లు గంగయొడ్డునకుఁ బోయి యిలది

వాలుకాముష్టిమనిశం భాగీరథ్యాం వ్యసర్జయత్.

సేతుమభ్యారభచ్ఛక్రో యవక్రీతం నిదర్శయన్

తందదర్శయవక్రీతో యత్నవంతంనిబంధనే

ప్రహసన్ చాబ్రవీద్వాక్యమిదం సమునిపుంగవః

కిమిదంవర్తతే బ్రహ్మన్ కించ తే హాచికీర్షితమ్

అతీవహిమహాన్ యత్నః క్రియతోయం నిరర్థకమ్

పిడికిట నిసుకంగైకొని మాటిమాటికి గంగయందలి నీటిలో వైచుచుంటఁజూచి యవక్రీతుఁడునవ్వి నీ వేకోరికతో నిట్లుజేయుచుంటివని యడుగ,

ఇంద్రఉవాచ

బాంధిష్యే సేతునాగంగాం సుఖఃపంథాభవిష్యతి

క్లిశ్యంతేహిజనస్తాత తరమాణాఃపునఃపునః

జనులెల్లరు రాకపోకలు సలుపుట కనువగునట్లు లోక హితార్థము గంగానదిపై సేతువుగట్టుచుంటిననియింద్రుఁడుప్రత్యుత్తరమిచ్చెనఁట అదివిని

నాయం శక్యస్త్వయాబద్ధుం మహానోఘస్తపోధన

అశక్యాద్వినివర్తస్వ శక్యమర్థంసమారభ

ఇంద్రఉవాచ

యథైవభవతాచేదం తపో వేదార్థముద్యతమ్

అశక్యంతద్వదస్మాభిరయం భారః సమాహితః

ఇసుకతోడ సేతువునిర్మింపఁబూనుట యేవిధమునఁజూచిన నసంభవమే యగుగాన నశక్యమగు నీప్రయత్నముమాని శక్యమగుదానిఁ బ్రారంభింపుమని యవక్రీతుండు వలుక వేదార్థముల నెఱుంగునిమిత్త మశక్యోపాయమగు దపమునీవెట్లు గావింపఁబూనితివో యటులే నేనుగూడ దీనినారంభించితినని యింద్రుఁడుమరలఁ బ్రత్యుత్తరమిచ్చెనఁట చదువక మంత్రయంత్రతంత్ర జపాదులమూలమున విద్యలభ్యమగుట అసంభవమని యీయితిహాసముయొక్క తాత్పర్యము, కావున నాచార్యుఁడధ్యాపకుఁడాదిగాఁగల వారివలననే విద్యప్రాప్తమగునని పూర్వోక్త ప్రమాణములవలన స్పష్టమగుచున్నది, ఇఁకనేయేగుణములు కలవాని నాచార్యుఁడనఁ జెల్లునో యోచింతము,

కస్మాదాచార్యః ఆచారం గ్రాహయత్యాచినోత్యర్థా నాచినోతి బుద్ధిమితివా, నిరు, పూ, అ, 1, పా, 2. ఖం, 2,

ఎవఁడుసర్వవిద్యార్థసంపన్నుఁడై మనుష్యుల కత్యుత్తమంబులగు నాచరణములనేర్పి వారలసకలార్థసంపన్నులుగఁ జేయుచుండునో యట్టివిద్యావంతుఁడే యాచార్యుఁడనఁబడునని నిరుక్తకారుండగు యాస్కమహర్షియొక్క సిద్ధాంతము, సమస్తవిద్యలనర్థసహితంబుగఁజదివించి మనుజులనర్థవంతులుగఁ జేయుటంబట్టియు బుద్ధినభివృద్ధిపరచి బుద్ధివంతులుగఁ జేయుటం

జేసియు సర్వోత్తముండైన యధ్యాపకుండే శాస్త్రములయం దాచార్యుండని పిలువంబడుచున్నాండు, మరియు

ఉపనీయతుయఃశిష్యం వేదమధ్యాపయేద్ద్విజః
సకల్పంసరహస్యంచ తమాచార్యం ప్రచక్షతే, మను. అ.2

ఎవండుశిష్యున కుపనయనసంస్కారము జేయించి యుత్తమంబులగు వేదాదివిద్యలంజదివించునో యతండేయాచార్యుండని మనుస్మృతి యందును

పితాహ్యేనం జనయతిపురుషం పురుషర్షభ
ప్రజ్ఞాందదాతి చాచార్యస్తస్మాత్సగురురుచ్యతే
వా, రా. అయో. సం. 111.

తండ్రికుమారునకు జన్మముగలుగంజేయును, కానిబుద్ధిని ప్రసాదించునది గురువు, సత్యాసత్యపదార్థముల విషయమైజ్ఞానముగలిగించు గావున నాచార్యుడే గురువనంబడునని రామాయణమందును

అల్పంవాబహువాయస్య శ్రుతస్యోపకరోతియః
తమపీహగురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయాతయా
మను, అ, 2,

కొంచెముగగాని విస్తారముగగాని విద్యాభ్యాసమందెవండు సహాయమొనరించునో వానినే గురువుగ నెంచవలయునని మనుస్మృతియందును వ్రాయంబడియున్నది, ఈమనువా

క్యము ననుసరించి మనుష్యునకు గురువు లనేకులుండవచ్చుగాని

గౌణముఖ్యయోర్ముఖ్యే కార్యసంప్రత్యయః

అను నీపరిభాష ననుసరించి

త్రయఃపురుషస్యాతి గురవోభవంతి

మాతాపితాఆచార్యశ్చ, విష్ణుస్మృతి, అ, 31,

మనుజునకుఁ దలిదండ్రులు, ఆచార్యుఁడు ముగ్గురేము ఖ్యగురువులు, ఈముగ్గురిలో మొట్టమొదటిగురువు తల్లి, బాలకునకు ప్రథమశిక్షతల్లి నుండియే కలుగును. కావుననే మహాభారతమందు

నాస్తి వేదాత్ పరం శాస్త్రంనాస్తి మాతృసమోగురుః

భార, అను, అ, 10,

వేదమునకుమించిన శాస్త్రములేదనియు, తల్లికిమించిన గురువులేఁడనియు,

గురూణాంచైవసర్వేషాం మాతాపరమకోగురుః

ఆది, అ. 195,

గురువులందరిలోఁదల్లియే యుత్తమగురువని యధిష్ఠిరుఁడు ద్రుపదునితో వచించినట్లు వ్రాయఁబడియున్నది. ఇదేవిధమున రెండవగురువు తండ్రి

నిషేకాదీనికర్మాణియః కరోతియథావిధి

సంభావయతిచాన్నేన సవిప్రోగురురుచ్యతే. మను. అ. 2

నిషేకాదిసంస్కారములఁగావించి యన్నపానములమా

లమునఁ బుత్రునిపోషణమంతఁ దత్పరుఁడై యుంటంజేసి తండ్రి యుగురువనఁబడును. కాని వేదాదివిద్యలఁ జదివించుటవలన నాచార్యునిదలిదండ్రులకుంగూడ మించినగురువనఁజెల్లు.

ఉత్పాదకబ్రహ్మ దాత్రోర్గరీయాన్ బ్రహ్మదఃపితా. మను. అ. 2. బాలకునకు జన్మముగలుగఁజేయునట్టియు, చదివించి జ్ఞానముగలుగఁజేయునట్టియు గురువులిరువురియందు చదివించునతఁడేముఖ్యగురువని మనుస్మృతియందును.

హితోపదేష్టాశిష్యస్యసువిద్యాభ్యాపకోగురుః. శు. అ. 1.

ఎవఁడువిద్యాభ్యాసాది సదుపదేశములమూలమునశిష్యుని సిహాపరలోకములదరింపఁజేయునోయతఁడేముఖ్యగురువని శుక్రనీతియందును లిఖింపఁబడియున్నది. ఆగురువు దర్మాత్ముఁడు, విద్వాంసుఁడు, బుద్ధిమంతుఁడు, నితరులకుపకారముజేయునతఁడు, మంచియాచరణములగలిగియుండునతఁడు, నిరభిమాని, విజ్ఞాని, శాంతుఁడు, దాంతుఁడు, ధీరుఁడు, గంభీరుఁడు, చతురుఁడు, దేశహితాభిలాషి, యనుభవశాలి, దేశకాలములగుర్తెఱిఁగియుండునతఁడు, ప్రగల్భుఁడు, ఇతరులఁ జదివింపవలెననుకోరికగలిగియుండునతఁడు, రోగరహితుఁడు, వ్యసనములేనివాఁడు, వివేకి, సత్యప్రతిజ్ఞుఁడు, చదివించుక్రమమెఱిఁగియుండునతఁడు, విద్యార్థుల స్వభావము దెలిసికొనఁగలుగునతఁడు, మృదుభాషి, లోకప్రియుఁడులోనుగాగలసకలసద్గుణసంపన్నుఁడై యుండవలయుసత్యశాస్త్రము

లందధ్యాపకునివిషయమై యెట్లువ్రాయఁబడియున్నదో చూడుఁడు.

ఆచార్యంపరీక్షేత-తద్యథా పర్యవదాతశ్రుతం పరిదృష్ట కర్మాణాం దక్షందక్షిణాం శుచిం జితహస్త ముపకర్ణవంతం సర్వోపకరణోపపన్నమ్ ప్రకృతిజ్ఞం ప్రతిపత్తిజ్ఞమనుపస్కృత విద్య మనసూయక మకోపనం క్లేశక్షమం శిష్యవత్సల మధ్యాపకం జ్ఞాపనాసమర్థమిత్యేవం గుణోహ్యాచార్యః సుక్షేత్రమార్తవో మేఘ ఇవశస్యగుణైః సుశిష్యమాశుసంప్రాదయతి. చర. వి అ. 8.

ఆచార్యుఁడు పర్యవదాత-శ్రద్ధాపూర్వకముగ నన్నిప్రకారముల విద్యనభ్యసించియుండు నతఁడును, పరిదృష్టకర్మాణాం-శిల్పము, గళాకౌశలము, చిత్రలేఖనము మొదలగు చేతిపనులయందు నిపుణుఁడును, దక్షం-మంచి చెడుకర్మములఁ దెలిసియుండు ననుభవశాలియు, దక్షిణమ్-చాతుర్యము, సరళస్వభావము, నుదారబుద్ధిగలిగియుండునతఁడును, శుచిం-మనస్సు, బుద్ధి, శరీరము ఇంద్రియములు, వస్త్రములు మున్నగువానియెడల బరిశుద్ధుఁడై యుండునతఁడును,జితహస్తం-హస్తపదాదియవయవములతో నిరుపయోగములయిన కార్యములను, నిష్కారణముగ విద్యార్థులఁగొట్టుట మొదలగుదుర్వ్యవహారంబుల నొనరింపకుండునతఁడును, ఉపకర్ణవంతం-చదివించుటకవసరములైన

యంత్రములు, ఆయుధములులోనగుసర్వసాధనముల గలిగి యుం
డునతఁడును, సర్వేంద్రియోపపన్నః-నిరోగములైనవానివాని వి
షయములయథావిధిగ్రహింపఁగలిగియుండు సకలేంద్రియముల
నొప్పియుండునతఁడును, ప్రకృతిజ్ఞః-విద్యార్థియొక్క ప్రకృతి, ల
క్షణము, శరీరము, బలము, విద్యాభ్యాసమందతనికుండుయో
గ్యత, రుచిమొదలగువాని తెలిసికొన గలుగునతఁడును, అటులే
రాజ్యసంబంధములైన వ్యవహారములగురించియు, రాజవర్గము
వారిలక్షణములగూర్చియు, రాష్ట్రముయొక్క హానిలాభాదుల
గూర్చియుఁ దెలిసికొనుటయందుఁగుశలుఁడును, ప్రతిపదార్థము
యొక్క స్వభావముగుర్తెఱిఁగి వానిని దానములఁ దెలిసియుండునతఁ
డును ప్రతిపత్తిజ్ఞః-ఆలస్యప్రమాదాదిదోషరహితుఁడై, ప్రగఁ
ల్భుఁడై, గౌరవవంతుఁడై, ప్రపంచమందలి ప్రతిపదార్థముఁ బ్రాఁ
ప్తింపఁ జేసికొనుటయందును, లభ్యమగుటకొరకుఁ జేయవలసిన
ప్రయత్నముల నెఱిఁగియుండునతఁడును, కర్తవ్యములఁ దెలిసియుం
డునతఁడును, ప్రత్యేకమగుబదవింబొందియుండునతఁడును, సమ
స్తవిద్యలంజదివిచదివి దానినుపస్థితముగ గలిగియుండునతఁడు
నుఅనసూయకః-నింద్యములైనచాడీలు చెప్పనివాఁడును, అకోప
నః-కోపములేనివాఁడును, క్లేశక్షమః-చదివించుట మొదలుగా
గలనానాప్రకారములైన క్లేశముల సహించుకొనునతఁడును, శి
ష్యవత్సలః-శిష్యులయెడలఁ బ్రీతిగలిగియుండునతఁడును, జ్ఞాపనా

సమర్థమ్-చదివించి తెలియఁజెప్పుటయందుఁ బ్రజ్ఞకలిగియుండునత
డును, మనుష్యులనేకులు చదివినవారలై యుండియు నితరులకు
దెలియఁజెప్పుటయందు సామర్థ్యము కలిగియుండరు. కావున నా
చార్యుఁడు బాగుగఁజదివి యితరులకుఁ దెలియఁజెప్పుటయందు శ
క్తిగలిగియుండవలెననుట ముఖ్యము. ఉచితసమయంబున వర్ష
ముంగురిపించి మేఘుఁడెట్లు సస్యములనుత్పన్నముఁ జేసి వానిఁబచ్చ
నివిగను, ప్రకాశవంతములుగను జేయునో యటులే యాచా
ర్యుఁడుకూడ విద్యార్థియొక్క బుద్ధియనుభూమిపై విద్యయను
మేఘముంగురిపించి యతని జ్ఞానాదిసకలగుణసంపన్నుఁగ నొనరింప
వలయు. అట్టిపురుషుఁడే గురువు, ఆచార్యుఁడు, అధ్యాపకుఁడునగుట
కు యోగ్యుఁడు. పైనవచించిన సమస్తగుణములతో నొప్పియుండు
నధ్యాపకుఁడు దొరకుట దుర్లభమే కాని వీలైనంతవరకు నుత్త
మోత్తముఁడగు నధ్యాపకునే పాఠనార్థము నియోగింపవలయు.
ఆహా! ప్రస్తుతకాలమున జనులలో నట్టియంధపరంపర వ్యాపిం
చియున్నదో చూడుఁడు. చెవులలో రెండుమూడక్షరములనూదు
దాంభికులనే లోకులు గురువులుగ భావించుచున్నారు. మహా
మూర్ఖులు, నిరక్షరభట్టాచార్యులు, దోసకారులు, కోసగాం
డ్రు, కూటసాక్షులు, దుష్టాత్ములు, జనుల నిహపరలోకములకు
భ్రష్టులఁజేయు వారలు నగుదుష్టులు చిత్తార్థముగ రూప్యములు,
వస్త్రములు, నారికేళాదిఫలములు లోనగువానిఁగానుకలుగ



సంగ్రహించి జనులకుగురువులుగనేర్పడుచున్నారు. ఈకలిగురువులు వేషధారులగు సాధువులును, గృహస్థులునై యుందురు. వీరు కేవలమైదుగాని, పదిగాని యక్షరములఁజెవిలోవినిపించి, మనుష్యులఁదమశిష్యులుగఁజేసికొని, పశువులభంగి దమబంధనములఁదగులువడఁజేసి "శిష్యాసీవితరమతములవారి వాక్యములవినవలదు. అన్యులకెవరికి నీగురుమంత్రము వెల్లడిఁజేయవలదు" అనివారల కుపదేశము జేయుచుందురు, గురువులోభియగు నెడలవామనావతారమునమ్ముమనియు, క్రోధియగునెడల నృసింహావతారమును, కాముకుఁడైన కృష్ణావతారమునమ్మవలసినదనియు, నింకను నిట్టివేయగునేకవాక్యముల నేర్పి వారిసంపూర్ణముగదమ యాధీనులుగఁ జేసికొని. బ్రతికియున్నంతవరకు మూర్ఖులుగనుండు నట్లొనరించి యుభయలోకములకుఁగూడ భ్రష్టులగు నట్లుచేయుచున్నారు. ఇట్టిమూర్ఖులుమోసగాండ్రనగు నీగురువులకుంజిక్కి ప్రతిమనుజుఁడెల్లవేళలఁదప్పించుకొనియుండవలయు.ఏలయన,

> త్యజేద్ధర్మం దయాహీనం విద్యాహీనం గురుంత్యజేత్.
>
> చా.నీ.అ.4.

దయావిహీనమైన ధర్మమును.విద్యావిహీనుఁడైనగురువును విడచిపెట్టవలయునని చాణక్యనీతియందును,

> శాస్త్రీయగురుసంయోగః. శుక్ర. నీ. అ. 1.

గురుపు నేర్పరచుకొనుట విద్యనభ్యసించు నిమిత్తముకాని చెవిలో నూదించుకొంటకుఁగాదని శుక్రనీతియందును లిఖింపఁబడియున్నది. ఇక్కాలంబున గురుపు నేర్పరచుకొను విధానము హానికారకమును వేదవిరుద్ధమునైయున్నది. కావునఁ జనువరులారా! మీరుమిమ్మును మీసంతానముల నిట్టిదుష్టగురువుల నేర్పరచుకొనుటయను నవిద్యాజాలమునుండి తప్పించి యుత్తమలక్షణవంతుఁడు. ధార్మికుఁడు.విద్వాంసుఁడునగు గురువును సేవించి ధర్మోపార్జనముగావింపుఁడు మఱియు

త్రయోధర్మస్కంధాయజ్ఞోధ్యయనదానమితి ప్రథమ స్తప ఏవ ద్వితీయో బ్రహ్మచర్యాచార్యకులవాసీ తృతీయోత్యంత మాత్మానమాచార్యకులేఅవసాదయన్త్సర్వఏతేపుణ్యలోకాభవంతి బ్రహ్మసంస్థోమృతత్వమేతి ఛాం ప్ర 2 ఖం 23

ధర్మమునకు మూఁడుస్కంధములు. అందు బదార్థసంగతికరణమనఁబడు యజ్ఞము మొదటిస్కంధము. నానాప్రకారములగు క్రియాకౌశలములకు నగ్నిహోత్రాదుల నొనరించుటకుఁ విద్వాంసులసత్కరించుటకు సంగతికరణమని పేరు. బ్రహ్మచర్య వ్రతమవలంబించి యాచార్యునివద్దనివాసము జేయుట రెండవ స్కంధము. క్లేశములకోర్చికొనుచు విస్తారకాలము పర్యంతముఁగురుపుకడనుండి సకలవిద్యలనభ్యసించుట మూఁడవస్కంధము.

బ్రహ్మచారిణంపరిదదామిదీర్ఘాయుష్ట్వాయసుప్రజాత్వాయ సువీర్యాయ, రాయస్పోషాయ, సర్వేషాం వేదానామధిపత్యాయసుశ్లోక్యాయ స్వస్తయే. సాం. గృ. అ. 1.

ఈనియమాలమున దీర్ఘాయువు. సుసంతానము. సుజనత వీర్యవృద్ధి సర్వవిధములధనవైభవాదులప్రాప్తి. వేదమందలిసమస్తజ్ఞానములోనగునవి లభించునో దాని బొందునిమిత్తముగురుకులవాసము సలుపుటకై బ్రహ్మచారియాచార్యునకర్పణము జేయఁబడుచున్నాఁడు. ప్రాచీనకాలంబున మహర్షులయొక్క గురుకులవాసములందు నివాసమొనరించి విద్యాధ్యయనము జేయుటకు నీదేశమందలి జనులకెల్లరకుఁగర్తవ్యమైయుండె. సృష్ట్యాదినుండిమహాభారతకాలమువరకునీదేశమందలియార్యులు బ్రహ్మచర్యవ్రతముంబూని గురుకులవాసులై విద్యనేర్చుచువచ్చిరి. ఎట్లనగా సృష్ట్యాదియందు

సబ్రహ్మచర్యమచరత్ గోప పూ ప్ర 1

బ్రహ్మ బ్రహ్మచర్యవ్రతముంబూని

అగ్ని వాయురవిభ్యస్తుత్రయంబ్రహ్మసనాతనమ్.

దుదోహియజ్ఞసిద్ధ్యర్థమృగ్యజుఃసామలక్షణమ్ మను అ 1

అగ్ని వాయువు మొదలగు ఋషులవలన సనాతనంబు నపౌరుషేయమునైన వేదమునభ్యసించెననిమనుస్మృతియందును

త్రయఃప్రజాపత్యాః ప్రజాపతౌపితరి బ్రహ్మచర్యమూషుర్దేవా

మనుష్యాఅసురాః బృ ఉ అ 7

ఆబ్రహ్మదగ్గర నివసించి దేవమనుష్యాసురులు విద్యనభ్యసించిరని బృహదారణ్యకమందును,

భృగుర్వైవారుణిర్వరుణం పితరముపససార అధీహి భగవో బ్రహ్మేతి తైత్తి ఉ

భృగుపుత్రునతండ్రియగు వరుణునికడ నివసించివిద్యనేర్చెనని తైత్తిరీయమందును

పిప్పలాదోంగిరాః సనత్కుమారశ్చాశ్వర్వణం భగవంతంప్రపచ్ఛ అ శి ఉ

పిప్పలాదఋషికుమారుండగునంగిరుడును.సనత్కుమారుడు నిరు ప్రురగలపె అథర్వణదు ఋషిచెంతనపొంది చదివిన ట్లుఅథర్వశిఖోపనిషత్తునందును

అధీహిం భగవఇతి హోపససాద సనత్కుమారం నారదః

ఛాం. ఉ. ప్ర. 7. ఖం. 1.

సనత్కుమారునొద్ద నారదుఁడు చదువునేర్చెనని ఛాందోగ్యమందును

తగ్ంహైతముద్దాలక ఆరుణిర్వాజసనేయాయ యాజ్ఞవల్క్యాయ అంతేవాసినే ఉక్త్వోవాచ

బృ. ఉ. అ 8. బ్రా. 3.

ఉద్దాలకఋషియొద్ద యాజ్ఞవల్క్యుఁడు విద్యనేర్చినట్లు

బృహదారణ్యకమునను వ్రాయఁబడి యున్నది. మరియుయాజ్ఞవల్క్యునివద్దమధుకుఁడు మనువునివలనఁ జూలుఁడు నతనికడ భాగవిత్తిభాగవిత్తిసమీపమున జాబాలి యతనినుండి యితరమునులును విద్యనభ్యసించిరి. అదేవిధమున సుకేశుఁడు భారద్వాజుఁడు శైవ్యసత్యకాముఁడు సౌర్యాయణిగార్గ్యుఁడు కౌశల్యాశ్వలాయనుఁడు భార్గవవైదర్భి కబంధి కాత్యాయనుఁడు మొదలగు ఋషులెల్లరు పిప్పలాదఋషిదగ్గర విద్యాధ్యయనముఁ జేసినట్లు ప్రశ్నోపనిషత్తుయొక్క మొదటిప్రశ్నమందును

ఉపకోశలోహవైకామలాయనః సత్యకామేజాబాలే

బ్రహ్మచర్యమువాస చాం ప్ర 4 ఖం 10

ఉపకోశలుడనునతఁడు జాబాలిదగ్గర గురుకులవాసముఁజేసనని ఛాందోగ్యమందును

సోహంగురువచఃకుర్వ౯ బా రా బాలకాం స 76

జగద్విదితమహానుభావుఁడగు బరశురాముఁడుకశ్యపఋషివద్ద జదివినట్లు బాలరామాయణమునను

మహర్షేరగ్నివేశస్య సకాశమహామచ్యుతః
అస్త్రార్థమగమంపూర్వం ధనుర్వేదచికీర్షయా
బ్రహ్మచారీవినీతాత్మా జటిలోబహుఃలాఃసమాః
అవసంసుచిరం తత్రగురుశుశ్రూషతత్పరః

అస్త్రాదివిద్యాప్రాప్తి కొరకు బ్రహ్మచర్యవ్రతమూని

యగ్నివేశుఁడను ఋషిదగ్గరకుఁ బోయియుండి విస్తారకాలము వర కాయనకు శుశ్రూషఁ జేయుచుఁ జదువు నేర్చితినని భీష్మునితో ద్రోణుఁడు వక్కాణించినట్లును

వివిక్తే పర్వతతటే పారాశర్యో మహాతపాః
వేదానధ్యాపయామాస వ్యాసః శిష్యాన్ మహాతపాః
సుమంతుంచ మహాభాగం వైశంపాయనమేవచ
జైమినించ మహాప్రాజ్ఞం పైలంచాపితపస్వినమ్

భార. శాం. అ. 328

ఏకాంతమగు పర్వతతటప్రదేశమందు సుమంతు వైశంపాయన జైమిని పైలాదులగు నలువురుశిష్యులచే వ్యాసుఁడు వేదాధ్యయనముఁ జేయించినట్లును మహాభారతమున వ్రాయఁబడి యున్నది. బ్రహ్మదులే క్రమమునఁ జదివియుండిరో యటులే రాజర్షులు కూడ పూర్వకాలమున గురుకుల వాసులై విద్య నేర్చి యుండిరి. ఎట్లనగా

తద్ధైతద్బ్రహ్మా ప్రజాపతయఉవాచ ప్రజాపతిర్మనవే
మనుః ప్రజాభ్యః ఛాం. ఉ. ప్ర. 3. ఖం. 1.

బ్రహ్మదగ్గఱ బ్రజాపతియు, నతనివద్ద మనువు, మనువు నుండి ప్రజలు విద్య గ్రహించిరనియు

భిక్షోః పంచశిఖస్యాహం శిష్యః పరమసమ్మతః
భాం. శాం. అ. 132

జనకుఁడు తానుపంచశిఖుఁడను సన్యాసి యొక్క శిష్యుఁడనని చెప్పుకొనినట్లుభారతమునందేకాక బృహదారణ్యకమందును

జనకోహ వై దేహః కూర్చాదుపావ సర్పంతువాచ
నమస్తేయాజ్ఞ వల్క్యాను మాశాధీతి. బృ. అ. 6. బ్రా. 2.

సింహాసనమునుండి లేచినిలువంబడి జనకుఁడుయాజ్ఞవల్క్యునకు నమస్కారమొనరించి తనకు విద్యనేర్పుమని యామునిని నడిగినట్లును లిఖింపఁబడియున్నది. వెండియు,

స తేహం పితురాచార్యస్త్వ చైవ పరంతపః.
వా. రా. అయో. స. 111.

నేనునీకును నీతండ్రికిని గురువునని వసిష్ఠుఁడు రామునితో వచించియుండె. అటులే,

ప్రతిజగ్రాహ తే విద్యేమహార్షే ర్భావితాత్మనః
విద్యాసుముదితో రామః శుశుభే భీమవిక్రమః
వా. రా. బాల. స. 22

బల, అతిబల మొదలగు విద్యలరాముఁడు విశ్వామిత్రునివద్దగూడ నేర్చెను. కృష్ణుఁడు ఘోరాంగిరసుని దగ్గరఁ జదివినట్లు ఛాందోగ్యము నుడువుచున్నది. ఇదేవిధమున,

బృహస్పతి పురోగాం స్తుదేవర్షి నసకృత్ ప్రభుః
తోపయిత్వోపచారేణ రాజనీతి మధీతవాన్.

ఉశనా వేదయచ్ఛాస్త్రం యచ్చ వేదగురుర్ద్విజః
యచ్చ ధర్మం సవై యాఖ్యం ప్రాప్తవాన్ కురుసత్తమః
భార్గవాచ్చ్యవనాచ్చాపి వేదానంగోప బృంహితాన్
ప్రతిపేదే మహా బాహుర్వసిష్ఠాచ్చరిత వ్రతః.
మార్కండేయ ముఖాత్ కృత్స్నం యతిధర్మమవాప్తవాన్
రామాదస్త్రాణి శక్రాచ్చ ప్రాప్తవాన్ పురుషర్షభ.

భా. శాం. అ. 36.

బృహస్పతి మొదలగు ఋషులం బ్రసన్నులఁ గావించికొని భీష్ముఁడు రాజనీతి నభ్యసించెననియు, శుక్రబృహస్పతు లెంత విద్య నెఱింగియుండిరో యంతవిద్యను వారినుండి గ్రహించెననియు, భార్గవచ్యవన వసిష్ఠులవద్ద సాంగముగ వేదముఁ జదివెననియు, మార్కండేయునికడ వేదాంతవిద్యయును, పరశురాముఁ డిందుఁడును మున్నగువారిదగ్గర యుద్ధవిద్య నేర్చెననియు వ్యాసుఁడు యుధిష్ఠిరునితో వక్కాణించియుండె.

పాంచాల్యో రాజపుత్రశ్చ యజ్ఞసేనో మహాబలః
ఇష్వస్త్రహేతోర్న్యవ సత్తస్మిన్నేవగురౌ ప్రభుః

భార. ఆది. అ. 131

పంజాబు దేశపు రాజగు ద్రుపదుఁ డగ్నివేశుని వద్ద శస్త్రాస్త్ర విద్యల నభ్యసించెను. మరియు,

విశ్రాంతోధగురో తస్మిన్ పౌత్రానాదాయకౌరవాన్
శిష్యత్వేన దదౌభీష్మో వసూని వివిధానిచ
గృహంచసుపరిచ్ఛన్నం ధనధాన్యసమాకులం
భారద్వాజాయ సుప్రీతః ప్రత్యపాదయతః ప్రభుః.
రాజపుత్రా స్తథాచార్య సమేత్య భరతర్షభ
అభిజగ్ముస్తతోద్రోణ మస్త్రార్థేద్విజ సత్తమః
వృష్ణయశ్చాంధకాశ్చైవ నానాదేశ్యాశ్చ పార్థివాః
సూతపుత్రశ్చరాధేయో గురుంద్రోణమియాత్తదా.

భార. ఆది అ. 122.

గురువగు ద్రోణాచార్యుఁ డిక్కడ నక్కడ సంచారము సేయుచుఁ దుదకు గౌరవరాజధానిం జేరి కొన్ని దినములు విశ్రాంతిం గైకొనినపిదప భీష్ముఁ డాయనం బరీక్షించి విద్యనభ్యసించు నిమిత్తము కౌరవపాండవుల నాయన వశముజేసెను. మఱియు శిష్యసమేతముగ ద్రోణుఁడు నివాసముఁ జేయుట కొరకు ధనధాన్యసంయుతంబగు సుందరమందిరము గట్టించియిచ్చి వారి గురుకులవాసమున కవసరమైన ప్రబంధమునంతయు భీష్ముఁడేచేయించెను. ద్రోణునిదగ్గరఁ గౌరవపాండవులు మాత్రమేకాదు. యాదవ, వృష్ణి, అంధక, కర్ణాది రాజపుత్రు లనేకులు విద్యనేర్చుకొనిరి. గురుకులవాస మొనర్చి విద్యనేర్చియుండె రనుటకుఁ గొందఱు రాజర్షిబ్రహ్మర్షులనామములిందు దెలుపుచున్నాను

పరచితిమి. ఇదేవిధమునఁ బూర్వకాలమందలి యార్యులెల్లరు నొకరి నుండి మరియొకరు విద్య నలవర్చుకొని యుండిరి. ఎట్లనఁగా;

సాక్షాత్కృత ధర్మాణ ఋషయో బభూవుస్తే అవరేభ్యో
సాక్షాత్కృత ధర్మభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః
నిరు. పూ. అ. 1. పా. 6. ఖం. 5

ఎవఁడుజగత్తునందలి సమస్తపదార్థముల యొక్క గుణ ధర్మములగురించి సరియగురీతి నిశ్చయమెఱింగియుండునో యట్టిమహావిజ్ఞానవంతుఁడగు ఋషితనకంటె దక్కువధర్మములుఁగల ఋషులచే వేదవిద్యఁజదివింపుచు వచ్చెను. మనపూర్వులందఱు పరస్పర మొకరినుండి మరియొకరు విద్యనభ్యసింపుచు నొకరొకరికి నేర్పుచువచ్చిరి. అటులేయిప్పుడు గూడ జరుగవలసి యున్నది. పూర్వకాలమున పాఠశాలలును, విద్యార్థిజననివాసాలయములును లేవనికొందఱనుట కేవలమబద్ధము, ఆకాలమున సకలజనులు గురుకులవాసవిధానముననే చదువుచు వచ్చిరి. ఎట్లనగా,

బాలదాయాదికం రిక్థం తావద్రాజానుపాలయేత్
యావత్సస్యాత్స మావృత్తో యావచ్చాతీత శైశవః.
మను. అ. 8.

ఏబాలకునకు బాల్యమందే తలిదండ్రులు చనిపోవుదురో, యట్టిబాలుఁడెంతకాలమువరకు నింటికిఁ బోవకయుండునో యంతపర్యంతమతని స్థావరజంగమాత్మకమైన యాస్తిని రాజు కాపాడుచుండవలయునను నీప్రమాణముచే రాజ్యప్రబంధము వలన సమస్తబాలకులు గురుకులవాస మొనరింప నీలుకలిగి యుండినట్లు తేటతెల్లమగుచున్నది. మఱియుఁ బూర్వకాలమున విద్యాధ్యయనమునకు సంబంధించిన వారందఱు పట్టణముల వెలుపల నేకాంతములైన పరిశుద్ధప్రదేశములందు విశ్వవిద్యాలయములంగట్టించికొని యక్కడే వసింపుచుండిరి. ఈకారణముననే మనువు

ముండో వాజటిలో వా స్యాదథవా స్యాచ్ఛిఖాజటః
నైనంగ్రామేఽభినిమ్లోచేత్ సూర్యోనాభ్యుదయాత్
క్వచిత్ మను.అ. 2.

బ్రహ్మచారిమస్తకము ముండనము జేయించుకొనవలయు, లేక జటలంగాని శిఖగాని యుంచుకొనవచ్చును.సూర్యుఁడుదయించుటకు ముందును ప్రొద్దుగ్రుంకిన యనంతరమును అనగా రాత్రికాలమున గ్రామములో నుండగూడదు. విద్యార్థిజననివాసాలయములందే యుండవలయును. ఇట్టినియమముండుటంబట్టియే ద్రోణాచార్యసహితముగ కౌరవపాండవులువసించునిమిత్తము విద్యార్థిజననివాసాలయము భీష్ముఁడు కట్టించి

యిచ్చెను. ఇక్కాలమున విశ్వవిద్యాలయములందును, కళాశాలలందును, రాజకుమార విద్యానిలయములందును దూర దేశములనుండి విద్యార్థులేతెంచి చదువుకొనుచుండురీతి పూర్వమందుఁగూడ బ్రహ్మచారులు నానాప్రదేశములనుండివచ్చి యొక్కచో నివసించుచువచ్చిరి. ద్రోణునివద్దఁ జదువుకొనుట కితర రాజకుమారులును, బిప్పలాదఋషివద్ద విద్యాభ్యాసముఁ జేయుట కనేకమంది యనేకచోట్లనుండి వచ్చియుండినట్లు ఇంతకుముందే వ్రాయఁబడినదిగదా. ఇదియిట్టులుండఁ బూర్వకాలమందు విద్యార్థులందఱు బిచ్చమెత్తుకొని పొట్టఁబోసికొనుచు విద్యనభ్యసించుచు వచ్చిరనియు నిప్పటివలె విద్యార్థిజనని వాసాలయవ్యవస్థ యప్పుడు లేకుండెననియు గొందఱు చెప్పుచున్నారు. ఇదిసర్వవిధముల నబద్ధమేఁలయన మనువు రాముఁడు కృష్ణుఁడు పరశురాముఁడు జనకుఁడు యాజ్ఞవల్క్యుఁడు సుకేశాదులు కౌరవపాండవులు మొదలగువారెల్లరు గురుకులవాసవిధానంబున విద్యనేర్చిరని యనేక గ్రంథములలో వ్రాయఁబడియున్నదికాని వీరలు ముష్టిమెత్తుకొనిరని యెచటను వ్రాయఁబడి యుండలేదు స్మృతులయందు విద్యార్థులు బిక్షమెత్తికొని భుజింపవలయునని యుపదేశము చేయఁబడి యున్నదందు లేని వానిలో వ్రాయబఁడి యుండుట నిక్కవమేకాని యందఱుముష్టి యెత్తుకొనవలెనని స్మృతికారుల యుద్దేశమై యుం

డను దగ్గరధనములేనిచో బిచ్చమెత్తుకొనియైన విద్యనేర్చి విద్వాంసులగుఁడు కాని మూర్ఖులుగ మాత్రముండబోకుండని వ్రాసియుంచారు ప్రస్తుతకాలము నందక్కడక్కడ ముష్టియెత్తుకొని తినుచు సంస్కృతాదివిద్యల నభ్యసించుచున్న విషయముఁ బూర్వమునఁగూడ జరిగియుండవచ్చును కాని యిక్కాలమున బీదలగువారలు పూర్ణవిద్య నేర్చుటకు వలను కాని విధమిప్పుడు లేదు దగ్గరధనము లేని కారణముననే యీకాలమందనేకు లాంగ్లేయవిద్య నభ్యసింపఁజాలకున్నారు కాని మనపూర్వపుఋషిమహర్షులెంతటిదీర్ఘదర్శులై యుండిరో యోచింపుఁడు ప్రతిగ్రహణమునకుఁ దగరని నిషేధింపబడిన క్షత్రియాదులు సహితము విద్యార్థి యవస్థయందుఁ జరుపుకొనఁదగిన సదుపాయము లేకుండినచో నట్టివారలు బిచ్చమెత్తుకొనియైన విద్యనేర్చికొని విద్వాంసులు కావలయునుగాని మూర్ఖులుగ నుండరాదని యేర్పరచిరి కావున స్మృతులు మొదలగువానియందు విద్యార్థులు బిచ్చమెత్తికొనవలయునని వ్రాయఁబడియుండుట కేవలము దరిద్రులకొరకే యై యుండవచ్చును బిచ్చమెత్తికొనకుండ విద్యనభ్యసించుటచేత బాపమేకలుగునెడల భీష్మునంతటి ధార్మికపురుషుఁడు కౌరవపాండవులు బిక్షమెత్తికొనకుండ విద్యనభ్యసింపఁగల యుత్తమప్రబంధమేల యేర్పరచియుండును మరియు శతపథమందుముష్టియెత్తుకొనుట

యత్యంతనీచమని వ్రాయఁబడి యున్నది చూడుఁడు!

అథయదాత్మానందరిద్రీకృత్యైవ అహ్రీంభూత్వాభిక్షతేయ
ఏవాస్యమృత్యోపాదస్తమేవతేన పరిక్రీణాతి.

శ. కాం. 21ప్ర. 2. అ. 3.

ఏమనుష్యుఁడు దరిద్రుఁడై సిగ్గుమాలి బిచ్చమెత్తుకొనునో యట్టిబ్రహ్మచారి మృత్యువునందొకపదముంచినటులే యెంచవలయును అనఁగా నట్టివాఁడు బ్రదికియుండియుఁ జచ్చినవానితో సమానుఁడే విచారించిచూడ నీశతపథవాక్యమెంతయు నిశ్చయమై యున్నది ఏలయన భిక్షమెత్తికొని చదువనెంచువాఁడాజన్మము ముష్టినెత్తుకొనవలసియే యుండును దినమంతయు భిక్షమెత్తుకొనుటకే సరిపోవనిక వానికి జదివికొననవకాశ మెచటనుండి కలుగును? కావున భిక్షావృత్తిమిగుల నీచమైనది కాని యేయుపాయము లేనియెడల నిఁకవిధిలేదు కానఁబూర్వోక్త ప్రమాణమువలన దీనదశయందు దక్కతక్కిన వేళల ముష్టియెత్తికొని భుజింపవలసిన యావశ్యకము లేనట్లును విద్యార్థి జననివాసాలయములవసించి విద్యనేర్చుటావశ్యకమైనట్లును స్పష్టమగుచున్నది. విద్యార్థులు చదువుకొనుటకుఁ బాఠశాలలును, నివసించునిమిత్తము నివాసాలయములును గట్టఁబడవలయును. విద్యార్థిజననివాసాలయముల యొక్క ప్రతిపంక్తి యందలి గదులలో సమానవయస్కులగు విద్యార్థులనుంచి

వారందఱకు నుత్తమరీతినన్నపానములు, వస్త్రములు లోన గునవి క్రమముగనందునట్లు జేయవలయు. విద్యాలయములు, నివాస్థాలయములు నగరమున కతిదూరముకానట్టియు, నతిస మీపముకానట్టియు, స్వచ్ఛమై యేకాంతముగనుండునట్టి మనోహరమైన ప్రదేశమునఁగట్టఁబడవలయును. పట్టణసమీపమందైనఁ గోలాహలమెక్కుడుగఁగలుగుటయు నతిదూరమైనవిద్యార్థులచదువునకు బాధకలుగుటయు సంభవమైయున్నది. మరియు,

నిత్యానధ్యాయ ఏవస్యాద్ గ్రామేషునగరేషు చ,
ధర్మనైపుణ్యకామానాంపూతిగంధేచసర్వదా. మను.అ. 4.

గ్రామమందుగాని నగరమందుగాని దుర్గంధయుక్తము గు ప్రదేశమందు విద్యార్థులచేఁ జదివించఁగూడదని మనుస్మృతియందును

శుచౌ శు. ప్రా. అ. 1.

విద్యార్థులస్వచ్ఛముఁబవిత్రమునగు ప్రదేశమునఁజదివించవలయునని శుక్లయజుర్వేదప్రాతిశాఖ్యయను గ్రంథమందును లిఖింపఁబడియున్నది. కావునఁబైనవచించినరీతి మంచిస్థలమునే బాలికాబాలకుల చదువునిమిత్తము నియతముచేయవలయును. అట్టివిద్యాలయములకుఁ దలిదండ్రులు తాముస్వయముగఁగాని రాజ్యవ్యవస్థననుసరించికాని తమబిడ్డలఁదప్పక పంపుచుండవలయు. కాని ప్రాణిధర్మశాస్త్రానుకూలము బాలకు

లయొక్క శారీరకమానసిక యోగ్యతలననుసరించి వారిఁజను వునందుఁ బ్రవేశపెట్టవలయుననుట ముఖ్యముగ స్మరణమునం దుంచికొనుఁడు. ఎందుచేతననఁగా

నానుపసన్నాయానిదంవిదే.సిరు. పూ అ. 2. పాద. 1.ఖం.6

ఎంతవరకు బాలుఁడు స్వయముగఁ బాఠశాలకేగ యోగ్యుఁడు కాకయుండునో, యెంతవరకువిద్యయెడలఁ బ్రీతివహింపకయుండునో, యెంతవరకు బాలకునకిది యేవస్తువగునోయని యూహించునంతటి జ్ఞానముకలుగకయుండునో యంతపర్యంత మతనిచేఁ జదివింపఁగూడదనినిరుక్తమందును.

వయఃశీలశౌర్యశౌచాచార వినయశక్తిబలమేధాధృతి
స్మృతిమతిప్రతిపత్తియుక్తం. సుశ్రు. సూ. అ. 2.

బాలకుఁడువయస్సంపన్నుఁడనగా నధికావస్థనొందినపిదప వానిఁజదివింపవలయునని సుశ్రుతమందును వ్రాయఁబడియున్నది. అట్టియవసరమే మననల్పావస్థయందు బాలకుని శరీరావయవములు సూక్ష్మములుగనుండుటంజేసి యతనియందు జ్ఞానముసహితము కడుస్వల్పముగనేయుండును. అప్పుడప్పుడే మొలకెత్తుచుండు నంకురమునకధికముగ నీరుపోయుటవలన నామొలకయెటులభివృద్ధిఁబొందఁజాలదో, యెట్లుఫలపుష్పాదులుదానికిఁ గలుగకయుండునో యటులే బాల్యావస్థయందు బాలునియొక్క జ్ఞానమను మొలకకు నధికముగఁజదివించుటయును యొక్క

వసిరుపోయుటచేత నతనిశరీరమందలి జ్ఞానాంకురమునకు హా
నికలుగఁదన్మూలమున ధర్మార్థకామమోక్షములను ఫలముల
ప్రాప్తిని మనుజదేహముపొందనేరదు. కావుననెంతపర్యంతము
బాలకులయొక్క శరీరావయవములు దృఢములు కాకయుం
డునో యంతపర్యంతము వారిఁజదువునందుఁబ్రవేశపెట్టకయుం
డుట మాతాపితరులకుచితము, అటులేశీలవంతుఁడు, బలిష్టశ
రీరుఁడు, వస్త్రములులోనగువానిఁ బరిశుభ్రముగ నుంచికొను
వాఁడు, సదాచారి,వినయవంతుఁడు, జ్ఞాతృత్వశక్తియుక్తుఁడు బు
ద్ధిమంతుఁడు, ధృతిమంతుఁడు, స్మరణశీలుఁడు, జనుపుటయందిష్ట
ముఁగలిగియుండునతఁడు, చదువువలనఁగలుగుశ్రమముసహించు
కొనగలుగునతఁడు,నగుబాలకునిగురుకులమునవసింపఁజేసిశా
స్త్రవిద్యలనభ్యసింపఁజేయవలయు. ప్రస్తుతకాలమందునబా
లకులఁగేవలము కాగితపు శరణ్యులఁజేయుట మహాహానికారక
మైయున్నది. కానశాస్త్రవిద్యయు, యంత్రకళాకౌశలాదివిద్య
యు వారలకవశ్యముగ నేర్పవలయును. ఇదేవిధమునఁజరకపి
మానస్థానమందలి యెనిమిదవయధ్యాయమందును, వాగ్భట్టా
దిగ్రంథములందును వ్రాయఁబడియున్నది. బాల్యావస్థయందు
ను, బలములేకయుండునపుడును, బాలురుచదువరాదని మన
పూర్వులునిషేధించియుంటయత్యుత్తమమైయున్నది. అట్లుచది
వించుటచేఁబైనవచించిన నష్టములేకాక మఱియునసేకవిధముల

హానికలుగును. ఎట్లనఁగా నల్పవయసునఁజదువుటచే బాలకుని శరీరము నల్పముగనుండి కొంచెమెదిగినపిదప జ్ఞానముతక్కువగును. శరీరముదుర్బలమై రోగగ్రస్థమగును. ఆయువుక్షీణించును, శీఘ్రకాలమునందమృతియుఁగలుగును. ఇట్టివేయగుననేకోపద్రవములు చిన్నయీడునఁజదివించుటంజేసి పొడముచుండును. కావునఁచిన్నవయసునందు బిడ్డలఁజదివింపఁగూడదనుటదలిదండ్రులు ధ్యానమునముంచికొనవలయును. ఏక్రమమున వారిఁజదివింపనగునని బ్రహ్మచర్యప్రకరణమందును, గృహస్థప్రకరణమందును వ్రాయఁబడునో యాక్రమములఁజదివించుట శ్రేయస్కరము.

ఇఁకనీవిద్య నభ్యసించుటకెవరెవరి కధికారముకలదో యోచింతము. కేవలము బ్రాహ్మణులుమాత్రమేచదువుటకర్హులని కొందఱును, బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకట్టియధికారమున్నదని కొందఱును వచించుచున్నారు. కానిస్త్రీశూద్రులకట్టియధికారములేదఁట. పక్షపాతమువీడియోచించిచూతుమేని స్త్రీశూద్రులకుఁగూడ విద్యాధ్యయనాధికారమున్నటుల స్పష్టముకాగలదు. ఎట్లనఁగా నాపస్తంబధర్మసూత్రములందు

"అస్థవనాస్య వేదస్య శేషఇత్యుపదిశంతి"

ఆప. ధర్మసం. ప్ర. ప. 11. ఖం. 29.

స్త్రీశూద్రులచేనథర్వవేదముఁ జదివింపవలయుననివ్రా

యఁబడియుండుటచే వారికి వేదాధ్యయనాధికారము సహితము న్నటుల విశదమగుచున్నది. ఇంతయేల

యథేమాం వాచంకళ్యాణీ మావదానిజనేభ్యః బ్రహ్మరాజన్యాభ్యాగ్ం శూద్రాయచార్యాయ స్వాయచారణాయ

యజు. అ. 26.

విద్వాంసులార! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అతిశూద్ర అంత్యజాతి సమస్తమానవమాత్రులనిమిత్తము నే నెట్లు వేదమును బ్రకాశముఁజేసియున్నాఁడనో యటులేమీరు నుజేయుఁడని పరమేశ్వరుఁడేయాజ్ఞాపించియున్నందున మనుష్య మాత్రునకట్టియధికారమున్నటుల స్పష్టమగుచున్నది. మఱియు

బ్రహ్మవైస్తోమానాం త్రివృత్ క్షత్రంపంచదశో విశఃసప్త దశః శౌద్రోవర్ణ ఏకవింశ. ఐత. పం. 8. అ. 4.

బ్రాహ్మణుఁడు తొమ్మిది, క్షత్రియుఁడు పదునైదు, వైశ్యుఁడు పదునేడు, శూద్రుఁడిరువదియొక్క యన్ని స్తోమములో నరింపనలయునని ఐతరేయబ్రాహ్మమునందలి యగ్నిష్టోమప్రకరణమున వ్రాయఁబడియున్నది. స్తోమమన వేదమంత్రము; నిరుక్తముయొక్క పూర్వషట్కములోని మూడవయధ్యాయమందలి రెండవఖండమునఁ జూచికొనుఁడు. ఇందుచే బ్రాహ్మణుఁడు తొమ్మిదిమంత్రములతోఁడను, క్షత్రియ వైశ్య శూద్రాదులు క్రమముగఁబదునైదు, పదునేడు, ఇరువదియొక్కమంత్ర

ములతోడను యజ్ఞముచేయవలయునని తెలుచున్నది. దీనివల న శూద్రులుకూడయజ్ఞముచేయవలయునని విధింపఁబడియుండు టచే వారికి వేదాధ్యయనాధికారముంచుటనిస్సందేహమేకదా! మఱియు ఛాందోగ్యమందలి నాలుగవప్రపాఠకములోని రెండవ ఖండములో హీరేత్వాశూద్ర

అనువాక్యములఁజూచుఁడు. రయిక్వుఁడనుమహర్షి జాం శ్రుతియను పేరుగలశూద్రునిచే విద్యఁజదివించె. కులము తెలి యని జాబాలికి గౌతమఋషి యుపనయన సంస్కారముఁజేసి విద్యనేర్పినట్లు ఛాందోగ్యము వచింపుచున్నది. మరియు ఋగ్వే దముయొక్క పదియవ మండలములోని మూడవ యనువాక మందలి ముప్పదియవ సూక్తము మొదలుకొని ముప్పదినాల్గవ సూక్తమువరకుఁ గల నాలుగు సూక్తములఁ గవషయైలుషుఁడ ను ఋషి ప్రచారము గావించి యనేకఋషులచేఁ జదివించె ఇతఁడు శూద్రుఁడు. ఇందులకు ప్రమాణము ఐతరేయబ్రాహ్మ ణముయొక్క రెండవసంచికలోని మూడవ యధ్యాయమున గలదు. కౌశీతకీబ్రాహ్మణమందును నిటులే వ్రాయఁబడియు న్నది. అటులే పూర్వోక్త సూక్తములఁ బ్రచారము చేసినది కవషయైలుషుఁడేయని ఋగ్వేదానుక్రమణిక యందును, నీసూ క్తములయొక్క సాయనభాష్యమందును, వ్రాయఁబడియున్నది. ఋగ్వేదముయొక్క ప్రథమమండలములోని పదియేడవయను

ాకమండలి 116 వ సూక్తము మొదలుకొని 126 వ సూక్తముvarakuṃ
ముపరకుఁ గలవానిఁ బ్రచారము చేసినది కక్షీవానుఁడు. ఈక క్షీవానుఁ డంగదేశపురాజుయొక్క దాసీకుమారుఁడని ఋగ్వేదానుక్రమణిక యందును, ఈసూక్తములపై వ్రాయఁబడిన సాయనభాష్యమందును, మహాభారతమందును వివరింపఁబడియున్నది. ఆహా! ఏకవషయైలూషాది శూద్రులయొక్క కృపవలన సంచారమందు వేదములకుఁ బ్రచారము కలిగెనో యట్టివారి సంతానములైన శూద్రులకు వర్తమానకాలమున హీనబుద్ధులగు మూర్ఖులు కొందఱు "మీకు వేదమువినుటకైన నధికారములేదు" అని వచింపుచుండుటెంతయు విచారకరముగనున్నది. దురాగ్రహులు హీనబుద్ధులునగు నీమూఢుల కంతటితోనైన సంతోషముకలిగెనా? లేదు.

శ్రవణేత్ర్పుజతుభ్యాం శ్రోత్ర పరిపూర్ణం ఉచ్చారణే
జిహ్వాచ్ఛేదో ధారణేహృదయవిదారణమిత్యాది.
వే. సం. అ. 1. పా. 3. సూ. 38.

శూద్రుఁడు వేదమువినినయెడల సీసముగాని, లక్కగాని కరగించి వానిచెవిలోఁ బోయవలయుననియు, మంత్రము నుచ్చరించినచో నాలుకఁగోయవలయుననియు, జ్ఞాపకముంచికొనినచో హృదయవిదారణము గావింపవలయుననియు వ్రాసికొనిరి. సుజ్ఞానులారా! లోకులు శూద్రులవిషయమై యెట్టి

యన్యాయమున కొడగట్టిరో యోచింపుఁడు. వీరలకింతటి దు రాగ్రహమేలపొడమెనో, తోఁచకున్నది. చూడుఁడు.

ఏహీతి బ్రాహ్మణస్యాద్రవేతి వైశ్యస్యచరాజస్య
బంధోశ్చాధావేతి శూద్రస్య.

శ. కాం. 1. ప్ర. 1. అ.1. బ్రా. 4. కం. 19.

నాలుగువర్ణములవారలు వేదమంత్రములతో హవిస్సు నుశుద్ధిపరచవలయునని శతపథమందును,

హవిష్కృదేహీతి బ్రాహ్మణస్య హవిష్కృదాగహీతి రాజన్యస్య హవిష్కృదాద్రవేతి వైశ్యస్య హవిష్కృదాధావేతి శూద్రస్య ప్రథమంవా సర్వేషాంవా. ఆప.శ్రౌ.ప్ర.1.కం.19.

పైనవ్రాసిన నాలుగు వేరువేరు మంత్రములతోగాని, మొదటిమంత్రముతోగాని నాలుగువర్ణములవారలు యజ్ఞవిధానమున హవిస్సును శుద్ధిపరచవలయునని ఆపస్తంబ శ్రౌతసూత్రములందును లిఖింపఁబడియున్నది. దీనిచేతను శూద్రులకు వేదాధికారము స్పష్టమగుచున్నది అటులే

ఆచాంతోదకాయ గౌరితినాపిత స్త్రిర్బ్రూయాత్ ముంచగా
వరుణపాశాత్. గోభి. ప్ర. 4. కం. 10.

దీనిపైటీకయందు, తమేవనాపితంముంచగామితి మంత్రంబ్రూయాత్. పైమంత్రము మంగలికి వినిపింపవల

యునని యుంటంజేసి మంగలివానికిఁగూడ వేదాధికార ముండి నటుల దేలుచున్నదే వెండియు,

ళద్రైవావృతాఽనిషాదస్థపితం యాజయేత్.

ఆప. శ్రౌ. ప్ర. 9. కం. 14.

పైన లిఖింపఁబడిన యజ్ఞముల సమస్తనిషాదులచేఁ జే యించవలెననియు,

"సావిత్రీ పురో అనువాక్యా" గాయత్రీమంత్రముల తో నాహుతు లిప్పింపవలెననియు చెప్పఁబడియుంటంజేసి శూ ద్రునకు గాయత్రీ మంత్రాధికారము సహితమున్నటులఁ దేట తెల్లమగుచున్నది. మరియు,

గాయత్రఛందసో బ్రాహ్మణాః, త్రిష్టుప్ఛందసః క్షత్రియాః
జగతీఛందసోవిశః అనుష్టుప్ఛందసఃశూద్రాః

శాం. శ్రౌ. అ. 14.

గాయత్రీమంత్రముతో బ్రాహ్మణులు త్రిష్టుప్ఛంద ముతో క్షత్రియులు, జగతీఛందముతో వైశ్యులు, అనుష్టుప్ ఛందముతో శూద్రులును యజనముచేయవలయునను శాం ఖాయనశ్రౌతసూత్రములయందలి విధిచేతంగూడ శూద్రుల కు వేదాధికారము సిద్ధమగుచున్నది. ఇదేప్రకారము మనుష్య మాత్రులకు శాస్త్రాధికారము, యజ్ఞాధికారము నున్నటుల జైమిని పూర్వమీమాంసమున రూఢిపరచియున్నాఁడు.

5

ఫలార్థత్వాత్ కర్మణః శాస్త్రం సర్వాధికారం స్యాత్-
పూ. మీ., అ. 6 పా.

విద్యాధ్యయనము, యజ్ఞము లోనగుకర్మలు మనుష్య మాత్రులకు ఫలముల నొసంగును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అంత్యజాదులలో నెవఁడైన గానిండు యెవఁడు విద్య నభ్యసించునో వానికి విద్యవచ్చును; ఎవఁడు యజ్ఞాధిశుభకర్మ ము లాచరించునో వాని కవశ్యముగ ఫలము చేకూరు గావున మానవమాత్రులకు శుభకర్మము లొనరించుట యుక్తమైయున్నది. జనులలో ననేకమంది చదువుకొనుటకే యిచ్చగింపరని యు నందుచేత సమస్తమానవులు జదువవలెనని యధికారమిచ్చుట వ్యర్థమనియు వచింతురేని నాలస్యప్రమాదవశులై యెవరైనఁజదువనిచో నదివారిమూర్ఖతయే కాని వేరుకాదు; కాని జనులందఱు శుభకర్మముల నొనరింపవలయునని యాజ్ఞాపించుటయందు శ్రుతియొక్క దోషమేమున్నది?

కర్తుర్వా శ్రుతిసంయోగాద్విధిః కార్త్స్న్యేనగమ్యతే.
పూ. మీ. అ. 6. పా.

విద్యాధ్యయనము, యజ్ఞము మున్నగు కర్మములొనరించుటయందెవఁడు సామర్థ్యముఁగలిగి యుండునో యతనికి శ్రుతిసంయోగముతో యుక్తకర్మము లొనరింప సకలవిధముల నధికారము కలదు. శ్రౌతయజ్ఞముఁ జేయుటకు శూద్రులకుఁగూడ నధి

కారముకలదని యింతకుఁబూర్వమే వ్రాసియుంటిమికదా, దీని ని గురించియే వెండియు,

స్థపతిర్నిషాదః స్యాత్ శబ్దసామర్థ్యాత్. పూ. మీ. అ.6. పా.

శబ్దసామర్థ్యాత్ - వేదముయొక్క యాసతివలన నిషాదులును రౌద్రయాగముఁ జేయవలయునని జైమిని రూఢి చేసియున్నాఁడు. యజ్ఞసంబంధములైన సమస్తకర్మలు. వేదముఁజదివియున్న వారలే చేయవలయుఁగాని యితరులు చేయఁగూడదు. ఎట్లనఁగా

జ్ఞాతేచవాచనం నహ్యావిద్వాన్ విహితోఽస్తి.

పూ. మీ. అ. 3. పా. 8.

ప్రస్తుతకాలమునందు జరుగుచున్న వివాహములలో వధూవరులిద్దరుఁ బసివారలై యుండు కారణమున వారు పరస్పరమనుకొనవలసిన వేదోక్తంబులగు ప్రతిజ్ఞావాక్యములను బెండ్లి జేయించు పురోహితుఁడే యొకరు వ్రుఁబెట్టుచుండురీతి, యజ్ఞమందుఁగూడ యజ్ఞముచేయునతఁడు వేదముచదువకపోయినప్పటికి నతఁడుచ్చరింపవలసిన మంత్రముల నతనికి బదులుగ ఋత్విగులు మొదలగువారలే పఠింపఁగూడదా యని ప్రశ్నింతురేని నందులకు జైమినిమహర్షి వేదముఁజదివియున్న వారలకే యజ్ఞముఁగావించునధికారమున్నది కాని యితరులకెంతమాత్రము లేదని యీపైసూత్రమునుండి స్పష్టముగ వ్రాసియున్నాఁడు.

నిషాదునకు యజ్ఞాధికారమున్నటుల యజుర్వేదముయొక్క 26 వ యధ్యాయమందలి 19 వ మంత్రముపై మహీధరుఁడు వ్రాసిన భాష్యమువలనను, నిరుక్తమువలనను విదితమగుచున్నది. ఇఁక లౌకికవ్యవహారములందును శాస్త్రములందును నిషాదనామ మతిశూద్రునకుఁ బ్రసిద్ధము. పూర్వోక్త ప్రమాణములచేనట్టి నిషాదునకుఁగూడ యజ్ఞాధికారమున్నటుల స్పష్టమగుచున్నదికదా! వెండియు,

పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వమీయాత్
వణిగ్జనః పణ్యఫలత్వమీయాత్
జనశ్చ శూద్రోపి మహత్వమీయాత్. వా. రా. బా. స. 1.

రామాయణముఁజదువునెడల బ్రాహ్మణునకైన వాక్చాతుర్యము కలుగుననియు, క్షత్రియుఁడైనచో భూపతియగుననియు, వైశ్యుఁడైనవ్యాపారము నున్నతిఁ బరచికొనఁనోపుననియు శూద్రుఁడైన మహత్వమును బొందునని రామాయణంబునను, మహాభారతమందు

యథామతియథాపాఠం తథావిద్యాఫలిష్యతి
సర్వస్తరతుదుర్గాణి సర్వోభద్రాణిపశ్యతు.
భార. శాం. అ.328.

మానవుఁడెంత బుద్ధిఁగలిగి యెంతకష్టపడి చదువునో

యంతయెక్కువగ నది యతనికి ఫలమిచ్చునసియు,

శ్రావయేచ్చతురోవర్ణాన్ కృత్వాబ్రాహ్మణమగ్రతః
వేదస్యాధ్యయనం హీదం తచ్చకార్యం మహత్స్మృతమ్
భార. శాం. అ. 328.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది నాలుగు వర్ణములవారికిఁ గ్రమముగ వేదముపదేశముఁ జేయుఁడని వ్యాసుఁడు జైమిని మొదలయిన శిష్యులతో వచియించియుంటఁ జేసి వేదాధ్యయనము సకలజనులకుఁ గర్తవ్యంబనియు,

చత్వారోవర్ణా యజ్ఞమిమంవహంతి.
భార. వ. ప. అ. 134.

అనుదానిపై వ్రాయఁబడిన నీలకంఠభాష్యములో

యజ్ఞం జ్ఞానయజ్ఞేశూద్రస్యా ప్యస్త్యధికార.

అనియున్నది కావున శ్రేష్ఠతమంబైనజ్ఞానయజ్ఞమునకు శూద్రులకు సహితమధికారమున్నదనియు,

విద్యార్థం బ్రహ్మచారీస్యాత్ సర్వేషాంపాలనేగృహీ.
శు. న. అ. 4. ప్ర. 4.

నాలుగు వర్ణములవారలు విద్యనభ్యసించు నిమిత్తముఁ బ్రహ్మచర్యముఁబూనవలయుననియు, సకలజనుల పాలనార్థము గృహస్థధర్మము నవలంబింపవలయుననియు శుక్రనీతిలో వ్రాయఁబడియున్నది. శూద్రులకు విద్యాధికారముండియుండినచో

వారల కుపనయనాధికారముగూడ యుండవలయును కాని వారికట్టియధికార మేశాస్త్రమునందును లేదు కావునఁజదువుట కుసహితమధికారము లేదని యెవరైనఁబ్రశ్నింతురేమో. అందులకుఁబ్రత్యుత్తరము వినుఁడు.

శూద్రాణామదుష్టకర్మణా ముపనయనమ్.

పరాస్కర. గృ. సూ. కాం. 2. వృ. 6.

దుష్టకర్మములఁజేయని శూద్రునకుపనయనముఁజేయవలెనని హరిహరభాష్యసహితంబగు పరాస్కరగృహ్యసూత్రములలో స్పష్టముగ లిఖింపఁబడియున్నది. ఎక్కడశూద్రునకుపనయనసంస్కారము కూడదని నిషేధింపఁబడియుండునో యది దుష్కర్మము లొనరించువారికొరకే కాని వేరుకాదు. మఱియు దుష్కార్యములఁజేయుచుండుశూద్రునకెట్లుపనయనముఁజేయఁగూడదని వ్రాయఁబడియున్నదో యటులేదుష్కర్మరతుండగు బ్రాహ్మణునకును నుపనయనముఁజేయఁగూడదని యాపస్తంబ ధర్మ సూత్రములందు విధింపఁబడియున్నది చూచికొనుఁడు. అటులే

శూద్రాణాం బ్రహ్మచర్యత్వం మునిభిః కైశ్చిదిష్యతే.

యోగయా. అ. 2.

శూద్రులకు బ్రహ్మచర్యాధికారమున్నటుల యోగయాజ్ఞవల్క్యంబునందును,

అత్రచ శూద్రావాజసనేయినః ఇతివసిష్టవాక్యాత్
సంస్కారమయూఖము. ప 85.

వలనను

శూద్రోవా చరితవ్రతః. వృ. గౌ. స్మృ. అ. 16.

అని వృద్ధగౌతమస్మృతియందును శూద్రులకుపనయనవిధానములిఖింపఁబడియున్నది. పురుషమాత్రులకేల్ల విద్యాధ్యయనాధికారము శాస్త్రసమ్మతమో యట్లులే వేదాదిసకలశాస్త్రములఁ జదువునధికారము స్త్రీలకుఁగూడ కలదు. ఎట్లనఁగా

బ్రహ్మచర్యేణ కన్యాయువానంవిందతేపతిం
అథ. కాం. 11. అను. 3. వ. 15

బ్రహ్మచర్యమువలనఁగన్య వయోవంతుఁడగు పతినిఁ బొందవలయునని యథర్వవేదమందును,

సమానం బ్రహ్మచర్యం. ఆ. శ్రౌ. పట. 4. కం. 15.

బ్రహ్మచర్యము స్త్రీపురుషులకు. సమానమని యాపస్తంబ శ్రౌతసూత్రములందును లిఖింపఁబడియున్నది. ఇంతయేల? స్త్రీలలో ననేకులు వేదమంత్రములనే ప్రచారముచేసియున్నారు చూడుఁడు. ఋగ్వేదముయొక్క ప్రథమమండలములోని 23 వ యనువాకమందలి 179 వ సూక్తముఁ బ్రచారముచేసినఋషిలోపాముద్ర ఎనిమిదవ మండలములోని 1 వ

యనువాకముయొక్క 91 వసూక్తము అపాలయను పేరుగల కన్యకప్రచారముఁగావించె. ఇందులకుఁబ్రమాణము ఋగ్వేదానుక్రమణికయందును, సాయనభాష్యమందునుఁ గలదు స్త్రీలకు వేదముఁజదువు నధికారమే యేల? పూర్వోక్తప్రమాణములంబట్టి వారలు వేదముంబ్రచారముచేసిన ఋషులలోఁ గొందఱైయుండిరికదా. మఱియు యాజ్ఞవల్క్యఋషిపత్నియగు మైత్రేయి పరమవిదుషియై బ్రహ్మవాదినియైయుండెనని బృహదారణ్యకమున వ్రాయఁబడియున్నది. ఇదేవిధమున

అథ హైనం గార్గీ వాచక్నవీ ప్రపచ్ఛ యాజ్ఞవల్క్యేతి హోవాచ (ఇత్యారభ్య) గార్గీమాతి ప్రాక్షీరితి తతో హ గార్గీ వాచక్నవ్యు పరరామ. బృ. ఉ. అ. 5. బ్రా. 6.

గార్గి యాజ్ఞవల్క్యునితోడఁ బ్రశ్నోత్తరరూపమున నతి విస్తారముగ శాస్త్రార్థమొనరింప నన్నింటికిఁబ్రత్యుత్తరమిచ్చి చూఁడఁదకిఁక విస్తారముమాటలాడవలదని యామెనువారించె. యాజ్ఞవల్క్యునంతటి ఋషియే శాస్త్రార్థమొనరించునపుడు విస్మయమునొంది యిఁకనూరకయుండుమని వచించుటఁజేసి గార్గి యెంతటివిద్వాంసురాలై యుండెనో యోచింపుఁడు.

అథయ ఇచ్ఛేద్దుహితా మే పండితా జాయేత సర్వమాయురియాదితి తిలౌదనం పాచయిత్వా సర్పిష్మంత మశ్నీయాతామీశ్వరౌ జనయితవై. బృ. ఉ. అ. 8. బ్రా. 4.

విద్యావంతురాలైన కూతురుకలుగవలయునని కోరిక యుండినచో నువ్వులు బియ్యముఁగలిపివండిన యన్నమును నేతితోఁగలిపి స్త్రీపురుషులిద్దఱు భుజింపవలయుననెడి యీ శ్రుతివలనఁగూడ స్త్రీలకు విద్యాధికారమున్నటులఁ దేలుచున్నది. మఱియు,

ఇమంయజ్ఞం సహ పత్నీభిరేత్య.

అ. కాం. 12. అను. 7. వర్గ. 53.

పత్నీసమేతముగ యజ్ఞము చేయవలయునని వేదమందును,

యజ్ఞాయామైకరోతి గార్హపత్య ఏవతజ్జుహోతి.

ఐత. పం. 8. అ. 5.

స్త్రీ గార్హపత్యాగ్నినిఁ జేయవలయునని శ్రుతివిధానముండుటం జేసి యాయగ్నియందు గృహ్యాసూత్రములలోని మంత్రములతో హవనము చేయవలెనని ఐతరేయమందును,

అథవేదేపత్నీ విస్రగ్ంసయతి ఇత్యారభ్యయజుషా చికీర్షేదేతేనైవకుర్యాత్ ఇత్యంతంద్రష్టవ్యమ్.

శ. కాం. 1. అ. 9. బ్రా. 2. కం. 19.

అనుటచేతను. నిటులే శ. కాం. 2. అ. 5. బ్రా. 2. కం. 11 నందును,

పాణిగ్రహణాది గృహ్యం పరిచరేత్ స్వయంపత్న్యపి

వాపుత్రః కుమార్యంతే వా-స-వ

అశ్వ. గృ. అ.సూ. 1. ఖం. 9.

వివాహమైనది మొదలుకొని గృహ్యాగ్ని సేవించవలయు. ఈగార్హపత్యాగ్ని సేవనముస్వయముగఁబురుషుఁడుగాని, స్త్రీగాని, కుమారీకుమారులుగాని, శిష్యులుగాని యెవరైనను జేయవచ్చునని యశ్వలాయనసూత్రములందును,

చాత్వాలేమార్జయంతే సపత్నికాః సుమిత్రియాఽ ఇతి.

కా. శ్రౌ. సూ. అ. 26. కం. 7.

దీనిపైటీకయందు

పత్న్యపిమంత్రపాఠో భవత్యేవేత్యాది.

వేదమంత్రములఁబాఠము ఁజేయవలయునని కాత్యాయనసూత్రములలోను, నిటులే శాంఖాయన గృహ్యసూత్రములందును,

అగ్నయేస్వాహేతి సాయంజుహుయాత్ సూర్యాయస్వాహేతి ప్రాతస్తూష్ణీం ద్వితీయే ఉభయత్ర.

అశ్వ. గృ. అ. 1. ఖం. 9.

ఒకపర్యాయము "అగ్నయేస్వాహా" యనుమంత్రము తోడను, ప్రాతఃకాలమునందొక మారు "సూర్యాయస్వాహా" యను మంత్రముతోడను, రెండవపర్యాయము రెండుకాలములందు "ప్రజాపతయేస్వాహా" యనుమంత్ర

ముతోడను స్త్రీ యాహుతులొసంగవలయునని యశ్వలాయన సూత్రములలోను,

కామం గృహ్యేగ్నౌ పత్నీ జుహుయాత్ సాయంప్రాతర్హో మౌ గృహాపత్నీ గృహ్య ఏషోగ్నిర్భవతీతి.

గోభి. గృ. సూ. ప్ర. 1. కం. 3.

సాయంకాలమందును, ప్రాతఃకాలమునను స్త్రీ యగ్ని హోత్రముఁ జేయవలయు. అదియే గృహ్యాగ్ని యనిపిలువఁబడు ను. ఎందుచేతననఁగాఁబత్ని వలననే గృహముకలుగుట యని గోభిలేయసూత్రము లందును, మరియునీసూత్రము యొక్క యర్థమునందు

పత్నీ మధ్యాపయేత్ కస్మాత్ పత్నీ జుహుయాదితివచనాత్ నహిఖల్వనధీత్యశక్నోతి పత్నీ హోతుమితి.

స్త్రీచేతనధ్యయనముఁ జేయింపవలెననియు వ్రాయఁబ డియున్నది. చదువనియెడలఁబత్ని యగ్నిహోత్ర మొనరింపఁ జాలదుగదా. కావునసూత్రములలో స్త్రీలగ్నిహోత్రములఁజే యవలయునని విధింపఁబడియుంటచేసి వారినవశ్యముగఁజదివిం ఛవలయునని తెలుచున్నది. మెండియు

యచ్ఛామ్నాయో విదధ్యాత్.

గోభి. గృ. సూ. ప్ర. 1. కం. 2.

స్త్రీలామ్నాయమనఁగా వేదముఁజదువ వలయునని

గోభిలేయమువక్కాణింపుచున్నది. కట్టా! వర్తమానకాలంబు నఁబత్కుపాతమూని జను లవిద్యాజాలములందగుల్కొని కన్య కలకుపనయన సంస్కారముంగావించుట సర్వవిధములఁ బేర్కొ కుండఁజేసి యున్నారు

కాని కుమారులకుంబలెఁగుమారికలకుఁగూడసమస్త సంస్కారములఁజేయవలయునని గృహ్యసూత్రములాజ్ఞాపించు చున్నవి.ఎట్లనఁగా

ప్రావృతాం యజ్ఞోపవీతి నీమభ్యుదానయన్ జపేత్
సోమోదదద్ గంధర్వాయేతి. గోభి. గృ. ప్ర. 2. కం.

ఏకన్యయుత్తమ వస్త్రాలంకృతాంగియై యజ్ఞోపవీతము ను దాల్చియుండునో యామెను వివాహశాలలోనికిఁ గొని రావలయుననియు "సోమోదదద్" మొదలగు మంత్రములవ రుఁడు చదువలయుననియు నుండుటచే నీసూత్రమువలన కన్య ల కుపనయనాధికారము స్పష్టమగుచున్నది. మరియు

స్త్రీయఉపనీతా అనుపనీతా. పార. గృ సూ. పృ, 84.

అని పారస్కర గృహ్యసూత్రములలోను నిటులే పా రాశరస్మృతి యొక్క మాధవభాష్యంబునను వ్రాయఁబడియు న్నది ఎట్లనఁగా

ద్వివిధాః స్త్రియో బ్రహ్మవాదిన్యః సద్యోవధ్వశ్చ,
తత్ర బ్రహ్మవాదినీనాముపనయన మగ్నీంధనం వేదాధ్య

యనం స్వగృహే భిక్షాచర్యాఇతి; వధూనాంతూ పస్థితే
వివాహే కథంచిదుపనయనమాత్రం కృత్వావివాహః
కార్యః; ఇతిహారీతేనోక్తం, తథా,
పురాకల్పేకుమారీణాం మౌంజీబంధన మిష్యతే
అధ్యాపనంచ వేదానాం సావిత్రీవచనంతథా
పితాపితృవ్యోభ్రాతా వానైనామధ్యాపయేత్ పరః
స్వగృహేచైవకన్యాయా భైక్షచర్యావిధీయతే.

యమస్మృ. పారాశరమాధవము.

బ్రహ్మవాదినులనియు సద్యోవధువులనియు స్త్రీలు రెం డువిధములు వీరిలో బ్రహ్మవాదినులనఁబరగు వారలుపనయన సంస్కారముఁబొంది యగ్నిహోత్రములొనర్చుచు, వేదా ధ్యయనముం జేయుచు, స్వగృహమందేభుజింపుచు నుండవలయు నంటవిధి. సద్యోవధువులగు వారలు వివాహమాతుసమయమున నుపనయనముఁజేయించుకొని వివాహముఁజేసికొనవలయు. ఇది హారీతకవాక్యము. పూర్వకల్పంబునఁగూడగన్యకలకుపనయన సంస్కారము,గాయిత్రీమంత్రోపదేశము, వేదాధ్యయనాధికా రమునుండియుండె ఆకల్పమునఁదండ్రి,సోదరులు మొదలగువార లుతమకన్యకలుచదువుకొనుటకు, భుజించుటకుఁగావలసిన యే ర్పాటులనన్నింటి స్వగృహములందే చేసియిచ్చుచుండిరి. ఇదే ప్రకారము

ధ్రువమసి ధ్రువాహం పతికులే భూయాసమముష్యాసావితి పతినామగృహ్ణీయాదాత్మనశ్చ. గోభి. గృ. ప్ర. 2. కం. 3.

కన్య "ధ్రువాహం" అను మంత్రము నుచ్చరించుచు "పరమాత్మా! నేను నాపతింగూడి నిర్విఘ్నతాపూర్వకంబుగ నిశ్చలచిత్తనై గృహమునవసియించు చుందుగాక" యని యీశ్వరుంగూర్చి ప్రార్థించి యనంతరముఁ దనయొక్కయుఁ దన భర్తయొక్కయుఁ బేరుల నుచ్చరించవలయునని గోభిలేయ సూత్రములందును

పత్నీ చ. లాట్యా. శ్రౌ. సూ ప్రం. 1. కం. 6.

పత్నియు సామవేదము గానముఁజేయవలయుననియు,

గృహపతేర్దాస్యోనవా నుదహారణాః పూరయిత్వా ప్రదక్షిణం మార్జాలీయంపరీయుర్హైమహా ఇదం మధ్విదం మధ్విత్వదంత్యః పంచావరార్ధ్యాః పంచశతం పరార్ధ్యాః పంచవింశతిః సామ్ప్రతః. లాట్యా. శ్రౌ. సూ. ప్రం. 4. కం. 3.

యజ్ఞమునందు గృహపతియొక్క దాసీలు క్రొత్తకుండను నీటితోనింపి "ఇదంమధుః ఇదంమధుః" అని యుచ్చరించవలయుననియు,

ఉత్తరోత్తరి వాచో వ్యాహరయేయుర్యావతీరధిగచ్ఛేయుః
లాట్యా. శ్రౌ. సూ. ప్రం. 4. కం. 2.

శాస్త్రాణ్యధికృత్యకథాః కారయేయురితి.

అను పైసూత్రముయొక్క యర్థమందు దాసీలెందత్రై
ననుఁ బరస్పరము శాస్త్రకథనంబుఁ జేయవలయునని లాట్యా
యన సూత్రములందును లిఖింపఁబడియున్నది. దీనివలన
శూద్రపురుషులకుంబలె శూద్ర స్త్రీలకుఁగూడ విద్యాధికార
మున్నటులఁ దేలుచున్నది. మరియు,

స్త్రీయోపిమంత్రేణ లిమారుహ్య. పా. గృ. సూ.

స్త్రీలుకూడ వేదమంత్రముఁజదివి పీఠముపైఁ గూరు
చుండవలయునని పారస్కరగృహ్య సూత్రములలోను

ధృతవంతం కులాయినంరాయస్పోషం సహస్రిణం వేదో
దథాతువాజినం ఇతివేదేపత్నీంవాచయతి.

శాం. శ్రౌ. సూ. అ. 1. కం. 5.

"ధృతవంతం" "కులాయినం" మొదలగు మంత్రములఁ
జెక్కంటి. స్త్రీ యుచ్చరింపవలయునని శాంఖాయనశ్రౌతసూ
త్రములందును, నశ్వలాయన శ్రౌతసూత్రంబులందును నిటులే

పత్నీపన్నెజనీర్గృహ్ణాతి ప్రత్యంతిష్ఠంతీ వసుభ్యోరుద్రేభ్య
ఆదిత్యేభ్య ఇతి. అప. శ్రౌ. ప్ర. 12. కం. 1.

పడమటి దిక్కుగ నిలువంబడి స్త్రీ యజ్ఞము నిమిత్తం
జలపాత్రముం గైకొని "వసుభ్యోరుద్రేభ్య" మొదలగు మం
త్రముల నుచ్చారణము సేయవలయునని యాపస్తంబ శ్రౌత
సూత్రములందును,

సావిత్రీప్రసూతాదైవ్యా ఆపఉందఁతు తే తనుః దీర్ఘా
యుష్ట్వాయవర్చస ఇతి. పార. గృ. సూ. కాం. 2. కం. 1.

బాలకునియొక్క కేశకర్మసంస్కారమందుఁ బై మంత్రమును స్త్రీ యుచ్చారణముసేయవలెనని పారస్కర గృహ్య సూత్రములలోను,

తస్యాయావదుక్త మాశీర్బ్రహ్మచర్యమతుల్యత్వాత్.
పూ. మ. అ. 6. పా. 1

స్త్రీలు బ్రహ్మచర్యమునలుపుటకును, నాశీస్సునొసంగుటకును వేదము విధించుచున్నదని జైమినిసి మీమాంసమందునను వ్రాయఁబడియుండుటచే నిన్నివిధములఁజూచినను స్త్రీలకు వేదాధ్యయనాధికారమున్నటులస్పష్టమగుచున్నది. కావున స్త్రీలవశ్యముగ బ్రహ్మచర్యవ్రతముఁ బూనవలయుచు పురుషులతో బాటు స్త్రీలుగూడ వేదమంత్రములతో నాశీస్సునొసంగుటకధికారముగలిగి యున్నటులఁబూర్వోక్తసూత్రము నుండియే విశదమగుచున్నదిగదా. మరియు

జాతింతు బాదరాయణో విశేషాత్ తస్మాత్
స్త్ర్యపి ప్రతీయేత జాత్యర్థస్య విశిష్టత్వాత్.
పూ. మీ. అ. 6. పా. 1.

స్త్రీలుగూడ మనుష్యజాతిలోఁజేరిన వారలేయగుటవలన వారికిని వేదముయొక్క పఠనపాఠనాది సమస్తకర్మములయధికారమున్నదని వ్యాసమహాముని యభిప్రాయము.

ఆయుర్ద్రాలసి ఇత్యాశః. పూ.మీ.అ.2.పా,1.సూ.32.
ఫలవత్త్వాంచ దర్శయతి. పూ.మీ.అ.6.పా.1.

స్త్రీపురుషు లిరువురు సమానయజ్ఞాధికారముఁగలిగి యుండుటంజేసి వేదాధ్యయనమువిదల కవశ్యమని తేలుచున్నది. మఱియు. నీసూత్రముయొక్క శావరభాష్యముఁ దిలకింపుఁడు.

సపత్నీ పత్న్యై సుకృతేనగచ్ఛతాం యజ్ఞస్యధూర్యా
యుక్తావభూతామ్ సంజానానౌ విజహీతాం
అరాతీర్దివి జ్యోతిగజరమార భేతామ్.

ఇటులే మహాభాష్యకర్తయగు బతంజలియొక్క కథనమునుండియు, స్త్రీలకుఁ బఠనపాఠనాధికారము సిద్ధమగుచున్నది. రెండియుఁ బతంజలమహాభాష్యమందలి నాలుగవ యధ్యాయముయొక్క మొదటిపాదములోని పదునొకండవ సూత్రపు భాష్యమందు

ఆపిశలమధీతే బ్రాహ్మణీ ఆపిశలా బ్రాహ్మణీ, కాశకృత్స్నినా ప్రోక్తామీమాంసాకాశకృత్స్నీ, కాశకృత్స్నిమధీతే కాశకృత్స్నా బ్రాహ్మణీ.

ఇటులే మూడవయధ్యాయమందలి మూడవపాదములోని యిరువదియొకటవ సూత్రమునందు భాష్యకారుఁడు

ఉపేత్యాధీయతే తస్యా ఉపాధ్యాయీ ఉపాధ్యాయా.

6

అని వ్రాసియుండుటవలన పతంజలిభాష్యమునుండి యు స్త్రీలకు బఠనపాఠనాధికారము విశదమగుచున్నది. మఱి యు వాల్మీకరామాయణమున

సా క్షౌమవసనాహృష్టా నిత్యంవ్రతపరాయణా, అగ్నింజు
హోతిస్మతదామంత్రవత్కృతమంగలా. అయో.స.20.

అనియుండుటంజేసి కౌసల్య వేదమంత్రములతో యజ్ఞముఁ జేయుచుండెననియు,

తతఃస్వస్త్యయనంకృత్వామంత్రవద్విజయైషిణీ, అంతఃపురం
సహ స్త్రీభిః ప్రవిష్టాశోకమోహితా. రా.కి.స.16.

దీనివలనఁ దార వేదము నధ్యయనముఁ జేయుచుండిన ట్లును దేలుచున్నది. ఇదేవిధమున నొకపర్యాయము ప్రధాన నామక రాజకుమారియగు సులభయనుపేరుగల నైష్ఠిక బ్రహ్మచారిణి యొకర్తు జనకమహారాజుయొక్క సభలోని కేతేర జనకుఁడామె యెవరగునదియు నడిగెనఁట. అందులకామె

సాహంతస్మిఁకులేజాతా భర్తర్య సతిమద్విధే వినీతామో
క్ష ధర్మేషు చరామ్యేకా మునివ్రతం. భార.శాం.అ.321.

నేనును గొప్పరాజకులమున జన్మించితి. గురువుదగ్గర విద్యనభ్యసించి యున్నదానను. బ్రహ్మచర్య పరిసమాప్తియైన పిదపనాకుఁదగిన విద్యాదిగుణ సంపన్నుఁడగు పతిదొరకని కారణమున సన్యాసాశ్రమము స్వీకరించితినని ప్రత్యుత్తరమిచ్చెను. మఱియు

అభ్యాసప్రయోజ్యాంశ్చ చాతుః షష్టికాన్ యోగాన్ కన్యా
రహస్యేకాకిన్యభ్యసేత్. వా. కా. సూ. అ. 3.

అభ్యాసపూర్వకంబుగఁ గన్య యఱువదినాలుగు కళల
నేకాంతప్రదేశమం దవశ్యముగ నేర్వవలయునని వాత్స్యాయన
కామ సూత్రములందును

ప్రియాచ దర్శనీయాచ పండితాచ పతివ్రతా.
భార. వన. ప. అ. 27.

అని ద్రౌపది పరమవిదుషియైనట్లు భారతమునను వ్రా
యఁబడి యుండుటవలన స్త్రీలకు విద్యాధికారము సిద్ధమగు
చున్నది. ఇదేప్రకారము విరాటరాజ కుమారియగు నుత్తర
యు, భోజరాజపత్నియగు విద్యావతియు, లీలావతియు మున్న
గువార లనేకులు విద్వాంసు రాండ్రయియుండిరి. ఇప్పుడు
మాత్రము లేరా? స్త్రీశూద్రులు చదువవలయుననుట యెట్లు
శాస్త్రసిద్ధమో యటులే యుక్తిసిద్ధముఁగూడనై యున్నది.
ఎట్లనఁగా నీశ్వరుఁడు మనకుఁ గన్నులఁ జూచుటకు నిచ్చియు
న్నాఁడనుకొనుఁడు. వానితో మనము జూచుటయను కార్య
ము నవశ్యముగఁ గైకొనవలసియుండును. అట్టిచో నెవఁడైన
దుర్మార్గుఁడొకఁడు మఱియొకని నేత్రములఁ బొడిచిన యెడల న
ట్టినేరముఁగావించినవానికి శిక్షకలుగుట నిశ్చయమేకదా. అ
టులే విద్యనభ్యసించి సత్యాసత్యవిచార మొనరించుకొను నిమి

త్తము పరమాత్మ మనుష్యునకు బుద్ధినిచ్చియున్నాడు. విద్యయనునది మానవహృదయమునకు నేత్రమువంటిది. ఎవరు మనుజుల విద్యనభ్యసించఁగూడదని నిషేధముఁ జేయుదురో యట్టివారలు హృదయ నేత్రముఁ భంగముఁగావించువారలే కాని వేరు కాదు. చర్మచక్షువుల నాశనముఁ జేయువారల కెట్లు రాజదండనము కలుగుచున్నదో యదేవిధమున హృదయ నేత్రమును భ్రష్టముఁ జేయు స్వప్రయోజనపరులకుఁగూడ రాజదండనమవశ్యముగఁ గావలసియున్నది. సమస్తమానవులు విద్యనభ్యసించినయెడలఁ దాము ప్రయోగించు గాలముల దగుల్కొనరు కావున జనులు మూర్ఖులుగ నేయుండినఁ బశువులంబలె వారి ననేకవిధములైన వలలంబడవైచి లేనిపోని యబద్ధములఁ గల్పించి చెప్పి నమ్మించి వారిమధ్యఁ దాము మహాపండితులై గురువులై తమయభిమతంబుల నెరవేర్చుకొనవచ్చు ననుటయే యీయుదరపరాయణులందఱు విద్యఁ జదువఁగూడదని నిషేధించుటకు ముఖ్యకారణము. ఇట్లని యూరక వ్రాయుటమాత్రమే కాదు సుఁడీ! వర్తమానకాలంబున నీవ్యవహారము లీదేశముం దెల్లయెడలఁ బ్రచారమందున్నవి. ఊరక నోటిమాటలతోఁ జెప్పుకొని పొట్టఁబోసికొనుట తోడ వీరలకుఁ దృప్తి కలిగెనా? లేదు. ఈపక్షపాతమనస్కులీస్వోదరపరాయణులీకపటాత్ములీవిషయమై గ్రంథములంగూడఁ బెక్కింటి వ్రాసి

యుంచుకొనిరి. వెండియుఁ బ్రాచీనములైన యుత్తమగ్రంథ ములందు సహితము తమప్రయోజనంబుల సిద్ధముఁ జేసికొను టకు వీలైన యబద్ధపులేఖనములఁ నెన్నింటినో కలిపి సంస్కృ తగ్రంథములఁగూడఁ బాడుచేసి లోకులకన్నులలో దుమ్ముఁ గొట్టి తమకార్యములు ఫలవంతములగునట్లు నేర్పఱచికొని యున్నారు చూడుఁడు.

శక్తేనాపిహి శూద్రేణ నకార్యోధనసంచయః శూద్రోహి
ధనమాసాద్య బ్రాహ్మణానేవబాధతే. మను. అ. 9.

ఏ కుశాగ్రబుద్ధియగు మహానుభావుని కృపాకటాక్ష ముననో గాని పై శ్లోకము మనుస్మృతియందుఁ బ్రవేశించియు న్నది. ధనము సంపాదించుటయందు సామర్థ్యముండి నప్పటికి, శూద్రుఁడు ధనము నార్జింపకయుండుట యుక్తమఁట. ధనముఁ గూడఁబెట్టినచో బ్రాహ్మణులనే బాధించువాఁడగునుగాన శూ ద్రుఁడు ధనసంచయము పోగుచేయరాదని యీశ్లోకముయొ క్కయాశయము. మొట్టమొదలిట్టి కపోల కల్పితవాక్యంబుల ప్రచారముఁ జేయుటంజేసియే యమాయికులగు వారలు కొం దఱు ధనోపార్జనముఁ జేయుట విడనాడియుండవచ్చును. ఆకా రణముచేతనే దేశము ధనహీనమైనది. కాని బుద్ధిమంతులగు శూద్రులు కొందఱీ యప్రమాణిక వాక్యములయెడల ధ్యాన మూనక ధనోపార్జనముఁజేయుట మొదలిడిరి కాఁబోలు. అప్పు

డుమఱల

విస్రబ్ధం బ్రాహ్మణః శూద్రాద్ ద్రవ్యోపాదానమాచరేత్
నహితస్యాస్తి కించిత్ స్వంభర్తృహార్య ధనోహిసః
మను. అ. 8.

శూద్రుఁడు ధనమార్జించినచో నాధనమును బలాత్కారముగ లాగికొనవలయును, ఏలయన శూద్రునిధనమునకు శూద్రుఁడు స్వామికానేరఁడు, బ్రాహ్మణుఁడేయాధనమునకు స్వామియగునని వ్రాసిరి. చదువరులార! చూడుఁడు. న్యాయమునకును, వేదమునకును, విరుద్ధమైన యిట్టివ్రాతలను బక్షపాత యుక్తులు, స్వార్థులునగు వారలుతక్క మఱియెవ్వరు వ్రాసియుండఁగలరు? కానిండు. మనము న్యాయ ముపదేశించు వేదము నెడల దృష్టిఁగలిగియుండవలయు. పరమేశ్వరుఁడు వేదమునందుఁ బక్షపాత రహితమైన యెట్టి న్యాయము బోధించియున్నాఁడో కనుఁగొనుఁడు.

సత్యమహంగభీరః కావ్యేన సత్యం జాతేనాస్మిజాత వేదా
న మేదాసోనమే ఆర్యోమహిత్వావ్రతంమీమాయయదహ
ధరిష్యే. అథ. కా. 8. అ. 2. వ. 11.

మనుష్యుఁడా! పరమేశ్వరుఁడనగు నేను సత్య స్వరూపుఁడనై మహాగంభీరుఁడనై, సత్యమగు వేదవిద్యను బ్రకటనము సేయుటచేత జాతవేదుఁడనై యున్నాఁడను. నేను ఏదాసునకుఁగాని, యేయార్యునకుఁగాని పక్షపాతముఁ జేయఁజాలను. ఎవరు

చారియొక్క న్యాయాచరణంబులను, సత్యవ్రతాజ్ఞలను బాలిం తురో యట్టివారి నుద్ధారముఁ జేయుదును.

ఇఁక నాలోచింపుఁడు. మనువు వేదాను యాయిగదా! అట్టియెడ నీయీశ్వరవాక్యమునకు విరుద్ధముగ శూద్రులకు దుఃఖము కలుగునట్టి విధాన మాయన యెట్లు వ్రాసియుంచును? ఇందుమూలమున నిట్టిశ్లోకములన్నియు మనువు వ్రాసినవి కావనియు, స్వప్రయోజనపరు లెవ్వరో వ్రాసియుందురనియు స్పష్టమగుచున్నది. పక్షపాత మనస్కులై జను లెట్లు శూద్రులు ధనము నార్జింపఁగూడదని యాటంకపరచిరో యటులే వారలు విద్యాధ్యయనమునకుఁగూడఁ బనికిరారని నిషేధించిరి.

స్త్రీశూద్రులు వేదముఁజదువరాదని నిషేధముఁగావించు నో మహాపండితులారా! మీ రేటికిట్లు వచించుట? విద్యాభ్యాస మొనరించుచో స్త్రీశూద్రు లపవిత్రులగుదురా? లేక వీరు చదివినయెడల విద్యయే భ్రష్టమగునా? విద్యాధ్యయనము వలన స్త్రీశూద్రులు పాడగుదురని వచింతురేని బ్రాహ్మణాదులును వానిఁజదువుటవలనఁ బాడుగావలసినదే. ఎట్లనఁగా నగ్నియందలి దాహకగుణము దానిం దాకునట్టి బ్రాహ్మణులకు, శూద్రులకు నొకేవిధమగుఫలము నిచ్చుఁగాని బ్రాహ్మణుఁడు తాకినఁ జల్లగనుండుటయు, శూద్రుఁడు ముట్టినఁ జేయి కాలుటయు సంభవింపదుగదా. అద్దేప్రకారము వేదాధ్యయనము

వలనఁగలుగు ఫలితమెయ్యదికలదో యది బ్రాహ్మణులకు శూద్రులకు నందఱికి కొక్కటిగనేయుండును. ఇఁకశూద్రులు మొదలగువారలు చదువుటచేత వేదవిద్యయే పాడగునందురేనిఁ బూర్వకాలంబునఁ గవష మైలూషాదులును, వర్తమానకాలమున ననేకులాంగిలేయులును వేదముఁజదివియున్నారుగదా! అందువలన వేదవిద్యయేమిపాడైనది? బ్రాహ్మణాదివర్ణముల వార లభ్యసించుటకుఁ బనికిరాకపోయెనా? ఏజాతివారలైనను విద్వాంసులగు వారల మూలమున వేదము లపభ్రంశము లు కాలేదుగాని వ్రాలుఁజేయుటకైనఁ జేతగాని నిరక్షరకుక్షులగు బురోహిత బ్రాహ్మణ నామకభిక్షాచార్యులనోళులంబడి వేదమంత్రములు భ్రష్టంబులయ్యె ననుట నిశ్చయము, సంభవము. జలము, వాయువు మొదలగు సకలపదార్థములతో సమానముగ వేదవిద్యంగూడ నీశ్వరుఁడు జగత్తుయొక్క హితార్థమొసంగెననుట మీరు నమ్మెదరా? లేదా? నమ్మెదురేని జలము మొదలగు వానితోఁబాటు విద్యయు సమస్తమానవమాత్రుల కొరకేల కాకయుండును? స్త్రీశూద్రులకు విద్యాధికారము మాత్రము లేదందురా? అటులైనచో విద్యచదివినప్పటికి వారికి రాకయుండవలయును. ఎట్లనఁగా నేత్రమునకు మాటలాడు నధికారము లేదు. కావునఁగంటితో మాటలాడవలయునని యెంతప్రయత్నముఁ జేసినను మానవుఁడట్లుమాటలాడనే

రఁడు. అటులే స్త్రీశూద్రులకు విద్యఁజదువు నధికారమే లేక యుండినచో వారెంతచదివినను నదిరాకయుండవలయును. కాని యటులెన్నఁడును సంభవించుటలేదే. ఇందువలనను, నింత వరకు నొసంగిన ప్రమాణములవలనను స్త్రీశూద్రులకు వేదాధ్యయనాధికారమున్నదనుట స్పష్టము నిస్సంశయము నిర్ధారణము. మఱియు స్త్రీశూద్రులు చదువెఱుఁగనిచో దేశమునందంతట మూర్ఖతయే వ్యాపించు. అందుమూలమున సజ్జులకు విజ్ఞులకు నెల్లవేళల దేవాసుర సంగ్రామంబులంబోలి పోరాటములే కలుగుచుండును. అట్లగుచో మానవులకిఁక శాంతికలుగుటెట్లు? ఇంతియగాక స్త్రీశూద్రులఁ జదువనీయక యాటంకపరచుట సర్వశక్తిమంతుఁడగు బరమేశ్వరుని యాజ్ఞను భంగముఁగావించుటయేగాని వేరుకాదు. ఏలయన స్త్రీశూద్రులకు విద్యాధికార మియ్యరాదనియే యీశ్వరునుద్దేశమైయుండినవారికి శబ్దముల నుచ్చరించు నిమిత్తము నాలుకను నక్షరావలోకనముకొరకు కన్నులను, వ్రాయుటకు హస్తములను విచారించుకొన బుద్ధిని, మననముకొరకు మనస్సును, స్మరించుటకు స్మృతిని మొదలగువానిఁ గూడ నొసంగకయే యుండును, విద్యాధికారము మానవునియొక్క విద్యాభ్యాసము, బుద్ధి మొదలగువానిపైనాధారపడియుండును. ఎవనికత్యుత్తమంబగు బుద్ధియుండునో, యెవఁడుచదివించుటచేతఁ జదువనోపునో యట్టి

వానికి విద్యయెడల సంపూర్ణాధికారముకలదు. ఏశూద్రుఁడైన నాకస్మికముగ వేదమువినుట సంభవించెనేని నట్టివానిచెవిలో సీసముఁగరఁగిపోయవలయునను పోపుపండితులరాజ్యమా యిదికాదు. న్యాయశీలుఁడగు శ్రీరాజరాజేశ్వర పంచమజార్జి సార్వభౌమునిరాజ్యమప్పుడు జరుగుచున్నది. ఎవఁడైనసీసముఁగరగించి యెవనిచెవిలోనైనఁబోయుచో నట్టివానికిఁ తత్ఫలమాక్షణమందేకలుగును. స్త్రీశూద్రులు మూర్ఖులుగనుంచినవారి గృహసంబంధములైనకార్యముల యథావిధినెరవేర్చుకొనఁజాలరు. స్త్రీలు చదువకయుండినఁ దమసంతానముల సుశిక్షితులుగఁజేసికొను సామర్థ్యముఁగలిగియుండరు. బాల్యావస్థయందు బాలకులుస్వయముగ నేకార్యమును చేసికొననోపక సర్వవిధములఁ దల్లియొక్కయాధీనమందేయుందురు. బాల్యమునందుఁ దలిదండ్రులశిక్షలననుసరించియే బాలకులు నడచుకొనుచుందురు. గాని ముఖ్యముగఁ దల్లితోడనెక్కువసంబంధముఁగలిగియుందురు. అందువలన నామెనేర్పువిషయములే బాలకునియొక్క నవనీతమువంటి కోమలాంతఃకరణమందు మోహారలిఖితంబులంబోలి గుమియగుచుండును. తల్లివలనఁగలుగు సంస్కారము బ్రతికియున్నంతవరకు నతనివదలిపోనేరదు. కావున స్త్రీలు ప్రాణిధర్మశాస్త్రము, మానసశాస్త్రము, సమాజసంస్థితిశాస్త్రము, రసాయనశాస్త్రము ఆలేఖ్యశాస్త్రము, వై

ద్యశాస్త్రము, గృహ్యశాస్త్రము, మొదలగువిద్యలముఖ్యముగ నభ్యసించవలెయును. బాల్యావస్థయందు బాలకునియొక్క శారీరకోన్నతి యెట్లుతల్లియాధీనమునను౦డునో యటులేమానసికోన్నతియు నామెయాధీనమందేయుండును. ఎట్లుబాలకునిశరీరకశక్తి యాహారములేక యభివృద్ధినొందఁజాలదో యటులే మానసికశక్తియు శిక్షారూపకాహారములేక వృద్ధినొందదు. బాలునకీరెండు ప్రకారములగుశక్తులఁ బెంపొందఁజేయునది తల్లియేయగుటవలన నామెవిదుషియైయుండవలయును. ఎప్పటినుండి యీదేశమున స్త్రీవిద్య నిషేధముఁగావింపఁ బడుచువచ్చెనో యప్పటినుండియే యిక్కడసర్వవిధముల హానికలుగుచున్నది. మరలనెప్పుడు స్త్రీవిద్యదేశమెల్లయెడలఁ బ్రచారమగునో యపుడే దేశముగూడ మేలుఁగాంచుఁగావున మనుష్యమాత్రులెల్లరీవిద్య నభివృద్ధియగుమార్గములఁ జేయుచుండవలయు. ముఖ్యముగ రాజులు మహారాజులు మొదలగువారలీకార్యము నకుఁ గంకణముఁగట్టికొనవలయును. భోజమహారాజు విద్యావిషయమై యెట్టియుత్తమములైన యాజ్ఞలఁ జేసియుండెనో చూడుఁడు.

ప్రియో మే యోభ వేన్మూర్ఖః సపురాద్వహిరస్తు మే,
కుంభకారోపి యో విద్వాన్ సతిష్ఠతుపురేమమ.

నా ప్రియకాంతమైన నగుఁగాక. మూర్ఖుఁడాలైనచో నా

మె నగరమున నుండఁగూడదు కాని విద్వాంసుఁడైనచోఁ గుమ్మరి సయిత ముండవచ్చును. ఇట్టి నియమమువలన భోజమహారాజు మనుజమాత్రులకెల్లరకు విద్యాధ్యయనముకొరకు జక్కని యేర్పాటులఁ జేసినటులఁ దోఁచుచున్నది. అందుచేతనే యాకాలమున సమస్తమానవులు విద్వాంసులుగా దేశము మహోన్నతదశ నందియుండెను. ఈవిషయమై యింకను బెంచి వ్రాయు టనవసరము. బుద్ధిమంతులగువార లింతమాత్రముతోడనే గ్రహించికొనుఁడు. ఇక విద్య నేర్పవలసినది పురుషుఁడా? లేక స్త్రీయా? లేక యిరువురుఁ జదివింపనగునా? ఇవురురగుచో బ్రాహ్మణీ బ్రాహ్మణులా? లేక యితర జాతుల స్త్రీ పురుషులుకూడ బనికివత్తురా? యను విషయముంగూర్చి యోచింపవలయును.

సకలవర్ణముల పురుషులు సమస్తవర్ణముల పురుషులకును, సర్వవర్ణముల స్త్రీలు నఖిలవర్ణముల స్త్రీలకును విద్య నేర్పవచ్చునని మాయుద్దేశ్యము. ఒకవేళ నెచటనైన బురుషులకుఁ బురుషులు స్త్రీలకు స్త్రీలు లభింపరేని దీనికి వ్యతిక్రమముకావచ్చును గాని యన్యథా గాకూడదు. పూర్వకాలమున స్త్రీలు బాలకులఁ జదివింపుచుండినట్లు మహాభాష్యముఁ గాంచుటచే విదితమగుచున్నది.

జౌదమేఘ్యాయాశ్ఛాత్రా జౌదమేఘా ఇత్యాది
మహాభాష్యము. అ. 14. పా. 1. సూ. 78.

ఇంతియుగాక చదివించువారలు నాలుగువర్ణముల స్త్రీ పురుషులలో నెవరైనం గావచ్చును. ఎట్లనఋగ్వేదముయొక్క ప్రథమమండలమందలి 134 వ సూక్తమును యౌవనాశ్వ సర పతికుమారుఁడగు మాంధాతప్రచారముఁ జేసియున్నాఁడు. ఇటులే క్షత్రియ వైశ్య శూద్రాదులు ప్రచారముఁగావించిన సూక్తము లనేకములుగలవు. అనుక్రమణికయందును, సాయనభాష్యమందును జూచికొనుఁడు. మఱియు మహాభారతముయొక్క. శాంతిపర్వములోని 203 వ యధ్యాయమందు తులాధారుఁడను వైశ్యునివద్ద బ్రాహ్మణుఁడు శిక్షనుబొందిన ట్లు వ్రాయఁబడియున్నది. అపాల, లోపాముద్ర లోనగువారి గురించి యిదివరకే వ్రాసియుంటిమికదా! వెండియు,

శ్రద్దధానః శుభాంవిద్యామాదదీతావరాదపి అంత్యాదపి
పరంధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి. మను. అ. 2.

శుభవిద్య శూద్రునిదగ్గరనుండియైనను, నుత్తమధర్మము చండాలునివద్దనుండియైనను, బాషుకులంబునఁబుట్టిన స్త్రీ వద్దనైనను గ్రహింపఁదగునని మనువాజ్ఞాపించి యున్నాఁడు. అటులే.

తాన్హోవాచప్రాతర్వః ప్రతివక్తాస్మీతితే హాసమిత్పాణయః

పూర్వాహ్ణే ప్రతిచక్రమిరే. ఛాం. ప్ర. 5. ఖం. 11.

ప్రాచీనశాల ఔపమన్యవుఁడు, సత్యయజ్ఞపౌలుషి, ఇంద్రద్యుమ్న భాల్లవేయుఁడు, జనశార్కరాక్ష్యుఁడు, బుడిలాశ్వతరాశ్వి మున్నవారందరు విద్యాగ్రహణార్థముద్దాలకునిచెంతకేగ నతఁడు వారినశ్వపతియొద్దకుఁ బొమ్మనుడు నెల్లరశ్వపతికడకు వచ్చి చేతులు జోడించికొని నిలువఁబడి "మాకు విద్య నుపదేశింపుఁడ"ని యడుగ మరునాఁ డుపదేశముఁజేయుదునని చెప్పి రెండవదినమున వారందఱు కశ్వపతిశిష్యులయిరి. ఇంతేకాక విదురుఁడు ధృతరాష్ట్రునకును, సూతుఁ డెనుబదియెనిమిదివేల ఋషులకును, ధర్మవ్యాధుఁడను చండాలుఁడు కౌశికఋషికిని నుపదేశముఁజేసిరి. ఇదేవిధమున స్త్రీలలో గార్గి, వాచక్నవి, బడబా, ప్రాతిథేయి, సులభ, మైత్రేయి లోనగువారలాచార్యులై యుండిరి. భారతవనపర్వముయొక్క 26 వ యధ్యాయమందు కౌశికునకొక స్త్రీ యుపదేశముఁజేసినట్లు వ్రాయఁబడియున్నది. అష్టాధ్యాయిలోని అ. 4. పా. 1. 49 వ సూత్రముమీఁదఁ గౌముదీకారుఁడు.

ఆచార్యస్య స్త్రీ ఆచార్యానీపుంయోగ ఇత్యేవ ఆచార్యా స్వయం వ్యాఖ్యాత్రీ.

ఆచార్యుని భార్య యాచార్యానియనఁబడుననియు, స్వయముగఁ దానే యితరులచేతఁ జదివించుకొంత ఆచార్య

యనఁబడుననియు వ్రాసియున్నాఁడు. మఱియు స్త్రీ తానితరులఁ జదివించక తనమగఁ డుపాధ్యాయుఁడైన నామె యుపాధ్యాయానీ లేక యుపాధ్యాయీ యనబడుననియు లిఖింపఁబడియున్నది. ఇతరులఁజదివించు స్త్రీ తనకుఁదానే ప్రసిద్ధముగుంగాన వ్యాకరణ నియమానుసార మామె కుపాధ్యాయానీయను పేరెప్పటికిఁ గలుగదనియు, నుండుటచేత వ్యాకరణమువలనఁగూడ స్త్రీలు చదివి యితరులచేఁ జదివింపవలయునని సిద్ధమగుచున్నది. ఇంక నీవిషయముఁ బెంచి వ్రాయనక్కర లేదు. విజ్ఞులగు పాఠకులే గ్రహించుకొనుఁడు.

బాలికాబాలకుల వేర్వేరు విద్యార్థి జనని వాసాలయములయందుంచి చదివించవలయునని యిదివరకు వ్రాసియుంటిమిగదా! ఇఁక వీరికే యేప్రకారముల నేయేవిద్యలఁ జదివించవలయునో యోచింతము. చూడఁజూడ నావశ్యకమయిన బాలోద్యానశిక్షణాక్రమము ననుసరించి పరీక్షించి యేయే విద్యలనభ్యసింపఁజేయనగునని తేలునో యావిద్యలఁ జదివించు టుచితము. బాలోద్యానశిక్షణాక్రమమెట్టిదనఁగా నేదేని నొకవాటికా విశేషమునందు గళాయంత్రములు, వాద్యములు, శిల్పపుంబనుల కుపయోగించు సాధనములు మొదలగు సకలవిద్యల నేర్చుకొనుట కవసరములైన వస్తువులు, నాయుధాది పదార్థములు లోనగు వాని నమర్చి యందు బాలకుల నాడుకొను

టకు వదలవలయును, ఆచార్యుఁడు, ఉపాధ్యాయుఁడు, పాఠ కుడు మొదలగువారందఱు వేర్వేరుగదూరమునఁ గూరుచుం డి చూచుచుండవలయును. ఏబాలకున కేవిద్యయం దభిలాష యుండునదియు నప్పుడీ పరీక్షవలన విదితమగును. ఆప్రకారము గ నెవని కేవిద్యయం దభీష్టముండునదియుఁ దెలిసికొని తద నుసారంబుగ నాతనిపితాపితామహాదు లేవిద్యవలన జీవనముఁ జేసి యుండిరో దానినిఁగూడ యోచించి యీక్రింద వ్రాయు విధానమున వారి కాయావిద్యల నేర్పు టుచితము.

1. బాలునకు ముందు సుగమమయిన విషయముం దెలియఁజెప్పి యనంతరము కఠినవిషయముల నేర్పవలెను. మొట్టమొదలే కఠినవిషయము బోధింపనెంచిన నది యతనికి రానేరదు కావున ముందు సులభవిషయమును నేర్పుటయే యుచితము. మఱియు నట్టికఠినవిషయమును బలాత్కారమున నేర్పవలెనని ప్రయత్నముఁ జేయఁగూడదు. అట్లు చేయుటం జేసి బాలకుని మానసికశక్తి మిక్కుటముగ వ్యయమగు ను. అట్టి కఠినవిషయము నేర్పుటయం దతని కదిసులభముగ రాకయుండుటచే బాలునకుఁ జదువునం దాయాసముకలుగును ఆకారణమునఁ జదువనిన భయపడిపారిపోవును. కావున బాల కునకు మొదలుసుగమమైన విషయముబోధించుటయే మంచి ది. ముందుస్థూలపదార్థములగురించిన జ్ఞానముఁగలుగఁజేసి య

నంతరము సూక్ష్మపదార్థములగూర్చి తెలియఁజెప్పుట సృష్టి క్రమానుకూలమైయున్నది. ఏలయన సృష్ట్యారంభమునుండి యీదినమువరకు బాలకులు మొదలు స్థూలపదార్థములఁజూచి తెలిసికొని తరువాత సూక్ష్మపదార్థములఁ దెలిసికొనుచున్నారు. కాన నేక్రమముననుసరించి మనుజునకు జ్ఞానోన్నతికలుగుచున్నదో యద్దేక్రమమున వారికి శిక్షణముకూడ గలుగవలయును. సృష్టిక్రమవిద్యయు, నితిహాసములును నీమా శిక్షాక్రమంబునకు సహాయకారులుగనున్నవి. ఇంతియకాక ప్రత్యక్షప్రమాణానుసారము తిలకించితిమేని బాలకులకుముందు భూమి, జలము, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఘటపటకటంబులు, కుక్కుటములు, ఏనుగలు, కాకులు, కుక్కలు, బిల్లులు మొదలగువానింగురించినజ్ఞానముకలిగి యనంతరమాకర్షణశక్తి ఆశ్లేషశక్తి, కాలము,దిశ,ఆత్మ,ప్రకృతి,అంతఃకరణము మున్నగువానిగురించిన జ్ఞానముకలుగుచున్నది. జగన్నింతయగు పరమాత్మయొక్క సృష్టిక్రమమిటులైయుండ నిందులకు వ్యతిరేకముగ వారికిశిక్షణమొసంగి తన్మూలమున వారిశరీరము, బుద్ధి, బలములోనగువాని నాశనముచేయఁజూచుట హానికారకముగాకమరియేమగును? చూడుఁడు ప్రస్తుతకాలంబున భాషాపరిజ్ఞానముఁగలిగింపకయే మున్ముందు బాలురచే వ్యాకరణముఁజదివించుట ప్రారంభముచేయుచున్నారు. కానియీరీతి సృష్టిక్ర

మమునకు విరుద్ధమును, బాలురకు హానికరమును నైయున్నది. సృష్టిక్రమానుసారము వారికి ముందుభాష నేర్పి యనంతరము వ్యాకరణముఁ జదివించవలయును. ఎందుచేతననఁగా భాషను శుద్ధిబరచుటకే వ్యాకరణము. మఱియు సృష్టిక్రమానుసారము బాలురకుముందు మాటలాడభాషవచ్చుచున్నదికాని వ్యాకరణముకాదుగదా. అటులే యెంతపర్యంతము బాలకుఁడే భాషను దెలిసికొనకయుండునో యంతపర్యంతమాతనిచే నే వ్యాకరణమును జదివించుటకుపీలులేదు. ఇందువలనఁగూడ ముందు బాలురకు భాషాజ్ఞానముఁ గలిగించవలయుననియే సిద్ధమగుచున్నది. మున్ముందు నేదేనినొక భాషనుజదివించక యాభాషా వ్యాకరణముఁ జదివించుటచే నింకనున నేకములగు నుపద్రవములు పొడముటసంభవమైయున్నది. ఎట్లనఁగా బాలకునియల్పబుద్ధియను బిపీలికపై వ్యాకరణమునందలి క్లిష్టవిషయమను భారముపడుటవలన నతనిబుద్ధి హీనాన హీనమైపోవును. ఆకారణమున బాలుడు బుద్ధిహీనుఁడై చిలుకవలె ప్రస్తుతకాలమంగవలి మూర్ఖపండితులంబోలి జన్మమున్నంతవరకుఁజదివిన పశువులై యుండును. మాతృభాషాసహాయంబున నన్యభాషావ్యాకరణముఁజదివింపఁబూనుచో నేభాషావ్యాకరణముముందుభాషరాకయుప్పుడేచదువునోయాభాష శుద్ధముగ మాటలాడుటకుఁగాని తప్పులులేకుండవ్రాయుటకుగాని యతనికెప్పటికిరాదు. వర్త

మాన కాలంబున సంస్కృతపండితులదశ యెట్లున్నదో వారిదశ యు నంతియయగును. కానసృష్టిక్రమము ననుసరించి బాలకుల కుముందుస్థూలపదార్థములఁగూర్చి తెలియఁజెప్పి తరువాత సూక్ష్మపదార్థముల విషయమైజ్ఞానముఁగలిగించు శిక్షణక్రమమే యుత్తమమైనదని మాయభిప్రాయము. మొట్టమొదలు గుణి గురించి నెరుకపరచితరువాత దానిగుణములగురించి తెలియఁ జెప్పవలయును.

2. బాలకులకెట్లు మానసికశక్తి యభివృద్ధినొందుచుండునో యట్లుశిక్షణమునొసంగుచుండవలయును. ఎందుచేతనన బాలురకేప్రకారము హస్తపదాద్యవయవములతోఁ బాటుమస్తిష్క మభివృద్ధిఁగాంచుచుఁ బక్వమగుచుండునో యద్దేప్రకారముగ నామస్తిష్కమందలిబుద్ధియు నభివృద్ధియై పక్వమగుచుండును. ఎంతవరకు బాలకునిబుద్ధి పక్వముగా[illegible] యంతవరకాయపక్వమగుబుద్ధియందుఁ బక్వవిచారములఁజేర్పుటతగదు. ఏలయన నపక్వబుద్ధియందుఁ బక్వవిచారములుత్పన్నములేకావు. మఱియు నచటనిలుకడగనుండనైననుండవు. ఎట్లనఁగా నేడాది, యేడాదిన్నరబాలకుఁడు నడువనేర్చికొనుటకు మొదలిడుననుకొనుఁడు అప్పుడెవరైన నతనిదగ్గరకుఁబోయి "బాలకా! చూడుము. నీవేస్నాయు, ధమన, మజ్జాస్థిసమ్మేళనమునఁ బాదములతోనడువఁగలుగుచున్నాఁడవో యాస్నా

యుమాంసాదులయొక్క యుత్పత్తిస్థితి స్వరూపములగూర్చి ముందుఁదెలిసికొని తరువాత నచుపఁర్చికొను" మనివచించిన చో నటులేడాది బాలున కుపదేశముఁజేయునట్టిమనుజుని బుద్ధి హీనుఁడన్న సరిపోవునా? ఇదేవిధమున నపక్వముగనుండుబుద్ధి యందుఁ బరిపక్వవిచారంబులఁ బ్రవేశింపఁజేయువానింగూడ బ్రమాదియనియు, (బాలన క్రమానభిజ్ఞుఁడనియుఁ దెలియవల యును. కావున బాలకుని మానసికశక్తియోగ్యత ననుసరించి యె శిక్షణమొసంగుట శ్రేయము.

3. సాధ్యమైనంతవరకు బాలకుఁడుస్వయముగఁదర్కించి కొని నేదేని నొకపదార్థమును దనకుఁదా నిదెలుసుకొనఁ గలు గునట్టి యుపాయముఁ జేయుచుండవలయు. బాలకునట్లుస్వయ ముగదెలిసికొనఁజేయుటచేత నతనితర్కశక్తి పెంపొందును. మ ఱియు బాలుఁడు దేనినిఁదర్కించుకొని స్వయముగ నేర్చుకొనునో దానిని మరల నెప్పటికిమరువకయుండును. చదివించువారలకు శ్రమతగ్గును.

4. బాలకునిచేఁ జదివించునదియంతయు నుదాహరణ సహితముగఁ జదివించుచుండవలయును. ఎట్లన భూగోళముఁ జదివించుతరి ఆశియాఖండమునం దిన్ని దేశములున్నవని యూరకనోటితోఁ జిలుకఁపాఠముఁ జేయించఁగూడదు. ఆదేశ ములయొక్క స్వరూపమును, భూగోళపటమునఁగనబరచి, వాఁ

నివిశేషములంగురించి తెలియఁజెప్పి తన్మూలముననాశియా యొక్క చిత్రము బాలకునియంతఃకరణమందు ముద్రితమై మ రల నెప్పటికి మరవకయుండురీతి జేయవలయును. ఇటులే వ్యాకర ణాది విద్యలనన్నింటి నుదాహరణపూర్వకముగనే నేర్పుచుం డవలయును.

5 ఎప్పుడు బాలకుఁడుచదువుటవలన నలసటఁజెందునో లేక యేదేనినిమిత్తవిశేషమున నెప్పుడు చదువుటయందు ను దా సీనుఁడగునో యప్పుడతనిచేఁ జదివించగూడదు. అట్టియవస్థ యందు జదివించుటఁజేసి జదువునందలిరుచియు, జ్ఞాతృత్వశక్తి యు,ధారణాశక్తియు క్షీణింప నిందువలనఁబలువిధములహానిచే కురును.

6.ఏక్రమమునఁజదివించుటచేత బాలునకుఁ జదువునంద భిరుచికలుగునో యాక్రమముననే చదివించుటయుచితము. ఆ యాసమెన్నఁటికిఁ గలుగనియ్యగూడదు. ఆటలాడుకొనుటయం దు వారికెట్లానందము, నభిరుచి పెంపొందుచుండునో యదేవి ధమునఁ జదువుకొనుటయందును నుల్లాసము నభిలాషవృద్ధి యగుచుండవలయు. సృష్టిక్రమానుసారముచదివించునెడల వా రికవశ్యముగ నానందమభివృద్ధి యగుచుండును తన్మూలమున బాలకుఁడెప్పటికి దుఃఖితుఁడు గాక యుండుటయగాదు; విస్తా రముగగూడ జదువఁగలుగును. కావునసృష్టిక్రమముననుసరించి

యే బాలురకు శిక్షణమొసంగుట తలిదండ్రులు, రాజులు, ఆచార్యులులోనగువారలకుఁ బరమకర్తవ్యము.

7. బాలునకుఁ గఠినవిషయముఁ బ్రాతఃకాలమందును సులభవిషయములఁదక్కిన కాలములందును భోధించవలయును. ప్రాతఃకాలమునఁ గఠినవిషయము నేర్పుచో వారికదిసులభము గవచ్చును.

8 తత్కాలమునందును,ముఖ్యముగముందు రాగలకాలమందునుబాలురకే యేవిద్యలవలనఁ గళ్యాణముసమకూరునో యాయావిద్యలమున్ముందు వారికినేర్పవలయును. ఎట్లనగావర్తమానకాలంబునఁ దలిదండ్రులనేకులు వారిబిడ్డలఁ గేవలము ధనోపార్జనము నిమిత్తమే చదివించుచున్నారు. మఱికొందరు తమకును దమబిడ్డలకును మాన్యప్రతిష్ఠలు కలుగవలయునని చదివించుచున్నారు. కాని యేప్రయోజనము కొరకువిద్యచదివించఁబడుచున్నదో యదివారికిఁ దెలియదు. యీదేశమందు మూర్ఖులు కొందరు కావలసినట్లు భోజనమునైనఁ జేయక కడుపుకాల్చుకొని ద్రవ్యముఁగూడబెట్టి లోకులకుఁ దమశోభనుప్రకాశముఁ జేయునిమిత్తము రంగురంగులవస్త్రముల ధరించి తిరుగుచుందురు కాని యీబుద్ధిహీనులకు శరీరరక్షణము సంతానశిక్షణము,పరమార్థముననిన నేమో కొంచమైనవానియెడలధ్యానము లేదు. యీమూఢుల కెల్లప్పుడులోకులకుఁ దమశో

భనుజూపించుకొనవలయునని యొకటే ధ్యానము. ఈమూర్ఖుల
సంగతి యిట్లుండఁ గొందరువిద్వాంసుల స్థితియు నిట్లే యు
న్నట్లుగఁ గానవచ్చుచున్నది. ఇంటనుండునపుడెట్లున్నను బ
యటబోవునపుడుమాత్రము దిట్టముగఁ బటాటోపముఁ గావిం
చుకొనిబయలుదేరుచుందురు. ఇఁక నాడువారు సింగారించుకొ
నుటయనునది జగద్విఖ్యాతమైనవిషయమే. కావుననందుగుఱించి
యేమియు వ్రాయనవసరము లేదు. ఈకల్పితశృంగారములవలన
స్త్రీపురుషులెట్లు ప్రసన్నతనందుచుందురో యట్లే యితరుల
మెప్పువడయుటకై విద్యనేర్చియుఁ బ్రసన్నతఁ గాంచుచున్నా
రు. కానివాస్తవమునకువిద్య కేవలము విధనమునార్జించుటకొఱ
కును, మనుష్యులందు దమయాధిక్యమును వెల్లడిజేసుకొనుని
మిత్తమును, నితరలకుఁ దమశోభను జూపించుకొనుటకునుఁ
గాదు. విద్యవలన బాలుఁడు పృథివి మొదలుకొని పరమాత్మ ప
ర్యంతముఁగల సకలపదార్థముల హస్తామలకంబులరీతిఁ దెలిసి
కొని నిస్సంశయుఁడై సంసారమునకు యథాయోగ్యమైన
యుపకారముఁ జేయుచు నభ్యుదయముయొక్కయు, నిశ్శ్రేయ
సముయొక్కయు సిద్ధినిఁబొందును. కావునఁబూర్వోక్త క్రమము
ననుసరించి బాలకులకు విద్యాధ్యయనము జేయించవలయును
ప్రపంచమునందనేక విద్యలున్నవి కాని వానివానివిషయమున
నవియన్నియు నత్యుత్తమసుఖదాయకములే. అన్నివిద్యలను

క్కుఁజదువఁజాలఁడు కావున మనుజమాత్రున కావశ్యకము లైన సామాన్యవిద్యలనఁగాఁ జదువుట, వ్రాయుట, భూగోళము, వ్యాకరణము, సాహిత్యము, గణితము, ఇతిహాసము, పదార్థవిద్య మున్నగువానిఁ బ్రతిబాలునకు నేర్పవలయును.

అ. చదువ నేర్చుకొనుటవలన బాలుఁడనేకానేక విద్యాగ్రంథములమూలమునఁ దనజ్ఞానము నభివృద్ధిపరచి కొనఁ గలుగును.

ఆ. వ్రాయ నేర్చినఁగలుగు ప్రయోజనం బేమన నేర్చిన సకలవిషయముల నెవరునుజ్ఞాపకముంచుకొనఁజాలరు. కాని వ్రాయఁగలిగియుండినయెడల నేదేని నొకవిషయము వ్రాసిపెట్టి కొని యెప్పుడు కావలసినప్పుడు దానినిజూచుటవలనజ్ఞాపకము చేసికొనవచ్చును. ఇంతియకాక యిక్కాలమున సమస్తవ్యవహారములు చదువుట, వ్రాయుటమీఁద నే యాధారపడియున్నది. మఱియు లేఖవలన వెయ్యిసంవత్సరములకు బూర్వమందలివ్యవహారములఁగూర్చియు జ్ఞానముకలుగుట కవకాశమున్నది. ఈ కారణముచేత లేఖనవిద్య బాలురక త్యావశ్యకము. కాని

వాచయతి నాన్యలిఖితం తస్యాపిలిఖితన్నకోపి వాచయతి
అయమపితస్యవిశేషః స్వయమపిలిఖితం స్వయన్న వాచయతి
రసకల్పద్రుమము. పరి. 5.

అనునట్లు ఉరుమువంటి యధమలిపినిమాత్రము నేర్పరా

దని స్మరణముఁగలిగియుండును. ఈభాషలో నొకరువ్రాసిన దాని మరియొకరుఁచదువఁజాలరు సరిగదా తాము వ్రాసినదితా మేచదువఁజాలరు. రెండియు నిక్కాలమందలి సంస్కృతపండితులరీతియుఁగాఁగూడదు. ఎట్లనఁగా నిప్పటిసంస్కృతపు బండితులలోన నేకులులకు వ్రాయుట కేచేతఁగాదు. ఒకవేళ వ్రాయుట వచ్చియుండునేని మెల్లమెల్లగ వ్రాయుదురు అట్లుమెల్లగవ్రాయఁబడినదియుఁ దప్పులతోనిండియుండును. కానఁబూర్వోక్తదోషరహితమైన యుత్తమలిపినిబాలురకు నేర్పవలయును.

ఇ. భూగోళవిద్యవలనఁబృథివిగుండ్రముగ నుండుట మొదలగువిషయములఁ గూర్చియు,

ఈ. భూతలవిద్యవలన దేశదేశాంతరముల స్థితిగతులంగూర్చియు జ్ఞానముకలుగును. ఇందువలన జనులకుఁజాలలాభముకలదు.

ఉ. వ్యాకరణవిద్య చదువుటచేత దప్పొప్పులంగురించియు, పదపదార్థములయొక్కయు జ్ఞానముకలుగును. వ్యాకరణముఁజదువుటవలనఁ గలుగులాభములఁగూర్చి మహాభాష్యకారుఁడగు బతంజలి యాభాష్యముయొక్క మొదటయధ్యాయములోని ప్రథమపాదమందలి మొదటియాహ్నికమందుఁ బ్రతిపాదనముఁజేసియున్నాఁడు సాహిత్యముచేత మనుజునివాణికి లాలిత్యంబును, దియ్యఁదనమును జేకూరును. వాక్యరచనయు మనోహరముగనుండును.

ఊ. అంకగణితవిద్యయుఁ బ్రతిమానవున కావశ్యకమై యున్నది. గణితవిద్యలేక నిర్వాహకముఁజేసికొనఁ జాలు మనుజుఁడు ప్రపంచమందొక్కఁడునుండఁడు. ఇఁకగణకులకు వణిజులకునగిన లెక్కలనిమిత్తము గణితవిద్యయత్యంతావశ్యకము. ఇటులేసకలమానవులకు నంకగణితమవసరమనియే. చెప్పవచ్చును. మఱియుఁసభ్యతకుఁబ్రథమసోపానమంకగణితమని యనేక విద్వాంసులయొక్క యభిప్రాయము.

ఋ. ఇతిహాసవిద్యవలన మనుజులకుఁబూర్వకాలపువిషయములఁగూర్చి జ్ఞానముకలుగుకారణమున నదియు నందరకు ముఖ్యమే. ఎట్లన నొకకాలమునందొకానొకరాజు ఒకవిధము ననేదోయొక కార్యముఁజేసినందువలన నాయారీతి లాభలాభములుకలిగి యాయాప్రకారములఁ బరిణమించెనని తెలియుటకతన నావిషయమును మనసుననిడికొని మనుజుఁడుదానటువంటికార్యముఁజేయబూనుచో నందులకుముందు రాగలహానిలాభములగురించి యోచించితెలిసికొనఁగలుగుటచేత ననేకములగునాపదలనుండి తప్పించుకొననోపును. రెండియుధార్మికులు పరోపకారులు, శూరవీరులునగు తనపూర్వులయొక్క సచ్చరిత్రములఁ దెలిసికొనియుండుటంజేసి మనుష్యుఁడు ధార్మికుఁడు, పరోపకారి, శూరవీరుఁడుఁగానోపును. ఎట్లుమానవులకీపైన జెప్పనినవిద్య లావశ్యకములో యటులే తక్కుంగలశాస్త్రము

లుగూడ నావశ్యకములై యున్నవి. ఈసార్వజనికవిద్యలఁ బ్రతి బాలునకు యథావిధ నేర్పవలయును. విశేషవిద్యలబాలకుల పితాపితామహాదులజీవికలననుసరించియు, వతనియభిరుచిననుసరించియుఁ జదివించుటొప్పును. ఎందుచేతనన? నేకులమం దేవిద్యవలన జీవనముజరుగుచుండునో యాయింటియందావిద్యకు సంబంధించిన సాధనములన్నియు విద్యమానములైయుండును. మరియు దలిదండ్రులు లేపనిఁ జేయుచుందురో బాలకుఁడునాపని నేచేయ బ్రయత్నించుచుండును. అట్టికార్యముల నేర్చుకొనుటతనికి సులభముగనుండును. కావున బూర్వోక్తక్రమముల ననుసరించియే విద్య నేర్పవలయును.

ఇకవిద్యలంగూర్చి విచారించినయెడల వానివానివిషయములలో సమస్తవిద్యలు నుత్తమములే. మరియు వీనివలన బెక్కులగులాభములుగూడగలవు. విద్యలమూలమునఁగలుగువాస్తవికలాభములవదలిపెట్టి ప్రస్తుతకాలమందలి లోకప్రవృత్తిననుసరించి విద్యలమూలమునఁగలుగుఫలము కేవలము జీవికనిమిత్తమేయనుకొని తన్నిమిత్తమా యావిద్యలనభ్యసించినయెడల జీవనమత్యుత్తమవిధానంబున జరుగుచుండును. అల్పసంఖ్యాకులగుమనుజులు కొందరుదప్పదక్కినవారెల్లరు ధాన్యాదులు, బ్రత్తి, పట్టు మొదలగు పదార్థముల నుత్పన్నముఁ జేయుటయు వానిబరదేశముల కెగుమతిఁగావించుటయు, నాదిగాఁగల

కార్యములందేలతత్పరులైయున్నారుగదా. ఈకార్యములను త్త్వమరీతి నెరవేర్చికొనుటకాపదార్థముల వాస్తవికస్వరూపముగు త్తెఱిఁగి తదనుసారముగ వానివిషయమైవ్యవస్థలఁగావించుకొనుటవలన లాభమును వేరువిధమైనహానియుఁ గలుగుచున్నది. కావుననాయాపదార్థములగుణములగురించి తెలిసికొనుటకు విద్యలతిముఖ్యములు. వ్యవసాయముఁ జేయునతఁడు తనకృషివలన ముందుగలుగులాభముఁగూర్చియు, వర్తకుఁడు తనవ్యాపారమువలన రాగలలాభముఁ గూర్చియు, నాలోచించుకొనునిమిత్తము

ఋా. తర్కవిద్యమిక్కిలియుపయోగకరమైయున్నది. ఎట్లనఁగా

మోహంరుణద్ధి విమలీకురుతేచబుద్ధింసూతేచ సంస్కృతప దవ్యవహారశక్తిం,
శాస్త్రాంతరాభ్యసన యోగ్యతయాయునక్తి తర్కశ్రమో నతనుతేకిమిహోపకారం. సుభా. ప్ర. 2.

తర్కవిద్య మనుష్యులమోహము నాశనముఁజేసి బుద్ధినభివృద్ధిబరచును.సంస్కృతమందు నిపుణత్వముఁగలిగించి వ్యవహారశక్తినుత్పన్నముఁజేయును. ఇతరశాస్త్రములఁ జదువుటయందుసహాయమొనరించును. దుఃఖమునుండి తప్పించును. ఇటులే యెన్నివిధములనో జగత్తునకుపకారముచేయుచుండును.

కృషికారులకు, వ్యాపారులకు సంకగణితమావశ్యకమని యిది వరకే వ్రాసితిమిగదా. ఇదేవిధమున శిల్పకారుల కంకగణితస మేతముగ

౫. భూమితి విద్యయవసరమైయున్నది. చదువెఱుఁగని శిల్పకారులు సయితము భూమితివిద్య జదివియుండకపోయినను నూహించుకొని వారివారి కార్యముల జేసికొనిచుండనీక భూమితివిద్యయొక్క యవసరమేమని యెవరైననడుగుచో నందులకుఁ బ్రత్యుత్తరమాలకింపుఁడు. చదువెఱుఁగని శిల్పులపని యందును, విద్య నేర్చియున్న శిల్పకారులపనియందును రాత్రిం దినములకున్నంత తారతమ్యముకలదు. చూడుఁడు. రామచంద్రమహారాజులంకాపురము నాక్రమించుకొను నిమిత్తము విశ్వకర్మ కుమారుఁడగు నలుఁడైదుదినములలో

దశయోజన విస్తీరణం శతయోజనమాయతమ్.

వా. రా. యు. స. 32.

పదియోజనముల వెడల్పును, నూరుయోజనములపొడవునుఁగలసేతువు శిల్పవిద్యాప్రభావంబుననే నిర్మాణముఁగావించె. ఎట్లనఁగా

హస్తిమాత్రాన్ మహాకాయాః పాషాణాంశ్చమహాబలాః
పర్వతాంశ్చసముత్పాట్య యంత్రైః పరివహంతిచ.
సూత్రాణ్యన్యే ప్రగృహ్ణంతి హ్యాయతంశతయోజనం

నలశ్చక్రే మహాసేతుం మధ్యేనదనదీపతేః.
సతదాక్రియతే సేతు ర్వానరై ర్ఘోరకర్మభిః
దండానన్యే ప్రగృహ్ణంతి విచిన్వంతి తథాపరే.
వానరైః శతశస్తత్ర రామస్యాజ్ఞా పురస్సరైః

వా. రా. యు. స. 22.

రామునియొక్కయాజ్ఞానుసారము వనచరులనేకులేనుగులవంటి పెద్దపెద్దబండల యంత్రములతోఁ బెల్లగించి సేతువుబంధించుటకొరకుఁ దెచ్చుచుండిరి. కొందఱు కొలత త్రాడులతో సముద్రముయొక్క యీవలితీరము మొదలుకొని యవతలితీరమువరకుఁగొలుచుచుండిరి. మఱికొందరు కొలతకఱ్ఱలంబూని యీగట్టునుండి యావలిగట్టువరకునిలువఁబడియుండిరి. అటులేమఱికొందరఱన్యాటులు సేతుబంధనమునకుఁ గావలసినసాధనములఁ బ్రోవుచేయుచుండిరి. నలుఁడు సేతువుఁగట్టుచుండెను. ఆసమయమున శిల్పయంత్రవిద్యలులేకయుండి నలుఁడు శిల్పవిద్యనభ్యసించియే యుండనిచో నంతటివిశాలమైన సేతువునిర్మించుటెట్లుసంభవమైయుండును? చదువెరుంగనిశిల్పులునయితము స్వబుద్ధితోడను, దమపితాపితామహాదులనుండియుఁ గొంచెము కొంచెము నేర్చికొనియే పనిచేయుచున్నారుకాని యూరకకాదు. అటక, కృష్ణా, గోదావరి మొదలగు నదులపైసేతువునిర్మించు శిల్పకళజ్ఞుఁడు తన్నిర్మాణమునకవసరములైన లోహకాష్ఠా

దిసాధనములెంతపొడుగు, ఎంతవెడలుపు, ఎంతయెత్తు నెంతదృ ఢత్వముఁ గలిగియుండవలసినదియు భూమితిశాస్త్రానుసారము తనధ్యానమునందుంచికొని మఱియు సేతువు బంధించఁబూను ను. చదువెఱుఁగనిపల్లెటూరి మోటుఁదనపుఁగమ్మరులు మొద లగు బనివాండ్రును కర్రు, నాగలిమొదలగువానియొక్క పొడు గు, వెడల్పు, ఎత్తు, దృఢతలోనగు విషయములమనసున నిడి కొనియేవానిని జేయుచుందురు. కానివిద్వాంసునకును నవిద్వాం సునకునుగల భేదమేమనఁగా విద్వాంసులగువారలు కొంచె మువ్యయముతోఁ గొలఁదికాలములోపలనే మంచిగట్టిదనము గలిగి చూచుటకుమనోహరముగనుండులాగు నెక్కువపనినిఁ జే యఁగలుగుదురు. అవిద్వాంసుఁడట్లుచేయఁజాలఁడు. భూమితిస ద్యశిల్పకారుల కెట్లావశ్యకమో యటులేయుపశిల్పకళజ్ఞులు, ప హాయోపశిల్పకళజ్ఞులు. లోహాకారులు, స్వర్ణకారులు, రాళ్లమ లచువారు, కుమ్మరులు, మణిహారకారులు, మొదలగు పనిపా టలవారికెల్లరకు నవసరమైయున్నది. మఱియు చిత్రలేఖనము, పురవీధులనేర్పరచుట, ధూమశకటమార్గంబులనిర్మించుట, ఇ నుపబట్టాలఁబరచుట, వంతెనలఁగట్టుట, విగ్రహాలయములుక ట్టుట, ధూమనావలఁజేయుట, సముద్రతీరములందు నౌకావిక్ర మఘట్టములనిర్మించుట, కర్మశాలలగట్టుట మొదలుగాఁగలప్ర తికార్యమందును భూమివిద్యయావశ్యకమేమైయున్నది..

ఎ. ఇఁక యంత్రనిర్మాణవిద్యయొక్క యవసరముఁజూడుము. యంత్రశాస్త్రముయొక్క ప్రభావంబుననే ప్రస్తుతకాలమునఁగళాకౌశలంబు లింతమహోన్నతదశకువచ్చియున్నవి. కర్మశాలలందుజరుగు సకలకార్యములకుయంత్రములేయాధారములు. ఆహారపదార్థములన్నియు యంత్రములనుండియే వెలువడుచున్నవి సముద్రయానమతిసుగమమగుటకుఁగారణము దిగ్దర్శిని యనుయంత్రసహాయము వలననే మఱియునింగ్లండు మొదలగునాగరికతనొందిన పరదేశములందుఁబొలముదున్నుట, విత్తుట, కోతగోయుట, కుప్పవేయుట, ధాన్యమురాల్చుట, తూర్పాఁరబట్టుట, దంపుట, బాగుచేయుట, విసరుట, పిండిదాల్చుట, పిండిదడిపిముద్దఁజేసిమర్దించుట, రొట్టెజేయుట, కాల్చిపక్వముఁజేయుటలోనగుసమస్త కార్యములు యంత్రములవలననే జరుగుచున్నవి. వెండియు నింటికుపయోగించు పెంకు, నిటుక స్తంభములు, ద్వారములు, కిటికీలు, మేకులుమున్నగుపదార్థములన్నియు యంత్రములవలననేయగుచున్నవి. మనముకూరుచుండుపీఠములు, వ్రాసికొనుబల్లలు, వస్త్రములు, గొడుగులు, కలములు, కాగితములు, బాకులు, కత్తెరలు, తంత్రులు, తుపాకులు, ఫిరంగులు, నుష్ణతామాపకయంత్రములు మొదలగునవియన్నియు యంత్రసహాయముననే చేయబడుచున్నవి. ఇంతయేల? ఏదేశమునందు యంత్రవిద్యయున్నతదశనందియుండు

నో యాదేశమే నాగరికతయందగ్రగణ్యమై యితరదేశములపైఁ దనయధికారముఁ జెల్లింపుచుండును.

ఐ. పదార్థవిద్యవలన ధూమయంత్రములు, వార్తాతంత్రులులోనగు ననేకసాధనములయొక్క ప్రాప్తికలిగియున్నది, ఈ పదార్థవిద్యాప్రభావముననే రక్షణదీపముకని పెట్టఁబడినది. అందువలనఁ బృథివిలోపలనుండు జ్వాలాగ్రాహకపదార్థముల జ్ఞానముకలిగి యనేకులు మృత్యుభయమునుండి తప్పించుకొని, ఖనిజపదార్థములపరిజ్ఞానముంబొంది తన్మూలమున నానావిధసౌఖ్యంబుల ననుభవించుచున్నారు. అటులే లోహచుంబకజ్ఞానముకలుగుటం జేసియు ననేకులప్రాణులప్రాణములు రక్షింపఁబడినవి. పదార్థవిద్యవలనఁ బ్రపంచమునకు గణనాతీతమగు లాభముకలిగియున్నది. పదార్థవిద్య తక్కినవిద్యలకెల్ల మాతయనినను నొప్పగు. ప్రపంచమున్నతిఁగాంచుటంతయుఁ బదార్థవిద్యమూలముననే. ఇంచుకయోచించినఁబదార్థవిద్య యెంతటియావశ్యకమగునదియుఁ జదువరులే గ్రహింపఁగలరు.

ఓ. దర్శనానుశాసనశాస్త్రమువలన సులోచనములు మొదలగువానిఁ జేయుజ్ఞానముకలుగును, అందువలన

వృద్ధోపితరుణాయతే.

అనునట్లువృద్ధుఁడుసయితము తరుణవయస్కునితోఁబాటు మందదృష్టివాఁడైనను మంచివానివలెజూడఁగలుగును. అ

ణ్వీక్షణి, దూరదర్శని, మున్నగువానిసహాయమున సూక్ష్మప దార్థములను, దూరపువస్తువులను సులభముగఁజూచి తెలిసికొ నుట మొదలగు లాభములనేకములీవిద్యవలనఁ గలిగియున్నవి.

౭౦. రసాయనవిద్యవలనఁ బ్రపంచమునఁ బలువిధముల నుపకారముకలుగుచున్నది. చాకలులు, రంగులద్దువారు, నా టకులు, చిత్రకారులు మొదలగు ననేకమంది కార్యములీరసా యనవిద్యమీఁదనే యాధారపడియున్నవి. ఎట్లనఁగా నేదేనినొ కరంగునందు మఱియొకరంగుగలుపుటవలన వేరొంకువిధమగు వర్ణమేర్పడుననియు, నొకవర్ణములో నొకవిధమగు క్షారముఁ గాని యామ్లముఁగానికలుపుటచేతమరియొకవర్ణమేర్పడుననియు వర్ణములసంబంధమైన జ్ఞానము రసాయనశాస్త్రముచేఁగలుగు ను. ఇంతియకాక బంగారము, వెండి, రాగి, కంచు, ఇనుము, ఉక్కు-లోనగుధాతురసములీవిద్యవలననే చేయఁబడుచున్నవి. బెల్లము, చక్కెర, సబ్బు, తుపాకిమందు, అత్తరువులు, అరఖు లు, అద్దములు, పింగాణిలోనగుపదార్థనిర్మాణముకొరకు గర్మ శాలలయందును, నౌషధాలయములలోను, బాలముల కెరువు సిద్ధపగచుటయందును, ద్రాగెడినీటినిఁబరీక్షించుకొనుటకును, మఱియునిటులేయనేకవిధములగుగార్యములందురసాయనవిద్య యావశ్యకమైయున్నది. ఇక్కాలమున మూర్ఖులుకొందరు భ్ర మతోఁగూడికొని వెండిని బంగారము చేయుటయేరసాయనవి

ద్యయనుభావముగలిగియున్నారు. ఇదిసృష్టిక్రమమునకు విరు
ద్ధమగుటచే నన్నివిధములనబద్ధమే. ఇంతకుముందుఁజెప్పఁబడిన
విద్యయేరసాయనవిద్య.

౨౦. భూగర్భవిద్యవలన భూమియొక్క నిర్మాణము, నా
నిర్మాణమునకుఁబట్టినకాలము, లోపలి భాగమునఁ గరఁగియుం
డు బంగారముఁ వెండి, యినుము మొదలగు ధాతువులగురించి
యు, భూకంపమెప్పుడేప్రకారముగఁబుట్టుచుండునదియు, పర్వ
తసమూహము లెప్పుడే పదార్థమువలన నెందునిమిత్త మెట్లు పు
ట్టియున్నదియు బంగారము, వెండి రాగి, ఇనుము, వజ్రములు,
మరకతమాణిక్యములు, నీలములు, గోమేధికములు, అంగారము
మొదలుగాఁగల ఖనిజములయొక్క గనులెక్కడెక్కడనుండునది
యు, వీనియందలియుత్తమత, యధమతమున్నగువానియొక్క యు
బరిజ్ఞానము మానవునకుఁగల్గును, ఖనిజపదార్థములతో మానవుల
కెట్టియవసరమున్నదియు, వానివలన లోకమునకెంతటి యుప
కారమగునదియు నెల్లరకుఁ దెలిసియేయున్నది.

౨౧. కృషివిద్యవలనఁ బ్రతివ్యవసాయదారుఁడు నొక
ఖండమందలి నేల యొకవిధముగనున్నదనియు, దానియందొక
ప్రత్యేకమైన యెరువుఁజల్లియందులకుఁదగిన ధాన్యము వైచిన
ఁబంటబాగుగఫలించుననియుఁదెలిసికొనఁగలుగును. కృషివిద్య
నెఱుఁగక వ్యవసాయము చేయఁబూనుటచేతఁ జల్లినవిత్తనములు

నాశనమందుటయుఁ, బైరునకుఁదెగుళ్లు సంభవించుటయు, బం టతక్కువగఁబండుటయు లోనగుదోషములు చేకూరును. ఈవి ద్యనేర్చివ్యవసాయముచేయఁబూనుచో నిట్టియుపద్రవములంత విస్తారముగఁగలుగవు. మఱియునీవిద్యను గుర్తెఱుఁగక వ్యవసా యముఁజేయుకారణమున నొకయకరపునేలయందు నైదుమణు గులధాన్యములభించు నెడలఁ గృషివిద్యననుసరించి పైరుచేయఁ బడుచోయదేనేలయందంతకన్న నెన్నియోరెట్లెక్కువ ధాన్య ములభించును. కానఁగృషి విద్యఁదెలిసియుండుట మిక్కిలిలాభ కరము. మనుష్యమాత్రునిజీవన మీవ్యవసాయముమీదనే యాధారపడియున్నది. విశేషించి యీదేశవాసులకుఁ గృషివి ద్యవలన నెంతటియావశ్యకమున్నదియు విశదీకరించుటకుఁగాను వేదమంత్రములఁబ్రమాణముజూపనక్కఱలేదు.

క. భూపృష్ఠవస్తువిద్యచేత నదులు, వాగులు, మంచు, వడగండ్లు మొదలగునవేర్పడుటయొక్కయు, వానకురియుట, స ముద్రముపొంగుట, తగ్గిపోవుట, మున్నగువానియొక్కయు, ప ర్వతాదులస్వరూపముమాఱిపోవుటయొక్కయు, భూపృష్ఠభా గముననేర్పడుసకలపదార్థములయొక్కయు జ్ఞానముకలుగును.

ఖ. భాషాపరిజ్ఞానముచేత నానావిధపదార్థములఁగూర్చి యతిశీఘ్రముగ బోధపడును, దేశదేశాంతరములకేగిమనుష్యుఁ డనేకలాభములఁబొందనగును. కావుననసకలమానవులు తక్క

చుకుతక్కువ రెండుభాషలైన నేర్చియుండవలయు. అందొకటి ధర్మభాషయు రెండవది రాజభాషయుఁగావలయును. ధర్మభాష నేర్చియుండిన మానవులు ధర్మాధర్మంబుల దెలిసికొన నితరుల సహాయమపేక్షించక స్వయముగ దెలిసికొనఁగలిగియుందురు. రాజభాషవలన రాజసన్మానమును జగత్తునందుఁబ్రతిష్ఠయు, రాజ్యవ్యవహారములందుఁ బ్రవీణతయు జేకురును.

గ. కావ్యవిద్యవలన మనుజుఁడేవిషయమునుఁ బ్రబంధరూపముగఁజేయునో యావిషయమతని కంఠస్థమగును. అంతకుఁబూర్వమురచియింపంబడియున్న ప్రబంధములనుత్తమరీతిఁ దెలిసికొనఁగలుగును. కవియై యుత్తమవిధానంబున కవిత నొనరించుచో నందువలనఁబ్రపంచమునకుపకారముగలుగుటయు కాక రచించినవాని పేరుజగంబున శాశ్వతంబుగనుండును.

ఘ. అలంకారవిద్యచేతఁగావ్యమునకు శోభకలుగును. మెండియు నొకేవిషయమున నేకప్రకారముల వర్ణించి తెలియఁజెప్పుటయందు సామర్థ్యముకలుగును.

ఙ. ఛందోశాస్త్రమువలనఁగావ్యరచనకు సంబంధించి సజ్ఞానముచేకూరును.

చ. చిత్రవిద్యవలన వివిధవిధములైన పదార్థములచిత్తరువుల దీయుశక్తికలుగును.

ఛ. వక్తృత్వవిద్యచేత మనుష్యుఁడు తనయభిప్రాయ

మును యథార్థరూపముగ వర్ణింపశక్తుఁడగును. ఇది ప్రతిమానవునకు నవసరము. మఱియు బ్రాడ్వివాకుఁడు, ఉపాధ్యాయుఁడు, శోధకుఁడు మొదలగువారిజీవనము దీనిమీఁదనే యాధారపడియున్నది. కావుననే వేదమందు

వాచావిప్రాస్తరతవాచమర్త్యః అ. కాం. 2. అ. 7. వ. 89

విద్వాంసుఁడును, వ్యాపారియు వాణిచేత నేతరించుచున్నారని ప్రతిపాదనముచేయఁబడియున్నది.

జ. గానవిద్య.

ఝ. వాద్యవిద్య.

ఞ. నృత్యవిద్య.

ట. నాటకాది విద్యలవలన మానవునిచిత్తమునకుఁ బ్రసన్నతయుఁజాతుర్యము కలుగుటయెకాక రసికతయుఁ జేకూరును.

ఠ. అర్థశాస్త్రమునభ్యసించుటచేత ధనోపార్జనమునకవసరము లైన సకలవిషయములు కరతలామలకంబులగును.

డ. ధనుర్విద్యయనఁగా యుద్ధవిద్యాప్రభావంబున రాజ్యప్రాప్తియు, స్థిరియుఁగలుగఁ బ్రజాపాలనముసమకూరును.

ఢ. రాజపద్ధతి విద్యయనఁగాఁ జట్టములులోనగువాని నిర్మించుటంగూర్చియు.

ణ. రాజనీతిమొదలగు విద్యలంగూర్చియు ముందు వ్రాయబడును.

త. ఖగోలవిద్యచేత నాకసమందలి సకలపదార్థముల గతులు, తన్నియమములు, నుదయాస్తమానములు, గ్రహము ల పరిమాణము. గ్రహణములు, గ్రహములకుఁగల పరస్పర దూరము మొదలగువానిఁగూర్చి తెలియును.

థ. వైద్యవిద్యమూలమున మనుజులనేకభయంకర రోగములనుండియు, నకాలమృత్యువునుండియుఁ దప్పించుకొనఁ గలుగుదురు. దీనివలనశరీరముయొక్క బహిరంతర్భాగములఁ గూర్చియు, నుత్పత్తి, ఆయుర్వృద్ధి, క్షయము, పరిమాణము మున్నగువానిఁగూర్చియు, జ్ఞానముకలుగును. ఇదిమనుష్యులకే కాదు? సమస్తప్రాణిమాత్రములకు మిక్కిలియావశ్యకమైయు న్నది. దీనినభ్యసించుటచేతఁగలుగు నానావిధములైన లాభ ములగురించి మనుష్యులందరు నెఱిఁగియే యుందురు కావున మే మువిస్తారము వ్రాయనక్కఱలేదు.

ద. విమానవిద్యవలన మానవుఁడు సుఖపూర్వకముగ నాకాశమార్గమందే యరణ్యంబుల, నుపవనవాటికల, బర్వ తంబుల, సముద్రములనవలీల లంఘించిపోఁగలుగును. ఈవిద్యాప్రచారము పూర్వకాలమున మనయార్యులలోనుండి యుండెను. ఋగ్వేదముయొక్క అ. 2. అ. 3. వ.23,24లందును, వాల్మీకరామాయణములోని యుద్ధకాండమందలి 124 వ స్వర్గమునను జూచికొనుఁడు.

ధ. ఆకృతివిద్యవిషయమై చరక విమానస్థానమందలి యెనిమిదవ యధ్యాయంబునను, సుశ్రుతశారీర స్థానమందలి నాలుగవయధ్యాయంబునను వ్రాయఁబడియున్నది. ఈవిద్యవలన మనుష్యాది ప్రాణులయాకారంబుల వీక్షించుటతోడనే యతఁడు దుష్టుఁడైనదియు, మోసగాడు, కపటి, క్రూరుఁడునైనదియు లేక దయాళుఁడు ధార్మికుఁడు, పరోపకారి, యహింసకుఁడైనదియు దెలియనగును. ప్రాణులస్వభావంబులఁగూర్చి తెలిసికొనుటకు వీలగుటచేత నీవిద్యయు నందరకవసరమే.

న. సృష్టిక్రమ విద్యవలన మనుజులకుఁబ్రపంచమందలి సకలపదార్థములయొక్క యనుభవము కలుగుటయకాక సృష్టి యేప్రకారముత్పన్నమైనదియుఁ దెలియును, వెండియునీవిద్యచేత మనుజుఁడు భ్రాంతిరహితుఁడగుటంజేసి మిథ్యాధర్మమను వలలోఁదగుల్కొననేరఁడు. ఇంతియకాక యీవిద్యనేర్చినవాని హృదయావకాశంబున నసంభవములైన వాక్యములకుఁబ్రదేశమేకలుగదు-దీనిగుర్తెరిఁగియుండునతఁడు ప్రపంచములోని ప్రతిపదార్థముయొక్క వాస్తవికస్వరూపముఁ దెలిసికొనఁబ్రయత్నముఁజేయుచుండుటయేకాక వానిఁగూర్చి తెలిసికొనితీరును. తన్మూలమున నతనిహృదయమున కెల్లప్పుడు సంతోషమేకలుగుచుండును.

ప. లోకవ్యవహారవిద్య నభ్యసించుట కేగ్రంథములవ

సరము లేదుకాని కొంతవరకు వార్తాపత్రికలు తోడుపడఁగల వు. ఎట్లనఁగా ప్రపంచమునందిపుడే యేకార్యములుజరుగుచు న్నవి? అంగడులయందు బియ్యము, గోధుమలు, నెయ్యి మొదలగువాని వెలలెట్లున్నవో? ఎవరెవరితో మనుష్యులే యే కార్యములఁ జేయుచున్నారు? దేశదేశాంతరములందీసంవత్సరము పండినవస్తువులెయ్యవి? రాజ్యపరిపాలనమెట్లు నడచుచున్నది? విపణియొక్క స్థితి యేమి? అనియిదే విధమునఁదక్కఁగల సమస్తసాంసారిక వ్యవహారములఁగూర్చి తెలిసికొనుటయే లోకవ్యవహార విద్యయనఁబరగును.

ఫ. సంపత్తిశాస్త్రముఁ జదివి యావిద్యననుసరించి వ్యాపారముఁ జేయుచో నష్టముతక్కువయు లాభమెక్కువయుఁగలుగును.

బ. రేఖాగణితము. భ. బీజగణితము
మ. శూన్యలబ్ధిగణితము య. సరళరేఖాత్రిభుజమితి
ర. వక్రరేఖాత్రిభుజమితి ల. స్థైర్యవిజ్ఞానవిద్య
వ. గతివిజ్ఞానవిద్య శ. శిల్పవిద్య
ష. జలవిజ్ఞానవిద్య. స. జలస్థైర్యవిద్య.

హ. మరియుజలగతివిద్య, వాయువిద్య, యెన్నిప్రకారంబులగు ప్రాణిశరీరంబులుండు నదియుఁదెలిసికొన శారీరవిద్య, గోశ్వాదిపశువులలో నుత్తమ మధ్యములఁబరీక్షించువి

ద్య, క్రిమివిద్య, జలప్రాణివిద్య, వనస్పతివిద్య, విద్యుద్విద్య, ఆత్మవిద్య మొదలుగాఁగలవిద్యలు పెక్కులుగలవు. వీనినివే దాదిసత్యశాస్త్రములనుండి తెలిసికొనవచ్చును. గ్రంథవిస్తరభీతిచే వానినన్నింటినిట వ్రాయఁజాలము. సుశీయుతులగుజదువరులింత వఱకుమాత్రముతోడ నధికముగ దెలిసికొందురుగాక.

విద్యనభ్యసించునిమిత్తము విద్యార్థి తనసమయమును విభాగించుకొనవలయు ఈసమయవిభాగముంగురించి విద్వాంసులు భిన్నాభిప్రాయములంగలిగియున్నారు. నిదర్శనముగ రెండుప్రకారములగు నభిప్రాయంబుల నిందుఁబొందుపరచెదము. రాత్రిందినములుకలుప నిరువదినాలుగు గంటలగుఁగదా, వీనిలో 9 గంటలు బాలురునిద్రించుటకును, మిక్కిలిపసిబాలురైనసిద్ధుఁడకుఁ బదిగంటలును 9గంటలు పాఠశాలలోఁ జదువుటకు నితరపనులకును, విద్యార్థి పెద్దవాఁడగుచో నతనికి నివాసస్థానమున యథేచ్ఛముగఁ జదివికొనుటకు వ్రాసికొనుటకు 3½ గంటలును, బాలుఁడగుచో స్వాలయంబున జదివికొన 2½ గంటలును, భోజనాదివ్యవహారంబులకు 1½ గంటయు, వాయువిహారవ్యాయామాదులకు నొకగంటయునైన నిరువదినాలుగుగంటలు సరిపోవును, మరికొందరి సిద్ధాంతమెట్లనగాఁ ప్రాతఃకాలమున నారుగంటలకు బాలుఁడునిద్దుర లేచి యారు మొదలుకొనియేడుగంటలవరకు నావశ్యకకార్యములందీర్చు

కొని 7 మొదలు 8 వరకుఁగొంచెముచదువుకొని 8 మొదలు 9 వరకు నీశ్వరోపాసనము, భోజనము మొదలగువాని క్రిందఁ గడపి 9 మొదలు 12 వరకు విద్యనభ్యసించుచు 12 మొదలు 1-15 లవరకు విశ్రాంతింగైకొని తరువాత 2 వరకు ఫలాహారము, భోజనము మొదలగువానితోఁబుచ్చి 2 మొదలు 5 వరకు విద్యాభ్యాసముఁజేయుచు 5 మొదలు 6 వరకు విహారములందేలి 6 మొదలు 8-30 వరకు స్వయముగ జదువుకొనుటయందుఁ గడపి 8-30 మొదలు 9-30 వరకు భోజనాది వ్యవహారముల బుచ్చియనంతరము నిదురింపవలయును మరలమరునాడిదే విధమున నారుగంటలకు మేల్కాంచి పూర్వపు ప్రకారముగనే పనిఁచేసికొనుచుండవలయును. ఇటులే బాలకులయొక్క సమయవిభాగముఁగూర్చి యింకనుగొందరు విద్వాంసులయొక్క సిద్ధాంతములలో భేదములుకలవు. కాని శీతోష్ణాది దేశకాలముల విచారించి బాలకులయొక్క శరీరస్థితినిబట్టి సమయవిభాగముఁజేసికొనుటుచితమని మాయభిప్రాయము. బాల్యావస్థయందలి కాలమును నిరర్థకంబుగఁ బోఁగొట్టకయుండుట తలిదండ్రులకు, నాచార్యులకు, విశేషించి బాలకులకునతిముఖ్యమైయున్నది. బాల్యావస్థయందు విద్యవచ్చులాగునఁబెరిగినపిదప రానేరదు కావున విద్యాభ్యాసంబునకు సర్వోత్తమంబగు బాల్యావస్థయందలి కాలమును జేతులార

నూరక పోఁగొట్టక యేవిద్యఁజదువుదురో దానిసార్థముగ, సాంగోపాంగముగ నుత్తమ విధానంబునఁజదువవలయును. ఆ విధమునఁజదివిన నేబాలకుఁడు పరీక్షోత్తీర్ణుఁడు కాఁగలుఁగును. ఎవఁడుధ్యానముంచి విద్యనభ్యసింపఁడో యతఁడుపరీక్షోత్తీర్ణుఁడెప్పటికిఁగానోపఁడు. వ్యాకరణమహాభాష్యమందేమని వ్రాయఁబడియున్నదో పరికింపుఁడు.

సమానమీహమానానాం చాధీయానానాంచ కేచిదర్థైర్యుజ్యంతే అపరేనతత్రకిమస్మాభిః కర్తుంశక్యమ్ స్వాభావికమేతత్. మహాభాష్యము. అ. 1. పా. 1. ఆ. 6 సూ. 38.

పరీక్షయందు గెలుపుఁగొనవలయునను కోరికతో సమానముగఁజదివినప్పటికి విద్యార్థులలోఁగొందరు గెలుచుటయుఁ గొందరోడిపోవుటయుగలుగును. ఈవిషయమై భాష్యకారుఁడు పరీక్షయందు గెలుపుకలుగుటయు, గలుగకపోవుటయు విద్యార్థియొక్క స్వభావముననుసరించియుండుననియు, నేవిద్యార్థిబుద్ధిమంతుఁడై మనసునుంచిచదువునో యతఁడుత్తీర్ణుఁడగుగాని యెవఁడు మూర్ఖుఁడై పరధ్యానముతో నధ్యయనముఁ జేయునో యతఁడు గెలుపుఁ గాంచనేరఁడు కావునసమస్త విద్యార్థులు మనసునుంచిచదువుట ముఖ్యమనివ్రాసియున్నాఁడు. మరియు దంభము, గపటము, ఛలము, పాఖండము, కుసంగము మూదిగాఁగల వానిఁ బరిత్యజించి

సేవేతేమాంస్తునియమాన్ బ్రహ్మచారీగురౌవసన్
సన్నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః
మను. అ. 2

విద్యార్థిగురుకులమందు వసించుచు జితేంద్రియుఁడై యధ్యయనంబను తపంబు నభివృద్ధి పరచికొనునిమిత్తము నియమముల సేవించవలయును. ఆనియమంబులెవ్వియన

శాంతఃదాంతః హ్రీమాన్ దృఢధృతిః అగ్లాస్నుః
అదివాస్వాపి. ఆప. ధ. సూ. ప్ర. ప. 1. ఖం. 2.

బ్రహ్మచారియెల్లప్పుడు శాంతస్వభావుఁడై, దాంతుఁడనఁగా విద్యాధ్యనంబునఁగలుగు శ్రమసహింప నోపువాఁడై లజ్జావంతుఁడు, ధైర్యవంతుఁడునై యేప్రకారం బగు హానికలిగినను జలించక విద్యాధ్యయన మందెన్నఁటికి నలసటనొందక, పగటియందెన్నఁడు నిదురించక యుండవలయు. మఱియు,

మైథునంమధుమాంసే, గోభి. గృ. సు. ప్రపా. 3. కం. ?.

బ్రహ్మచర్యమూనిన విద్యార్థిమైథునమద్యమాంసాది దుష్టపదార్థములనెప్పుడు సేవించఁగూడదు. అటులే,

స్వాధ్యాయధృగ్ధర్మరుచిస్తపస్వ్యృజుర్మృదుః సిద్ధ్యతి
బ్రహ్మచారీ ఆప. ధ. సు. ప్ర. 1. ప. 1. ఖం. 4.

విద్యనధ్యయనముఁ జేయుచు స్వధర్మనిష్ఠుఁడై, తపస్వి

యు, సరళస్వభావుఁడున్నై, కోమలుఁడై యే బ్రహ్మచారియుం డునో యావటువైకృతకార్యుఁడగుఁ గావున నమ్రతయు, సరళతయు విద్యార్థి కవసరములై యున్నవి. ఇదేవిధమున

శిష్యం బ్రూయాత్ కామక్రోధలోభమోహమానాహంకారేర్ష్యా పారుష్యపైశూన్యా నృతాలస్యాయశస్యాని హిత్వానీచనఖరోమ్ణాశుచినాకషాయవాససాసత్యవ్రత బ్రహ్మచర్యాభివాదన తత్పరేణావశ్యంభవితవ్యం మదనుమతస్థానగమనశయనాసన భోజనాధ్యయనపరేణభూత్వామత్ప్రియహితేషు వర్తితస్యసత్తోన్యథా తేవర్తమానస్యాధర్మో భవత్యఫలాచ విద్యానచప్రకాశ్యం ప్రాప్నోతిఅహం వాత్వాయిసమ్యగ్వర్తమానేయద్యన్యథాదర్శీస్వామేనో భాగ్ భవేయమఫలవిద్యశ్చ. సుశ్రు. సూ. అ. 2.

నిమ్నలిఖితనీచకార్యంబులసలుపరాదని గురువుశిష్యునకుబోధించవలయును. అట్లుగురువువచించుటయే గాక విద్యార్థియు నీనీచకార్యములపొంతఁబోకుండుట మిగుల శ్రేయస్కరము. ఎట్లనఁగా కామము, క్రోధము, లోభము, మోహము, దురభిమానము, అహంకారము, అసూయ, కటువులగుబలుకులనాడుట, కొండెములు చెప్పుట, అబద్ధములాడుట, ఆలస్యము మొదలగు నింద్యకర్మంబులొనరించుట విడనాడి, చిన్నచిన్న గోళ్లు కేశములుంచికొని శుద్ధకాషాయవసనంబులం దాల్చుచు

ను త్తమపురుషులసత్కరించుచు, విద్యార్థి నిర్మలంబగు బ్రహ్మచర్యవ్రతముంబూని విద్యాభ్యాసమునందుఁదత్పరుఁడై యుండవలయు. శిష్యునియొక్క స్నానశయనపఠనాదిసకల వ్యవహారములు గురువుయొక్క యిష్టానుసారము జరుగుచుండుటముఖ్యము. మరియు గురుశిష్యులిరువురుఁబరస్పరముప్రతిజ్ఞ గావించికొని యుండవలయు. ఎట్లనఁగా "శిష్యా! నీనీనియమంబులకు వ్యతిరేకముగనడచికొనుదువేని నీబ్రహ్మచర్యము నష్టమైపోవ నీకు విద్యసఫలముగాకుండుగాక." ఇటులేగురువుతనవిషయమునఁగూడ నొకప్రతిజ్ఞఁగలిగియుండవలెను. ఎట్లన "నేనే ప్రకారముగనైన నీకువిరుద్ధముగనడచికొందునేనిఁ బాపాత్ముఁడనగుదుగాక వెండియు నావిద్యనిష్ఫలమైపోవుగాక." అటులే

సత్యధర్మార్యవృత్తేషు శౌచే చైవారమేత్ సదా
శిష్యాంశ్చ శిష్యాద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః.

మను. అ. 4.

సత్యధర్మము, సత్యాచరణమునవలంబించి మనోవాక్కాయంబుల నెల్లవేళలఁబరిశుద్ధిగ నుంచికొనుటయందుఁబ్రీతిగలఁవాఁడై,శిష్యుల ధర్మముగఁ బ్రేమపూర్వకంబుగఁ జదువు నేర్పుట విద్వాంసునకు సముచితము. విద్యార్థుల నెప్పుడుగాని కటువచనంబులబల్కఁగూడదు. దుష్టశిక్షణములొనఁగుట తగదు. తిట్టుటయుఁ గొట్టుటయు మొదలేకూడదు. ఇటులుండ

ఇక్కాలంబున నధ్యాపకులుకొందరు తమయుదరపోషణమునిమిత్తము విద్యార్థులపై సామదానభేదదండోపాయంబులఁ బ్రయోగించి వారిదగ్గరనుండి ద్రవ్యముఁ గైకొనుచున్నారు. కొందరుదుష్టగురువులు విద్యార్థులకేవియోకొన్నిపదార్థములనిచ్చి వారిమోసముఁ జేయుచుందురు. మఱికొందరాచార్యాభాసులు విద్యార్థులఁ గ్రూరముగహింసించుటంజేసి పాపము వారలాపాడుగురువుల కేమైనసమర్పించుకొని తమప్రాణములఁ గాపాడుకొనవలసివచ్చుచున్నది. కుత్సితులైన మఱికొందరుపాధ్యాయులు విద్యార్థులలోఁగలహములనెక్కొల్పి తమ ప్రయోజనంబుల సిద్ధముచేసికొనుచుందురు. కొందరుక్రూరశాసకులు విద్యార్థులుచదువు పూర్తియై వెడలిపోవునపుడు వారిలోధనికులగువారలకుఁబఠవనివృత్తిపత్రములనొసంగక వారినుండి కొంతద్రవ్యముఁగ్రహించియిచ్చుచుందురు. విద్యార్థులయెడనిట్టివేయగు ననేకదుర్వర్తనముల వర్తమానకాలంబున మూర్ఖులు, స్వార్థులునైన దుష్టులుచేయుచుందురుగాని యధ్యాపకు లిట్టిదుర్వ్యవహారములనెప్పటికిఁ జేయఁగూడదు.

పుత్రమివైనమనుకాంక్షన్ సర్వధర్మేష్వనపచ్ఛాదయమానః సుయోక్తోవిద్యాంగ్రాహయేత్.
న చైనమధ్యయనవిఘ్నేనాత్మార్థేషూపరుంధ్యాదనాపత్సు ఆచార్యోప్యనాచార్యోభవతిశ్రుతాత్ పరిహరమాణః

ఆప. ధ. సూ. ప్ర. 1. ప. 2. ఖం. 8.

గురువు విద్యార్థిని దనకుమారుంబలె దగ్గరనుంచికొని యేవిషయముంగాని దాచికొనక యుత్తమవిధానంబున నతని కివిద్య నేర్పవలయును. అనావశ్యకముగ గురువెన్నఁడును స్వలాభమునకాశించి విద్యార్థినితరకార్యములందు నియోగించఁ గూడదు. ఇక్కాలంబునఁగొందరుగురువులు తమయింటిపనిపాటలనన్నిఁటి విద్యార్థులచేతనే చేయించుకొనుచుందురు. అటులెన్నఁడు చేయించుకొనఁగూడదు. ఆచార్యుఁడే యేవిద్యలనేర్చియుండునో యాయావిద్యలదాచికొనక విద్యార్థులకుబోధించవలయును. అట్లుబోధింపనియతఁడనాచార్యుఁడనఁబడును గాని యాచార్యుఁడనిపిలువఁబడను. కావున ఛలకపటకురాగ్రహాదుష్టభావంబులఁబరిత్యజించి పుత్రులతోడంబలె విద్యార్థులతో నడచికొనుట ప్రతియాచార్యునకు నుచితమైయున్నది. విద్యార్థులునయితము గురువుయెడల నిష్కల్మషభావముఁబూనియుండవలయును. నిరుక్తమున వ్రాయబడియున్న విధానంబునుజూడుడు.

యఆతృణత్త్యవితథేన కర్ణావదుఃఖంకుర్వన్నమృతంసంప్రయచ్ఛఁ తంమన్యేతపితరంమాతరంచ తస్మైనద్రుహ్యేత్కతమంచనాహ. ని. పూ. అ. 2. పా. 1. ఖం. 7

యః-ఎవఁడు, ఆతృణత్తి-విచ్చుకొనియున్న, కర్ణౌ-చెవులకు, అవితథేన-సత్యవిద్యోపదేశమువలన, అదుఃఖంకుర్వఁ

దుఃఖమునొసంగక, అమృతంసంప్రయచ్ఛన్ - విద్యారూపమైన యమృతంబను సౌఖ్యమునొసంగునో, తంమన్యేతపితరంమాతరంచ యాతయాచార్యుని దలిదండ్రులకంటె నెక్కువగ సన్మానించవలయును, తస్మైనద్రుహ్యేత్ మఱియునట్టియాచార్యునకెప్పుడును దుఃఖముఁగలిగింపఁగూడదు. అనఁగా గురువుదగ్గరవిద్యార్థియెప్పుడును ఛలకపటపాఖండ దంభాహంకారయుక్తములైన కార్యములనొనరింపఁదగదనిదీనియభిప్రాయము. మరియు

అధ్యాపితాయేగురుం నాద్రియంతే విప్రావాచామన
సాకర్మణావాయథైవతేన గురోర్భోజనీ యాస్తథైవతా
న్నభునక్తిశ్రుతంతత్. ని. పు. అ. 2. పా. 1. ఖం. 7.

విద్యార్థి విద్యాభ్యాసకాలమందెట్లు గురువునుబ్రీతిపూర్వకముగ నాదరించునో యదేప్రకారము విద్యపూర్తియయినదరువాతఁగూడ సన్మానించుచుండవలయును. అటులేగురువుసయితము శిష్యునెల్లవేళల నాదరణపూర్వకంబుగ సన్మానించుచుఁబ్రేమతో చదివించవలయును. వెండియు,

సర్వాన్ పరిత్యజేదర్థాన్ స్వాధ్యాయస్యవిరోధినః. మను. అ. 4.

బ్రహ్మచారియగునతఁడు విద్యకువిరోధములగు దుర్వ్యసనంబులు, దుర్గుణంబులులోనగు వానింబరిత్యజించి

వశేకృత్వేంద్రియగ్రామం సంయమ్యచమనస్తథా,
సర్వాన్సంసాధయేదర్థానాక్షిణ్వన్ యోగతస్తనుం.
మను. అ. 2.

ఇంద్రియముల వశపరచికొని మనస్సునుజయిం చి యుక్తిపూర్వకముగ సకలకార్యములఁ జేసికొనచుండవల యును. ఏసమయమందుఁగానిశరీరమును దుర్బలము, దుఃఖిత మునై నదిగఁ జేసికొనగూడదు. శరీరము బలహీనమయ్యేనేని వి ద్యాధ్యయనమందు గెలుపుఁగొనఁజాలఁడు; కావున నతిపతన ము, నజితేంద్రియత్వమ్, లఘుభోజనము, నుపవాసము మొ దలగు వానిచేత విద్యార్థిశరీరమును బలహీనమగునట్లు చేసి కొనఁదగదు. ఇటులే "నబ్రహ్మచారిణో విద్యార్థస్య పరోప పవాసోస్తి" ఆ. ధ. సు. ప్ర. 1. ప. 1. ఖ. 2.

బ్రహ్మచారికి విద్యదప్ప యుపవాసములు మొదలగువా ని నొనరింపనవసరము లేదని యాపస్తంబధర్మ సూత్రములువ క్కాణించుచున్నవి.

చోదితో గురుణా నిత్యమప్రచోదిత ఏవవా
కుర్యాదధ్యయనే యత్నమాచార్యస్య హితేషుచ. మను. అ. 2

యుక్తకార్యములొనరించు నిమిత్తముగురువాజ్ఞనియ్య వలసిన యవసరము లేదు కావునఁ జదువుటయందును, గురువున కు హితముగూర్చుటయందును, విద్యార్థి కొంచెమేనియునా లస్యము చేయగూడదు. ఎట్లనఁగా

వేదోపకరణే చైవ స్వాధ్యాయే చైవనైత్యికే
నానురోధోస్త్యనధ్యాయే హోమమంత్రేషు చైవహి.
మను. అ. 2.

వేదోపకరణములనఁగా వేదమందలియర్థము నుగుర్తెరుఁగుటకు సాధనములైన వ్యాకరణము మొదలైనవానిఁగాని యనుదినము నేవిద్యనభ్యసించుచుండునో దానినిగాని చదువుకొంటకనుమతి యక్కరలేదు ఇదేవిధమున హోమము మొనరించుటకును, హోమమంత్రముల నుచ్చరించుటకునుగూడ ననుమతి యవసరములేదు. స్వాధ్యాయము నిత్యకర్మము. ఈ స్వాధ్యాయముంగూర్చి సత్యశాస్త్రములలోఁ గడునుత్తమరీతి వ్రాయఁబడియున్నది చూడుఁడు.

పావమానీర్యోఅధ్యేత్ ఋషిభిః సంభృతం రసం
తస్మై సరస్వతీదుహేక్షీరం సర్పిర్మధూదకం

ఋ. అ. 7. అ. 2. వ. 19.

ఎవఁడుపవిత్రమైన విద్యనభ్యసించునో వానికావిద్య దుగ్ధఘృతాది సకలపదార్థంబులఁగలుగఁజేయునని ఋగ్వేదమందును, అథాతఃస్వాధ్యాయప్రశంసాప్రియేస్వాధ్యాయ ప్రవచనేభవతో యుక్తమనాభవత్యపరాధినో హరహరర్థాఀసాధయతేసుఖంగ్ం స్వపితిపరమచికిత్సక ఆత్మనోభవతీంద్రియసంయమ శ్చైకారా మతాచప్రజ్ఞావృద్ధిర్యశోలోకపక్తిః ప్రజ్ఞాచవర్ధమానాచతురోధర్మాఀ బ్రాహ్మణమభినిష్పాదయతి.

శ. కాం. 11. ప్ర. 4. బ్రా. 9. కం. 1.

విద్యనభ్యసించుటచేతను, నభ్యసించినదికొంఁడి మాత్ర

మైనను దానినిజమైనయర్థము గ్రహించుటచేతను మనుజునిమన స్సుప్రబలమైనజ్ఞానయుక్తమగును. విద్యనేర్చినయతఁడితిరులయూ ధీమంతుండై స్వతంత్రుఁడై ధనోపార్జనంబునఁ గాఁదగిన నానా ప్రకారములగు గళాకౌశలాదిపదార్థములను, బదార్థవిద్యచేతన నేకేతరవస్తు విశేషంబులనుత్పన్నముఁ గావించికొనుచు నెల్లకాలముసౌఖ్యముగనుండును. దియకేనిసంపూర్ణమైనయూ త్మజ్ఞానముకలుగును. అట్టివాడేయింద్రియములజయింపఁగలిగిం పరమసుఖియగు. వానిసౌఖ్యమునకు భగము నెవరునుగా వింపనోపరు. వానికేబుద్ధియునభివృద్ధిజెందును. చదువుచే మనుజుఁడు పవిత్రుఁడై లోకమందు యశముఁబొందును. చదువుచేత నే మానవునకు ధర్మార్థకామమోక్షము ల ప్రాప్తియుఁజేకూరు. ఇంతియకాక విద్యమననముఁజే యుటచే బ్రాహ్మణత్వము సిద్ధించునని శతపథమునందును.

యఃస్వాధ్యాయమధీతేబ్దం విధినానియతఃశుచిః
తస్యనిత్యంక్షరత్యేషపయోదధిఘృతంమధుః.మను. అ. 2.

చదువఁదగిన విధానంబుననేవిద్యార్థి యొకసంవత్సరము పర్యంతము విద్యనభ్యసించునో వానికావిద్య పాలతోసమ ముగఁబోషించునదియు, పెరుగుతోబాటు శీతలత్వమిచ్చునది యు, నెయ్యివలెఁబుష్టిఁగలుగఁజేయునదియు, మధువుంబోలి నిరోగత్వము, నిర్మలత్వము, మృదుస్వభావము నొసంగునది

యు నగునని మనుస్మృతియందును లిఖింపఁబడియున్నది. ఒక్క సంవత్సరము మాత్రమే తగినరీతి విద్యనభ్యసించుటచేత బ్రహ్మచారికి దుగ్ధఘృతాది సకలపదార్థములు చేకూరుచుండ నింక నధిక కాలము పర్యంతము నభ్యసించు విద్యకుఁగలుగు ఫలితమింతింతయని వచింపనలవియగునా? మఱియు,

స్వాధ్యాయధర్మేణ తపస్వీపుణ్యో భవతి, తపస్వీపుణ్యో భవతి తై. ఆ. ప్ర. 1.

స్వాధ్యాయంబను పుణ్యముచే మనుజుఁడు తపస్వియు, పుణ్యాత్ముఁడునగునని తైత్తిరీయారణ్యకమందును,

నిత్యంస్వాధ్యాయశీలాశ్చదుర్గాణ్యతితరంతి తే.

భార. శాం. అ. 110.

అనుదినము స్వాధ్యాయముం జేయునతఁడు మహాదుఃఖములనైన దాటఁగలుగునని భారతమునను,

యథాయథాహిపురుషః శాస్త్రంసమధిగచ్ఛతి
తథాతథావిజానాతి విజ్ఞానంచాస్యరోచతే.

మను. అ. 4.

ఏయే ప్రకారముననుబురుషుఁడు విద్యనభ్యసించునో యాయా విధమున వానిజ్ఞానమభివృద్ధినొంద నట్టివాఁడు విద్వాంసుఁడగునని మనుస్మృతియందును వ్రాయఁబడియున్నది. విద్వాంసులనియు నవిద్వాంసులనియు మానవులు ప్రపంచమున రెండు

ప్రకారము లేవైయున్నారు. వారిలో విద్వాంసులే ధన్యవాదు లని వేదము వచించుచున్నది. ఎట్లనఁగా,

సక్తుమివ తితఉనా పునంతో యత్ర ధీరా మనసా వాచమక్రత।
అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి
వాచి ఋ. అ. 8. అ 2. వ. 2.

ఎట్లు చాలిని చేతఁ దాల్పఁబడుటచేఁ బిండి శుద్ధము కావింపఁబడుచున్నదో యటులే మనస్సని యెడు చాలిని సహాయమున నే విద్వాంసుఁడు తనవాణియను పిండిని శుద్ధము జేసికొనునో యా బుద్ధిమంతుండగు బురుషుఁడే విద్వాంసుల సభ నలంకరింప నర్హుఁడై, పవిత్రుఁడై, నిశ్చితమైన సత్యవాణిఁ బరస్పరము వచించుచుండును. అతనితో సమానులగు విద్వాంసులే విద్వత్తుతోఁ గూడిన యతని వాక్యముల గ్రహింపఁగలుగుదురు కాని మూర్ఖులు తెలిసికొనఁజాలరు అట్టి విద్వాంసులయొక్క వాణియందే కళ్యాణకారకమైన లక్ష్మీవాసము చేయుచుండును. మరియు,

ఉతత్వంస్థిరపీతమాహుర్నైనం హింత్వంత్యపి వాజినేషు
అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాం అఫలామపు
ష్పాం ఋ. అ. 8. అ. 7. వ. 23.

ఎవఁడర్థసహితంబుగ సమస్తవిద్యల యథావిధి నధ్యయనంబుఁ జేయునో, యెవఁడందలి నిజమైన యభిప్రాయమును త్తమరీతి తెలిసికొనునో వాఁడే విద్వాంసుల సభలలో సన్మాన

ముఁగాంచును. అట్టిమనుజునితోడ శాస్త్రార్థవాదములువా నిగావింప విద్వాంసులెప్పుడును తిరస్కరింపరు. ఇఁకనవిద్వాంసుఁడనిన వ్యర్థముగ దంతములకు నొప్పికలుగుబకవాదముచేయుచు గ్రుమ్మరుచుండును. గొడ్డుబోతగునావునందు క్షీరములును సారములు లేకుండురీతినవిద్వాంసునివాక్యములందుఁగూడ సారముండదు. ఆవిద్వాంసుఁడువచించునదంతయు నిష్ఫలమేయగుచుండును కావునశ్రమపూర్వకముగ విద్యనధ్యయనముచేసి విద్వాంసులగుట మనుష్యులందరకుముఖ్యము. వెండియు

భద్రమిచ్ఛంతి ఋషయః స్వర్విద స్తపోదీక్షాముపనిషేదుర
గ్రే తతో రాష్ట్రం బలమోజశ్చజాతంతస్మైదేవాఉపసన్న
మంతు. అధ. కాం. 19. అను. 5. వ. 41.

సుఖాపేక్షులై కళ్యాణమభిలషించునట్టి సూక్ష్మదర్శులైన జనులు ప్రథమావస్థయందు సత్యభాషణజితేంద్రియతాదితపంబుఁగాని విద్యలభించుటకు హేతుభూతములైన మరియేదీక్షలనైనఁగాని సేవనముసేయుదురు. ఏతపంబువలననేదీక్షవలన రాజ్యబలతేజంబులు ప్రాప్తములగునో యట్టియోగ్యవిద్యాభ్యాసంబునఁ బండితులగునట్టి మానవులకు సత్కారము నరించుటసజ్జనులకుచితమని యథర్వవేదమందును.

యోవైబ్రాహ్మణానామనుచానతమఃసఏషాంవీర్యవత్తమః
శ. కాం. 4. ప్ర. 5. బ్రా. 8. కం. 5.

బ్రాహ్మణులలో నెవఁడువిద్వాంసుఁడగునో వాఁడేవా రిలో శ్రేష్ఠుఁడుగ గణింపఁబడునని శతపథంబునను.

భూయోవిద్యః ప్రశస్యోభవతి. ని. పూ. అ. 1. పా. 5. ఖం. 2.

ఎవఁడుపూర్ణవిద్వాంసుఁడగునో వాఁడే ప్రశంసనీయుఁడ ని నిరుక్తమందును

యస్తువిజ్ఞానవాన్ భవతియుక్తేనమనసాసదా
తస్యేంద్రియాణివశ్యాని సదశ్వాఇవసారథేః.

క. ఉప. వల్లి. 3.

అలవర్చఁబడిన గుఱ్ఱముసారథియొక్క వశములోనుం డుచాడ్పున నెవఁడువిద్వాంసుఁడగునో, నెవనిమనస్సువిద్యా యుక్తమైయుండునో యట్టిమనుష్యుఁడేయింద్రియములవశమం దుంచికొని యోచనాశీలుఁడై మనోవాక్కాయంబులఁ బరిశు ద్ధుఁడై యుండునని కఠోపనిషత్తునందును, నిటులేమనుస్మృ తియందు

సేనాపత్యంచరాజ్యంచ దండనేతృత్వమేవచ
సర్వలోకాధిపత్యంచ వేదశాస్త్రవిదర్హతి. మను, అ. 12

వేదాదిసకలవిద్యాసంపన్నులే రాజు, మంత్రి, సేనాని, దండవిధాయకుఁడు మొదలగునుచ్ఛపదవులకును, సర్వలోకా ధిపత్యమునకును యోగ్యులనియు,నట్టివారలనేయాయాపదము లందుంచుట సజ్జనులకుచితమనియు,

న హాయనై ర్న పలితైర్న విత్తేర్న చ బంధుభిః
ఋషయశ్చక్రిరే ధర్మం యోనూచానః సనోమహాన్
మను. అ. 2.

ఏండ్లెక్కు వయగుటవలనను, వెండ్రుకలు నెరయుటచేతను ధనముచేతను, బంధుబృందములఁగలిగియుండుటచేతనుమనుష్యుఁడు పెద్దవాఁడుకాఁజాలఁడుకాని యెవఁడువిద్వాంసుఁడగునో యతఁడే పెద్దయని ఋషులుస్థిరనియమముఁ గావించియున్నట్లును.

విద్వత్త్వంచ నృపత్త్వంచ నైవతుల్యంకదాచన
స్వదేశేపూజ్యతేరాజావిద్వాన్ సర్వత్రపూజ్యతే.
పంచతంత్ర. 2.

స్వదేశమునందుమాత్రమే రాజుసన్మానముఁగాంచు గాని విద్వాంసుఁడెచటకేగిన నచటఁబూజింపఁబడుగావున విద్వాంసుఁడును రాజును సమానులుకానేరరని పంచతంత్రమందును,

సవిద్యఃపురుషః శ్రేష్ఠోయత్రకుత్రాపితిష్ఠతి
తత్రైవలభతేశ్రీమాన్ పూజాపాత్రంచ భూభుజామ్. పు. ప.

విద్వాంసుఁడే సకలమానవులలో శ్రేష్ఠుఁడై యెచటనుండినఁనచట రాజులచేఁబూజింపఁబడుచు ధనాదిసకలపదార్థసమేతుఁడగునని పురుషపరీక్షయందును లిఖింపఁబడియున్నది. ప్రపంచమందేయే యుత్తమకార్యము లింతకుమున్ను జరిగి

యున్నవో యవియన్నియు విద్వాంసులవలనఁ జేయఁబడినవే. ఇక్కాలంబునఁగూడ విద్వాంసులే యుత్తమకార్యములఁ జేయుచున్నారు. కావున మేమిరీతివరకుఁ గనుబరచియున్న విధానంబున నెవఁడు బ్రహ్మచర్యవ్రతము నవలంబించి విద్యనభ్యసించునో యాపురుషుఁడే విద్వాంసుఁడగును. ఎవఁడట్లొనరింపఁడో వాఁడు మహామూర్ఖుఁడు, జడుఁడు, నిరక్షరభట్టాచార్యుఁడై మట్టివినాయకునిఁబోలి యజ్ఞానియైయుండును. అట్టియధముఁడు సంసారంబునందు వ్యర్థమేయగుఁగాని యొకకార్యమునొనరింపనేరఁడు. ఎట్లనఁగా,

ఉతత్వః పశ్యన్నదదర్శవాచముతత్వః శృణ్వన్న శృణోత్యేనామ్, ఉతోత్వస్మైతన్వంవిసస్రేజాయేవపత్యఉశతీసువాసాః

ఋ. అ. ౮. అ. ౨. వ. ౨౩.

అవిద్వాంసులగువారలు చూచుచుండియుఁజూడనేరక పోవుటంబట్టియు, వినుచుండియు వినఁజాలక పోవుటచేతను విద్యావాణియొక్క రహస్యమును దెలియనేరరు. కానిసుందరవస్త్రాలంకారములందాల్చి తనకాంతునికామితంబు నెసఁగూర్చు స్త్రీ తనశరీరస్వరూపము మగనికిఁ బ్రకాశముచేయురీతి, విద్యయు, తనస్వరూపమును శబ్దార్థసంబంధముల నెఱుంగఁగల విద్వాంసులకే ప్రకాశముఁజేయును. అవిద్వాంసులకట్లుగాదు. మరియు మూర్ఖులయొక్క వ్యవహారములు విద్వాంసుల

వ్యవహారములకువిరుద్ధములుగనుండును. ఇదేవిధమున గోపని షత్తునందు మరియు

యస్త్వవిజ్ఞానవాన్భవత్యయుక్తేనమనసాసదా
తస్యేంద్రియాణ్యవశ్యానిదుష్టాశ్వాఇవసారథేః క.వు వల్లీ.3.

అవిద్వాంసుఁడగు మూర్ఖునియొక్క బుద్ధి యనుసారథి నేర్పరికాకపోవుటంజేసి యింద్రియములనెడు గుఱ్ఱములతని యాధీనమందుండనేరవు. ఆకారణమున మనుజుఁడు స్థిరమైన మనస్సుఁగలిగియుండడనియు,

యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కః సదాశుచిః
నసతత్పద మాప్నోతిసంసారంచాధిగచ్ఛతి. క. ఉ. వల్లీ. 3.

అవిద్వాంసుఁ డెల్లవేళల విచారశూన్యుఁడై మనోవాక్కాయంబుల నపరిశుద్ధుఁడై యుండుఁగాన నట్టివాఁడు త్తమమైన పదము నొందనేరఁడనియు వ్రాయఁబడియున్నది. విద్యలేనిమనుజుఁడు ప్రపంచమున నెప్పుడు దుఃఖమునే యనుభవించుచుండును. మరియు.

లోకద్వారం విదుషాం ప్రపదనంనిరోధోవిదుషాం
ఛా ప్ర. 8 ఖం. 6.

విద్వాంసునకే సూర్యాది సమస్తలోకంబులఁ బ్రచారము కలుగుఁగాని యవిద్వాంసుల కెప్పటికిఁ గలుగదని ఛాందోగ్యమందును,

వరంగర్భ స్రావోవర మృతు ష్వైవాభిగమనం,
వరంజాతః ప్రేతోవర మపిచ కన్యైవజనితా
వరం వంధ్యా భార్యావర మపిచ గర్భేషువసతి
ర్నచావిద్వాన్ రూపద్రవిణగణయుక్తోపితనయః పంచ. ప్ర..

మూర్ఖుఁడైనకుమారుఁడు పుట్టుటకంటె గర్భస్రావము గుటమేలు; ఋతుకాలమందు స్త్రీతో సమాగమము సేయక యుంట యుత్తమము; మూర్ఖుఁడగువాఁడు పుట్టిచచ్చిననుమంచిదే. వానికన్నఁ గూతురుకలుగు టత్యుత్తమము. లేకస్త్రీ గొడ్రాలైనను శ్రేయమే. మూర్ఖుఁడు గర్భములోనుండి బయటికి రాకయుండుటయు మంచిదేయగును కాని యెంతరూపముఁ గలిగియున్నను నెంతధనమున్నను మూర్ఖుఁడగు దనయుఁడు కలుగకయుండుట శ్రేయస్కరమని పంచతంత్రమందునను,

పండితోపి వరంశత్రుర్న మూర్ఖోహితకారకః
వానరేణ హతోరాజా విప్రాశ్చోరేణరక్షితాః.

పంచతంత్రం. 1.

పండితుఁడైన శత్రువుండుట మేలేయగుఁగాని మూర్ఖుఁడైన మిత్రుఁడుండుట చెడుగునకుఁగారణంబగు. ఎట్లనఁగానొక రాజునకు మిత్రుఁడుగ నుండిన మూర్ఖవానరమొకఁడు తనరాజును జంపియుండె. విద్వాంసుఁడగుదొంగయొకఁడు బ్రాహ్మణులఁగాపాడెనఁట. ప్రతిమనుజుఁడు విద్వాంసుఁడు కావలయుఁ

గాని మూర్ఖుఁడుగ నెవఁడు నుండఁగూడదని దీని ముఖ్యాభిప్రాయము. మరియు,

కింగర్జితేన వృషభేణ పరాజితేన,
కింకోకిలస్వరకృతేన వినావసంతం,
కింకాతరేణ బహుశస్త్రపరిగ్రహేణ
కింజీవితేన పురుషేణ నిరక్షరేణ. నీ. శా.

పరాజయము నొందిన పిదప నాఁబోతు రంకె వేయుట చేత నేమి ప్రయోజనము? వసంతమాసము గాక కోకిలరుతము నరించిన నేమిఫలము? పిరికిపందయగు వాఁడు దేహము నిండ శస్త్రాస్త్రముల ధరించుకొనుటనిమిత్తము? అటులే పొట్టఁబొడిచిన నక్కరము లేని మూర్ఖుఁడు బ్రతికియుండి మాత్రము లాభమేమి? కొంచెమేనియు లేదని నీతిశాస్త్ర మందును

నలోకేరాజతే మూర్ఖః కేవలాత్మ ప్రశంసయా
అపిచేహ మృజాహీనః కృతవిద్యః ప్రకాశతే.

భార. వ. అ. 207.

మూర్ఖుఁడగు బురుషుఁడు తనను దానెంత పొగడికొనినను వానికి బ్రపంచమందెన్నఁటికిఁ బ్రశంస కలుగనేరదు కాని విద్వాంసుఁడగు నతఁడెట్టి మలినములైన చింపిరిపేలికలఁగట్టికొనియుండినను సూర్యునితో సమానముగ సమస్త జనులతో బ్రకాశమాన మగుచుండునని భారతమందును వ్రాయబడియు

స్నది. మనయార్యావర్తమందలి సభ్యజనులందరు మొదటి నుండి స్వసంతానంబుల మూర్ఖులుగ నుంచుట నీచమనియే యెంచుచువచ్చిరి. ఎట్లనఁగా

అజాతమృత మూర్ఖేభ్యోమృతౌ జాతౌసుతౌ వరం
యతస్తౌ స్వల్పదుఃఖాయ యావజ్జీవం జడోదహేత్
పంచతంత్రం .1.

మొదలుత్పన్నముగానట్టియు, నుత్పన్నమైమృతినొంది నట్టియు, బ్రతికియుండి మూర్ఖుఁడుగ నుండునట్టియు గుమారులలో మొదలు జనించని యతఁడే యుత్తముఁడు. పుట్టిచచ్చిన వానిఁగూడ మంచివాఁడే యనవచ్చునుకాని పుట్టిబ్రతికియుండి యు విద్యనభ్యసించని యతఁడత్యంత హీనుఁడనఁబరగు. ఏల యనఁ బుత్రుఁడు కలుగకయున్నను, గలిగి మృతినొందినను దలిదండ్రులకు దాత్కాలిక దుఃఖముమాత్రమే చేకూరుగాని మూర్ఖుఁడయ్యెనేని మాతాపితరులవారు బ్రతికియున్నంతకాలము నేడువఁబెట్టుచుండును. కావుననీశ్వరా! నీకృపావిశేషంబున మాకు విద్వాంసులగు సుతులు కలుగకయుందురుగాక యని పరమేశ్వరు వేడుకొనుచు మూర్ఖతనుండి దూరగులై విద్య ప్రాప్తమగు భంగిచేసికొను నిమిత్తమీ నిమ్నలిఖిత క్రమానుసారము బ్రహ్మచర్యము సేవింపవలయు. ఎట్లనఁగా,

అష్టాచత్వారింశద్వర్షం సర్వవేద బ్రహ్మచర్యం.
గో. పూ. ప్ర. 2. బ్రా. 6.

నలువదియెనిమిది సంవత్సరములవరకు బ్రహ్మచర్యవ్రతము ధరించి విద్యాభ్యాసము చేయవలయునని గోపథము వక్కాణించుచున్నది. లేనియెడ నుత్తమాధమ భేదములతో బ్రహ్మచర్యము నాలుగు ప్రకారములని యాపస్తంబధర్మసూత్రములందు లిఖింపఁబడియున్నది. వానిలో యథాశక్తి దేనినైన నాచరించవలయును.

అష్టాచత్వారింశద్వర్షాణి
పాదూనమ్.

అర్ధేన. ఆప. ధ. సూ. ప్ర. 1. ప. 1. ఖం. 2.

నలువదియెనిమిది వత్సరముల పర్యంతమాచరించునది యుత్తమోత్తమ బ్రహ్మచర్యము. ముప్పదియారు సంవత్సరములవరకు సలుపునది యుత్తమము. ఇరువదినాలుగు వర్షముల పర్యంతము జేయునది మధ్యమము. ఇంతకుఁదక్కువకాలమువరకు నాచరించునవి కనిష్టములనఁబడును. ఇదేవిధమున ఛాందోగ్యమునందును, దక్కంగల గృహ్యాసూత్రములందును వ్రాయఁబడియున్నది. కావున యుత్తమోత్తమాది విధానంబులలో నేవిధినైన నాచరించుటొప్పగును. అట్లుత్తమ బ్రహ్మచర్యము సలుపనేరనిచో

ఆయుషస్తు చతుర్భాగం బ్రహ్మచార్య ననూయకః
గురౌవాగురు పుత్రేషువావ సేద్ధర్మార్థకోవిదః

భార. శాం. అ. 241.

అనుభారత వచనానుసారమాయువు యొక్క నాలుగ వయంశము వరకైన నధ్యాపకునొద్ద నివసించి విద్య నభ్యసించవలయును,

శతం జీవే మశరద.

మొదలగు వాక్యములవలన మనుజుని యాయువు నూరుసంవత్సరములని, వేదమునుండి తేలుచున్నది. నూరేండ్లలో నాలుగవ వంతు 25 వర్షములగుచుండగాన ప్రతిమానవుఁడు దక్కువకుఁ దక్కువ యంతపర్యంతమైన బ్రహ్మచర్యమునవలుపుటుచితము. అంతకునుదక్కువయగునేని గావలసినయంతజ్ఞానముకలుగుట కవకాశముండదు.

ప్రణాతిబ్రహ్మచర్యేప సర్వణానికృత్వాసిద్ధిర్బహుకాలాత్ తద్వత్. సాం. శా. అ. 4

బ్రహ్మచర్యనియమమవలంబించి విస్తారకాలము పర్యంతమాచార్యునొద్ద విద్యనభ్యసించుటచేతనే యదిలభించును గాని యితరమార్గమునఁగాదని సాంఖ్యశాస్త్రములో వ్రాయఁబడియున్నది. కావునఁబూర్వోక్తరీతి ననుసరించి యుత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, కనిష్టములలో దేనినైనఁబాలింపవలయును. వెండియు,

బ్రహ్మచర్యంత్వా విద్యాగ్రహణాత్. వాత్స. సు. అ. 2.

ఎంతపర్యంతము విద్యనభ్యసించవలయునో యంతప

ర్యంతము బ్రహ్మచర్యముఁ జేయవలయునని ఋషులనేకులుప చించియున్నారు, కావునఁ బ్రతిమానవుఁడుఁ గొంచెముగనో గొప్పగనో తన్నియమమునాచరించవలయుననుట నిర్ధారణము.

కానివర్తమానకాలమందలి నామమాత్రపు ఘోటక బ్రహ్మచారులంబోలి యాశ్రమంబునకుఁగళంకముమాత్రము కలుగఁజేయఁగూడదు. ధూర్తులు కొందఱు బ్రహ్మచారులమని పేరులంబెట్టికొని, జడలఁబెంచికొని యొక్కయక్కరమైనఁజనువక కేవలమునాట్యము, హాస్యము, గానము, వాద్యము, గంజాయి, భంగు, నల్లమందు, పొగాకు, మద్యము, మాంసము, మాలలు, మాదకద్రవ్యములు లోనగువాని సేవించుచుందురు. ఇట్టివారిసర్వవిధములనిషేధించవలయునని మనుస్మృతిలోని రెండవయధ్యాయముయొక్క 177, 178 వ శ్లోకములందు లిఖింపఁబడియున్నది. వేషధారులగు నీనామకబ్రహ్మచారులు మిక్కుటముగ వామమార్గులనుండియు, శాక్తేయులనుండియు నగుచుందురు. మనుజుఁడెంతవరకు మద్యమాంసములసేవించకయుండునో యంతవరకు బ్రహ్మచారి కానేరఁడని వీరిసిద్ధాంతము. ఈదుష్టు లీధూర్తు లీమూర్ఖు లీమోహవగాండ్రు వచించునదంతయు ధర్మశాస్త్రముల కత్యంతవిరుద్ధమైయున్నది. వీరలు బ్రహ్మచర్యాశ్రమమును ముంచివేయునట్టి ఘోరరాక్షసులేకాని వేరుకాదు. దుర్మార్గగాములగునిట్టి

యధర్మాత్ములే సర్వోత్తమంబై, నిష్కళంకమై, సకలాశ్రమంబులకు మూలాధారమైయొప్పు బ్రహ్మచర్యాశ్రమమును నామమాత్రావశిష్టము చేసియున్నారు. బ్రహ్మచర్యాశ్రమము తక్కిన యాశ్రమములకుఁ బునాదివంటిది. ఏయింటిపునాదులు దృఢముగ నుండవో యాయింటిని మొదలు నిర్మించుటయే కఠినము. ఒకవేళ నెట్లో కట్టినప్పటికి స్థిరముగ నిలువనేరదు. కావున సకలమానవులు మొట్టమొదలు బ్రహ్మచర్యాశ్రమము యుక్తవిధానంబున సలుపవలయును, ఉదరపరాయణులు, మూఢులు నైన జనులుకొందఱు స్వగృహమున భార్యాబిడ్డలతోఁ దగవులాడి బూటకపుఁ బంచకేశములుంచికొని బ్రహ్మచారులుగ మారుచుందురు. ఈకుక్షింభరులిట్లు చేయుటయేవిధమునఁ జూచినను ధర్మశాస్త్ర విరుద్ధమే. ఎట్లనఁగా

యోగృహాశ్రమ మాస్థాయా బ్రహ్మచారీభవేత్పునః
నయతిర్నవనస్థశ్చ సర్వాశ్రమ వివర్జితః లిఖ. అ. I.

ఎవఁడు గృహస్థాశ్రమము వదలి మరల బ్రహ్మచారియగునో యట్టివాఁడే యాశ్రమస్థుఁడును గానేరఁడుకాని యాశ్రమ భ్రష్టుఁడని పిలువఁబడును. కావునే బ్రహ్మచర్యాశ్రమనియమము లెయ్యవి కలవో వాని నెప్పటికిఁ బరిత్యజింపఁగూడదు. ఏలయన

కృతనియమ లంఘనాదా నర్థక్యం లోకవత్.

సాం. అ. 4.

ప్రపంచమం దేరోగమున కేమందున కేపథ్యము విధింపఁబడునో యారోగమున కామందుఁగ్రైకొని యాపథ్యముఁజేసిననే యది నివారణమగుగాని వేరొకవిధముననఁగా నేరదు. అటులే బ్రహ్మచర్యాశ్రమంబున కే నియమములు కలవో వానినాచరించక తద్విరుద్ధములైన యాచరణంబుల నొనరించుటంజేసి విద్యార్థియొక్క ప్రయత్నము లన్నియు నిష్ఫలములే యగుచుండు. కావున

అనేన క్రమ యోగేన సంస్కృతాత్మాద్విజః శనైః,
గురౌవసన్ సఞ్చినుయా ద్బ్రహ్మాధిగ మికంతపః.

మను. అ. 2.

వేదాదిశాస్త్రములం దెట్లు బ్రహ్మచర్యాశ్రమము యొక్క విధులు వ్రాయఁబడియున్నవో యావిధుల ప్రకారము బ్రహ్మచారి పరిశుద్ధాత్ముఁడై గురుకులమున వసించి జితేంద్రియతాపూర్వకంబుగ వేదాదివిద్యలఁ జదువ వలయునని మనుస్మృతియందును,

బ్రహ్మచారీ బ్రహ్మభ్రాజద్బిభర్తి తస్మిన్ దేవాఅధి విశ్వే
సమోతాః, ప్రాణాపానౌ జనయన్నా ద్వ్యానం
వాచం మనోహృదయం బ్రహ్మ మేధామ్.

అథర్వ. కాం. 11. అను. 3, వ. 16.

ఎవఁడు పూర్ణబ్రహ్మచర్యమున విద్వాంసుఁ డగునో వానియొక్క వాణి, మనస్సు, హృదయము, బుద్ధిలోనగునవన్నియు నుత్తమంబులగు. అట్టివాఁడే విద్వాంసులలో సన్మానింపఁబడుటకు యోగ్యుఁడగును. వాఁడే తేజస్వియుఁ బ్రతాపవంతుఁడునై ప్రాణాదులరక్షించుకొనఁగలుగునని యధర్వవేదమందును బ్రతిపాదనము చేయఁబడియున్నది.

కావున నీయుత్తమోత్తమంబైన, యానన్దానందప్రదంబైన బ్రహ్మచర్యముం బూని మనుజ జన్మముయొక్క ధర్మార్థ కామమోక్షంబులనెడి నాలుగువిధములైన ఫలములు ప్రాప్తములగునట్లు చేసికొని యెల్లప్పుడు సుఖముగా నుండుట ప్రతిమనుష్యునకు నుచితము.

1. పరంవిద్యాదీనా మవిరత గుణానాం సముదితం
ప్రయచ్ఛత్యారోగ్యం వపురపి పురుషార్థం బలమథో,
యదైశ్వర్యం రాజ్యాది కమపిచ తేజోబహువిధం
నరోన్నత్యాశ్చైతత్ ప్రథమ మిదమారోహణమపి. 1.

2. సుఖానాం సంభోక్తా పరిచరణ తోస్యైవ మనుజో,
వయస్యాదేరాదాయత ఇహహి విద్యాగ్రహణతా,
నరాణాం భద్రాణాం సముచిత మతస్తైః స్వయమథో
సుసంసేవ్యః పూతైర్రాపేజిత సుఖై రుక్తవిధినా. 2.

3. యద్బ్రహ్మచర్య సుఖ భాజనం పరం
తత్ సేవనీయం పురుషేణయత్నతః
నతద్వినాస్వోన్నతి మిచ్ఛతా పరం
నరేణకించిత్ కిలకర్తు మీహ్యతే. 3.

4. సమ్యక్ ప్రసాధితం హ్యేతత్ శతం భద్రాణియచ్ఛతి
పరలోక సుఖస్యేదం సాధనం చోత్తమం మతం. 4.

5. నసేవతేన రోహ్యే తద్దారిద్ర్యం సోశ్ను తేభృశం
సంపదం యేతు వాంఛంతి తైః సంసేవ్యం ప్రయత్నతః 5.

6. అనుభవతి నితాంతం బ్రహ్మచర్యేణ తేన
ప్రయతిమతి సుఖంయత్ పూర్ణలోక ద్వయేష్టం,
మనుజ జనిమవాప్తై నైవ దాశు ప్రయత్నాత్
ప్రథమ వయసిసేవ్యం నాన్యథా సౌఖ్యమేతి. 6.

ఇత్యాశాస్మహే.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇది శ్రీమద్విశ్వేశ్వరానంద నిత్యానంద విరచితంబైన
పురుషార్థ ప్రకాశమందు బ్రహ్మచర్యప్రకరణము.

సంపూర్ణము.



ఓం

పురుషార్థప్రకాశము

# గృహస్థాశ్రమప్రకరణము

---

వెనుకటిప్రకరణంబున వ్రాసినవిధానమున బ్రహ్మచర్యసేవనంబొనరించి విద్యార్థి తనగృహమునకుఁ జేరవలయును. దీనికిసమావర్తనమని పేరు. ఈసమావర్తనసమయముంగూర్చి,

తథావ్రతేనాష్టచత్వారింశత్ పరిమాణేన.

ఆప. ధర్మ. సూ. ప్ర 2. ప. 9. ఖం. 22

అనియీసూత్రమునందు నలువదియెనిమిది సంవత్సరములకుఁ దరువాతనే సమావర్తనసమయంబని వ్రాయఁబడియున్నది. అనఁగా

విద్యాంసమాప్యదారాన్ కృత్వాగ్నీనాధాయకర్మాణ్యారభతేసోమావరార్థ్యానియానిశ్రూయంతే

ఆప. ధర్మ. సూ. ప్ర. 2. ప. 9. ఖం. 22

సంపూర్ణమగు విద్యనభ్యసించి వివాహమాడి గృహాశ్రమంబు లొనరించుకొను నిమిత్తమగ్నిని బొందుపరచికొని యుత్తమోత్తమంబులైన సమస్తగృహకార్యముల నెరవేర్చుచుండవలయునను నీసూత్రముచేత మొట్టమొదలు బాగుగవిద్య

వభ్యసించి యనంతరమే వివాహ మొనరించుకొనుట విధియైనట్లు స్పష్టమగుచున్నది. సత్యశాస్త్రములందెట్లు విద్యాధ్యయనముఁ జేసి పదంపడి వివాహముఁ గావించుకొనవలయునని కొమారులవిషయమై విధింపఁబడియున్నదో యటులే విద్యాధ్యయనానంతరమే పెండ్లియాడవలెనని బాలికలవిషయమైకూడ వేదమం దాజ్ఞాపించఁబడియున్నది. ఎట్లన

బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్

అథర్వ. కాం. 11. అను. 3. వ. 15.

బ్రహ్మచర్యమనఁగా జితేంద్రియతాపూర్వకమైనవిద్యాభ్యాసంబునలిపి కన్యవయోవంతుండగు బురుషునిగ్రహింపవలయునను నీమంత్రమువలనఁ గన్యతనయంతఁ దానేవరునిఁ బెండ్లియాడవలయుననుట సిద్ధమగుచున్నది. కావున వేదములందు విశ్వాసముగల దంపతులందఱుఁ దమకన్యలకుఁ దామే వివాహ మొనరించక కన్యకలు వారంత వారలే వివాహముఁ జేసికొనునట్లుచేయుట సముచితము. ఇఁకనిట కుమారీకుమారులెన్ని సంవత్సరముల యీడునఁ బెండ్లిఁ జేసికొనవలయునో యాలోచింతము. ఈవిషయమై దూరదర్శిత్వములేనికొందఱు.

అష్టవర్షా భవేద్గౌరీ నవవర్షా చ రోహిణీ
దశవర్షా భవేత్కన్యా తత ఊర్ధ్వం రజస్వలా.
మాతా చైవ పితా చైవ జ్యేష్ఠో భ్రాతా తథైవ చ
త్రయస్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం.

ఎనిమిదిసంవత్సరములకు గౌరియుఁ దొమ్మిదేఁడులకు రోహిణియుఁ బదియేండ్లకుఁ గన్యయుఁ బదియేండ్లుదాటినతోడనే రజస్వలయునగును. అట్టిరజస్వలయగుదానిఁ జూచినయెడలఁ దలిదండ్రులు సోదరులు మొదలగువారలు నరకమునకుఁబోవుదురని యీపైశ్లోకములయందలి తాత్పర్యమైయున్నది. ఈశ్లోకములు తాత్కాలికావసరముంబట్టి కల్పింపఁబడిన వనుటకెంత మాత్రము సందియములేదు. ఎందుచేతనన గౌరీరోహిణ్యాది పదములు పూర్వగ్రంథములందు గొన్నిటిలో బ్రాహ్మవయస్కలకేవాడఁబడియున్నవి. అదియటులుండ బ్రస్తుతకాలమందు బౌరాణికులు సయితము దమబిడ్డలకు వివాహమొనరించి వారెన్నిసంవత్సరముల యీడుగలిగియుండినను గన్యాదానమొనర్చితిమనియే వచింపుచుందురు. కానియెనిమిదేఁడుల బాలికకుఁ బెండ్లిజేసినచో గౌరీదానముజేసితిమనియు, దొమ్మిదిసంవత్సరములైన రోహిణీదానమొనరించితిమనియు జెప్పుటలేదు. ఎన్నియేండ్లబాలికయైనను గన్యాదానమనియే వచింపుచుందురు. కావున నిచటఁ గన్యాశబ్దముంగూర్చియే ముఖ్యముగ యోచింపవలయును. ఎంతపర్యంతము వివాహమాడకయుండునో యంతపర్యంతము స్త్రీకన్యకయనియే పిలువఁబడుననుటకనేక నిదర్శనములుకలవు.

కౌమారంబ్రహ్మచర్యం మేకన్యావాస్మినసంశయః

భార అను. అ 20.

మఱియునిట్లేశల్యపర్వముయొక్క 53 వ యధ్యాయమందుఁగూడఁ గలదు. వయసుమీరినస్త్రీ లిరువురుండిరి. పండ్లుమీఱినవనువీరలు కన్యలని మహాభారతమునఁజేర్కొనఁబడి యున్నారు నిక్కమాలోచించిచూచినయెడల.

ఋతుస్నాతా తుయాశుద్ధా సాకన్యేత్యభిధీయతే.

పరాశరమాధవసిద్ధాంతము.

అనియనుటచేత ఋతుస్నాతకే కన్యయనిపేరు. మాధవాచార్య కృతమైన పరాశరస్మృతియొక్క టీకయందు టీకాకారుఁడీ మహాభారతముయొక్క ప్రమాణము నిచ్చియున్నాఁడు చూచికొనుఁడు. అందువలనఁ బదియేండ్లబాలికయే కన్యయనఁబడదని స్పష్టమగుచున్నది. వివాహముగాకయుండు వారలేకన్యలు. మెండియు

"అష్టవర్షా" యనునీపైశ్లోకమందుఁ బదిసంవత్సరములు దాటినతోడనే బాలికలకు ఋతుధర్మమెంచఁబడి యున్నది ఇదియేవిధమునఁజూచినను నసంభవమే. ఎట్లనఁగా

రసాదేవస్త్రియారక్తం రజఃసంజ్ఞంప్రవర్తతే,

తద్వర్షాద్ద్వాదశాదూర్ధ్వం యాతిపంచాశత్ క్షయం.

సుశ్రుతం. సూత్రస్థా. అ. 14.

పండ్రెండుసంవత్సరములు గడచినతరువాతనే బాలికరజస్వలయగునని ధన్వంతరి సిద్ధాంతముఁజేసి యున్నాఁడు. నిజ

మాలోచించిచూడ రజస్వలలగుట కన్యకలయొక్క శారీరక ప్రకృతిననుసరించి యుండును. కొందఱుపండ్రెండవ యేటను, కొందఱు పదునాలుగు, మఱికొందఱు పదియైదుబదియారు సంవత్సరముల ప్రాయమందుఁగూడ ఋతుమతులగుచుందురు. పదియేండ్లుదాటి పదునొకండు సంవత్సరములు వచ్చినంతమాత్రమునఁ, బదియారుసంవత్సరముల పర్యంతము స్త్రీధర్మయుక్తలుగాని కన్యకలను ఋతుధర్మవతులనుట యెంతటిప్రమాద మనవచ్చును? ఇంతియకాదు. కన్యలుపదునాల్గుఁబదియారు యేండ్లవరకు రజస్వలలుకాక యుండినప్పటికి నట్టివారలు ఋతుధర్మవతులైరను నపరాధమునోపి నిరపరాధులగు మాతాపితరుల బలాత్కారముగ నరకమునకుఁ బంపుటంజూడ నిది పౌరాణికనాయక మహానుభావుల యిండ్లయందలి న్యాయమువలెఁదోఁచుచున్నది. ఈకపోలకల్పితములేనిజమైయుండుచో

త్రింశద్వర్షోవహేత్ కన్యాంహృద్యాంద్వాదశవార్షికీమ్.

మను. అ. 9

పండ్రెండుసంవత్సరముల ప్రాయమందుఁ గన్యలకుఁ బెండ్లిచేయవలయునని మనువేల విధించియుండును? ఈశ్లోకము సత్యయుగ విషయిక మందురేని నదియు సరిగాదు. ఎందుచేత నన మనువు చెప్పినవన్నియు వేదాజ్ఞలని మనుస్మృతియొక్క 2 వ యధ్యాయములోని 7వ శ్లోకము వలన విదితమగు

చున్నది. అన్నియుగములకు వేదమొక్కటే యగుటంజేసి త
దనుకూలంబులగుమనుస్మృతి విధానములుగూడ నన్నియుగము
లకుఁ గావలసివచ్చును. ఇఁక "కృతేతుమానవోధర్మః" అను
ప్రమాణంబున మనుస్మృతి సత్యయుగముకొరకే యనిపట్టు
బట్టుదురేని సత్యయుగమందు మనుజులులక్షలకొలఁది సంత్సర
ములుజీవించినట్లు మీరునమ్ముదురుగదా. అట్లగుచో వివాహ
మాడునప్పటికి నప్పటివారలకు వేలకొలఁది యేండ్లుగడచియుండ
వలయు. ఏలయన నూరేండ్లవయసుగల యీకలియుగమం
దు 5 లేక 6 సంవత్సరములకుఁ దక్కువయీడున నెచ్చటనువి
వాహములగుచుండుటలేదు. అనఁగా నూరేండ్లలో గొంచెమెం
చుమించుగ షోడశాంశమైన వయసునఁ జేయఁబడుచున్న వి-
ఈలెక్కననుసరించి లక్షలకొలఁది యేండ్లపర్యంతము జీవించు
కృతయుగంబున వేయిసంవత్సరములకు దక్కువయీడున వి
వాహమెంతమాత్రము నైయుండఁగూడదు. ఇఁకఁబదియేండ్లదా
టి పదునొకండువచ్చినతోడనే బాలిక రజస్వలయగునెడల మ
నుస్మృతిలోని 9వ యధ్యాయమందునుఁ గలియుగమునకుఁ
బ్రమాణమైన పరాశరస్మృతిలోని 7వ యధ్యాయంబునను
బం౹డెండు సంవత్సరముల వయసున వివాహముఁజేయవలయు
ననియున్నదికదా. ఈవాక్యముల వ్యవస్థయేమికావలయు? నిజ
మాలోచించి చూడనివియేవియు నమ్ముటకు యోగ్యములుగ

లేవు. ఎందుచేతననఁగా హిందువులకు మాననీయములైన యనేక గ్రంథములందు ఋతుమతులైన యనంతరమే కన్యలకు వివాహముచేయవలయునని విధింపఁబడియున్నదిగాదు.

పితా ఋతూన్ స్వపుత్ర్యాశ్చ గణయేదాదితః సుధీః
దినావధి గృహేయత్నాత్ పాలయేచ్చ రజోవతీం.

సం. పు. 21.

ఎన్ని పర్యాయములు ఋతుమతియగు నంతవరకు నింటనుంచికొని పాలించవలయునని విధింపఁబడియున్నదో యంతపర్యంతము దండ్రి తనకుమారిక రజస్వలయైనది మొదలుకొని లెక్కించుచు నెన్ని పర్యాయములు కావలయునో యన్నిమారులు ఋతుధర్మవతియైన యనంతరమే యామెకు వివాహముఁ జేయవలయునని సంస్కారకౌస్తుభమునందు లిఖింపఁబడియున్నది. తద్గ్రంథకారుఁడిందుల కశ్వలాయన ఋషివాక్యములఁ బ్రమాణముగ నిచ్చియున్నాఁడు.

కామమామరణాత్తిష్ఠేత్ గృహే కన్యర్తుమత్యపి
నచైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్.

మను. అ. 9.

ఋతుమతియైన దరువాతఁ గూడఁ గన్య బ్రతికి యున్నంతకాలము వివాహమాడకయ తండ్రి యింటనుండనగును గానిగుణవిహీనుండగు వరునకొసంగఁబడఁగూడదని మనుస్మృతి

విధించుచున్నది. మఱియు; హిరణ్యకేశియొక్క చాతుర్థిక కర్మమను పేరుగల గ్రంథమునుండియు ఋతుమతియగుకన్యకే వివాహము చేయుట యుక్తమని తెలుచున్నది మనఋషి మహార్షులెల్లరు నిందుఁగూర్చి యిదేవిధమున నొక్కమాదిరిగ వక్కాణించియుండ, స్వార్థులును, బూర్వాచారంబులనుపేరవతి నూతనకాలంబుననే యనేక కారణాంతరములచేతఁ గలిగిన నవీనాచారంబుల వదలుకొనినచోఁ బ్రాణములు పోవునని తలంచువారును నగు మూర్ఖపండితులు వచించు తెలివిమాలిన కల్పితవాక్యజాలంబులందగులువడి యిహపరలోకములకు రెండిటికిఁగూడఁ గొఱగాకుండఁజేయు బాల్య— — — లొనరింప నింకను నేలపాలుపడెదరు? ప్రతిమనుజుఁడు తనబిడ్డలకు వేదోపవేదవేదాంగాది సత్యశాస్త్రముల ననుసరించియుఁ బ్రత్యక్షాది ప్రమాణానుకూలంబుగను వివాహముసేయుటొప్పు. కన్యస్వయముగ వరుని వరించికొనవలయునని వేదమునందు విధించఁబడియున్నది చూడుఁడు.

కియతీ యోషా మర్యతో వధూయోః పరిప్రీతా పన్యసా
వార్యేణ.
భద్రా వధూర్భవతి యత్ సుపేశాః స్వయం సామిత్రం వను
తే జనే చిత్. ఋ. అ. 7. అ. 7. వ. 17.

పన్యసా- ప్రశంసనీయమైనట్టియు, వార్యేణ- మంచి

గుణములుగలట్టియు వధూయోః- వధువునభిలషించువాఁడగు, మర్యతాః మనుజునకు, కియతీ- యెటువంటి, యోషా- స్త్రీ, పరిప్రీతా- మంచిప్రీమాస్పదురాలు, భవతి- అగును? అను ప్రశ్నంబునకు యత్ - ఏ, భద్రా- కల్యాణియనఁగా సుఖము నిచ్చునదియు, సుపేశాః- మంచిరూపముకలదియు, జనేచిత్ - మనుజులందఱిలో, స్వయం- తనయంతదాను, మిత్రం- ప్రియ పతిని, వనుతే- యడిగికొనునట్టిదియునగు, సావధూ- ఆస్త్రీ, యే పతికత్యంతప్రియురాలగునని ప్రత్యుత్తరము. ఈమంత్రము వలనఁ గన్యస్వయంవర విధానంబున వివాహముఁ జేసికొనవ లయునసుట స్పష్టమగుచున్నదికదా. ఇంతయేల? తలిదండ్రు లు తమంతఁదామే బాలికాబాలకులకు బొమ్మపెండ్లిండ్లుచే యనగునని వేదమందెక్కడను లేదు. మరియు ఋగ్వేదమందు

వధూరియం పతిమిచ్ఛన్త్యేతి. ఋ. అ. 4. అ. 2. వ. 8.

కన్యయే వరుని కోరికొనవలయుననియు

యువంబ్రహ్మణే అనుమన్యమానా. అథ.కాం.14.అ.2.వ.11.

తరుణవయస్కుండగు వరుని గన్యవరించవలయునని యథర్వ వేదమందును,

త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతు మతీసతీ
ఊర్ధ్వం కాలాదే తస్మాద్విందేత సదృశం పతిం.

మను. ౯. 9

రజస్వలయైన దరువాత మూడుసంవత్సరముల పర్యంతము గన్యక వరు నన్వేషించుచుండి మూడేండ్లు దాటినఁ బిదపఁ దనకు సదృశుఁడగుమగనిఁ బొందవలయునని మనుస్మృతియందును,

త్రీణివర్షాణ్యుదీక్షేత కన్యాఋతుమతీసతీ
చతుర్థేత్వథ సంప్రాప్తే స్వయం భర్తారమర్జయేత్.
ప్రజానహీయతే తస్యారతిశ్చ భరతర్షభ!
అతో౽న్యథావర్తమానా భవేద్వాచ్యా ప్రజాపతేః.
భార, అను. అ. 44. శ్లో. 16. 17.

ఋతుమతియైన బిదపఁ గన్య మూడు సంవత్సరముల వరకు వరునికొరకు నిరీక్షించుచుండి నాలుగవయేటఁ దనంత దానే పెండ్లిఁజేసికొన వలయుననియు, నట్టికన్యయందుత్పన్నమగు సంతాన మకాలమృత్యువు వాతఁబడక యుండుననియు, నట్టికన్యక ఋతువు నిష్ఫలమే కాదనియుననగా వంధ్యాదిదోషము లాయువతికిఁగలుగవనియు, నిందులకు వ్యతిరేకముగ వర్తించుచో నామె పరమేశ్వరునెడల దోషియగుననియు భారతములో వ్రాయఁబడియున్నది. ఇదేవిధమున కృష్ణుఁడన్నివివాహముల నిషేధించుచు స్వయంవర విధానమే మంచిదని యట్టిదాని కనుజ్ఞ నిచ్చియున్నాఁడు.

ప్రదానమపికన్యాయాః పశువత్ కో౽నుమన్యతే

విక్రియం చాప్యపత్యస్యకః కుర్యాత్ పురుషోభువి.
భార. ఆది. అ. 221. శ్లో. 4.

పురుషుఁడు తనకుఁదానే కన్యకు వివాహ మొనరించి తాను గన్యాదాన మొనరించితినను కొనుచున్నాఁడు. అట్లుచేయుట కన్యాదానముగానేరదు కాని కన్యా విక్రయమగును. మనుజుఁడెట్లు పశువును దనకిష్టమైన వానికి నిచ్చివేయునో యటులే కన్యనుఁగూడఁ దనమనస్సునకు వచ్చినవానికి నొసంగును. ఇట్లొనరించుట వేదమునకును, సదాచారమునకును, న్యాయమునకును నత్యంత విరుద్ధమైయున్నది. ఇది సృష్టిక్రమమునకుఁ గూడఁ బ్రతికూలమే కావున మాతాపితరులు తాము తమ బిడ్డలకుఁ బెండ్లిండ్లుచేయుట మాని కన్యావరులు స్వయముగ వివాహమాడునట్లు చేయవలయునని కృష్ణుఁడు వచించియున్నాఁడు. మంచిచెడ్డలెఱుఁగని బాలికాబాలకులకుఁ దలిదండ్రులు తామే కన్యావరుల యనుమతి లేశమాత్రమైనఁ గైకొనక వివాహములఁ చేయుట మహానర్థదాయకము. ఇట్టి విధానములు వేదవిరుద్ధములని యింతకుముందే వ్రాసియుంటిమిగదా! ఇఁక నివి సదాచారమున కెట్లు ప్రతికూలములో వ్రాసెదము. మనయార్యగ్రంథావళిం జూచుటచేఁ బూర్వకాలమందలి ఋషులు, మహర్షులు, మహాత్ములు లోనగు జనులెల్లరుఁ దమకుమారితలకు స్వయంవరవిధానముననే పెండ్లిసేయు

చు వచ్చినట్లు విదితమగుచున్నది. జనకుఁడు సీతకుస్వయంవర విధిఁ బెండ్లిఁగావించినట్లు రామాయణమందు లిఖింపఁబడియున్నది. ఆస్వయంవరము సహితము సీతనుఁ బతితోఁగూర్చఁదగిన యీడువచ్చిన తరువాతనే చేసెఁగాని యతిబాల్యమందుఁ గాదు. చూడుఁడు.

పతిసంయోగసులభం వయోదృష్ట్వాతు మేపితా.

వా. రా. అయో. స. 118. శ్లో. 34.

పతితోడ సహవాసము చేయుటకుఁ దగిన వయసు వచ్చిన పిదప నాతండ్రికి నావివాహముం గూర్చిన చింతకలిగెనని సీతయే యత్రిముని భార్యయగు ననసూయతో వచించినట్లును,

తాంతు తేజస్వినీం కన్యాం రూపయావన శాలినీం
వ్యావృణ్వన్ పార్థివాః కేచి దతీ వస్త్రీగుణైర్యుతామ్.

భార. ఆది. అ. 12.

కుంతీస్వయంవరముఁగూర్చి వర్ణించు సందర్భమునఁ దేజస్వినియు, నత్యంతరూపవతియు, నిండుజవ్వనియు, సమస్త స్త్రీగుణములతోఁ గూడుకొన్నదియునగు గుంతీ కన్యం బెండ్లియాడవలయునను గుతూహలంబున రాజులనేకులు పరివేష్టించియుండిరిగాని పాండురాజునే యుత్తమునిగ భావించి కుంతి యాతనినే వరించెనని భారతంబునను,

ససమీక్ష్యమహీపాలః స్వాంసుతాంప్రాప్తయౌవనాం
అపశ్యదాత్మనః కార్యందమయంత్యాః స్వయంవరం

భార. వ. అ. 53

యౌవనము వచ్చినతరువాత దన కుమారియగు దమయంతింగాంచి యప్పుడామెకుస్వయంవరము చేయనగునని భీముఁడు యోచించెననియు,

వైదర్భీంతు తథాయుక్తాం యువతీంప్రేక్ష్యవైపితా
మనసాచింతయామాసకస్మైదద్యామిమాం సుతాం.

భార. వ. అ. 96.

లోపాముద్రతరుణావస్థనొందిన యనంతరమామెతండ్రి యీకన్యక నెవరికొసంగువాఁడనో యని చింతించినట్లును, త రువాతఁ గొంత కాలమున కీమె నగస్త్యుఁడు పెండ్లియాడెను.

సంప్రాప్తయౌవనాంపశ్యన్దేయాందుహితరంతుతామ్.

భార. ఆది. అ. 171.

తపతియనుకన్యక సంపూర్ణయౌవనమందినపిదపనే వివాహమాఁడెననియు,

సశీలయన్దేవయానీంకన్యాంసంప్రాప్తయౌవనాం

భార. ఆది. అ. 76.

శుక్రాచార్యుని కూతురైన దేవయాని యౌవనమం దిన యనంతరమే యయాతిం బెండ్లిచేసికొనెననియుభారతమం

దు వ్రాయఁబడియున్నది. బ్రహ్మర్షికూతురగు దేవయాని యొక్కయు, కుంతిమొదలగు రాజర్షికన్యకలయొక్కయు వివాహముల నిదర్శనములుగ దీసికొని పూర్వకాలమున సమస్తఋషికన్యకలావిధినే వివాహమాడుచుండినట్లు తెలిసికొనుఁడు. ఇంతియకాదు. బ్రహ్మర్షి రాజర్షుల కుమారీకుమారులనేకులు స్వయంవరవిధానమునఁగూడఁ బెండ్లియాడకబ్రతికియున్నంతకాల మట్లేయుండుచువచ్చిరి. ఎట్లనఁగా

అత్రైవబ్రాహ్మణీసిద్ధా కౌమారబ్రహ్మచారిణీ
యోగయుక్తాదివంయాతాతపః సిద్ధాతపస్వినీ.
బభూవశ్రీమతీరాజన్ శాండిలస్యమహాత్మనః
సుతాధృతవ్రతాసాధ్వీ నియతా బ్రహ్మచారిణీ.
సాతుతప్త్వాతపోఘోరం దుశ్చరం స్త్రీజనేనహ
గతాస్వర్గంమహాభాగాదేవబ్రాహ్మణపూజితా.

భార. శల్య అ. 54.

ఇదేప్రదేశంబున శాండిల్యఋషియొక్కకూతురగుధృతవ్రతయను పేరుగలకన్య యాజన్మబ్రహ్మచర్యవ్రతమవలంబించి యింద్రియనిగ్రహణమున విద్యాసత్యభాషణాది తపంబులొనరించుచు, విద్వాంసులచేతఁగూడ సత్కారములం గొనుచు యోగంబున నుత్తమలోకంబుఁగాంచెనని లోమశుఁడనుఋషి యుధిష్ఠిరునితోఁడ వచించియుండె. వెండియు

భరద్వాజస్యదుహితారూపేణాప్రతిమాభువి
శ్రుతావతీనామవిభోకుమారీ బ్రహ్మచారిణీ.

భార. శల్య. అ. 49.

భరద్వాజఋషికుమారికయగు శ్రుతవతియను పేరంబ రగుకన్య మరణపర్యంతము వివాహమాడక యుండెననియు,

సాహంతస్మిన్కులేజాతా భర్తర్యసతిమద్విధే
వినీతామోక్షధర్మే షుచారామ్యేకామునివ్రతాం.

భార. శాం. అ. 32

రాజువలన క్షత్రియకులంబున జననమంది గురువుదగ్గర విద్యాభ్యాసమొనరించి విద్యాదిగుణంబుల నాకుఁదగిన వరుఁడు దొరకనికారణమునసన్యాసాశ్రమము నవలంబించితినని శులభయనుపేరుగల స్త్రీ) జనకునితోఁడఁజెప్పినట్లును భారత మందు లిఖింపఁబడియున్నది. ఇదేరీతిగార్గి, బడబా మొదలగు వారెల్లరు బ్రతికియున్నంతకాలము బ్రహ్మచారిణులుగ యుండిరి. పురుషులలో సనక,సనందన, నారద, పరశురామ, హను మ, భీష్మ, శుకాదులాజన్మబ్రహ్మచారులగుట లోకవిఖ్యాతమేక దా! సంపూర్ణమగుయువావస్థయందు స్వయంవర విధానం బున బెండ్లియాడిన కుంతిమొదలగు జవ్వనులకు జనించిన యుధిష్ఠిర భీమార్జునాదులెట్టి ధర్మాత్ములెట్టిశూరవీరులైన మస్తభూమండలముఁ దమస్వాధీనమం దుంచికొనఁగలిగినవా

ట్టితేజోవంతులై యుండిరో యోచింపుఁడు. మఱియు మరణప ర్యంతముఁ బెండ్లియాడక నియతబ్రహ్మచర్యంబు సలిపిన గార్గిలోనగువారలయు శుకసనకహనుమభీష్మాదులయు ప్రతి భా విశేషం బెంత యుత్కృష్టమైనదిగనుండునో తెలియనివా రెవరుకలరు? సనకాదులఁగూర్చి చరిత్రలమూలమున మనము తెలిసికొనుచున్నాము. కానివర్తమానకాలంబున సంపూర్ణ బ్రహ్మచర్యముఁ బాలించిన శ్రీస్వామిదయానందసరస్వతియొ క్క ప్రభావముఁ గనుఁగొనుఁడు. నియతబ్రహ్మచర్యమువలన నే యామహర్షి ప్రస్తుతస్థితియం దార్యావర్తముయొక్క యు న్నతిమార్గముఁ గనఁబరచి యున్నాఁడు.

పైనవ్రాసిన మహాత్ములతోఁడఁ బ్రస్తుతకాలమందలి బాలికాబాలకుల సరిపోల్చిచూచుకొనుఁడు. వారలప్రభావ మెట్టున్నదియు బాల్యావస్థయందు వివాహమాడిన దంపతు లకు జనించిన వీరిప్రభావ మెట్లున్నదియుఁ బక్షపాతవిహీనమైన బుద్ధితో యోచింపుఁడు. బాల్యవివాహము న్యాయవిరుద్ధమను ట కావంతయేని సందియము లేదు. లేశమాత్రమైన జ్ఞానముఁ గలిగియుండని పసితనమందు జన్మమంతటికొఱకు స్త్రీకిఁబురు షుని, బురుషునిమెడకు స్త్రీనిఁ గట్టుట మహాపాతకము. బాలికాబాలకుల యిష్టముఁ గైకొనక కేవలము తమయానం దముల కాసఁజెందియు, కుమారీకుమారుల వివాహముల వీ

క్షించకయె మృతినొందుదురోయను భయంబుననుఁ జిన్నతన మందే తలిదండ్రులు తమబిడ్డలకుఁ బెండ్లిండ్లుచేయు ఘోరకి ల్బిషమున కొడిగట్టుచున్నారు. న్యాయమునకిల్లుచేయుటకు మాతాపితరులకెంతమాత్ర మధికారములేదు, తలిదండ్రులు హఠమూని బలవంతముగఁదమసంతతులకుఁ బసితనమందే వి వాహము లొనరించుటవలన నెదిగినతరువాత వారికివిరోధ ములు కలిగి యట్టియుపద్రవంబులచే వారలు మరణపర్యంత ము దుఃఖమే యనుభవించవలసి వచ్చుచున్నది. ఇంతటియ న్యాయము వేరొండేదియులేదు. ఇఁకబాల్యవివాహము సృష్టి క్రమమున కెట్లువిరుద్ధమనఁగాఁ బ్రపంచమందలి సమస్తపదార్థ ములుఁబరిపక్వ దశనందిన యనంతరమే ఫలదాయకములగు చున్నవికాని యపక్వదశయందుగాదు.ఇందులకొక వృక్షమును దృష్టాంతముగఁ గైకొనిచూడుఁడు. వృక్షముయొక్క సకలావ యవములుఁ బరిపుష్టినొందినతరువాతనే యదిఫలించుఁగాని యంతకుఁదక్కువ తరుణమందెన్నఁటికి ఫలింపదు. అట్లేసంతా నములను ఫలంబుల నుత్పన్న మొనరించు వృక్షములనందగిన మానవుల సమస్తావయవంబులుఁ బూర్ణములుఁ బ్రౌఢములు, బుష్టములునైన యనంతరమే వారికి వివాహమగుట యోగ్య మగుఁగాని వేరొండువిధమైన వ్యర్థమేయగు. ఈకారణముననే బాల్యవివాహము సృష్టిక్రమవిరుద్ధము. ఇఁకవివాహమనినఁనో

స్త్రీపురుషు లిరువురుఁ బరస్పరము వారివ్యామోహంబుదీరఁ గామము శాంతింపఁజేసికొనుటకుఁగాదు. కేవలముసంతానముకొరకే వివాహము. ఎట్లనఁగా

ప్రజాయైత్వానయామసి. అ. కాం. 5. అను. 5. వ. 25.

ఓ కాంతా! సంతానోత్పత్తి నిమిత్తమే నే నిన్నుఁగైకొనుచున్నానని యథర్వవేదమందును.

ప్రజానార్థం స్త్రియఃసృష్టాః. మను. అ, 9.

స్త్రీలు సంతానోత్పత్తినిమిత్తమేయని మనుస్మృతియందును వ్రాయఁబడియున్నది. ఇందుచేతఁ గేవలము సంతానప్రాప్తికొరకే వివాహముచేసికొనవలయుననుట సిద్ధమగుచున్నదిగదా. తత్వమెరుఁగని పామరజనసమూహంబులు దక్షిణదక్షిణభూమండలమందలి సమస్తవిద్వాంసులు, బుద్ధిమంతులుమున్నగువారు వివాహము సంతానోత్పత్తి కొరకేయందురుగాని కామశాంతికని యెన్నఁడువచింపరు. కావున స్త్రీపురుషులెప్పుడు సంతానోత్పత్తిచేయుటయందు సమర్థులగుదురో యప్పుడేవివాహమాఁడుటుచితముకాని యసమర్థులుగ నున్నయప్పుడుకాదు. బాల్యమందు వివాహములు చేయఁబడుచుండుటచే నింకననేకప్రకారంబులగు హానికలుగుచున్నది. అందుమొట్టమొదటిదివిధవలవృద్ధి మితిమీరిపోవుట. ఎందుచేతననఁగా శైశవావస్థయందుమొదలుకొని నేఁటివఱకు యిందుమితిమీరి కౌమారదశయందున్న

గౌమారమందుఁ జనిపోవునంతమంది కిశోరప్రాయమందును, గిశోరప్రాయంబున మరణించునంతమంది యౌవనంబునను మరణింపరు. ఈవిషయము జననమరణముల లెక్కలఁజూచుట వలనవిశదముకావచ్చును. మఱియు సృష్టిక్రమవిధానముఁజూచినను నిదేరీతిసిద్ధమగుచున్నది. ఎట్లనఁగా నొకమామిడిచెట్టును జూడుడు. దానికెంతపూతపట్టునో యంతయుఁగాయలు కానేరదు. మొదలుపూవులె యతివిస్తారముగ రాలిపోవును. వానికంటెఁదక్కువగఁ బిందెలును, నంతకన్నఁ దక్కువగఁగాయలును, నంతకుమఱియుతక్కువ పండఁబారుకాయలును రాలును. కారణమేమన మామిడిమొదలగుపండ్లుగాని మనుష్యాదిప్రాణులుగాని తరుణదశఁ బొందుగాలఁదిఁ బ్రౌఢత్వముగాంచుచుండుటచేత శీతాతపవాతంబులవలనఁ గలుఁగు యుపద్రవములు వానినంతగ బాధించఁజాలవు. తరుణావస్థనొందుటవలన వయోవంతులందు శీతాతపవాతములచేఁ గలుగుహానిఁదగురీతి సహించుకొనుసామర్థ్యముండును. బాలకులు కోమలాంగులగుటచేత శీతాతపములవలనఁ గలుగుబాధలసహింపనోపరు. ఇంతియకాక తరుణవయస్కులంబోలి బాలురు సంయమాదులమూలమున స్వశరీరంబుల యథావిధి రక్షించుకొనసనేఁజాలరు. ఇట్టివేయగుననేక కారణంబులచే బాల్యమందుబాలురు విస్తారముగ మృతినొందుచుందురు. వివాహితుఁడగు బాలుఁ

డొకఁడు మరణించినయెడల నతనిమెడంగట్టఁబడిన బాలికజన్మ
ము భ్రష్టమైనటులేగదా.

బలవానింద్రియగ్రామోవిద్వాంస మపికర్షతి,

అనుమనువాక్యముననుసరించి యాపెనిమిటిపోయిన
బాల యాజన్మము నింద్రియములజయించి యుండనేరనికార
ణమున రెండుకుటుంబములవారలకుఁ గళంకముంగల్పించి ధ
నము మొదలగు నింటిలోనిపదార్థములంగైకొని యేహిందువు
నో, మహమ్మదీయునో, ఈసాయినో, మూసాయినో లేక యేక
సాయినో తగులుకొని పారిపోవుటసంభవించుచున్నది. కాని
చో వేశ్యావృత్తినవలంబించి యేదోయొకపట్టణంబునఁ బీఠ
మువైచికొని యుభయకులంబులవారికిఁ దలవంపులు కలుగఁ
జేయుటగాననగుచున్నది, మరియునట్టివధూవరుల వివాహము
లందు వ్యయపరచబడు తత్సంబంధులయొక్క ద్రవ్యమువ్యర్థ
మైపోవుచున్నది. బాల్యవివాహమువలన బాలికాబాలకుల
బ్రహ్మచర్యమునష్టమగును. మరలవారలు బ్రహ్మచర్యమెప్ప
టికిఁబాలింపనేరరు. బాల్యమందేవివాహమాడుటవలన నట్టివా
రికిఁ జదువునందు మనసు కుదురదు. బాలదంపతులు వైవాహి
కమంత్రములయందలి యర్థముగ్రహింపఁ జాలకపోవుటచే గృ
హస్థాశ్రమముయొక్క కర్తవ్యములనుండి వంచితులైయుండు
టకలుగుచున్నది. కన్యావరుల పరస్పరసమాధానంబున వివా

హములు జరుపఁబడకపోవుటవలన దంపతుల కన్యోన్యముఁబో రాటములు సంభవించుచుండును, అందులకు కారకులు తమ మాతాపితరు లేగదా యనుతలఁపున బాలికాబాలకులు తమ జననీజనకులయెడలఁగూడ ద్వేషమూనుచున్నారు. చిన్నచిన్న పిల్లలకుఁ బెండ్లిండ్లు చేయుటచేత బాల్యమందే బిడ్డలుజనించుట వలన వారుతమశిశువులను సరియగువిధానంబున రక్షించుకొ నుచుఁ దగురీతివారికి శిక్షణము గావింపఁజాలకయున్నారు. తలిదండ్రులే బాలికాబాలకులైయుండ నిఁకఁదమసంతానము లకెట్లు పోషణపాలనరక్షణాదులొనరింపఁగలరు? బాలదంపతు లు కాపురముచేయునపుడు గృహకృత్యముల సరిగఁజేసికొనఁ జాలరు. అన్నియుఁ నటులుండ బాలకులకుఁ బండ్రెండుసంవత్సర ములు మొదలుకొని యిరువదినాలుగుసంవత్సరములవరకు వి ద్యాభ్యయనంబున కతిముఖ్యమైనకాలము. ఒకవైపువిద్యనే ర్చుకొనుటయందుఁ బూర్ణపరిశ్రమముఁజేయుటచేత దేహమం దలిశక్తిమిక్కుటముగ వ్యయమగుచుండును. రెండవది పశు ధర్మముమూలమున నమూల్యమైనవీర్యమును నాశనమగుచుం డును. ఈప్రకారముగనొకేసమయమందు రెండుప్రకారముల శరీరమందలిశక్తిపోవుటవలన మనదేశవాసులకనేకగతుల హా నికలుగుచున్నది. కట్టా? నేఁడుమనదేశమునకుసంభవించియున్న దుర్దశంగూర్చి యెవ్వరైననించుక వచింపఁబూనినయెడల నవి

ద్వాంసులగువారలు వినన్నై నవినరుసరిగదా యుత్తమవిద్వాంసులు, బుద్ధిమంతులు, సువక్తలు, పత్రికాసంపాదకులు, దేశకాలజ్ఞులు, అనుభవశాలులు, తత్వవేత్తలు మొదలగువారు సయితము దేశముయొక్క దీనదశవిషయమై సరియగుధ్యానమూనకయున్నారు. మనహిందూదేశమందలి ప్రత్యేకప్రాంతమును దృష్టిసారించిచూచినచో నేతద్దేశవాసులు ఎండిపోయినశరీరంబులతో దుర్బలులు, నిస్తేజులు, హ్రస్వగాత్రులునై యెముకలుబైటఁబడి కన్నులులోపలికిఁ బీకికొనిపోయియుండ, క్షయాదినానావిధరోగములందగులువడి వెయ్యిమందిలో తొమ్మిదివందల తొంబదితొమ్మిదిమంది యకాలమృత్యువు నోటంబడి పోవుచుండుటయేకాననగుచున్నది. శారీరకదశనటులుంచిమానసికదశవిషయమైచూచినయెడల నిక్కడివారలందు బుద్ధిహీనతయు, జ్ఞానశూన్యతయు, విద్యావిషయంబును గేవలము విచారహీనతయు, నిరర్థకశుకఘోషమాత్రంబును హృదయదౌర్బల్యము, పరాధీనత మొదలగుదోషములనేకములు పరిపూర్ణముగనుండుట విదితమగుచున్నది. ఇఁకనాచరణములు, నీతిమున్నగువాని విషయమైచూచిన జనులందు మిక్కుటముగ నబద్ధము, ఛలము, కపటము, పాఖండము, దౌష్ట్యము, ధృష్టత, దొంగతనము, పోకిరితనము, వెకలితనము మొదలుగాగల వివిధవిధములైన దుర్మార్గములు వ్యాపించి

యున్నవి. భారతవర్షమందలి యిట్టివ్యవస్థవీక్షించి విద్వాంసుఁడగునతఁడిందులకుఁ గారణమారయఁ బ్రయత్నించుచున్నాఁడు.

కారణాభావాత్కార్యాభావః   వైశే. అ. 4. ఆ. 1

కారణములేక కార్యమెన్నఁటికిఁ గానోపదుగాన నీదేశమునకిట్టిదశకలుగుటకుఁ గూడనేదేనిగారణముండితీరవలయు. చూడంజూడ నీదేశమునకిట్టి దుర్దశకలుగుటకు గారణములనేకములుండవచ్చునుకాని మూలకారణముమాత్రము బాల్యవివాహమేయని స్పష్టముగఁ దేలుచున్నది. దీనినిసమస్తవిద్వాంసులు తెలిసియేయున్నారు. ఎంతపర్యంత మీభయంకరరోగము భారతవర్షమునుండి వెలువడిపోవకయుండునో యంతపర్యంతము భారతీయులకెంతమాత్రము సౌఖ్యముకలుగనేరదు. కావుననిట్టిరోగమును వెడలనడచుటకొరకు మనమందరముఁబురుషార్థములఁ జేయవలయును. వివాహము సంతానోత్పత్తికొఱకేయనియింతకుముందు వ్రాసియుంటిమిగదా? దంపతులట్టి సంతానోత్పత్తి కొన్నిసంవత్సరములయీడున యోగ్యులగునదియు వైద్యశాస్త్రముననుసరించి నిర్ణయముఁజేసికొనవలయును. ఎందుచేతననఁగా నీవిషయమువైద్యమునకే సంబంధించియున్నది. వైద్యమునకు సంబంధించినవిషయమును స్మృతిననుసరించి నిర్ణయించుకొనుటెన్నఁటికి సరికాదు. ఒకవేళ వైద్యముగూర్చియు స్మృతులయందుండిన, నవి ప్రధానవై

ద్యదమునకు వ్యతిరేకముగనుండుచో నట్టిస్మృతియందలి విష యములఁగూడ నమ్మఁగూడదు. వానివానివిషయములలో సమస్తసత్యశాస్త్రములు ప్రమాణభూతములును గార్యదము లును నై యున్నవి. అందులో ముఖ్యముగ వైద్యకవిషయము ప్రత్యక్షముగఁ గనుబడుచున్నది. వైద్యగ్రంథమందా కానొక యోషధిదినుటవలన నోరుచేదెక్కునని వ్రాయఁబడియుండు ననుకొనుఁడు. అట్టిదానిందినుటచేత నోరుచేదెక్కియేతీరును. ఆయోషధి వలన గలిగినచేదును బాపుకొనుట కెన్నిస్మృత్యు క్తములగు ప్రాయశ్చిత్తములఁ జేసికొన్నను వైద్యశాస్త్రోక్త మైన యోషధికటుత్వము లేశమాత్రమైనఁదరుగదు ఇదేప్ర కారముశరీరమునకు సంబంధించిన వివాహాదివిషయములలో వైద్యశాస్త్రమునకు విరుద్ధముగ స్మృతులననుసరించి నడచి కొనునట్టిమనుజుఁడు కృశించి, దుర్బలేంద్రియుఁడై యల్పవయ సునందే యకాలమరణమొందుట మొదలగుననేకదుఃఖములకు భాగియగుచుండుటగాననగుచున్నది. ఇది యిటులుండ వైద్య శాస్త్రములరచియించినవారలు సయితము పరోత్కృష్టులగు మన మహర్షులేమైయుండ నట్టి మహానుభావులయొక్క యాజ్ఞ లకు వ్యతిరేకముగ నడచుకొనుటవలన మనకుహానియేలకలుగ కపోవును? మన హైందవసోదరులు ధన్వంతరి నీశ్వరావతా నమనినమ్ముచుండియు నట్టివానివాక్యములకు విరుద్ధములై

యాచరణంబుల నేల యొనరించుచున్నారో తెలియకున్నది. ఆర్యసోదరులారా! మిమ్ముమరియొకమారు ప్రార్థించెదము. సంతానోత్పత్తిమొదలగు శారీరకవిషయములయెడల జరకశుశ్రుతాది విధులప్రకారము జనులునడచుకొనులాగున మీరు కృషిఁజేయుఁడు. ఈవిషయమై ధన్వంతరి మొదలగు వైద్యవేత్తలసమ్మతిప్రకారము

అథాస్మై పంచవింశతి వర్షాయషోడశవర్షాం పత్నీమావహేత్ పిత్ర్యధర్మార్థకామాః ప్రజాః ప్రాప్స్యతీతి.

సుశ్రు. శా. అ. 10

ఇరువదియైదుసంవత్సరముల పురుషునకును బదియారు సంవత్సరముల కన్యకను వివాహముకావలెననియు, నట్టిదంపతులకు జనియించుసంతానమే మాతాపితరుల సేవచేయుచుండుటయు, ధర్మార్థకామమోక్షంబుల సంపాదించుకొనుటయందును సామర్థ్యముకలిగియుండుననియు సుశ్రుతమున వ్రాయఁబడియున్నది. కావుననట్టియవస్థయందు

అసగోత్రా మాతురసపిండా. గోభి. గృ. ప్ర. 3. కా. 4

తల్లికిసంబంధించిన యారుతరములవారియొక్కయు, జనకగోత్రీకులయు గన్యకువదలి

బుద్ధిరూపశీలలక్షణ సంపన్నామరోగాముపయచ్ఛేత్.

అశ్వ. గృ. సూ. అ. 1. ఖం. 5.

బుద్ధిమతియు, రూపవతియు, శీలవతియు, సులక్షణయు క్తయు. రోగరహితయునగు కన్యకం బెండ్లియాడుట యోగ్యము. వధూవరులువారివారి రూపగుణకర్మస్వభావంబులఁ బరస్పరముఁ బరీక్షగావించుకొని వివాహముచేసుకొనవలయును.

సదాగృహీసుఖం భుఙ్క్తే స్త్రీలక్షణవతీయది
తస్మాత్ సుఖసమృద్ధ్యర్థమాదాలక్షణమీక్షయేత్.

గోభి. గృ. ప్ర. 2 కాం. 1. 2 వ సూత్రకారిక.

పురుషునకు లక్షణవతియగు స్త్రీలభించినయెడల నట్టియతఁడెల్లప్పుడత్యంత సౌఖ్యమునేయనుభవించుచుండుగాన మొదలుకన్యకయొక్క లక్షణములఁ బరిశీలించి వివాహమాడుటుచితము. ఇటులే కన్యకయు వరునిలక్షణములఁ బరీక్షించవలయును.

యయోరేవసమంవిత్తం యయోరేవసమంకులమ్
తయోర్మైత్రీవివాహశ్చనతుపుష్ట విపుష్టయోః

పంచ తంత్రం. 2.

అనుపంచతంత్రవచనానుసారము విత్తమందుసమానులు నేకకులమువారలునగు కన్యావరులకే పరస్పరముమైత్రియు వివాహమునుగావలయును. ఇతరులకు విరుద్ధముగవిపరీతగుణకర్మస్వభావకుల విత్తాదులు గలవారలకు వివాహసంబంధముకలిగిన నట్టివారలు దుఃఖభాగులగుదురు. కావునసమాన

ధర్మములు గలవారలకే పరస్పరసంబంధముకలుగుట శ్రేయస్కరము. ఇక్కాలంబున మూఢులుకొందరెనిమిదియేండ్లబాలిక నరువదిసంవత్సరముల ముదుసలికొసంగి వివాహముచేయుచున్నారు. ఇదిమహానర్థదాయకము. ఇంతియకాక స్త్రీపురుషులకనేక వివాహములగుటయుఁగూడదు. ప్రతి స్త్రీ పతివ్రతాధర్మమును, ప్రతిపురుషుఁడేకపత్నీవ్రతమును బాలించవలయును. ఒకభార్యబ్రతికియుండ రెండవభార్యను బురుషుఁడును, మగఁడు బ్రతికియుండ రెండవవానిస్త్రీయుఁ జేసికొనఁగూడదు. విశేషనిమిత్తములేమియులేక స్త్రీపురుషులు ద్వితీయవివాహంబులఁజేసికొనుట వేదవిరుద్ధమును మహాహానికారకమునునైయున్నది. మఱియు

చక్రవాకేవదంపతీ అథ. కాం. 14. అను. 2. వ. 13.

చక్రవాకీ చక్రవాకంబులజంటంబోలి స్త్రీపురుషులు గవగూడియుండవలయుఁగాని యొకతెగాదని మరియొకర్తును బురుషుఁడును, మరియొకపురుషుని స్త్రీయుఁ జేపట్టఁగూడదు. అనేకవివాహములఁ జేసికొనుటవలన శరీరబలము నశింపనల్పాయువులగుటయు విద్యాద్యుత్తమగుణరహితులై యనుదినమునునింటఁబోరాడుకొనుచు దరిద్రులై బలహీనులగు సంతానములంబడయుచు జనులు పరోపకారశూన్యులై యసభ్యతమొదలగు ననేకోపద్రవంబులకు లోనుగావలసివచ్చును.

శిష్టాచారము ప్రకారము జూచినను భార్యయొక తె బ్రతికియుండ వంధ్యాదికారణము లేమియు లేక పురుషుడు రెండవభార్యం బెండ్లియాడుట నిషేధించబడినటులే గానవచ్చుచున్నది.

కృతదారోస్మిభవతి భార్యేయందయితామమ
త్వద్విధానాంతునారీణాం సుదుఃఖాససపత్నతా.

వా. రా. అర. సర్గ. 17.

శూర్పణఖ తన్నుం బెండ్లియాడుమని రామునడుగ న తడామెతో "నేనువివాహమాడియున్నాడను, చూడుమిదే సీతనాకడనున్నది. ఒకభార్యంగలిగియుండి మఱలరెండవ స్త్రీని బెండ్లియాడుటవలన సపత్నతయన సీతకుదుఃఖము సంభవించుగాన బురుషుడనైన నాకుంగూడదుఃఖము కలుగు" ననివచించియుండె. ఇట్టిశిష్టాచారములుండుటంజేసి ప్రాచీన కాలమందు విశేషకారణము లేమియులేని తరి నొక్కవివాహమే చేసికొనుచుండినటుల విదితమగుచున్నది. ఇంకనిప్పుడు వివాహశబ్దముయొక్క భావార్థమును, వివాహముంగావించుకొనుటయొక్క యావశ్యకతంగూర్చియుసంక్షేపముగ నిరూపణము జేసెదము. వి యుపసర్గగాంగల వహ అను ప్రాపణే ధాతువుతో ఘఞ్ ప్రత్యయము చేరుటవలన వివాహశబ్దమే ర్పడును. సంపూర్ణమగు బ్రహ్మచర్యపాలనంబున విద్యాద్యుత్తమ గుణసమేతులై యువావస్థయందు వైదిక లౌకిక నియ

మముల ననుసరించి కుమారీకుమారులు గావించుకొను పాణి గ్రహణరూపమైన సంబంధవిశేషమే వివాహమని పిలువఁబ డుచున్నది. వివాహము లేనియెడల సంతానోత్పత్తియు, సంతానసంగోపనాది గృహాశ్రమముయొక్క కార్యంబులును, మనుష్యులకుఁ దన్మూలమునఁగలుగు సౌఖ్యంబులును సమకూరఁ జాలవుగాన వివాహము చేసికొనుట యావశ్యకము. వేదములో వైవాహిక మంత్రములందుఁ జెప్పఁబడిన నియమముల ననుసరించి పెండ్లియాడుట యోగ్యము. ఆనియమములఁ గూర్చి ఋగ్వేదములోని యెనిమిదవ యధ్యాయమందును, నథర్వ వేదముయొక్క పదునాలుగవ కాండంబునను, వ్రాయఁబడియున్నది. మనమిద్దరమెంతకాలము బ్రతికియుందుమో యంతకాలము ఛలకపటాది సమస్త దుర్వ్యవహారంబులమాని పరస్పరముఁ బ్రీతికలిగి నడుచుకొందుముగాక యనియు, గృహాశ్రమ కార్యములందు బద్ధులమై యేప్రాణికిఁగాని పీడఁ గలిగించక తదాశ్రమ కార్యములవలనఁ బ్రపంచమున కుపకారముఁ జేయుటకొరకు శక్తికొలఁది రేయింబవళ్లు ప్రయత్నంబులఁ జేయుచుందుముగాక యనియు వధూవరులన్యోన్యముఁ బ్రతిజ్ఞలఁ జేసికొనుటయే యీమంత్రములందలి భావము.

మనపూర్వీకులు వివాహవిషయంబున నాలోచించినది కేవల మొక్క కన్యావరులయొక్క యారోగ్యతా ప్రియముల

ంగూర్చి మాత్రమే కాదు. ఏయేపదార్థములుండుటవలన దంపతులకు లాభమును లేకపోవుటచే హానియు గలుగునో, యెయ్యవి లేనిచో గృహస్థాశ్రమముయొక్క నిర్వాహకము గానేరదో, యట్టివానినెల్లఁ దగురీతియోచించి తెలిసికొని పీఠ రాగులైన యమ్మహాత్ములు దాము కనుఁగొనినవానిఁ బరోప కారదృష్టితోఁడ లోకమునకు స్పష్టముగ నుపదేశముచేసియు న్నారు. ఎట్లనఁగా,

నగృహంగృహమిత్యాహుర్గృహిణీ గృహముచ్యతే
తయాహిసహితస్సర్వాన్ పురుషార్థాన్ సమశ్నుతే.
గోభి. గృ. ప్ర. 1. కాం. 2. సూ. 15.

పురుషుఁడెప్పుడు వివాహమాడునో యప్పుడే గృహస్థుఁ డగును. ఎప్పుడు గృహస్థుడగునో యప్పుడేయతనికి నానావిధ పదార్థములతోఁడ నవసరమును గలుగునుకాని ప్రపంచమంద లి పదార్థములన్నియు ధనమున కాధీనములై యుండుట యెల్ల రకుఁ దెలిసినదేకదా! ఈకారణము చేతనే కాఁబోలు పరాశర స్మృతి, శుక్రనీతి, యమస్మృతిమొదలగు గ్రంథములందు గన్య ధనవంతుఁడగువరునే పెండ్లియాడవలయునని వ్రాయఁబడియు న్నది. ఆదికాలంబున ఛందోవిద్యను బ్రచారముఁ జేసిన జగ ద్విఖ్యాతుఁడగు పింగలమహాముని వ్రాసిన,

ధీ శ్రీ స్త్రీమ్. పిం. సూ. పా. 1.

అను సూత్రముమీఁద హాలాయుధుఁడు

అధ్యయనాద్ధీర్భవతియస్యధీ స్తస్య శ్రీర్బుద్ధి పూర్వకత్వాత్
విభూతేఃయస్య శ్రీ స్తస్య స్త్రీ అర్థమూలకత్వాద్దారగ్రహస్య.

అనివృత్తివ్రాసియున్నాఁడు. అనఁగా మొట్టమొదలు మానవుఁడు విద్యనభ్యసించి బుద్ధినభివృద్ధి పరచికొనవలయుననియు, నట్టిబుద్ధియొక్క సహాయమున న్యాయపూర్వకముగ నానావిధ వ్యవహారంబులొనరించుచు ధనమార్జించియనంతరము వివాహముఁ జేసికొనవలయుననియు, విద్య లేనిచో మనుజుఁడు యథావిధి ధనమభివృద్ధి జేసికొనఁ జాలక పోవుటచేత గృహాశ్రమ కార్యంబులకాటంకము గలుగుననియు దీని యభిప్రాయము. వేదాది సత్యశాస్త్రములకు విరుద్ధముగ బాల్యావస్థయందు వివాహమాడువారలు ప్రపంచమున నెక్కుడగు దుఃఖమనుభవించుచు యల్పకాలమందే మృతినొంది రెండు లోకములకు భ్రష్టులగుచున్నారు. కావున జదువరులారా! ఈబాల్య వివాహంబను ప్రళయాగ్నినుండి మీరు దూరగులై యుండుటయగాక మీసంతానంబులఁగూడ దప్పించి మనుష్యజన్మముయొక్క ధర్మయుక్తంబులగు సమస్త సౌఖ్యంబుల భోగింతురుగాక యని మీతోఁడ మేము వినయపూర్వకముగ నివేదనముఁ జేసికొనుచున్నాము. కాని ప్రస్తుతకాలమున నెపరేని దమ కొమారులకు నలువదియెనిమిది వర్షములవరకును, కూతుల కు

రువదినాలుగు వర్షములవరకును, వివాహముచేయక యుంచిన చో నట్టినలువది యెనిమిదివత్సరముల పురుషునకుఁ గన్యదొరకుటయు, నిరువదినాలుగు వర్షముల స్త్రీకి మగఁడు లభించుటయు దుస్సాధ్యమే కాక యసాధ్యముఁ గూడఁగావచ్చును. మఱియు నేవరి తలిదండ్రులు సరియగురీతి బ్రహ్మచర్యము సలిపియుండరో యట్టివారిచేత నొక్కపర్యాయముగ నుత్తమ బ్రహ్మచర్యముఁ జేయించుటయు దుర్ఘటమే. కాని మరల బ్రహ్మచర్యమును గ్రమముగ నభివృద్ధిపరచికొనుచుఁ బోయినయెడలఁ గొన్నితరములు గడచునప్పటికిఁ దిరుగ నుత్తమ బ్రహ్మచర్యముఁ జేయుశక్తి కలుగుననుట స్పష్టము. ప్రస్తుతదశయందు మాత్రము ప్రతిపురుషుఁడిరువదియైదు సంవత్సరములకు దక్కువ వయసునందును గన్యక పదియారేండ్ల లోపలను వివాహముఁ జేసికొనక యుండినచో మరలఁ గ్రమక్రమముగ నుత్తమ బ్రహ్మచర్యముసలుపఁగలుగుదశయుఁ బ్రాప్తము కాఁగలదు. కావున నీయువతీవివాహ విధానంబుసమస్త మానవులాచరించుటుచితము. వైద్యశాస్త్రసిద్ధాంతానుసారముగ నిరువదియైదు వత్సరములకుఁ దక్కువ యీడునందుఁ బురుషులు వివాహమాడుటెంతమాత్రముఁగూడదుమెంశియు,

చతుర్థమాయుషో భాగ ముషిత్వాద్యగురౌ ద్విజః,

ద్వితీయమాయుషోభాగం కృతదారో గృహేవసేత్.

మను. అ. 4.

ఆయువునందు నాలుగవ భాగమగు మొదటి యిరువది యైదువర్షముల పర్యంతము గురువుదగ్గిరవసించి దానికి రెండవదియగు నిరువదియైదేండ్ల తరువాత యీడునందు వివాహమాడి గృహమందు వసించవలయునని మనువు విధించియున్నాడు.

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోయతిస్తథా
ఏతేగృహస్థప్రభావాశ్చత్వారః పృథగాశ్రమాః.

మను. అ 6.

బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమంబులకు గృహస్థాశ్రమమే యాధారమని మనుస్మృతియందును,

చతుర్ణామాశ్రమాణాంచ గార్హస్థ్యంశ్రేష్ఠముత్తమం,

బా. రా. అయో. స. 106.

నాలుగాశ్రమంబులలో గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనదని బాలరామాయణమందును,

యథామాతర మాశ్రిత్య సర్వేజీవంతి జంతవః
ఏవంగార్హస్థ్యమాశ్రిత్య వర్తంతి ఇతరాశ్రమాః

భార. శాం. అ. 269.

తల్లి నాశ్రయించి సమస్తజంతుజాలము లెట్లుజీవిం

చునో యటులే గృహస్థాశ్రమము నాశ్రయించి తక్కిన యా శ్రమములు వర్తించుచుండునని భారతమందును,

సర్వేషామపి చైతేషాం వేదస్మృతి విధానతః
గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః సత్రీనేతా న్బిభర్తిహి.

మను. అ. 6.

గృహస్థాశ్రమమువలన దక్కిన మూఁడాశ్రమములకుఁ బాలనము కలుగుచుండుటంజేసి యదియే యాశ్రమములలో నెల్ల శ్రేష్ఠమైనదని వేదముఁగూడ వచించుచున్నట్లు మనుస్మృతియందును లిఖింపఁబడియున్నది. ఇట్లు తక్కుంగల మూఁడాశ్రమంబులవారల పాలనము నిమిత్తము గృహస్థుఁడనేక కార్యములొనరించవలసియుండును.

కారణభావాత్ కార్యభావః వై శే. అ. 4.అ . 1.

అనుకణాదమహర్షి వాక్యానుసారము ప్రతికార్యముదాని దాని కారణమునుండియే యగుచుండుఁగాని వేరువిధమునఁగాదు. సమవాయికారణమనియు, నసమవాయికారణమనియు,నిమిత్తకారణమనియుఁ, గారణము మూఁడుప్రకారములు. ఈమూఁడువిధంబులగు గారణములేక యేకార్యముగాని గాఁజాలదు. ఎట్లనఁగా వస్త్రముసేయుటయందు నూలుసమవాయికారణము. నూలుదారములయొక్క సంయోగమసమవాయికారణము. అనఁగానాదారములొండొంటితోఁడగలియుట. అసమవా

యి కారణమనఁబడును. మూఁడవదియగునిమిత్తకారణము గౌణ ముఖ్యములను భేధములు రెండువిధములు. వస్త్రము నేయుటయం దు దేశ, కాల, ఆకాశ, దిశా, పృథక్త్వ, సంఖ్యా, పరిమాణ పరత్వాపరత్వ, విభాగాదులుగౌణనిమిత్త కారణముక్రిందఁ చేరు ను. కర్త, ఇచ్ఛ, ప్రయత్నము, అనుభవము, నేయు సాధనము మొదలగునవి ముఖ్యనిమిత్తకారణములు. ఇచ్ఛలోనగునవన్ని యుఁగర్తయొక్క యాధీనమందయుండు ఁగావునముఖ్యకారణ ములన్నింటిలోఁ గర్తయే ప్రధానకారణము. పూర్వోక్తము లైన మూఁడు కారణములు లేక యే కార్యము నుగలుగనేరదు కావునవీనిధ్యానమందుంచికొని బుద్ధిపూర్వకంబుగఁ బ్రతికా ర్యముఁ జేసికొనుచుండుట యుత్తమము. మనుజుఁడనుదినముఁ చేయవలసినకార్యంబులను విభాగించుకొని మఱియుఁ జేయు చుండవలయు. సంపూర్ణమైనతనయాయుష్యమునందుఁదాఁ జేసికొ నవలసిన కర్తవ్యంబుల నాత్మరక్షణము, జీవిక, సంతానసంగో పనము లేక సంరక్షణము, సమాజసంస్థ, మనోరంజనము, ఈ శ్వరోపాసనములను నారువిధముల విభాగించుకొని వానిఁగ్రమ ముతప్పక నెరవేర్చుకొనుచుండ వలయును. ఈకార్యములన్నిం టిలో నారవకర్తవ్యంబు దూరముగనిడినమొదల, మూఁడవ, నాల్గవ, మైదవకర్తవ్యములే శ్రేష్ఠములగుటంజేసి వీనిఁగ్రమ ముతప్పక యొకటి తరువాత నొకటిగఁ జేసికొనుచుండుట

యోగ్యమైయున్నది. ఈకర్తవ్యకార్యములయొక్క నిక్కంబగుమహత్వమును దెలియని కారణమున,జనులుత్తమమో, యధమమోయగు నేదియోయొక యేకదేశీయ కార్యమునుసలుపుట యందే తమయమూల్యమైన మనుష్యజన్మము నంతయుం బాడుచేయుచున్నారు. ఎట్లనఁగాఁ గొందరు కొంచెము విద్యనభ్యసించిన మాత్రముననే కృతకృత్యులైనట్లుతలంచుచున్నారు. మరికొందరు ధనముఁగూడఁబెట్టుటయే పరమ పురుషార్థముగ భావించుచుందురు. కొందరు లోకమంతయుఁ దమ్ముస్తుతించవలయునను కోరికతోఁ దమసర్వస్వము నాశముఁజేసి కొనియైన బరోపకారులను తాత్కాలిక నామముంబడసి యందుమూలమునఁ గృతకార్యులైనట్లెంచుచున్నారు. మరికొందరు మనుజులు కేవలము భార్యాపుత్రులయందలి మోహమందే నిమగ్నులై వారినారాధించుటవలననే తమనరజన్మము సార్థకతఁగాంచునని తలపోయుచున్నారు. వేరొక కొందరు మానవులు,

యావజ్జీవేత్ సుఖంజీవే దృణంకృత్వా ఘృతంపిబేత్.

అను నిదర్శనంబు సఫలముఁజేయుటయందే యహర్నిశముఁ బాటుపడుచున్నారు. కొందరు తీర్థములవెంటఁ దిరుగుటయందును, గొందరసదుపాసనములందును మగ్నులై యుందురు. ఈయేదు ప్రకారంబులగు స్వభావంబులుగల మానవు

లు వారివారి ప్రత్యేక కర్తవ్యములయెడల మాత్రమే యభి మానముంగలిగి వాని నొనరించుటయందే ధ్యానము కలవా రలై యొకరు వేరొకరి వార్త విననైన వినరు. వీరికర్తవ్యము లన్నియు నేకదేశీయంబులగుటకతన మన్నించుటకుఁ దగినవిగ నుండలేదు. ఎట్లనఁగా నీపైనఁ జేర్కొనినవారిలో మొదటితరగతివారలకు గ్రంథములు పఠించుటదప్ప వేరేదియుఁ దెలియదు. అడవిలోని జంతువులకు నగరమందలి పదార్థములం బోలి వీరికి గ్రంథములుదప్ప ప్రపంచమందలి తక్కిన సకల పదార్థములు నమంగలములు, భయంకరములుగనే ప్రతీతము లగుచుండును. వీరలు పుస్తకంబులవదలి యించుక వెలుపలికే తెంచుటతోడనే వెఱ్ఱిపట్టినవారివలె నగుదురు. వీరి దృష్టికిఁ బ్రపంచమంతయు శూన్యముగనేయుండును. అదే విధమున వీరలుఁగూడఁ బ్రపంచమున కెందులకుఁగాని పనికిరాకయున్నారు. వీరలే జగంబునఁ జదివిన పశువులనఁబడుదురు. ఇటువంటివారివలన లోకంబున కావంతయు లాభములేదు. ఇట్టి చదివిన పశువులు ప్రపంచములో విశేషించి యీ భారతవర్షమందు మిక్కుటముగ గలరు. ఇఁక రెండవ తరగతివారనిన లోభగ్రస్థులగు కారణంబున వీరలు ధర్మాధర్మముల యెడల రవ్వంతయేని లక్ష్యముంచక కేవలము గవ్వకు గవ్వఁగూడఁ బెట్టుటయే తమకు బరమధర్మమైనట్టుల భావించుచున్నారు.

కాని ప్రపంచమందేయే కార్యములైయున్నవో యిఁక నేయే కార్యంబుల దాము గావించవలయునో యట్టి విషయంబులం గూర్చి లవమాత్రమైన యోచింపరు. వీరలాత్మ రక్షణము సయితము యథావిధిఁ జేసికొనఁ జాలరు. తమబిడ్డలఁ జదివించుటంగూర్చియు వీరలకు ధ్యానములేదు. ఇంతయేల వీరలకు విద్యయనినఁ దెలియనే తెలియదు. వీరల యెదుట నెవరైన న్యాయ వ్యాకరణాంబుల గురించిగాని రసాయన విద్యాసంబంధములైన కలాకౌశలంబుల గురించిగాని ముచ్చటించిన యెడల వారలవి యెట్టిపదార్థములనియు నేవర్తకుని యంగడియందెంత వెలకేవిధమున నమ్మఁబడుననియుఁ బ్రశ్నింతురు. ఎటులైనను ధనముఁ గూడఁబెట్టుటయే వీరలకు ముఖ్య కర్తవ్యము. ఇట్టివారలు లోకంబున జన్మించుటయు వ్యర్థమే. మూఁడవ తరగతి మానవు లొకవిధముగఁ బరోపకారముఁ జేయువారలగుటచే గొన్నివిషయములలో నట్టివారలు కొందరికి మంచివారలే కావచ్చును. కాని వీరలు కుటుంబ ఘాతకులగుట వలన శాస్త్రవిధానమున నధర్మాత్ములనియే యనఁబడుదురు. ఎట్లనఁగా

శక్తః పరజనేదాతా స్వజనే దుఃఖజీవని
మధ్వాపాతో విషాస్వాదః సధర్మ ప్రతిరూపకః.

మను. అ. 11.

ఎవఁడు తనతలిదండ్రులు, భార్యాపుత్రులు, సోదరీ సోదరులు మొదలగువారల యథావిధిఁ బాలించక లోకయశంబున కాసఁజెంది తనధనముం బరమార్థమునందు వినియోగించునో యట్టివాఁడు మొదలు మొదలు లౌకిక యశంబనెడు మాధుర్యము భోగించుఁగాని యందులకుఁ బరిణామముగ నంతమందు విషతుల్యమైన దుఃఖము ననుభవించునని మను స్మృతియందు వ్రాయఁబడియున్నది. తనకడనున్న ధనమునంతయుఁ దానుపరమార్థంబని యెంచినదానికి లోకోపకార్యాయముగ వ్యయము చేయుటవలనఁ దరువాతఁ దనకుదానే భిక్ష మెత్తికొనవలసి వచ్చుఁగదా ! బిడ్డలాకలిచే గృశించుచు దొంగతనము మొదలగు దుష్కార్యములొనరింప మొదలిడుదురు. ఇంటియందును దినముఁ బోరాటములే కలుగుచుండును. ఇట్లు పరిణమింపఁ దుదకామహాదాత విషముంద్రోలి ప్రాణముల విడువనైనవిడుచును. లేనియెడల కాషాయాంబరములందాల్చి సన్యాసియై దేశముమీఁదనైనఁబోవును. బిడ్డలు విద్యావిహీనులు, దీనులు మలీనులునై తిరిపమెత్తికొనఁ బాల్పడుదురు. స్త్రీలయుక్తకార్యంబులఁ జేయఁగడగుటచే బంధుబృందములకుఁ దలవంపులు చేకూరు. దాము తమబంధుగులకును, బాధువు లితరులకును మొగము జూపనోడుదురు. ముందు వెనుక లాలోచించక శక్తికిమించిన ధనవ్యయము చేయుటచేతనే యిట్టిదుర్దశ సంప్రా

ష్టమగుట సంభవించుచున్నది. ఇట్టి దాతలను స్వోదర పరాయణులగు భోజన పండితులుదప్ప యితరులేరును బరోపకారులనం జాలరు. నాలుగవ తరగతి జనులు కేవలము భార్యాపుత్రులను మోహజాలంబునం దగులువడి వారిజన్మము నష్టము జేసికొనుచున్నారు. వీరలకు ధనోపార్జనము చేయుటచేతగాదు. ఆత్మరక్షణ మెట్లుచేసికొనవలయునో తెలియదు. సంతానరక్షణమందును, వారికి శిక్షనిప్పించుటయందును వీరలకు శక్తిసున్న. వీరలు ప్రపంచమందేకార్యముం జేయుటకును సమర్థులుగారు. వీరలు పేరునకు మాత్రము మనుజులు. ఇంక నైదవ తరగతి జనులనినచో బ్రత్యక్షరాక్షసులు. వీరల స్థితి కడుశోచనీయమైయున్నది. ఈమూఢులు ప్రపంచమునకుం జేయునది యంతయు హానియే. ఇతరుల సంతాపమునొందంజేసి తమప్రయోజనంబుల సిద్ధముచేసికొనుటయే వీరికి ముఖ్యకర్తవ్యము. జగత్తునందలి సమస్తమానవు లిట్టిదుష్టస్వభావమే కలిగియుందురేని నొక్కదినముననే మహాప్రళయము సంభవించకయుండునా? ఒకరు మరియొకరి ధనాది పదార్థంబులఛల, కపట, దంభ, పాఖండముల మూలమున బలాత్కారంబుగ నపహరింప మొదలిడినతరి బ్రపంచమందెవరైన నెట్లు నిలువనోపుదురు? ఈయైదవ తరగతి మనుజులత్యంతాధములై సంసారంబను మహారణ్యమునకు దావానలముంబోలియున్నా

రు. అట్టిమగు రక్కసులనందగిన యీదుర్మార్గులయొక్క ద ర్శనము పరమేశ్వరుఁ డెవరికిని గలుగఁ జేయకయుండుగాకయ ని మేము కోరుకొనుచుండ నేమి ప్రారబ్ధముననో గాని ప్రస్తు తకాలమందీ మైదవతరగతివారింబోలు జనుల సంఖ్యయే పె రిగిపోవుచున్నది. దేశముయొక్కదశ యేమికానున్నదో వచిం పఁజాలము. ఆరవతరగతివారలు మూర్ఖులై బ్రతికి యున్నంత కాలముఁ దీర్థములవెంటఁ దిరుగుచు, భిక్షావృత్తిఁ బొట్టఁబోసి కొనుచు గ్రుమ్మరుచుందురు. ఇష్టమువచ్చిన వేషముల ధరిం చుచుందురు. ఇట్టివారిని

తే మృత్యులోకే భువిభారభూతా
మనుష్యరూపేణ మృగాశ్చరంతి. భర్తృ.

అనురీతి మనుష్యశ్రేణిలో గణింపఁ గూడదు. ప్రపం చమునకు వీరలు దరిద్రతా రూపమైన రోగము వంటివారలు. ఈరోగమునకు మందు సురూపమునందలి వారలంబలె వీరినం దరిఁగూడ నుద్యోగవంతులఁ జేయుటదక్క వేరొండు మార్గ మేదియు లేదు. ఇదే విదేవిధమున గొందరు పరమాత్మయొక్క సద్భక్తియందు మగ్నులమైయున్నారము కావున మాకేమియు నవసరము లేదని ప్రపంచమునకుఁ గొంచెమైన యుపకారముచే యక యూరక దినముల గడుపుచుందురు. ఇట్టివారు సర్వవి ధములఁ బ్రశంసనీయులు కాఁజాలరు. కేవలము మూఢమా

ర్గమున నీశ్వరభక్తియందు మునింగియుంటిమని ప్రపంచము నుండి యన్నపానాదుల గ్రహించుచు ప్రపంచమున కుపకారము చేయకుండుట మహాకృతఘ్నతగాక మరియేమి కాఁగలదు? కావున మనుజులిట్టి వ్యవహారములందును దత్పరులు గాఁగూడదు. ఆలోచించిచూడ సమస్తమానవుల విద్యయను పెద్దనిద్దురంబడి తమ్మెఱుఁగక యుండినట్లు స్పష్టమగుచున్నది. మేము పైనవ్రాసిన యారుకర్తవ్యంబుల నెంతపర్యంతము పాలించకయుందురో యంతపర్యంతము నీయవిద్యానామక నిద్రనుండి మేలుకొనుట దుర్ఘటము. కాన బూర్వోక్త షట్కర్తవ్యంబుల యథారీతి నందరు పాలించవలయుననికోరుచున్నారము. ఆకర్తవ్యంబులలో మొదటిది యాత్మరక్షణము. ఆత్మరక్షణము లేనిచో శరీరాత్మలకు వియోగము సంభవింపఁ దన్మూలమునఁ దక్కిన కర్తవ్యముల కవకాశమే కలుగదు. ఎట్లనఁగా

ప్రాణైషణా ధనైషణా పరలోకైషణేతి ఆసాంతు
ఖల్వైషణానాం ప్రాణైషణాంతావత్ పూర్వతరమాపద్యేత.
కస్మాత్ ప్రాణపరిత్యాగేహి సర్వపరిత్యాగః.

చర. సూ. అ. 11.

ప్రాణ, ధన, పరలోకముల నభిలషించుట యనెడు తృష్ణాత్రయమందు మొదలు ప్రాణమునే ముఖ్యముగఁ జూచి

కొనవలయుననియు, గాని చో ప్రాణపరిత్యాగంబునం దక్కిన వానికిం గూడ నాశనము కలుగుననియు జరకమున లిఖింపంబడియున్నది. ఇటులే

ధర్మార్థకామమోక్షాణాం ప్రాణాఃసంస్థితి హేతవః
తంనిఘ్నతాకి న్నహతం రక్షతాకిన్నరక్షితమ్.

హి. మ. 1.

ధర్మార్థ కామమోక్షంబుల ప్రాప్తికిం గారణము ప్రాణరక్షణమే గాన నెవండు తన ప్రాణము నాశనముం జేసికొనునో యట్టివాండు సకలపదార్థంబుల నాశనము జేసికొనుటయుం, ప్రాణముల రక్షించుకొనువాండు సర్వపదార్థంబుల రక్షించు కొంటయు నగునని హితోపదేశమందును,

క్షత్రేణాత్మానం పరిధాపయాథ.

అథ. కాం. 12. అను. 3. వ. 18.

క్షత్రేణ-ధనాది పదార్థములవలన, ఆత్మానం- ఆత్మను, పరిధాపయాథ-తగురీతిరక్షించుకొనుమనియథర్వవేదమందును,

ఆపదర్థం ధనంరక్షేద్దారాన్ రక్షేద్ధనైరపి
ఆత్మానం సతతంరక్షేద్దారైరపి ధనైరపి.

మను. అ. 7.

ఆపదసంభవించిన కాలమందుపయోగించుకొను నిమిత్తము ధనము రక్షించవలయుననియు, దానితో భార్య మొద

లగువారినిఁబోషించుచు, నాధనముచేతను భార్యాదుల చేతను నిరంతరము ధనరక్షణము చేసికొనుచుండవలయునని మను స్మృతియందును వ్రాయఁబడియున్నది. కావునసమస్తకర్తవ్య ములలో మొదలాత్మరక్షణముఁ జేసికొనుటయే సకలమాన వులకుఁ బరమావశ్యకము. సాధారణముగఁ బ్రతిప్రాణికిఁ దన యొక్క యాత్మను రక్షించుకొనవలయునను కోరిక స్వాభావి కముగ నున్నటులే విదితమగుచున్నది. ఎట్లన నాఁకలియు దప్పియుఁ గలిగిన సమయంబున నన్నపానములచే సమస్త ప్రా ణులుఁ దమతమ పోషణముఁ జేసికొనుచునేయున్నవి. మరి యు దుఃఖదాయకంబులైన సకల వస్తుజాలములనుండియుఁ ద ప్పించుకొని యుండవలయునని ప్రాణిమాత్రములన్నియు శక్తి కొలఁదిఁ బ్రయత్నముల సలుపుచునేయున్నవి. కావున స్వా త్మరక్షణవిషయమై విస్తారము వ్రాయ నవసరము లేదుకాని సూక్ష్మదృష్టితోడ యోజించి చూచిన నైమిత్తికాత్మరక్ష ణములేక స్వాభావికాత్మరక్షణమువలనఁ బ్రయోజనము లేనటు లఁదోఁచుచున్నది. ఆఁకలియగుటతోడనే యేదియోయొకఆహార ముందినుట స్వాభావికాత్మరక్షణంబగుఁగాని నైమిత్తికాత్మరక్ష ణమునకుసాధనములు వైద్యక నియమంబులైయున్నవి. ఆనియ మములకువ్యతిరేకముగ మిథ్యాహారవిహారబులొనరించుట వ లనవెంటనేరోగము జనియింపనత్తరి నాత్మరక్షణముఁజేసికొనఁ

జాలకపోఫ్పుటచేతఁ దక్కిన పదార్థసంచయములకుఁగూడ నష్టముకలుగును. ఈహేతువుచేతనే చరకమందు

ధర్మార్థకామమోక్షాణా మారోగ్యం మూలము త్తమం
రోగా సస్యాపహర్తారః శ్రేయసో జీవితస్యచ.

చర. సూ. అ. 1.

ధర్మార్థకామమోక్షంబుల ప్రాప్తికి మూలకారణమారోగ్యము. అనఁగా రోగరహితమైన శరీరముంబొందియుండవలయును. ఆరోగ్యమును నాయువును నాశనము జేయునట్టిరోగము వైద్యనియమంబులకు విరుద్ధములైన యాచరణంబుల నలుపుటవలనఁ గలుగుచుండును. కావున వైద్యశాస్త్రము ననుసరించి యుక్తాహార విహారాదులమూలము శరీరము రోగగ్రస్తముగాకుండునటులఁ గాపాడుకొనుచు నాత్మరక్షణముఁ జేసికొనుటయందప్రమత్తులైయుండుట ముఖ్యకర్తవ్యంబనియు,

సర్వమన్యత్ పరిత్యజ్య శరీరమనుపాలయేత్
తదభావేహి భావానాం సర్వభావః శరీరిణాం.

చరక. ని. అ. 6.

సాంసారిక పారమార్థిక పదార్థములనెల్లఁ బొందుటకు మూలకారణము శరీరమనియు, నట్టిశరీరమునకు భంగముగలిగిన దక్కినవియు నాశనమైనటులే కాన నితరపదార్థములఁ బరిత్యాగముచేసియైన శరీరము రక్షించుకొనవలయుననియు,

ప్రాణాపానౌచక్షుః శ్రోత్రమక్షితిశ్చ క్షితిశ్చయా
వ్యానోదానౌ వాఙ్మనః శరీరేణత ఈయంతే.

అథ. కాం. 11. వ. 24.

ఎంతపర్యంతము మనుజశరీరము విద్యమానమైయుండునో యంతపర్యంతమే ప్రాణాపాన వ్యానోదానంబులును, గన్నులు, చెవులు, వాక్కు, మనసు, పృథివ్యాదులు, పృథివికంటె భిన్నంబులగు సకలపదార్థంబులు వానివాని నైజావస్థల నొప్పియుండును. శరీరము విద్యమానమైయుండిననే వానివాని కార్యంబుల యథావిధిఁ జేసికొనఁగలిగియుండును. కావున సర్వవిధములఁ దమయాత్మరక్షణముఁ గావించుకొనుట మనుజ మాత్రుల కత్యంత ముఖ్యమని యథర్వవేదమందును,

తస్మాత్ పురుషోమతిమాన్ బలమాత్మనః
సమీక్ష్యతదనురూపాణి కర్మాణ్యారభతేకర్తుం,
బలసమాధానంహి శరీరం శరీరమూలశ్చ పురుషః
సాహసంవర్జయేత్ కర్మరక్షం జీవితుమాత్మనః
జీవన్హిపురుషస్త్విష్టం కర్మణః ఫలమశ్నుతే.

చర. ని. అ. 6.

తనయొక్క బలముంజూచికొని తదనుకూలముగఁ బనిఁ జేయుచు, బలమునకు మించిన పనినిం జేయక యుండుట బుద్ధిమంతుల కుచితమైయున్నది. శక్తికి మించిన పనిఁ జేయుటవలన

బలమునకు నాశనముకలుగఁ దన్మూలమున శరీరమునకుఁ గూడ నాశనము సంభవించును. బలమే శరీరమున కాధారము. అట్టి శరీరాధారంబున మనుజుఁడు జీవించియుండును కావున సాహసముఁ జేసి హఠమూని యాత్మకు హాని చేకూరునట్టి కార్యంబులఁ జేయఁగూడదని చరకమందును లిఖంపఁబడి యున్నది. పురుషుఁడు జీవించి యుండిననే యుత్తమ కర్మంబులయొక్క ఫలముల భోగింపఁ గలుగుఁగాని మీఁద వచించినరీతి మూర్ఖ్యమూని స్వశక్తికిమించిన మోటుపనిం జేయునెడల మనుజుఁడు ప్రపంచమునుండి యతిత్వరితకాలములోనే వెడలవలసివచ్చును. ఆత్మరక్షణ తత్త్వముంగూర్చి తెలియనికతమున జగంబునందనేకులు స్వారపరాయణులై తమకుఁదామే యాత్మహానిం గావించుకొనువారలగుచున్నారు. ఎట్లనఁగాఁ బనిపాటలవారలు మితిమీరిన భారంబులమోసియు, దరిద్రులు మిక్కుటంబుగ భుజించియు, విద్యనిమిత్తము విద్యార్థులు శక్తికిమించిన పరిశ్రమల సలిపియు, లేఖకులతివిస్తారముగవ్రాసియు, బరిచారకులెక్కువ కష్టపడియుఁ, గాములుమిక్కుటంబుగఁ గాముకవ్యాపారంబులఁ దగిలియు, లోభులతిలోభమునఁజేసియు, క్రోధాత్ములు క్రోధంబువలనను, వ్యసనచిత్తులతివ్యసనములఁజేసియు నిటులే మానవులందరు మూర్ఖత్వమునకు వశీభూతులై యాత్మరక్షణ తత్వంబునెఱుంగని హేతువున

వాత్మఘాతముఁ జేసికొనినవారలగుచున్నారు. కాని మన ఋషి మహర్షుల సిద్ధాంతమెట్టిదన

కర్మచాత్మహితంకార్యం తీక్ష్ణంవాయదివామృదు
గ్రస్యతే కర్మశీలస్తు సదానస్థైరకించనః.

భార. శాం. అ. 139.

ఏయే కార్యంబులాత్మకు హితకారకములుగ నుండునో యట్టివానినే యొనరించుచుండవలయు. తీక్ష్ణములైనను, మృదువులైనను మనుజుఁడాత్మహితము నెడల ధ్యానమూనక కేవలము గార్యకరణమందే మగ్నుఁడయ్యెనేని నట్టివాఁడేమి చేయుటకును సమర్థుఁడుగానేరఁడని భారతమందును, నిటులే చరక నిదాన స్థానమందలి యారవయధ్యాయంబునను,

సర్వస్వమపిసంత్యజ్యకార్య మాత్మహితంనరైః

భార. శాం. అ. 139.

సమస్తముఁ బరిత్యాగముచేసియైన మొట్టమొదలు మానవుఁడాత్మహితముఁ జేసికొనవలయునని వెండియు భారతమందును వ్రాయఁబడియున్నది. ఈవిషయమై సంక్షేపముగ నింతమాత్రమే ప్రతిపాదనముచేయఁబడినది. బుద్ధిమంతులగు వారలు స్వయముగ నింకను దీనిగుఱించి సంపూర్ణముగఁదెలిసికొందురుగాక. ఆత్మరక్షణము తరువాత ద్వితీయకర్తవ్యము జీవిక.

జీవ్యతేఽనయాసాజీవికా.

దేనిమూలమున మనుష్యుఁడు జీవింపఁగలుగునో యనఁగా మనుష్యజీవనమున కెయ్యది సాధనమగునో యదియే జీవిక యనిపిలువఁబడును. ఆహారము, వస్త్రములు, భృత్యులు, పశువులు మొదలగుపదార్థములు మనుష్యజీవనంబునకు సాధనములు. ఈసాధనములన్నియు ధనమున కాధీనములు. కావుననే

ఆయుష్యం వర్చస్యగ్ం రాయస్పోష మౌద్భిదమ్
ఇదగ్ం హిరణ్యం వర్చస్వజ్జైత్రాయావిశ తాదుమామ్

యజు. వే. అ. 34.

సమస్తకార్యంబులందు జయోపేతుఁడై సిద్ధిఁబడయు నిమిత్తము మనుజుఁడాయువునకుహితముఁగూర్చునదియు, నధ్యయనంబునకుఁ దోడుపడునదియు, గోశ్వాదిపశువులఁబోషింప మార్గమగునదియు, దుఃఖంబుఁబోగొట్టునదియు, శ్రేష్ఠమైన యాహారంబులఁ గలుగఁజేయునదియునగు సువర్ణాదిరూపంబైన ధనమునార్జింపవలయునని యజుర్వేదమందును, నిటులే యథర్వమందు,

యోబిభర్తిదాక్షాయణం హిరణ్యంసజీవేషుకృణుతే దీర్ఘమాయుః అథ. కాం. 1. అను 6. వ. 35.

దక్షుఁడైచాకచక్యముం గలిగియెవఁడు సువర్ణాది పదార్థంబుల సముపార్జనంబుఁ జేయునో యతఁడే సమస్తజీవుల

లో నాయువునభివృద్ధిపఱచికొనఁజాలువాఁడగునిని యు

ఇదంహిరణ్యంబిభృహి యత్తేపితాబిభఃపురా.

అథ. కాం. 18. అను. 4. వ. 25.

మనుజుఁడా! భద్రాత్ములు, బుద్ధిమంతులునగునీతండ్రి మొదలగువారలేప్రకారము సువర్ణాదులార్జించియుండిరో య ట్లేనీవుగూడ నార్జించుమని యీశ్వరుఁడాజ్ఞాపించినట్లును,

భూత్యైనప్రమదితవ్యం. తై. అను. 11. వల్లీ. 1.

ధనోపార్జనంబునందెన్నఁడుగాని ప్రమాదముగూడదని తైత్తిరీయోపనిషత్తునందును వ్రాయఁబడియున్నది. కావున సధర్మకార్యంబులవిడనాడియహరహము ధనోపార్జనంబుసలుపుట మానవునకుఁ బరమకర్తవ్యము. వెండియు ధనముసంపాదించుటయే పరమధర్మమని సిద్ధాంతముకలదు. ఎట్లనఁగా.

ధనమాహుఃపరంధర్మం ధనేసర్వంప్రతిష్ఠితమ్,

జీవంతిధనినోలోకే మృతాయేత్వధనానరాః.

భార. ఉ. అ. 72

ధనమేపరమధర్మము. ధనమునందే తక్కుంగల సమస్తపదార్థములు విద్యమానములైయుండును. ఎవనిదగ్గఱధనముండునో వాఁడేసజీవుఁడు. ఎవఁడుధనము కలిగియుండఁడో వాఁడు బ్రతికియుండియుఁ జచ్చినవాఁడే. ప్రాణవిహీనమైన శరీరమేమియుఁగావింపఁజాలని వడువునధనములేనివాఁడుగూడ

నేకార్యముచేయుటకును సామర్థ్యముకలిగియుండఁడు. బుద్ధిమంతులగువారలు ధనసహాయంబుననే యేమైనఁ జేయగలుగుదురు.

ఇదేవిధమునఁ బంచతంత్రమందు,

నహితద్విద్యతేకించి ద్యదర్థేన నసిద్ధ్యతి
యత్నేనమతిమాం స్తస్మాదర్థమేకంప్రసాధయేత్

మతిమంతులకు ద్రవ్యమూలంబున దొరకఁజాలని వస్తువేదియుఁ బ్రపంచమందులేదు గావున ధనోపార్జనంబునకు యత్నములొనరింపవలయుననియు.

యస్యార్థాఃతస్యమిత్రాణి యస్యార్థా స్తస్యబాంధవాః
యస్యార్థాఃసపుమాంల్లోకే యస్యార్థాఃసచపండితః

ఎవనిదగ్గఱధనముండునో వానికేమిత్రులు బాంధవులు జేకూఱుదురనియు,ధనముగలవాఁడే పురుషుఁడును బండితుఁడునగుననియు.

ఇహలోకేహిధనినాం పరోపిస్వజనాయతే
స్వజనోపిదరిద్రాణాం సర్వదాదుర్జనాయతే

ఈలోకంబున ధనాఢ్యులగు వారలకు శత్రువులుమిత్రులుగను, మిత్రులుశాత్రవులుగను మారుచుందురనియు.

అర్థేభ్యోపిహివృద్ధేభ్యః సంవృత్తేభ్య స్తత స్తతః
ప్రవర్తంతేక్రియాఃసర్వాః పర్వతేభ్యఇవాపగా.

పర్వతములయొక్క శిఖరప్రదేశములనుండి నదులుత మం

లేదాము బయలువెడలురీతి ధనవంతుండగు పురుషునకుఁ బ్ర దేశమందైనను సమస్తకార్యములు వానియంత నవియేయగు చుండుననియు,

పూజ్యతేయదపూజ్యోపి యదగమ్యోపిగమ్యతే
వంద్యతేయదవంద్యోపి సప్రభావోధనస్యచ॥

ధనప్రభావంబునం జేసి పూజింపఁదగనివాఁడు సయితము బూజకర్హుఁడగును. దగ్గఱనిలుచుటకైన దగనివాఁడు నమస్కరింపఁబడుటకు యోగ్యుఁడగును. చూచుటకైన దగనియతఁడు వందుఁడగును. ఇదియంతయు ధనమహాత్మ్యమేకాని వేరొండుకాదనియు

అశనాదింద్రియాణీవ స్యుఃకార్యాణ్యఖిలాన్యపి
ఏతస్మాత్కారణాద్విత్తం సర్వసాధనముచ్యతే.

భోజనమొనరించుటవలన సకలేంద్రియములుఁబుష్టములు. బలిష్ఠములునగుచాడ్పున ధనరూపకసాధనముల మూలమున సకలకార్యములు నెరవేరుచుండుటచేత ధనమేసర్వపదార్థములకు సాధనంబనియు

కృపణోప్యకులీనోపి సజ్జనైర్వర్జితఃసదా
సేవ్యతేసనరోలోకే యస్యస్యాద్విత్తసంచయః

ఎంతకృపణుఁడైనను, ఎంతమంచికులంబునఁ బుట్టినవాఁడుగాకపోయినను, సజ్జనులయెదుటికే తేరనర్హుఁడు గాకపోయి

నను సత్పురుషులచేఁ బరిత్యాగముచేయఁబడినవాఁడైనను ధనము సంపూర్ణముగఁ గలిగియుండినయెడల నట్టివాఁడు మనుజులకుఁ బూజ్యుండగుననియు

అస్తియావత్తుసధనస్తావత్సర్వైస్తుసేవ్యతే
నిర్ధనస్త్యజ్యతేభార్యాపుత్రాద్యైఃసగుణోప్యతః.

శు. నీ. అ. 3.

ఎంతపర్యంతము బురుషునివద్దధనముండునో యంతకాలము సమస్తజనులతని సేవింపుచుందురు కాని ధనములేని తరుణమందాలుబిడ్డలుగూడ నొల్లరని శుక్రనీతియందును,

శ్రీమాన్ సయావద్భవతితావద్భవతి పూరుషః

భార. ఉ. అ. 72.

శ్రీమంతుఁడగు నతఁడే పురుషుఁడనఁబడుఁగాని ధనహీనుఁడైన నట్టివానికిఁబుంస్త్వము నయితముండదని భారతంబునను,

యస్యాస్తివిత్తంసనరఃకులీనః సపండితఃసశ్రుతవాన్ గుణజ్ఞః,
సఏవవక్తాస చదర్శనీయః సర్వేగుణాః కాంచనమాశ్రయంతి.

భర్తృ.

ఎవనిదగ్గఱధనముండునో వాఁడె కులీనుఁడు, వాఁడె పండితుఁడు బహుశ్రుతుఁడు; వాఁడె గుణజ్ఞుఁడు దర్శనీయుఁడు. సమస్తగుణగణంబులు ధనమునాశ్రయించి యుండునని భర్తృహరియందును వ్రాయఁబడియున్నది. ఇట్టి సర్వతంత్రసిద్ధాం

తంబుగురైతుఁగసి కారణంబుననే మనదేశమందలిపండితులనే కులాజన్మముకావ్యకోశంబులు, భట్టోజీదీక్షితవిరచితమైన కౌముదీగ్రంథమందలి ఫక్కికలు మొదలగువాని మరలమరల వల్లించుటయందె కాలముగడుపుచుఁగూటికి గుడ్డకు సయితములేక యెల్లప్పుడుదుఃఖించుచున్నారు. అట్టివారలీ నిమ్నలిఖితవాక్యములయెడల ధ్యానమియ్యకుండుట శోచనీయము.

బుభుక్షితైర్వ్యాకరణం నభుజ్యతే
పిపాసితైః కావ్యరసోనపీయతే,
నఛందసాకశ్చాపి సముద్ధృతంకులం
హిరణ్యమేవార్జయనిష్ఫలాఃకలాః. సుభా. ము. మ. 4.

ఆఁకలియయ్యేనేని వ్యాకరణముందినఁజాలరు. దాహమయ్యేనేనిఁ గావ్యరసముఁద్రావనేరరు. ఛందోగ్రంథములేకులముంగాని యుద్ధారణముఁజేసియుండలేదు. కావున సోదరులారా! ధనమార్జింపుఁడు. ధనములేనియెడల నీగుణములన్నియు నిష్ఫలములేయగుననియు,

ధనసంచయకాకుత్స్న ధనమూలమిదంజగత్
అంతరైనైవ పశ్యామి నిర్ధనస్యమృతస్యచ.
సుభా. ము. మ. 4.

సమస్తజగత్తు ధనమూలమే కావున ధనముఁగూడఁబెట్టుము. ధనహీనునకును బ్రాణహీనునకును గొంచె

మైనభేదములేదనిసుభాషితముక్తావళియందు వ్రాయఁబడియున్నది. గ్రంథకారులనేకులు ధనములేనివాని శవమనియే వర్ణించియున్నారు. అదియంతయు సమంజసమనఁజెల్లు. చచ్చినవాని శరీరంబున శోభయుండనిచాడ్పున ధనహీనునందును గళయుండదు. మరియు,

శీలంశౌచం క్షాంతిర్దాక్షిణ్యంమధురతా కులేజన్మ
నవిరాజంతి హి సర్వేవిత్తహీనశ్చ పురుషశ్చ.

శీలము, శౌచము, శాంతి, దాక్షిణ్యము, మధురత, కులీనతాది సద్గుణములు ధనహీనుండగువానికిఁ గళనొసంగనేరవనియు

మానోవా దర్పోవా విజ్ఞానం విభ్రమః సుబుద్ధిర్వా
సర్వంప్రణస్యతి సమంవిత్తహీనోయథాపురుషః.

ఎప్పుడుమానవుఁడు ధనహీనుండగునో యప్పుడే యతనికింగల మానాభిమాన విజ్ఞానవిలాస సుబుద్ధ్యాదులన్నియు నాశములై పోవుననియు,

నశ్యతి విపులమతేరపిబుద్ధిః పురుస్యమందవిభవస్య
ఘృతలవణ తైలతండులవస్త్రేంధన చింతయాసతతమ్.

మహాబుద్ధిమంతుండయ్యు ధనహీనుండయ్యెనేని నానమయమందతని బుద్ధినష్టమైపోవ గృహసంబంధములైన ఘృతలవణతైలతండుల వస్త్రకాష్ఠాదులఁ గూర్చియు చింతకలు

గును. దీనికి దారిద్ర్యమే కారణము. దారిద్ర్యమువలన దుఃఖ ముకలుగునది యొక్క దరిద్రునకే గాదు.

బుభిక్షితఃకిన్నకరోతిపాపం
క్షీణానరానిష్కరుణాభవంతి
ఆఖ్యాహి భద్రేప్రియదర్శనస్య
నగంగదత్తః పునరేతికూపం. పంచతంత్రం. 4.

దరిద్రుఁడుసర్వవిధములైన దుష్కార్యంబు లొనరించుటయందు వెనుదీయక తన్కాలమున మనుష్యులకెల్లరకు దుఃఖముగలుగఁజేయుచుండును. చత్తునను భయమునొందిన వాఁడెట్టిదారుణ కర్మంబుల జేయుటకును సందేహింపఁడుగదా? వెండియు లోకమందలి దృష్టాంతములఁజూచుట చేతంగూడ ధనహీనుండగుపురుషుండు కరుణాశూన్యుఁడై యెట్టిపాపంబు లెట్టిదురాచారంబులనైన సలుపుటయందును, దక్కంగల సమస్తమానవులకు దుఃఖముసమకూర్చుటయందును లేశమాత్రమైన జంకఁడనియే విదితమగుచున్నది. ఇట్లని యీసంగతి కేవలము వ్రాయుటమాత్రమేకాదు. దరిద్రతాకారణంబున నీజగత్తునందనేక దురాచారంబులు బయలువెడలియున్నవి. వెండియు నిట్టిదురాచారంబులకు మూలమైనదారిద్రమే దినదినప్రవర్థమానమగుచున్నది. ఈభయంకరమైన రోగము నివృత్తి చేసికొనుటకుఁగొందరు మహానుభావులు వచించియున్న

వాక్యోపాయంబులనెడు హేమగర్భమాత్రలఁబ్రయోగముచేసి కొనుటావశ్యకము. ఎట్లనఁగా

నాత్మానమవమన్యేత పూర్వాభిరసమృద్ధిభిః
ఆమృత్యోః శ్రియమన్విచ్ఛేన్నైనాంమన్యేతదుర్లభాం,

మను. అ. 4.

పితరులుఁధనహీనులై తమకేమియు వారివలనధనముల భింపనంత మాత్రమున మనుజులుతమ్ముదాము తుచ్ఛులు, అనాథులు, దరిద్రులుగ గణించుకొనుచు వాత్సోత్సాహులైప్పుడుఁగాఁగూడదు. కాని మరణపర్యంతము ధనోపార్జనమందే మనసుంచి ప్రయత్నముఁజేయుచు ద్రవ్యసంచయము గావించుచుండవలయు. ప్రయత్నముఁజేసినప్పటికి ధనములభింపనియెడల నుదాసీనులై ధనమలభ్యమనుకొనక మరలమరల నుద్యోగంబులసలుపుచుండవలయును. ధనముదొరకదనునిరుత్సాహముగలిగి యూరకఁగూరుచుండుటతగదు. నిరాశుఁడయ్యెనేని నట్టివాఁడేకార్యముఁజేయఁజాలక యెందులకుఁ బనికిరానివాఁడగును. కావుననుత్సాహపూర్వకంబుగ ధర్మముదప్పక సమస్తమానవులు ధనమార్జించుటయందుదత్పరులై యుండవలెను. వెండియు,

నత్వేవాత్మావమంతవ్యః పురుషేణకదాచన
నహ్యాత్మ పరిభూతస్యభూతిర్భవతిశోభనా.

భార. వ. అ. 32.

మనుజుఁడు తననుదానెన్నఁడు నవమానముఁగాని యనాదరణముగాని జేసికొనఁగూడదు. ఏఁయనఁదనయొక్కయాత్మందిరస్కారముఁజేసికొనుపురుషునకు ధనాదిపదార్థంబులెప్పుడును బ్రాప్తముకానేరవు. అనఁగా మానవుఁడెల్లవేళల నుత్తమపదార్థంబుల సంగ్రహించుటయందు దత్పరుఁడై యుండవలయును. వేదమందుఁగూడనిటులే యాజ్ఞాపింపఁబడియున్నది.

దివంచరోహ పృథివీంచరోహ రాష్ట్రంచరోహ ద్రవిణంచరోహ ప్రజాంచరోహామృతంచ రోహరోహితేనతన్వంసంస్పృశస్వ అథ. కాం. 13. అను. 2. వ. 4.

శరీరముసురక్షితముగనుంచికొనుచు దివ్యంబులైన పృథివీరాజ్యధనప్రజామృతాది సకలపదార్థంబులప్రాప్తమగునట్లుఁ చేసికొనుఁడని యథర్వమందును,

అదీనాఃస్యామశరదఃశతమ్. య. అ. 36.

నూఱుసంవత్సరములపర్యంతము మేము దారిద్ర్యము లేకుండ జీవింతుముగాకయని యజుర్వేదంబునను వ్రాయఁబడియున్నది. మనుష్యులెప్పుడును దరిద్రులై యుండఁగూడదు. ఈ దారిద్ర్యనాశనమునకుఁ దగినయుపాయముకూడ వేదమందుఁ బ్రతిపాదనముచేయఁబడియున్నది.

కుర్వన్నేవేహకర్మాణిజిజీవిషేచ్ఛతంసమాః. య. అ. 40.

కర్మతత్పరుఁడై మానవుఁడు నూఱుసంవత్సరముల పర్యంతము జీవింపనభిలషించవలయు ననఁగా బ్రతికియున్నంతవ

రకు మనుజుఁడుద్యోగము జేయుచునే యుండవలయును. పరమేశ్వరునియొక్క జ్ఞానమయంబగు వేదము కర్మములొనరింపవలయునని యెట్లాజ్ఞాపించుచున్నదో యటులే యీశ్వరసృష్టిక్రమముగూడఁ గర్మలొనరింపవలెనని యే శిక్షనొసఁగుచున్నది. చూడుఁడు మనమునివసించుపృథివి నిరంతరము స్వకక్షమీఁదఁ బరిభ్రమణముఁ జేయుచున్నది. అటులే చంద్రుఁడు, నక్షత్రములు, జలము, అగ్ని, వాయువులొనగునవన్నియు వానివాని కార్యంబుల నెడతెగకుండ సలుపుచున్నవి. జడపదార్థములటులుంచి చేతనంబులఁ జూతుమేని పశుపక్ష్యాది సకలప్రాణిసమూహంబు లనవరతము గార్యములందునిమగ్నములై యుండుట యే కానఁగు మనశరీరావయవంబుల బరిశీలింతుమేని గన్నులు, ముక్కు, చెవులు. నాలుక, దంతములు, ముఖము, మస్తిష్కము, హృదయము, ధమని, జ్ఞానజనకక్రియాజనకతంతువులాదిగాఁగల సమస్తావయవములు వానివానికార్యంబుల జేయుచునే యున్నవి. ఇందేవిధమునమానవుఁడు సముచితముఁదన కార్యములఁ జేయుచుండవలయును. ఇదిసృష్టియొక్క నియమము. ప్రయత్నము జేయుటచేత నే మనుజునకు సకలపదార్థములు చేకూఱుచుండుఁగాని యితరవిధమునఁగాదు. మనముభుజించునట్టి యాహారపదార్థములన్నియుఁ బరిశ్రమమువలననే యుత్పన్నములగుచున్నవి. మనముధరించువస్త్రములు భూషణములు మొద

14

లగునవి ప్రయత్నముచేత నేకలుగుచున్నవి. మనమువాసముచే యుగృహములు, నీళ్లుదెచ్చికొను బావులు, కుంటలులోనగునవి పరిశ్రమంబుననే యేర్పడుచున్నవి. స్వల్పముగ మనమభ్యసించినవిద్యయు, మనదగ్గరనుండుధనాదిపదార్థంబు లుద్యమమువలనఁగలిగినవే. ఇటులే మనకుఁగోచరములగు పదార్థములన్నియు దీర్ఘపరిశ్రమవలనఁగలిగిన ఫలములేకాని వేరుకాదు. కావున

ఉద్యమేనహిసిద్ధ్యంతి కార్యాణినమనోరథైః
నహిసింహస్యసుప్తస్య ప్రవిశంతిముఖేమృగాః

పంచతంత్ర. 2.

మనుజులకు సకలకార్యంబులుద్యమమువలన సిద్ధించుఁగాని గొంతెమలాగు నూరకకోరుకొన్నంతమాత్రమున సిద్ధింపవు. అడవిలోనేమూలనోబడి నిదురబోవుసింహమునోటిలోనికి మృగములప్రయత్నముగ వానియంతనవియే ప్రవేశింపవుగదా. ఇట్టియభిప్రాయములుండుటంజేసియే ప్రాచీనకాలమందార్యులు పురుషార్థంబులనలిపియుండిరి. ఆపురుషార్థములమూలమున బ్రహ్మర్షిరాజులనేకులు విద్యలఁబ్రచారముఁగావించి యార్యావర్తమును దక్షిణదేశంబులకన్నిఁటికి శిక్షనొసంగువానిగఁ జేసిరి. పక్షపాతములేని యితిహాసవేత్తలందఱీవిషయము నెఱిఁగియేయున్నారు. ఈదేశమందు జనించిన బ్రహ్మయుద్యమంబు

వలననే నలుగురుబురుషులనుండి వేదముగ్రహించి జగత్తునందంతటఁ బ్రచారముఁగావించియున్నాఁడు. పాణిని పతంజలికాత్యాయనాదు లుద్యమంబుననే వ్యాకరణము రచియించిరి. అటులే పింగలుఁడు ఛందంబును, యాస్కమునినిరుక్తమును, ఆర్యభట్టభాస్కరాచార్యాదులు జ్యోతిషమును, గౌతమకణాదకపిలపతంజలి జైమినివ్యాసాదులు క్రమముగనుద్యమములవలననే న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగ, పూర్వమీమాంసోత్తరమీమాంస మొదలగు శాస్త్రములురచియించిరి. ఈప్రయత్నప్రభావంబుననే చరకాచార్యులు చరకము, సుశ్రుతుఁడు సుశ్రుతము, వాల్మీకి రామాయణంబును రచియించెను. ఉద్యోగముచేతనే యింకనుఋషులనేకు లనేకగ్రంథములవ్రాసియున్నారు. ఉద్యోగప్రతాపంబుననే సింధుద్వీపదేవాపి విశ్వామిత్రాదిక్షత్రియులును, కక్షీవతుఁడు మొదలగు శూద్రులును బ్రాహ్మణులైరి. ఉద్యమంబుననే హనుమంతుఁడు సముద్రంబుదాఁటఁగలిగె. ఉద్యమంబుననే నలుఁడు సేతువునిర్మింప రాముఁడులంకానగరంబుజయించె. భీష్ముఁడు, భీముఁడు, కర్ణుఁడు, కృష్ణార్జునులు, విక్రమార్కుఁడు, భోజుఁడు శంకరాచార్యులు, దయానందసరస్వతి మొదలగువారు చేసిన [illegible]ంబుల నుద్యమంబువలననేచేసిరి. ఉద్యమంబుననే ఖండాంతరవిద్వాంసులనేకులు నవీనకళాకౌశలంబుల,నిర్మాణం

బుల, వైచిత్ర్యములఁ గనుఁగొనఁగలిగిరి. ఉద్యమముచేతనే యవనులీ దేశమందు రాజ్యముసంపాదించిరి. ఉద్యమముల మూలంబుననే శివాజీరణజితసింహులు రాజులైరి. ప్రస్తుత మందలి రాజ్యాధికారులుగూడ యుక్తిపూర్వకప్రయత్నంబు లవలననే రాజులుగ నేర్పడిరి. ఉద్యోగంబుననే మేమీగ్రంథము వ్రాసితిమి. పరిశ్రమముచేసియే చదువరులుదీనింజదువగలరు. కావునఁబ్రపంచమందలి సమస్తకార్యంబు లుద్యమంబువలననే నెఱవేరుచుండునని స్పష్టమగుచున్నదిగదా! ఈకారణముంబట్టి యే పూర్వకాలమందలి ఋషిమహర్షులందఱు

శ్రమేణతపసాసృష్టా. అథ. వే. కాం. 12.

అనునీవేదవాక్యము ననుసరించి పరిశ్రమల నొనరించి యుండిరి. కానివర్తమానకాలంబున నవిద్యాకారణమున నా ర్యులాలసులై ప్రారబ్ధము ప్రారబ్ధమని కొట్టుకొనుచుఁ దమ నొసట లిఖింపఁబడియున్నప్రకారము దమకేపదార్థమైన దొర కవలసినచో దొరకియేతీరునని పలుకుచుందురు. ఇట్లుతలపో యువారందరు స్వప్రమాదవశులై "అతోభ్రష్టస్తతోభ్రష్టః" యనునీతినాశనమందుచున్నారు. ఈజగత్తునందుఁ జదువకయు పండితుఁడగుటయు, నన్నముదినకయయాఁకలిదీరుటయు, కర్త లేకకార్యమగుటయు నెప్పుడుగానిసంభవింపనేరదుగదా! ప్ర త్యక్షాదిప్రమాణములవలనను, వేదాదిసత్యశాస్త్రంబులనుండి

యు నీవిధానమే సిద్ధమగుచుండఁ దిరుగఁ గేవలము ప్రారబ్ధము మీఁద నే భారము వైచుకొని కూరుచుండి తమమానవజన్మంబు నష్టముఁ గావించుకొనుట వట్టిమౌర్ఖ్యముగాక మరేమి కాఁగల దు? ఉత్తమప్రారబ్ధకారణంబున ఘుణాక్షరన్యాయముగ మ నుజుఁడు రాజాధిరాజులయిండ్లలో జన్మముగాంచవచ్చును. కాకతాళన్యాయముగ నుత్తమప్రారబ్ధవశంబున దీనులగువా రింటఁబుట్టిన యతఁడు రాజ్యమున కభిషిక్తుఁడుగావచ్చును. కా నియుద్యోగమావంతయు లేక సంప్రాప్తమగు రాజ్యము నష్టమ గుటయు సంభవించుచుండును. ఇఁక నవీన రాజ్యస్థాపనముంగూ ర్చి వేఱుగ వచింపనేల? భీష్ముఁడు యుధిష్ఠిరునకును బ్రహ్మ వశి ష్ఠునకును నుపదేశముజేసియున్న విషయముఁదిలకింపుఁడు.

యథాబీజంవినాక్షేత్రముప్తంభవతినిష్ఫలం
తథాపురుషకారేణ వినాదైవంనసిద్ధ్యతి.
క్షేత్రంపురుషకారస్తు దైవంబీజముదాహృతం
క్షేత్రబీజసమాయోగాత్తతః సస్యంసమృధ్యతే.
కృతఃపురుషకారస్తు దైవమేవానువర్తతే.
నదైవమకృతేకించిత్ కస్యచిద్దాతుమర్హతి,
కృతంచాప్యకృతంకించిత్ కృతేకర్మణిసిద్ధ్యతి
సుకృతందుష్కృతం కర్మనయాథార్థం ప్రతిపద్యతే.
పాండవానాం హృతంరాజ్యంధార్తరాష్ట్రైర్మహాబలైః

పునఃప్రత్యాహృతంచైవన దైవాత్ భుజసంశ్రయాత్
యథాగ్నిః పవనోద్ధూతః సూక్ష్మోపిసుమహాన్భవేత్
తథాకర్మసమాయుక్తందైవంసాధువివర్ధతే.
యథాతైలక్షయాద్దీపః ప్రహ్రాసముపగచ్ఛతి,
తథాకర్మక్షయాద్దైవం ప్రహ్రాసముపగచ్ఛతి.
నచఫలతివికర్మా జీవలోకేనదైవం
వ్యపనయతివిమార్గంనాస్తిదైవేప్రభుత్వం
గురుమివకృతమగ్రం కర్మసంయాతిదైవం
నయతిపురుషకారః సంచితస్తత్రతత్ర.

భార. అను. అ. 6.

క్షేత్రములేనియెడల బీజమునిష్ఫలంబగురీతిఁబురుషప్రయత్నములేనిచో నదృష్టముగూడ సిద్ధింపదు. పురుషప్రయత్నంబుక్షేత్రమును, బీజముదైవమునగుటవలన క్షేత్రబీజంబుల సంయోగంబుననే సస్యసమృద్ధియగు పురుషప్రయత్నమునననుసరించియే దైవముండుఁగాని వేఱువిధముగఁగాదు. కొంచెముగగాని యెక్కువగగాని చేయు సుకృత దుష్కృతంబులంబట్టియే ఫలముచేకూఱుచుండు. పాండవులుతాము కోలుపోయినరాజ్యము ధార్తరాష్ట్రులనుండి దైవబలంబునఁగాక భుజబలంబుననే మరలగ్రహించిరి. అగ్నిసూక్ష్మముగనుండియు వాయువువీచుటచేఁజెలరేగి యెక్కువగుచాడ్పున కర్మ

తోఁగూడి యదృష్టముఁగూడ బెంపొందును. తైలనాశనంబు న దీపముక్షీణించునట్లె వడి కర్మక్షయానంతరమదృష్టంబును క్షీణించును. పురుషప్రయత్నమును, దైవము అనఁగా ప్రారబ్ధము ను గలసిననేయుత్తమఫలములభించుఁగాని యొకటిలేకమఱియొ కదానివలన నంతగఫలముకలుగనేరదు. ఉద్యోగియగుపురు షుఁడే యీప్రపంచంబున నిజబాహుబలంబునంజేసి యనేక క్షేత్రదేశములందు నయితము స్వారాజ్యముస్థాపింపఁగలుగు నుగాని యలసుఁడైననృపాలుఁడు పెద్దలార్జించిన రాజ్య ముయొక్క భాగ్యముమీఁదనే భారమువైచుకొని కూరుచు న్నచో నున్నదానింగూడఁబాడుచేసికొనినవాఁడగును. భాగ్య మునమ్ముకొని యుద్యోగముఁగావింపకయుండుట గొప్పప్రమా దము. పైనివచించినరీతిఁ బ్రారబ్ధము శాస్త్రములలోఁ గేవల ము బీజారూపముగ గణింపఁబడియున్నది. మఱియు,

యథాక్షేత్రంమృదుభూతమద్భిరాప్లావితంతథా
జనయత్యంకురంకర్మనృణాంతద్వత్ పునర్భవమ్

భార. శాం. అ. 321.

కృషికారుఁడు భూమియందున్న యెనువువైచి జలసేచనా దులమూలమున మెత్తబఱచి యనంతరము విత్తనమునాటిన నుత్తమమగునాహారముత్పన్నమగు విధంబున బ్రారబ్ధంబను వి త్తనంబు మానవుఁడొనరించు నుద్యోగమనెడు సజలమృదు

భూమిలో వేయఁబడనేని గార్యసిద్ధిరూపకవృక్షముద్భవించి మనుజునకు సౌఖ్యమను ఫలంబుల నొసంగుఁగాని యితరవిధమునఁ గాదు. ఎందుచేతననఁగా

యథైకేన నహస్తేన తాలికా సంప్రపద్యతే
తథోద్యమపరిత్యక్తం నఫలంకర్మణఃస్మృతం.

ఒక్కచేతితోఁడఁ జప్పటులుగొట్టుటకు వలనుగానిరీతి నుద్యమంబు లేనియెడల గేవలమొక్కప్రారబ్ధమెన్నఁటికి ఫలము నియ్యనేరదు.

పశ్యకర్మవశాత్ ప్రాప్తంభోజ్య కాలేపిభోజనం
హస్తోద్యమం వినావక్త్రే) ప్రవిశేన్నకథంచన.

పంచ. 2.

భాగ్యప్రభావముచేత భుజింపవలసినవేళకుఁ దనప్రయత్నము లేకుండభోజనము ప్రాప్తమైనప్పటికిఁ జేతితోనాహారముఁంగైకొని నోటఁబెట్టుకొననిచో దానియంతనది కడుపులోనికిఁబోఁజాలదు. ఒకవేళనితరులెవరైనఁ గలిపి నోటిలోనిడుదురనుకొనుఁడు. భోజనముఁజేయునతఁడు నమలిమ్రింగిననేదప్ప, లేనియెడల లోపలికెంతమాత్రము దిగనేరదు. లోనికేగకున్న నుదరపోషణముగాఁజాలదు. కావున విచారించిచూడ,

పూర్వజన్మకృతంకర్మ తద్దైవమితికథ్యతే.
తస్మాత్ పురుషకారేణయత్నంకుర్యాద తంద్రితః. హి.ప్ర.

పూర్వజన్మంబునఁగావించియుండిన యుద్యమంబునకే ప్రారబ్ధమని పేరు కావునఁబురుషుఁడీ జన్మమందుఁబురుషార్థంబులఁ జేసితీరవలయు. అట్లుద్యమంబుల నొనరించుటవలననే ప్రారబ్ధమేర్పడును. అదియుంగాక యిప్పుడుద్యమముఁ జేయుటమూలముననే వెనుకటి ప్రారబ్ధము ఫలమొసంగుఁగాని, ప్రయత్నము లేనిచో ఫలముకలుగక పోవుటయటులుండ ప్రారబ్ధమునయితమేర్పడఁజాలదు. కావునఁబ్రత్యక్షఫలదాయకంబగు నుద్యమంబుఁబరిత్యాగముచేసి భాగ్యముమీఁద భారమువైచుకొని యూరకకూరుచుండుట మీయొక్క భ్రమయు, మూర్ఖత్వముగాకున్న మరియేమగును? ప్రారబ్ధముమీఁద భారమువైచుకొని కూరుచుండువారల మూర్ఖులనుటయేమేకాదు భారతముగూడవచించుచున్నది.

యశ్చదిష్టపరోలోకే యశ్చాపిహఠవాదికః
ఉభావపిశఠావైతౌ కర్మబుద్ధిః ప్రశస్యతే.

జగత్తులో భాగ్యముమీఁద భారమువైచుకొని యుండువతఁడును, హఠమూని విరుద్ధకార్యంబు లొనరించునతఁడును మూర్ఖులనఁబడుదురు. కార్యతత్పరుఁడై యుండునతఁడే ప్రశంసనీయుఁడు.

మోహాద్దిష్టముపాసీనో, నిర్విచేష్టః సుఖంశయేత్
అవసీదేత్సదుర్బుద్ధిరామో ఘటఇవోదకే. భార.వ.అ.22.

ఏమనుష్యుఁడు ప్రారబ్ధముమీఁద భారమువైచుకొని యనఁగా నెట్లుకావలసిన నట్లుకాఁగలదను నమ్మకమూని హాయిగఁబరుండియుండునో యట్టివానిశరీరము నీటియందుముంచఁబడు పచ్చిమట్టికుండవిరిసిపోవురీతి నాశనమగుటనిశ్చయము. కట్టా! ప్రస్తుతకాలంబున వేషధారులగు ననేకసాధువులు, గృహస్థులు లోనగువారలాలస్యవశులై ప్రారబ్ధమేమోతమకభ్యంతరములుకల్పించుచున్నదను తలఁపున నాలస్యమునందగుల్కొనియున్నారు.

ఆలస్యంహిమనుష్యాణాం శరీరస్థోమహాన్రిపుః. భర్తృ.

నీశరీరంబున నెలకొనియుండు నాలస్యమే మనుష్యునకుఁబ్రబలమైనశత్రువు. ఆలస్యవైరిమూలముననే బుద్ధిమంతులు సయితమనేకులు దమ సర్వస్వంబుఁగోలుపోయి యున్నారు. ఆలస్యవశులైనకారణముచేతనే యనేకరాజుల రాజ్యములు నాశనములైయున్నవి. పరమబంధువనందగు నుద్యమంబుతోడ విరోధమూని యాలస్యంబను శాత్రవుఁజేపట్టుటవలన దుఃఖముగాక సౌఖ్యమెన్నఁడైనఁగలుగనేర్చునా? ఆలస్యపిశాచంబునకు వశీభూతులై వ్యర్థముగఁగాలమును బాడుచేయుట మహానీచము. ఆలస్యమే శరీరమును మనస్సును నాశనముజేయును. విషంబులలోనెల్ల శిరోమణివిషంబీయాలస్యంబు. ఆలస్యము దుర్గతికిఁదల్లియు, దురాచారమునకుఁదండ్రియు ననఁజెల్లు.

సమస్తదుఃఖములకుమూలము, సకల పాపంబులలోఁ బాపము, సర్వరోగంబులకు నాకరమాలస్యమే. శారీరకాలస్యమునకంటె మానసికాలస్యము సకలానర్థంబులకుఁగారణము- యథాప్రకాశముఁ బ్రవహింపనీయక నడుమనడ్డముగట్టఁబడుటచేనిలువయుండు నీటియందెట్లు దుర్గంధముపుట్టి పురుగులుత్పన్నమగునో యటులే యాలసుఁడగు మనుజుని శరీరమందు రోగముద్భవింప మనస్సునందు దుర్వాసనారూపకంబులైన పురుగులుత్పన్నములగుచుండును. దొంగతనము మొదలగు దుర్వ్యసనంబులన్నియు నాలస్యమువలనఁగలుగు ఫలములేగాని వేఱుకాదు.

అర్థోవామిత్రవర్గోవా, ఐశ్వర్యం వాకులాన్వితమ్,
శ్రీశ్చాపిదుర్లభాభోక్తుం తథైవాకృతకర్మభిః.

భార. అను. అ. 6.

మానవుఁడాలసుఁడయ్యేనేని నట్టివాఁడెప్పటికి ధనాఢ్యుఁడుగానేరఁడని ధ్రువంబుగనమ్ముఁడు. అట్టివానికి నుత్తములైనమిత్రులుగాని యుత్తమంబులైన పదార్థములుగాని లభింపనేరవు. ఘుణాక్షరన్యాయముగ లేనిగొన్నిపదార్థములు దొరకినచోనవి మరల శీఘ్రకాలమందే నాశనమగును. ఆలసియగు మానవుని మనశ్శరీరంబులెల్లపుడు దుఃఖముతోఁగూడుకొనియుండును. అట్టివానికెప్పుడు స్వస్థతగలుగదు ఎవఁడు తన మనోవాక్కాయంబుల శుభోద్యమములందు ప్రవేశపెట్టక

యుండునో యట్టివానిమనసు,

చంచలం హి మనః కృష్ణ భ. గీ. అ. 6.

చలించిపోవుట వలనఁగుకర్మములొనరించుటయందుఁ బ్రవృత్తమగును.

నహి కశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్.
భ. గీ. అ. 3.

ప్రపంచమందలి ప్రాణిసమూహాలన్నియు నేదియో యొకపని జేయుటయందే ప్రవృత్తములై యుండుఁ గాని యూరక యుండుటలేదు. అది వానికి స్వాభావిక ధర్మము. కావున మనుజులుగూడ నిరంతరమేదియో యొక కృషి జేయుచుండవలయు. మూర్ఖులైనవారలనేకులు ఆలస్యవశాత్ములగు కారణంబున నుద్యోగదూరులై తమ మానవజన్మము బాడు చేసికొని కలకాలము దుఃఖమేయనుభవించుచుందురు. ఇది యెంతయు శోకకరముగనున్నది. మరియు మూర్ఖమనుజులాల సులగు కైవడి విద్వాంసులునయితము బ్రపంచమందలి పదార్థములన్నియు బ్రారబ్ధమువలన లభించునవియే యనుయుద్దేశమున నుద్యోగములొనరించుట మానుచున్నారు. ఇట్టివిద్వాంసులకు సృష్టియందలి పదార్థములగుఱించి సరియగుజ్ఞానములేదనవలసియున్నది. వానివాని కారణంబులనుండి సకలపదార్థంబులుత్పన్నమగుచు లయమగుచుండునుగాని యితరమార్గము

నఁగాదు. అఖండమైన సృష్టిప్రవాహంబీనియ మాధారంబుననే వర్తించుచున్నది. ఎవరీనియమము ననుసరించి నడచుకొందు రో యట్టివారలు సంసార సముద్రముందాఁటఁగలుగుదురుగాని యుల్లంఘించువారందు మునుఁగుటయే నిక్కము.జగన్నియంత యగు పరమాత్మయొక్క సృష్టినియమంబులనపాయంబులు చిరంతనములునగు హేతువున వానికనుకూలముగ నడుచుకొ నుటచేతనే మనుష్యుఁడు సౌఖ్యవంతుఁడగును. విద్వాంసుఁడ గు నతఁడెవఁడీ పదార్థములన్నియు ననిత్యములను తలంపున నుద్యోగహీనుండై యుండునో యట్టివానికది గొప్పప్రమాదమే గాని వేఱుకాదు. అట్టిసర్వంబనిత్యంబను వాఁడుఁగూడ భోజనా ది వ్యవహారంబుల యథావిధిఁ జేసికొన వలసియేయుండుఁగదా! ఇఁకనుద్యోగమును మాత్రము పరిత్యాగము జేసినచో నదిప్ర మాదంబు నాలస్యముగాకున్న నేమగును? ఎట్లు భోజనాది వ్యవహారంబులన్నియుననిత్యములనిగుర్తెఱిఁగియుండియువానివి డనాడుటలేదో యటులే తనయొక్కయుఁ దనదేశముయొక్క యు నున్నతికిగారణభూతములైన యుద్యోగరూపక శుభక ర్మంబులగూడ నెప్పటికిఁబరిత్యాగముఁ జేయఁగూడదు. ఈయా లస్యదోషగ్రస్తులగు కారణంబుననే మనుజులనేకులు ఛలకపట పాషండముల మూలముననూ, దొంగతనమువలనను నితరులధన మపహరించుటకలవాటుపడియున్నారు. ఇందువలన లోకము

వశుఁగలుగుచున్న హాని యింతింతయన నలవికాదు. ఇట్టిదుష్కా ర్యములొనరించువారి స్వభావముగూడ నష్టమగును. ఇహపర లోకంబుల రెండింటియందుఁగూడ వీరికి దుఃఖమే. గనుకనే వేదమందు,

మా గృధః కస్యస్విద్ధనమ్. య. అ. 40.

మనుజుఁడా! నీవెవ్వరి ధనమును నభిలషింపకుము కాని,

కుర్వన్నే వేహకర్మాణిజిజీవిషేత్.

స్వపురుషార్థముచేతనే సకలపదార్థంబుల సంపాదించు కొని జీవింపనెంచుమని యాజ్ఞాపింపఁబడియున్నది. జనులిట్టివే దవాక్యములయెడల దృష్టిలేక పూర్వులచే సంపాదింపఁబడుధన మువలన ధనవంతులగు కారణంబున స్వయముగ నుద్యమం బుల నలుపుటమానియున్నారు. వారలకిదిగొప్పప్రమాదమై యున్నది. పూర్వులెట్లుధనోపార్జనము సలిపియుండిరో యదే వి ధమునఁ దాముగూడ జేయవలయును. ఉద్యమవిహీనుఁడై కూ రుచున్నచో నదివఱకున్న ధనము సయితము నాశనమగుట సంభవించును.

తస్యచాపిభవేత్కార్యం వివృద్ధౌరక్షణేతథా.

భక్ష్యమాణోహ్యనాదానాత్ క్షీయేతహిమవానపి.

భార. వ. అ. 32.

ధనవంతుఁడుగూడదనధనమునభివృద్ధిచేసికొనుచురక్షిం చుకొనుచుండవలయును. ఆదాయములేక వ్యయముమాత్రమే యగుచుండిన యెడల హిమాలయపర్వతము సయితము నాశ నంబగుట సంభవమైయుండఁ గొంచెముమాత్రమగు ధనముం గూర్చి వేఱుగవచింపవలయునా? కావునధనాఢ్యులును బురు షార్థములఁజేయవలయు.

ఉద్యమఃఖలుక ర్తవ్యో నిర్ధనేనవిశేషతః

సమస్తమానవమాత్రులుద్యోగంబులసలుపవలయుఁగా ని ధనహీనుండగువాఁడహర్నిశంబులుద్యోగతత్పరుఁడైయుండు టావశ్యకము. మఱియు,

వీరఃసుధీఃసువిద్యశ్చపురుషఃపురుషార్థవాన్

తదన్యేపురుషాకారాః పశవఃపుచ్ఛవర్జితాః. పు. ప.

శూరవీరులు, బుద్ధిమంతులు, నుత్తమవిద్యావంతులు, పురుషార్థులునైన జనులే పురుషులనఁబడుదురు. ఎవరియందట్టి పురుషార్థాది సద్గుణములుండవో వారలుపురుషాకారంబున నొ ప్పుపశువులేకాని వేఱుకాదు. కావునఁ బ్రతిమానవుఁడుద్యోగ తత్పరుఁడై యుండవలయు. బుద్ధిహీనులై యాలసులనేకులు దమజ్ఞాతులు మొదలగువారలు మరణించుటచేతను మరియు ననేకవిధములైన దుస్తంత్రములచేతను నితరులధనము తమకు రావలయుననికోరుకొనుచుందురు. ఇది వారలపందతనమేగాని మఱేమియుఁగాదు.

సింహాఃసత్పురుషాశ్చైవనిజదర్పోపజీవినః
పరాశ్రయేణ జీవంతికాతరాః శిశవఃస్త్రియః. పు. వ.

సింహంబులును, సత్పురుషులును స్వపురుషార్థముల మూలమున జీవన మొనరించుచుందురు కాని పిరికిపందయగునతఁడు శిశువులతోడను స్త్రీలతోడను సమానముగ నితరుల నాశ్రయించి జీవించుచుండును. తెలివిమాలినయబలంబోలి యితరపురుషులయొక్క యాశ బెట్టుకొనక మనుజుఁడు స్వయముగ బురుషార్థములఁజేసికొను చుండవయును. పురుషార్థములసల్పకుండుకారణమున మనుష్యులయందు దారిద్ర్యమభివృద్ధినొందుచుండును. మనహైందవార్యులు దరిద్రులగుటకు గారణములనేకములుండియున్నవి కాని యన్నింటిలో ముఖ్యకారణమది వరకుంను భాగ్యముమీాద భారమూని యుద్యమంబులచేయకుండుటయే. కృత్రిమభోగంబుల బరిత్యజించి యెంతపర్యంత మున్యోగంబుల సల్పకయుందురో యంతపర్యంతమీా దేశముయొక్క దారిద్ర్యమెంతమాత్రము దూరముగానేరదని మేముశపథముజేసి వక్కాణించుచున్నాము. ఇటులే

అనిర్వేదఃశ్రియోమూలం లాభస్యచశుభస్యచ
మహాఁన్ భవత్యనిర్విణ్ణః సుఖశ్చానంత్య మశ్నుతే.

భార. ఉ. అ. 3.

ధనంబుగాని, విద్యాద్యుత్తమగుణంబులగాని పొందుటకు ముఖ్యసాధన ముత్సాహపూర్వకప్రయత్నము. ప్రయత్నశీలుఁడైనమనుజుఁడధమావస్థనుండి యుత్తమస్థితినొందఁగలుగు. ఉత్సాహములేనివారలు ధనముగాని, యుత్తమస్థితింగాని పొందఁజాలరు.

దుఃఖార్తేషుప్రమత్తేషు నాస్తికేష్వలసేషుచ,
నశ్రీర్వసత్యదాం తేషుయేచోత్సాహవివర్జితాః.
భార. ఉ. అ. 39.

అవిద్యాదిక్లేశముల మూలంబున ననుదినము దుఃఖముఁ బొందుచుండునట్టియు, మద్యద్యూతాది దుర్వ్యసనంబులందగులుకొని యుండునట్టియు, వర్తమానకాలమందలి నవీనవేదాంతులంబోలి ప్రత్యక్షములగుచున్న పదార్థములంగూడ నిషేధించునట్టియు, నాలసులింద్రియారాము లుత్సాహశూన్యులనగుమనుష్యులదగ్గర ధనాద్యుత్తమ పదార్థములు నిలువఁజాలవనియు, నుద్యోగియగువాఁడే ధనవంతుఁడగుననియు భారతమందులిఖింపఁబడియున్నది.

ఉద్యోగినంపురుషసింహముపైతిలక్ష్మీ
ర్దైవంహిదైవమితి కాపురుషావదంతి
దైవంనిహత్యకురుపౌరుష మాత్మశక్త్యా
యత్నేకృతేయదినసిద్ధ్యతికోత్రదోషః. పంచ.

సింహముతో సమానముగ నెవఁడుద్యోగతత్పరుఁడై యుండునో యట్టివానికే లక్ష్మియనఁగా ధనము సంప్రాప్తమగును. పిరికిపందయగువాఁడు కేవలముప్రారబ్ధము ప్రారబ్ధమని కొట్టుకొనుచుండును. అట్టివానికేమియు దొరకనేరదు. వాఁడు బ్రతికియున్నంతకాలము దరిద్రుఁడుగనేయుండును. కావునఁబ్రారబ్ధముదూరముగనిడి శక్తికొలఁది ప్రయత్నంబుల సలుపవలయును. ప్రయత్నము జేసినప్పటికిఁగార్యము సిద్ధింపనియెడల నందలి లోపాలోపంబులఁగూర్చి బాగుగయోచించి కలిగినదోషముగనుగొని దాని నివర్తిజేసికొనుచుఁగార్యకరణమందు దత్పరుఁడైసిద్ధిని బొందుచుండవలయునని పంచతంత్రంబునను,

ధీమంతో వంద్యచరితా మన్యంతే పౌరుషంమహత్
అశక్తాఃపౌరుషంకర్తుంక్లీవాదైవముపాసతే. శు. నీ. అ. 1.

సదాచరణంబులొనరించు బుద్ధిమంతులు పౌరుషమే శ్రేష్ఠమైనదని భావించుచుందురు కాని బలహీనులు, నపుంసకులు నగువారలు కేవలముభాగ్యముమీఁదనే భారమువైచుకొని యదృష్టమునేసేవింపుచుందురని శుక్రనీతియందును లిఖంపఁబడియున్నది. భాగ్యమునమ్ముకొని ప్రత్యక్షఫలదాయకంబైన యుద్యమంబుఁబరిత్యాగముఁ జేయుటజూడ బాధువుచుభోఁగొట్టుకొనుటతోసమానమైయున్నది. సహోదరాదిభాంధవులు పురుషునకు సౌఖ్యదాయకులగు చాప్పుననుద్యమముగూడ

మానవునకు బంధువై సుఖముగలుగఁజేయుచుండును. ఇంతి యకాదు. ఉద్యమముబంధువునకంటెఁ గూడనధికమనంజెల్లు. వెండియు

నాస్త్యుద్యమసమోబంధుః కుర్వాణోనావసీదతే.

భర్తృ. నీ. శ.

పురుషునకుద్యోగముతోడ సమానమగు బంధువే లేదని భర్తృహరి వచించియున్నాఁడు. ఒక్కొక్క సమయంబున బంధువులగువారలు ప్రాణికిసహాయపడక పోవచ్చునుగాని యుద్యోగమొనరించుచో నది నిష్ఫలమెన్నటికిఁగాదు. కావున మనుజుఁడవశ్యము ప్రయత్నశీలుఁడుకావలయు. చేసినప్రయత్నమెప్పుడైన నిష్ఫలమగుననుకొనుఁడు. ఆలస్యముతోఁగూడియుండుసిరుద్యోగంబుకంటె నట్టినిష్ఫలమైన యుద్యమమే యుత్తమము. తనకర్తవ్యముందానునెరవేర్చినందునఁ గార్యము ఫలవంతము గాకపోవుటకు తన యాలస్యదోష మేమియుకారణముకాదనిమానవుఁడు తృప్తిగలిగియుండును.మరియు నేదేనినుద్యోగమొనరించవలయునను వ్యసనంబుఁగలిగియుండు కతన నొకపర్యాయమొక కార్యము సిద్ధింపనియెడల మరలదానినేచేయ మొదలుపెట్టుకారణంబున నొకమారుగాకపోయిన మరియొకమారైననట్టివానికి జయముచేకూరుచుండును. ఉద్యోగమువల నమూర్ఖుఁడు విద్వాంసుఁడును, నిర్ధనుఁడు ధనాఢ్యుఁడును, నప్ర

తిష్ఠితుఁడు ప్రతిష్ఠితుఁడును, నధర్మాత్ముఁడు ధర్మాత్ముఁడును నగును. మానవునకుఁగల దుఃఖమును దూరము జేసి సౌఖ్యము కలుగఁజేయునది యుద్యమమేగాని వేరేదియుఁగాదు. నిరుద్యోగులై స్వస్థముగ గూరుచుండియున్న యెడల దమకెట్టిదుఃఖముక లుగనేరదని బుద్ధిహీనులు కొందఱు తలచుచుందురు. కాని యట్లూరక కూరుచుండియుండుటవలన గలుగుఫలితము చాలమందికి విశదమై యుండవచ్చును. ఎవఁడుద్యోగమొనరించుటకు వెనుకతీయునో యట్టివాఁడవశ్యంబుగ దుఃఖభాగియగును. ఉష్ణమునకు శైత్యమునకుఁ బరస్పరవిరోధమున్నరీతి నుద్యోగమునకును దుఃఖంబునకును వైరము కలదు. ఎచటనుద్యోగము లు జరుపఁబడుచుండునో యచట దుఃఖమునకు నిలువనీడయుండదు కాని యుద్యోగరాహిత్యమైన స్థలమందు దుఃఖమే నెల కొనియుండును. ఉద్యోగము చేయునప్పుడు చేయునప్పుడు కూడ మనుష్యునకు శ్రమకలుగుచుండును. కాని,

సుఖందుఃఖాంతమాలస్యం దాక్ష్యందుఃఖసుఖోదయం,
భూతిః శ్రీర్హ్రీర్ధృతిః కీర్తిర్దక్షేవసతి నాలసే,

భార. శాం. అ.27.

ఉద్యోగము చేయునపుడు మొదలుకొంచెము దుఃఖముగ నుండి తుదకది యుత్తమంబగు సౌఖ్యముగఁబరిణమించును. నిరుద్యోగమందు మొదలు మొదలు సుఖముగనేయుండును

గాని తుట్టతుదకు మహాఘోరమైనదుఃఖమనుభవింపవలసివచ్చు ను. ఐశ్వర్యము, ధనము, లజ్జ, ధృతి, కీర్తి మొదలగునవి యుద్యోగియగువానికే సమకూరుచుండు కారణంబున నట్టి వాఁడే సర్వదాసౌఖ్యమందుచుండును. నిరుద్యోగున కెల్లప్పుడు దుఃఖమే. ప్రపంచమందలి సకలపదార్థములు యత్నపరునకే లభించుచుండును. ఏసమయమందేపదార్థమవసరమైననాసమయ మందాపదార్థము నుద్యోగియగునతఁడే యథాశక్తి నుత్పన్న ముఁజేసికొనఁగలుగును. నిరుద్యోగియగు నతఁడు తన యుదర పోషణముసహితము జేసికొనఁజాలక దుఃఖించుచుండును. ఈ హేతువు చేతనే

నియతంకురుకర్మత్వం కర్మంజ్యాయోహ్యకర్మణః
శరీరయాత్రాపిచతే నప్రసిద్ధేదకర్మణః. భ. గీ. అ. 3,

ఉద్యోగ మొనరించక యుండుటకంటె ప్రయత్నశీలుఁ డై యుండుటత్యుత్తమంబగు గావున నీవు నిరంతరము గర్మ నొనరించుచుండుము. కర్మహీనుఁడై యుండుటవలన నన్నపా నాదులకు సంబంధించిన వ్యవహారములుఁగూడ యథాప్రకార ముజరుఁగజాలవు. తన్మూలమున శరీరస్థితికేభంగముకలుగునని కృష్ణుఁడర్జునునితో వచించియుండెను. మరియు,

అలక్ష్మీరావిశత్యేనంశయానమలసంనరం
నిఃసంశయంఫలం లబ్ధ్వాదక్షో భూతిముపాశ్నుతే.
భార. వ. అ. 32.

ఏపురుషుఁడాలస్యంబున మునిఁగియుండునో యట్టివాని ద్రవ్యంబంతయు నాశనంబై పోవ దారిద్ర్యమేయావరించి యుం డుననియు, పురుషార్థియగునతఁడు ధనాదిసకలపదార్థములఁ జే కూర్చుకొని యెల్లవేళలనానందము బొందుచుండుననియు భా రతమున వ్రాయఁబడియున్నది. కావున నాలస్యంబను నిద్దురం బారఁదోలి పురుషార్థరూపక జాగరణంబవలంబించి యిహపర లోకంబులనెల్ల సౌఖ్యము లనుభవించుచు మానవజన్మమును సార్థకముజేసికొందురుగాక యని సకలసజ్జనులతోడ నివేదన ముఁజేసికొనుచున్నారము.

అధర్మమార్గమున ధనమునార్జించి తన్మూలమున జను లు గర్వపూరితులుకాఁగూడదు. ధనముచేత మూర్ఖులనేకులు మదోన్మత్తులగుచున్నారు. అటులెప్పటికిఁగూడదు.

అర్థార్థీజీవలోకోయం శ్మశానమపిసేవతే
జనితారమపిత్యక్త్వా నిఃస్వంగచ్ఛతిదూరతః.
భక్త్ద్వేషోజడప్రీతిః సురుచిర్గురులంఘనే
ముఖేకటుకతానూనంధనినాం జ్వరిణామివ.
బధిరయతికర్ణవివరం వాచంమూకయతి నయనమంధయతి
వికృతయతిగాత్రయష్టిం సంపద్రోగోయ మద్భుతోరాజన్.
సుభా. ప్ర. 2.

కేవలము ధనమందేకాంక్షగలమనుష్యుఁడు తల్లిదండ్రు

లసయితము బరిత్యాగమొనరించి శ్మశానసేవనముగావింప నంగీకరించును. ధనమదంబున మనుజులు కొందఱు తమకు హితమొనగూర్చుభక్తజనులయెడల ద్వేషమూని జడాత్ములైనదుష్టులతో నెయ్యముమీరవర్తించుచు శిరసావహించి మన్నింపదగినగురువాక్యంబులఁగూడఁ గడునిర్లక్ష్యభావంబునఁదిరస్కరింపుచుందురన నిఁక దక్కుంగలవారిగణింపనేల? జ్వరపీడితులగువారలకుంబోలి ధనమదాంధుల నోరెల్ల పుడు కటువుగనేయుచును. అనఁగా ధనగర్వితుఁడెల్లవేళల గటువచనంబులే వచింపుచుండును. ఇంతియకాదు. ధనంబనురోగము బుద్ధిహీనుఁడగుమానవునకు చిత్రవిచిత్రదశలఁ గలుగఁజేయుచుండును. ఇతరులవాక్యములను జెవులకు వినఁబడనియ్యదు, ఎవ్వరైన నేదేనినొకసంగతిగూర్చియడిగినచో నంములకుఁబ్రత్యుత్తర మొసఁగనీయదు. ఎట్టయెదుటికే తెంచిన మనుజులసయితము గన్నులకుఁగనబడనీయదు. పక్షవాయువు రోగంబువలన మానవుని శరీరమే విధమున వంకరలుతిరిగి ముడుచుకొని పోవునో యదేవిధమున ధనంబను పెద్దరోగమువలనఁగూడఁబురుషుఁడు ప్రపంచమునుండి ముడుచుకొనియుండును. రెండియు ధనగర్వంబున మూఢుఁడనేకప్రకారంబులైన దుష్కార్యము లొనరించుటకును బాల్పడుచున్నాఁడు. కావున బుద్ధిమంతులగువారలు ధనముచేత జనియించు నిట్టియుపద్రవములనుండి దూరగులై సజ్జనతా...

కంబుగ నుత్తమోత్తమంబులైన సకలవ్యవహారములఁ జేసికొ నుచుండవలయును. వర్తమానకాలమందనేక నవశిక్షితధర్మా ధర్మములయెడల ధ్యానమియ్యఁగూడదు. అనఁగా

టకాధర్మః టకాకర్మః

అనువచనమును బ్రమాణముగఁగైకొని ధర్మాధర్మం బుల విచారించక కుకర్మంబుల మూలమున ద్రవ్యమునార్జించి యిష్టమువచ్చినరీతిఁ దినుటయందును ద్రావుటయందును నైహి కానందంబులఁ దేలుటయందును వ్యయముఁజేయుచున్నారు. కేవలముతుచ్ఛభోగంబు లనుభవించవలయునని యధర్మమా ర్గంబున ధనసంచయముజేయుట శాస్త్రవిరుద్ధము.

పరిత్యజేదర్థకామాయాస్యాతాం ధర్మవర్జితౌ
ధర్మంచాప్యసుఖోదర్కం లోకవిక్రుష్టమేవచ.

మను. అ. 4.

ఆధర్మమంబునఁజేకూరు ద్రవ్యంబును, దూషితమైనేవి షయవాసనను బరిత్యాగ మొనరించవలయుననియు నంతమం దుసౌఖ్యముగఁ బరిణమించనట్టియు సంసారమునకు హానినాపా దించునట్టియు ధర్మంబును ధర్మమైనను విడువవలయుననియు మనుస్మృతివచింపుచున్నది. మహాభారతమందు ధనమేధర్మము ని వ్రాయఁబడియుండుట యందలియభిప్రాయమేమన ధనము వలన మనుజుఁడు ధర్మోపార్జనంబొనరించు ననియేకాని వేరు కాదు. ఇందుచేతనే వెండియు మనుస్మృతియందు,

అలబ్ధంచైవలిప్సేతలబ్ధం రక్షేత్ప్రయత్నతః
రక్షితంవర్ధయేంచైవ వృద్ధంపాత్రేషునిక్షిపేత్.

మను. అ,7.

మనుష్యుఁడు తనకప్రాప్తంబులైన పదార్థంబులఁబ్రాప్తింపఁజేసికొనవలెననుబుద్ధిగలిగి ప్రాప్తమైనవానిబ్రయత్నపూర్వకంబుగ రక్షించుకొనుచు, రక్షించుకొనువాని నభివృద్ధిచేసికొనుచు వృద్ధియైనవాని దేశమునకుపకరించు సత్కార్యములందు వినియోగించవలయునని వ్రాయఁబడియున్నది. కావున మనుజులు దరిద్రులైయుండక, లోభియగువానివలె ధనమునంతయు నొకచోఁగూడబెట్టి మరణమునొంద ధూర్తులాధనంబును దుష్కార్యములందుఁ బాడుచేయకుండురీతి ధన మార్జింపవలయుననియే శాస్త్రకారుల సిద్ధాంతము.

ఏతచ్చతుర్విధం విద్యాత్పురుషార్థప్రయోజనమ్,
అస్యనిత్యమనుష్ఠానం సమ్యక్కుర్యాదతంద్రితః

మను. అ. 7.

మనుజుఁడు పైనవచించిన నాలుగువిధములైన పురుషార్థములొనరించుటయందుఁ దత్పరుఁడైయుండిననే మనుష్యజన్మము సఫలమగును.

ఇఁకనిప్పుడు పురుషుఁడేలాటియుద్యోగముల మూలమున ధనాదిపదార్థంబుల నార్జించి తన మానవజన్మము సఫలము

చేసికొనఁగలునో యోచింతము. ఈవిషమై వేదాది సత్యశాస్త్రములసిద్ధాంత మేమన,

ప్రాతారత్నం ప్రాతరిత్వాదధాతితంచికిత్వాన్ ప్రతిగృహ్యాని ధత్తే। తేనప్రజాంవర్ధయమాన ఆయూరాయస్పోషేణసచ తే సువీరః ఋ. అ. 2. అ. 1. వ. 10.

సువీరః- పరాక్రమశాలియు, చికిత్వాన్- జ్ఞానవంతుఁడును, ప్రాతరిత్వా- ప్రాతఃకాలమునయందు మేల్కొనునతఁడును, రత్నందధాతి- ప్రభాతమందుత్తమపదార్థములఁ దాల్చునతఁడును,

అనఁగా దినారంభకాలమందు సృష్టిలోని యుత్తమశిక్షచే దన యాత్మనలంకరించుకొనువాఁడును, తంప్రతిగృహ్యానిధత్తే- తానుపొందిన శిక్షను బహోపకారార్థ మితరులకొసంగునతఁడును, లేక యితరులనుండి గ్రహించునతఁడును, తేనప్రజావర్ధయమాన- యుత్తమములైన శారీరకమానసిక శిక్షణాంబులవలన దన సంతానమునకున్నతి గలుగఁజేయు వాఁడును నగుపురుషుఁడు, ఆయూరాయస్పోషేణసచతే తన జీవనంబును ధనమును నభివృద్ధిచేసికొనఁగలుగునని ఋగ్వేదమందును

వశ్యేంద్రియంజితాత్మానం ధృతదండం వికారిషు
పరీక్షకారిణం ధీరమత్యంతం శ్రీర్ని సేవతే. భార. ఉ. అ. 34.

ఎవఁడుజితేంద్రియుఁడై మనస్సు వశపరుచుకొనియుం

డునో, యెవఁడుముష్టశిక్షణుఁడైన పరమాత్మ మొదలుకొని జగత్తునందలి సకలపదార్థంబుల సమ్యగ్విధానంబునఁ బరీక్షచే యుచుండునో, యెవఁడుదుఃఖముగలిగినను జలింపకయుండునో యట్టిపురుషునకే ధనములభించి యతనివద్దనే చిరకాలము నిల చియుండునని భారతమందును,

విద్యావితర్కోవిజ్ఞానం స్మృతిస్తత్పరతాక్రియ
యస్యైతే షడ్గుణాస్తస్యనసాధ్యమతివర్తతే.

చ. సూ. అ. 9.

ఏపురుషునందు విద్యయు, యుక్తిపూర్వక వితర్కంబును, సకలపదార్థముల సూక్ష్మదృష్టిఁగనుంగొను విజ్ఞానంబును, స్మృతియు, కర్మతత్పరతయుఁ గ్రియయు నను నారు గుణములు నెలకొనియుండునో యట్టివానికే ప్రపంచంబున నసాధ్యమగు కార్యమేదియు లేదని చరకమందును నటులే పంచతంత్రంబున,

ఉత్సాహసంపన్నమదీర్ఘసూత్రం క్రియావిధిజ్ఞంవ్యసనేష్వసక్తం శూరంకృతజ్ఞం దృఢసౌహృదంచ లక్ష్మీః స్వయం మార్గతి వాసహేతోః.

ఉత్సాహవంతుఁడును, నదీర్ఘసూత్రుఁడనఁగా నొక దినములోఁజేసికొనఁదగిన కార్యము నెలవరకుఁగాని సంవత్సరమువరకుఁగాని యాపియుంచక శీఘ్రకాలమునందే చేసికొనుచుండు

నతఁడును, నేకార్యమేవిధమునఁ జేసిన సఫలమగునదియుఁ దెలిసియుండునతఁడును, దొంగతనము, వ్యభిచారము మొదలగు దుర్వ్యసనములనుండియు, భంగు, గంజాయిఁ నల్లమందులోనగు మాదకద్రవ్యములనుండియు దూరముగనుండునతఁడును, పరాక్రమశాలియు, చేసినమేలు మరవనివాఁడును, జనులందఱితో మైత్రికలిగియుండు నతఁడునునగు పురుషునిలక్ష్మిస్వయముగ వెతకిపొందుననియు,

యత్రోత్సాహసమారంభో యత్రాలస్యవిహీనతా,
నయవిక్రమసంయోగస్తత్ర శ్రీ రచలాధ్రువం.

పంచతంత్రం.

ఏప్రదేశమందుత్సాహ పూర్వకంబగు నుద్యోగముజరుగుచుండునో, యెచట నాలస్యము కలుక నేకలుగదో, యెచట నీతిపరాక్రమాదులు నెలకొనియుండునో యచట నేనిక్కువముగ లక్ష్మియెల్లప్పుడు నివాసముచేయుచుండుననియు వ్రాయఁబడియున్నది. మరియు నేకార్యమొనరించుటకైన నుత్సాహమావశ్యకము.

నిరుత్సాహస్యదీనస్య శోకపర్యాకులాత్మనః
సర్వార్థావ్యవసీదంతి వ్యసనంచాధిగచ్ఛతి.

వా. రా. యుద్ధ. స. 1.

ఎవఁడునిరుత్సాహముగాని దీనుఁడై శోకమందుచుండు

నో యట్టివానికే కార్యము ఫలించకపోవుటవలన నిరంతరము తేఁడు దుఃఖమునే యనుభవించవలసివచ్చును. కావుననుత్సాహముతో నుద్యోగతత్పరుఁడై యుండుట మనుష్యునకు ముఖ్యమనియు,

ఉత్సాహోబలవా౯ ఆర్యనాస్త్యుత్సాహాత్ పరంబలం
సోత్సాహస్యహిలోకేషు సకించిదపిదుర్లభమ్.
ఉత్సాహవంతః పురుషాః నావసీదంతికర్మసు
ఉత్సాహమాత్రమాశ్రిత్యప్రతిలప్స్యా మజానకీం.
వా. రా. కి. స. 1.

ఆర్యా! ఉత్సాహమేయెక్కుడు బలము. దానికిమించినదేదియు లేదు. ఉత్సాహవంతుఁడగువానికే జగత్తునందు సకల పదార్థములు లభించుచుండును. ఏకార్యముఁజేయుటయందైన నుత్సాహవంతుడే దుఃఖితుఁడుగాని హతాశుఁడుగాని గాకయుండును. కేవలముత్సాహమువలననే మనము జానకింగైకొనఁగలమని లక్ష్మణుఁడు రామునితో వచించినట్లురామాయణమున లిఖింపఁబడియున్నది. పురుషుఁడుద్యోగశీలుఁడై కృతకార్యుఁడగుట కనేకసాధనము లావశ్యకములై యున్నవి. వానిలో ముఖ్యమైన ప్రథమసాధనము ప్రాణరక్షణము. దీని విషయమై యింతకుముందే వ్రాయఁబడియున్నది. రెండవసాధనము సదాచారము.

ఋతం వదన్నృతద్యుమ్న సత్యంత్సత్యకర్మన్.

ఋ. అ. 7. అ. 5. వ.26.

సత్యముఁబలుకుచు నిక్కువంపు ధనధాన్య యశంబులఁ బొందవలెననియు, సత్యమాడుచు సత్యకార్యంబులనొనరించు వలయుననియు ఋగ్వేదమందును,

ఆచారాల్లభతేహ్యాయురాచారాదీప్సితాః ప్రజాః
ఆచారాద్ధనమక్షయ్య మాచారోహ్యంత్యలక్షణమ్.

మను. అ. 4,

సదాచరణంబులనలంబించి యుండుటవలననే యాయు వభివృద్ధినొందును. ఎట్టిసంతానముకావలసిన నట్టిసంతానమును సదాచారంబులఁబూనుటచేఁ బొందఁగలుగును. సదాచారంబు వనే మనుష్యునకు ధనములభించు। మనుష్యునియందుండెడు దుర్లక్షణంబులన్నియు సదాచారంబుననే నాశనమగును. సదాచారంబను గుణముండిననే తక్కినసమస్తగుణములు ప్రకాశించుఁగాని లేనిచోఁదక్కిన గుణము లవగుణములేయగును. మానవుఁడెంత విద్యావంతుఁడై యెంతబుద్ధిశాలియైయుండినను సదాచారములఁ బూనియుండనియెడల నట్టివాఁడీలోకంబునఁ బ్రతిష్ఠఁగావించనేరఁడు. మఱియు,

దురాచారోహిపురుషోలోకే భవతినిందితః
దుఃఖభాగీచసతతం వ్యాధితోల్పాయురేవచ. మను. అ. 4.

దురాచారంబు వలనఁబురుషుఁడు లోకముచేతనిందింపఁబడుచు నెల్లప్పుడు చింతాకులుఁడై వ్యాధిపీడితుఁడై యుండు కారణమున నట్టివాని యాయువుసయితము క్షీణించిపోవును. విద్యాదిగుణములు లేకపోయినను సదాచారుఁడైయుండిన మేలే యగు.

సర్వలక్షణహీనోపి యఃసదాచారవాన్నరః
శ్రద్ధధానోనసూయశ్చ శతంవర్షాణిజీవతి. మను. అ. 4.

సమస్తగుణములనుండి దూరుఁడయ్యు మనుష్యుఁడుత్తమంబగు నాచారముల నవలంబించి సత్యాగ్రహణుఁడై యానందము గలిగియుండుచో నూఱుసంవత్సరములపర్యంతము జీవింపఁజాలునని మనుస్మృతియందును,

యాసాధూంశ్చఖలాన్ కరోతివిదుషోమూర్ఖాన్హితాన్
ద్వేషిణః ప్రత్యక్షం కురుతేపరోక్షమమృతం హాలాహలం
తత్క్షణాత్ తామారాధయసత్క్రియాంభగవతీం భోక్తుం
ఫలంవాంఛితం హేసాధోవ్యసనైర్గుణేషువిపులేష్వాస్థాంవృథా మాకృథాః. భర్తృ. నీ.శ.

మానవులకు సదాచారపరుఁడై యుండుటత్యంతముఖ్యము. సదాచారము దుష్టులను సజ్జనులుగను, మూర్ఖులను విద్వాంసులుగను, శాత్రవులనుమిత్రులుగను, బరోక్షపదార్థంబులను బ్రత్యక్షములుగను నొక్కక్షణములోఁ జేయుచుండు

వని భర్తృహరియందును వ్రాయఁబడియున్నది. సదాచారంబున నరుఁడుభయలోకములఁ గూడఁదరింపఁగలుగును. ఇఁకఁ గృతకార్యుఁడగుటకు మనుష్యునకు మూఁడవసాధనము విద్య. దీనిగురించి యిదివరకే వ్రాసియున్నాము. నాలుగవసాధనము బుద్ధి. ఈవిషయమైఋగ్వేదమందు,

మనీషిణఃప్రభరధ్వం మనీషాం యథాయథామతయః
సంతినృణామ్. ఋ. అ. 8. అ. 6. వ. 10.

మనుజుఁడా! నీవేలాటిబుద్ధిమంతులఁగలియుచుందువో యట్టివారియందెంత బుద్ధినెలకొనియుండునో దాని యంతటివలన నీబుద్ధినభివృద్ధి పరచికొనుమనియు,

ధియావసుర్జగమ్యాత్. అథ. కా. 20, అను. 4. వ. 35.

బుద్ధిచేతనేమానవులు ధనాదిపదార్థముల నొందఁగలుగుదురని యథర్వంబునను,

ప్రజ్ఞాసంయోజయత్యర్థైః ప్రజ్ఞాశ్రేయోధిగచ్ఛతి
రాజానో భుంజతేరాజ్యం ప్రజ్ఞయాతుల్యలక్షణాః
భార. శాం. అ. 238.

బుద్ధియే మనుష్యులకు ధనాదిపదార్థములఁ గలుగఁజేసి కళ్యాణమొనగూర్చును. బుద్ధి బలసహాయంబుననే రాజులనేకరాజ్యము లనుభవించుచుందురు కావున మనుజుఁడవశ్యముగ బుద్ధినివృద్ధిఁజేసికొనవలయునని భారతంబునను వ్రాయఁబడియున్నది. వెండియునాబుద్ధి,

శుశ్రూషాశ్రవణంచైవ గ్రహణంధారణంతథా,
ఊహాపోహార్థవిజ్ఞానంతత్వం జ్ఞానంచధీగుణాః.
వా. రా. కి. స. 34. ౭వ శ్లోకమునకు టీక.

శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము,ఊహ, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానములోనగు గుణంబులతోఁగూడుకొని యుండవలయును. మనుష్యుఁడు తనునల్పునిగ నెంచుకొనుచుం డుట అయిదవసాధనము. అనఁగా సర్వవిధములఁదాను సంపూర్ణుఁడైనట్లు తలపఁగూడదు.

నపూర్ణోస్మీతిమన్యేత ధర్మతఃకామతోర్థతః
బుద్ధితోమిత్రతంచాపి సతతం వసుధాధిప,
భార. శాం. అ. 92.

ధర్మము, కామము, అర్థము, బుద్ధి, మైత్రి మొదలగు వానియందుఁ దానుసంపూర్ణుఁడైనట్లు భావించక యథావిధి నీపదార్థంబుల వృద్ధిఁజేసికొనుచునే యుండవలయుననియుతథ్య ఋషి మాంధాతతోడ నచించియుండెను. కృతకార్యుఁడగుట కారవ సాధనము సత్సంగము.

బుద్ధివిద్యావయఃశీలధైర్యస్మృతి సమాధిభిః
బుద్ధోపసేవినోవృద్ధాః స్వభావజ్ఞాగతవ్యథాః.
సుముఖాఃసర్వభూతానాం ప్రశాంతాశ్శంసితవ్రతాః
సేవ్యాఃసన్మార్గవక్తారః పుణ్యశ్రవణదర్శనాః,
చర. సూ. అ. 7.

బుద్ధి, విద్య, వయస్సు, ధైర్యము, స్మృతి, సమాధి మొదలగువానియందుఁ దమకన్న బెద్దవారలగునట్టియు, నట్టి వృద్ధుల సేవించియుండునట్టియు, దుఃఖాత్ములుగాక ప్రసన్నులై సమస్తజీవాత్మలకు శాంతినొసంగువారును, నుత్తమాచరణంబులంబూని సత్యమార్గంబుల నుపదేశముఁజేయుచు బహుశ్రుతులై చూడసుందరాకారంబుల నొప్పియుండువారును నగు సజ్జనులతో సాంగత్యముచేయవలయునని చరకంబునను,

జాడ్యంధియోహరతి సించతివాచిసత్యం
మానోన్నతిందిశతి పాపమపాకరోతి
చేతఃప్రసాదయతి దిక్షుతనోతికీర్తిం
సత్సంగతిఃకథయకిన్నకరోతి పుంసాం. భర్తృ. సీ, శ.

బుద్ధియందలి మాంద్యముంబోనడచునదియు, నోటివెంటసత్యముఁబలికించునదియు, మనస్సునభివృద్ధి చేయునదియుఁ, బాపమునుండిరక్షించునదియుఁ, జిత్తమునుబ్రసన్నముగ నుంచునదియు నగునుత్తమసాంగత్యము మనుష్యులకు సర్వవిధములఁ దోడుపడుచుండునని భర్తృహరియందును లిఖింపఁబడియున్నది. మనుజులు బుద్ధిమంతులగుటయు, దుర్మార్గులగుటయు వారువారొనరించు సాంగత్యముంబట్టియేయుండును.

హీయతేహిమతిః పుంసాంహీనైః సహసమాగమాత్
సమైశ్చసమతామేతి విశిష్టైశ్చవిశిష్టతాం హి. ప్ర.

నీచులతో దుస్సహవాసము చేయుటవలన బుద్ధినీచమగు ననియు, నుత్తమపురుషులతో సత్సహవాసమువలన బుద్ధిశ్రేష్ఠమగుననియు హితోపదేశము వక్కాణించుచున్నది. మనుజులే ప్రకారము సాంగత్యమొనరించుచుందురో యటులే మారుచుందురు గావున నుత్తమపురుషులతోడ సహవాసముచేయుటత్యంతముఖ్యము. మాకు దుస్సాంగత్యమువలదు, సత్సాంగత్యమువలదు. ఏకాంతవాసులమైయుండెదమని యెవరైన ననుచో నట్టియుక్తి ప్రమాణశూన్యంబును, నసంభవంబునునగుటచేత, బుద్ధిహీనులాడఁదగినదేకాని వేఱుకాదు ఎందుచేతననఁగా మనుష్యుఁడు లేకుండ మనుష్యునకు నెప్పటికి నిర్వాహముకానేరదు. పుట్టినదిమొదలుకొని యొకనినడవిలోనుంచితిమేని వాఁడు పశువుతోసమానముగ నగుఁగాని లేశమైన జ్ఞానవంతుఁడుగానేరఁడు. మనుష్యులసంగతిలేక మనుష్యులకు జ్ఞానముకలుగదు. ఇది సృష్టినియమము. జ్ఞానశూన్యుఁడైన మానవుఁడు సంసారముందరింపఁజాలఁడుగదా. మఱియు నితరులతోడ సహవాసమొనరించుచు వానిగుణాగుణంబులఁదనయందు నెలకొల్పికొనుట, మానవునకు స్వాభావిక ధర్మమైనట్లుగానవచ్చుచున్నది. ఈస్వాభావికధర్మము నెవరును బోఁగొట్టఁజాలరు.

సుజనైః సంగతంకుర్యాద్ధర్మాయచసుఖాయచ
సేవ్యమానస్తుసుజనైర్మహానతి విరాజతే. శు. అ. 1.

సుజనులగువారలతో సహవాసము చేయుటవలన ధర్మాభివృద్ధియు సౌఖ్యము చేకూఱుఁ దత్కారణంబున గొప్పవారిచేతఁగూడ సేవింపఁబడుచు మనుజుఁడందఱకు శిరోవంద్యుఁడగునని శుక్రనీతియందు లిఖింపఁబడియున్నది. కావున మనుజునకు సత్సాంగత్యమత్యంతముఖ్యము. ఒకదీపమునుండి మరియొకదీపమునుంబోలి యింతపర్యంతమొక మహాత్ముని సాంగత్యమునుండి మరియొకరు మహాత్ములగుచు వచ్చిరి. ఇందువలననే పంచతంత్రమందు,

మహాజనస్యసంపర్కః కస్యనోన్నతి కారకః పంచ.తం. 3.

మహానుభావులతోఁడ సహవాసముచేయుటవలన నెవఁడున్నతిఁబొందకుండఁగలఁడు? అనఁగా నందఱునున్నతి గాంతురనియే లిఖింపఁబడియున్నది. కావున భోజనముఁజేయుట నిత్యవిధిగ నేర్పఱచుకొన్నకైవడి, సత్సంగముంగూడ నిత్యకర్మగఁజేసికొని యనుదినంబు నియమముదప్పక సజ్జనులతో సహవాసము చేయుచు దుర్జనులసంగతినుండి దూరగుఁడై యుండుట మనుజునకుముఖ్యము. కుసంగంబువలన నరునకుఁగలుగు నంతటిదుర్గతి మరియేవిధమునను గలుగఁజాలదు.

పాపవృత్తవచః సత్వాఃసూచకాః కలహప్రియాః
మర్మోపహాసి నోలుబ్ధాః పరవృద్ధిద్విషఃశఠాః
పరోపవాదరతయః పరనారీప్రవేశినః

నిర్ఘృణాస్త్యక్తధర్మాణః పరివర్జ్యానరాధమాః
చర. సూ. అ. 7.

పాపవర్తనులై కొండెములు పోరాటములు లోనగునుపద్రవంబులఁ గల్పించుటయందుఁ బ్రియులును, మర్మచ్ఛేదంబులైన వాక్యములాడుచుఁ బరిహాసముల సల్పుచుండువారును, లోభులై యితరులయైశ్వర్యంబుఁజూచి సహింపనివారును, మూర్ఖులైయితరుల నిందించుచుఁ బరకాంతలంగవయు నిర్దయాత్ములు నధర్మాత్ములునగు దుర్మార్గులతో సాంగత్యమెప్పటికి జేయఁగూడదు. దుస్సాంగత్యమునం జేసి వేలకొలఁది మనుష్యుల ధోగతింబొందియున్నారు. ప్రస్తుతకాలమునఁగూడ జనులుకుసంగముచేత నేయధోగతిఁబొందుచున్నారు. కావునఁగుసంగముమండిదూరగుఁడై మనుజుఁడెప్పుడు సత్సంగతిఁ గలిగియుండవలయు. మనుష్యుఁడు కృతకార్యుఁడగుటకు నేఁడవసాధనముమిత్రుఁడు. ఈవిషయమై,

ధర్మజ్ఞంచకృతజ్ఞంచ తుష్టప్రకృతిమేవచ
అనురక్తంస్థిరారంభం లఘుమిత్రంప్రశస్యతే.
మను. అ. 7.

ధర్మమెఱిగినవాఁడును, జేసినమేలుమరువనియతఁడును, ప్రసన్నప్రకృతిగలవాఁడును, సంతోషియు, మిత్రునిపై ప్రేమఁనుంచునతఁడును, నుద్యోగవంతుఁడుననఁగా మొదలిడినకార్య

ముఁబరిపూర్తి చేయువాఁడును నగు మిత్రునితో నెయ్యమూని యుండుటవలన సౌఖ్యముకలుగునని మనుస్మృతియందును, భారతమందు

మత్వాపరీక్ష్య మేధావీ బుద్ధ్యాసంపాద్యచాసకృత్
శ్రుత్వాదృష్ట్వాథవిజ్ఞాయప్రాజ్ఞైర్మైత్రీంసమాచరేత్.

భార. ఉ. అ. 39.

మనుష్యుఁడు స్వబుద్ధితో యథావిధి బరీక్షించి గుణాగుణాంబులఁ బరిశీలించియు, నాచరణాంబులఁజూచియు బుద్ధిమంతుఁడగువానితో నెయ్యమొనర్పవలయుననియు

కృతజ్ఞంధార్మికం సత్యమక్షుద్రందృఢ భక్తికం
జితేంద్రియంస్థితంస్థిత్యాం మిత్రమత్యాగిచేష్యతే.

భార. ఉ. అ. 39.

చేసినమేలు మరువకుండునతఁడును, ధార్మికుఁడును, సత్యప్రియుఁడును, క్షుద్రాంతఃకరణము లేనివాఁడును అనఁగా నీచస్వభావము లేనివాఁడును జితేంద్రియుఁడును, యథోచితప్రవర్తనంబుల నొప్పువాఁడును, నత్యాగియుననఁగా కృపణుఁడుగానివాఁడును నగు నుత్తమలక్షణవంతుఁడైనవానితో స్నేహము జేయవలయుననియు నటులే పంచతంత్రమందు

మిత్రవాన్ సాధయత్యర్థాన్ దుస్సాధానాపివై యతః
తస్మాన్మిత్రాణికుర్వీతసమానా న్యేవచాత్మనః,

ఎవఁడుస్నేహితునిగలిగియుండునో వాఁడుసాధింపదుర్ఘటములైన కార్యములనయితము సాధింపఁగలుగుఁ గావున మనుజుఁడు తనతోసమానుఁడగువానితోఁ జెలిమిసేయవలయుననియు,

ఆపన్నాశాయవిబుధైః కర్తవ్యాః సుహృదోమలాః
నతరత్యాపదం కశ్చిద్యోఽత్ర మిత్రవివర్జితః

ఆపత్కాలమందు మరియొకరి సాయములేక దుఃఖమునుండివిడివడుట దుర్ఘటంబగు గాన నెప్పుడైనఁగష్టము ప్రాప్తించినచో వాని దొలఁగించుకొనునిమిత్తముత్తముఁడై నమిత్రుని సంపాదించుకొని యుండవలయునని వ్రాయఁబడియున్నది.

కేనామృతమిదంసృష్టం మిత్రమిత్యక్షరద్వయం
ఆపదాంచపరిత్రాణం శోకసంతాపభేషజం.

ఆపదరానీయక కాపాడునదియు, శోకసంతాపంబుల కౌషధంబగునదియు, నమృతంబునునైనమిత్రుఁడును రెండక్షరంబుల శబ్దమెవనిచే సృజింపఁబడినదోగదా?

నమాతరినదారేషున సోదర్యేనచాత్మజే
విశ్రంభస్తాదృశః పుంసాంయాదృజ్ మిత్రేనిరంతరే.

తలిదండ్రులు, అన్నదమ్ములు, భార్యాపుత్రులు మొదలగువారికంటె మిత్రుఁడేవిశ్వసనీయుండని యనేకనీతిశాస్త్రకారులు వ్రాసియున్నారు. యోజించిచూడ నిందులకు సందియమావంతయులేదు.

పాపాన్ని వారయతి యోజయతే హితాయ
గుహ్యంచగూహతి గుణాన్ ప్రకటీకరోతి,
ఆపద్గతంచన జహాతిదదాతికాలే
సన్మిత్రలక్షణమిదం ప్రవదంతిసంతః. భర్తృ. నీ.

పాపమునుండి కాపాడిహితమునందు బ్రవేశింపఁజేయు వాఁడును, దాఁచియుంచఁదగిన రహస్యంబుల గుప్తంబుగనుంచి గుణముల బ్రకటము సేయుచుండు వాఁడును, ఆపత్కాలంబున మిత్రుని విడనాడక తన మనోధనంబుల సాయమొనర్చువాఁడును నగు మిత్రునితో చెలిమి సేయవలయునని భర్తృహరివలన దేలుచున్నది. ఎవనియందీ పూర్వోక్తగుణంబులుండునో వాఁడె సన్మిత్రుఁడు మహాత్ముఁడు ననిపిలువఁబడును. కావున నట్టివానితోడనే మైత్రిచేయవలయును. ఇందులకు విపరీతగుణములనొప్పియుండు కృత్రిమబుద్ధిగలవానితో నెప్పటికిసహవాసముఁ జేయఁ గూడదు. మరియు,

దుర్బుద్ధిమకృత ప్రజ్ఞంఛన్నంకూపంతృణైరివ
వివర్జయేతమేధావీ తస్మిన్ మైత్రీప్రణస్యతి.
అవలిప్తేషుమూర్ఖేషు రౌద్రసాహసికేషుచ
తథైవాపేతధర్మేషునమైత్రీమాచరేద్బుధః.
భార. ఉ. అ. 39.

దుష్టాత్ముఁడును, బుద్ధిహీనుఁడునునగు కపటమానవుని

సర్వవిధములఁ బరిత్యజింపవలయుఁగాని యట్టివానితో నెప్పటికిఁ జెలిమి సేయఁగూడదు. ఎందుచేతననఁగా నంతటను దట్టముగ గడ్డిచేఁ గప్పఁబడియుండు కూపమును బావియని గుర్తింప నేరనికారణమున మనుజుఁడందుఁగూలి ప్రాణంబులఁగోల్పోవురీతి దుర్మార్గునితోఁ జెలిమిచేతఁగూడ మనుజుఁడు దుర్మరణము నొందుచుండును. కావున దురభిమానపూరితులు, మూర్ఖులు, క్రోధాత్ములు, విచారశూన్యులు, హింసకులు, నధర్మాత్ములునగు వారితో మైత్రిచేయఁగూడదు. ఇఁకఁ గృతకార్యుఁడగుటకు నైనిమిదవ సాధనము ధైర్యము. ఈవిషయమై సుగ్రీవుఁడు రామునితో

వ్యసనే వార్థకృచ్ఛ్రే వా భయే వా జీవితాంతగే
విమృశం శ్చ స్వయా బుద్ధ్యా ధృతిమా న్నావసీదతి.

వా. రా. కి. స. 7.

ఎట్టిప్రియపదార్థవియోగమందైన, ధననష్టమైన, మరణమగునంతటి భయముకలిగిననైన నెవఁడుబుద్ధితోడ బాగుగనాలోచించుకొని ధైర్యమవలంబించియుండునో యాపురుషుఁడే కృతకార్యుఁడగునని వచించినట్లు రామాయణమందును నట్లే బోధసత్వాభిదానకల్పలతయనుగ్రంథమున,

నతద స్త్రిజగత్యస్మిన్ స్వప్న సంకల్ప దుర్లభం
యన్న సిద్ధ్యతియ త్నేన ధీరాణాం వ్యవసాయినాం

ధైర్యవంతుఁడు, నిశ్చయాత్మకుఁడు, బుద్ధిమంతుఁడునగు

పురుషునకు లభింపఁజాలని స్వాప్నంబుఁబోలు పదార్థమేదియు లేదనియు,

విషమంసమతాంయాతి దూరమాయాతిచాంతికం
సలిలంస్థలతామేతి కార్యకాలేమహాత్మనః. బో. క.

ఏదైననొక కార్య మొనరింపవలయునని యెప్పుడుద్యుక్తుఁడగునో యప్పుడే యాధైర్యవంతుఁడగు మనుజునకు విషమత సమతగను, దూరముసామీప్యముగను, జలముస్థలముగ మారుననియు వ్రాయఁబడియున్నది. మనుఁజుఁడు కృతకార్యుఁడగుట కెనిమిదవసాధనం బైన ధైర్యముతరువాతఁ దొమ్మిదవసాధనము పరీక్ష. ఎట్లనఁగా

ఏషాపరీక్షానాస్త్యన్యాయయాసర్వంపరీక్ష్యతే
పరీక్ష్యంసదసచ్చైవంతయాచాస్తిపునర్భవః.

దేనివలనసదసత్ పదార్థములఁ బరీక్షింపనగునో, అధోగతిబొందువాఁడు సయితము దేనిసహాయంబున నుత్తమదశంబొందునో యదియేపరీక్ష. దీనియవసరము సమస్తవ్యవహారములందుఁగూడగలదు. పరీక్షింపఁబడనియెడల బంగారునకుమారుగనిత్తడిగైకొంటయు, వజ్రమునకుబదులు గాజుపెంకులుదొరకుటయు, నౌషధమునకుమారు విషముద్రావుటయు సంభవించును. ఆకారణమున మనుష్యు కెట్టిదుర్దశగలుగునదియు నెవరువచింపఁగలరు? కావునఁబ్రతివస్తువును బరీక్షాపూర్వకంబుగ

గై కొనుచుండవలయును. ఇట్లు కృతకార్యుడగుటకు పదియవసా ధనమీ నిమ్నలిఖితగుణ విశిష్టతయైయున్నది.

దేశకాలజ్ఞతా దార్ఢ్యం సర్వక్లేశసహిష్ణుతా
సర్వవిజ్ఞానతా దాక్ష్యమూర్జః సంవృతమంత్రతా.
అవిసంవాదితా శౌర్యః భక్తిజ్ఞత్వం కృతజ్ఞతా
శరణాగతవాత్సల్యమమర్షిత్వమచాపలం

వా. రా. కి. స. 54. 2. శ్లోకటీక.

మనుజుడు దేశకాలంబుల గుర్తెఱిగియుండి, దార్ఢ్యవంతుడై పరిశ్రమంబుల సహించుకొనుచు జ్ఞానము, చాతుర్యము, బలము, విచారము, శీలత్వము, యథార్థమైన మితభాషిత్వము, శౌర్యము, భక్తిజ్ఞత, కృతజ్ఞత శరణాగతవాత్సల్యము, అవరోధత, అచాపల్యము మొదలగు గుణంబులఁగలిగియుండవలయును. గ్రంథవిస్తరభీతి వీనియన్నింటియుల్లేఖనము వ్రాయఁజాలము, బుద్ధిమంతులు యథావిధిగ్రహింతురుగాక. ప్రపంచంబున సుగుణములు ప్రకటములైయేయున్నవి కావున నాయాసద్గుణములను వానివాని సాధనములవలన నార్జింపనెల్లవేళల నుద్యోగమొనర్చుచుండుట సకలమానవులకు యోగ్యమైయున్నది.

మనుష్యునకు ద్వితీయకర్తవ్యమాజీవికయని యిదివరకే వ్రాసియుంటిమిగదా. ఆయాజీవిక పదిప్రకారములని మనుస్మృతిలో వ్రాయఁబడియున్నది. ఎట్లనఁగా.

విద్యాశిల్పంభృతిః సేవాగోరక్ష్యంవిపణిఃకృషిః
ధృతిర్భైక్ష్యం కుసీదంచ దశజీవనహేతవః. మను. అ. 10.

విద్యా—ఇదియనేకప్రకారములు. ఇందుగుఱించి యి దివఱకే వ్రాసియున్నాము. శిల్పం—చేతిపనులు, భృతిః— అధికారాదులు, సేవ—కొలువు, గోరక్ష—గోఽశ్వాదిపశు పాలనము, విపణిః— వ్యాపారము. కృషిః—వ్యవసాయము. ధృతి—ధారణము, భైక్ష్యం—భిక్షావృత్తి, కుసీదంచ—వ డ్డీబేరము మొదలగునవి పదియు మనుష్యజీవనమున కాధార ములు. శుక్రనీతియందెనిమిదిప్రకారములగు జీవికలుమాత్రమే గణింపఁబడియున్నవి. ఈయాజీవికలవిషయమై ప్రాచీనవర్తమా న గ్రంథకారులెల్లరు యథామతి వ్రాసియేయున్నారు. మరి యు వారివారిబుద్ధిననుసరించి యుత్తమమధ్యమాధమములని జీవికలందు భేదములఁగూడఁ గల్పించియున్నారు, వీనిలోనొకవి ధమైన జీవికనవలంబించుచు వానికిగష్టమెక్కువయు లాభము కొంచెముగను గలుగుచుండును. దీనిమూలమున బ్రపంచము నకును లాభముకొలదిమాత్రమే మరియొకప్రకారమగుజీవికవ లన మనుజునకు శ్రమముకొంచెము లాభమమితమును గలుగు నుగాని ప్రపంచమునకు లాభములేకపోవుట యటులుండ హాని కలుగుచుండును. ధనసంచయంబుల నప్పులిచ్చి వడ్డీలకువడ్డిగట్టి యితరులకొంపలరూపుట కనువగు వడ్డిబేరములీతరగతిలోఁ జే

రుచున్నవి. ప్రాడ్వివాకాది వేరొండు విధములగువృత్తులమూల మునమనుజునకుఁగొంచెముకష్టమును లాభమెక్కువయుఁగలుగు నుగాని ప్రపంచమునకు విశిష్టమైన లాభమంతగనుండదు. మరి యొకవిధమగుభృతివలన శ్రమమువిస్తారముకలుగదు. ఇందన్యా యమొనరించిన నెక్కుడులాభమును, న్యాయమైనదక్కువలా భమును గలుగుచుండును. అవస్థావిశేషమందు దీనివలనఁబ్ర పంచమునకు హానియులేదు. సద్వ్యాపారము మొదలగు జీవికల వలన శ్రమముసామాన్యమై శాస్త్రానుకూలముగఁ జేసికొనుట వలనలాభమత్యంతముగ గలుగుచుండును. వివేషదశయందు దీనివలన సంసారమునకుపకారముకలుగుటయు సంభవమైయు న్నది. వేరొంకువిధంబగు జీవికవలన శ్రమమెక్కువయు, నొ క్కొకమారు కొంచెముగను మరియొకపర్యాయ మమితముగ ను లాభము చేకూరుచుండును. ఇందువలన బ్రపంచమునకెల్ల విధములనుపకారమే గాని వేరుకాదు. వ్యవసాయాది కృషులిం దుఁజేరును. తక్షకలోహాకారాది వృత్తులవలన వానివిషయమై యొనరింపఁబడు శ్రమముయొక్క యెక్కువదక్కువలననుసరిం చి లాభముగూడ నెక్కువదక్కువగ గలుగుచుండును. దీనిచే బ్రపంచమునకును నుపకారమే. వేఱుప్రకారంబులగు కళాకౌశ లాదులమూలమున శ్రమముకొంచెమును లాభమధికముగను గలుగును. వీనివలనఁ బ్రపంచమునకుపకారమేయగును. నూత

నంబులగు సద్విద్యలఁ బ్రకాశింపఁజేయుటయును మరియొకరీతి జీవిక చేశ్రమము మిక్కుటంబుగను లాభమున్స్వల్పముగను గలుగును గాని వీనిమూలముల బ్రపంచమునకు సకలవిధముల గళ్యాణ మేకలుగుచుండును. గోఽశ్వాదిపశుపాలనంబున శ్రమతక్కువ యు నుద్యమమునననుసరించి లాభంబునుగలుగును. జగత్తునకుఁ గూడలాభమేయగును. ఇఁక భైక్ష్యమాదిగాఁగల నీచవృత్తుల మూలముల శ్రమకలుగదు. ప్రయత్నమునననుసరించి లాభము కలుగుచుండును. కాని ప్రపంచమునకు సర్వవిధముల నకళ్యా ణమేగాని వేరుకాదు. ఈజీవికలవిషయమై సత్యశాస్త్రముల లోవిపులముగనే వ్రాయఁబడియున్నది కాని గ్రంధవిస్తరభీతి వాసినన్నింటి నిటవివరింపఁజాలము. స్థాలీపులాకన్యాయముగ గొంతవఱకుమాత్రము వ్రాసెదము.

సర్వంఘనోసమవిందంత. అథ.కాం. 20. అను. 3. వ. 25

వ్యాపారము సమస్తపదార్థముల మనుజులకుఁ గలుగఁ జేయునంతటి యత్యుత్తమమైనదని యథర్వవేదమందును,

అక్షైర్మాదీవ్యంకృషిమిత్ కృషస్వ
విత్తేరమస్వ బహుమన్యమానః
తత్రగావః కితవతత్రజాయా
తన్మేవిచష్టేసవితాయమర్యః.

ఋ. అ. 7. అ. 8. వ. 5.

మనుజుఁడా! జూదమాడవలదు. కృషిసల్పుచు నీయుద్యోగమున ననుసరించి యాకృషివలన నుత్పన్నమగుధనమే చాలుననుకొని సంతుష్టుఁడవుగమ్ము. కృషిమూలంబున బశువుల యొక్కయు, సంతానముయొక్కయు నభివృద్ధియగుచుండును. జూదంబుననో శరీరముమీఁదిగుడ్డను సయితము బోఁగొట్టుకొని కూరుచుండవలసివచ్చునని సర్వోత్పాదకుండగు బరమేశ్వరుఁడు మనయందలి కొఱకు ఋగ్వేదంబునను నుపదేశము చేసియున్నాఁడు. వేదాదిశాస్త్రములలో నీజీవికలగుఱించి యథోచితరీతి వచింపఁబడియున్నది. వీనియందలి యుత్తమమధ్యమాధమములంగూర్చి యితరగ్రంథకారులుగూడ బ్రతిపాదనము జేసియున్నారు. ఎట్లనఁగా

ప్రథమంకృషివాణిజ్యం ద్వితీయంయోనిపోషణం
తృతీయంవిక్రయంవక్రం చతుర్థంరాజసేవనం

పరాశరస్మృతి. అ. 3.

మొదటిదికృషియు, రెండవది వాణిజ్యము, మూఁడవదియంగడివర్తకము, నాలుగవదిరాజసేవనంబని పరాశరస్మృతిలో వ్రాయఁబడియున్నది. మరియునీనాలుగు ప్రకారములగువానియందు గృషియేయుత్తమమైనదని వారియభిప్రాయము. గొప్పమొత్తునఁజేయఁబడు మొత్తపువ్యాపారము వాణిజ్యంబనియు నేదేనియొకగ్రామంబునఁ జిల్లరగ వస్తువులమ్మఁబడుటంగడి

వర్తకంబనియు గ్రహింపుడు. అలస్యవశాత్ములై ప్రస్తుతకాలమున బ్రాహ్మణులనేకులు తామెట్టికృషియు జేయరాదని చెప్పుకొనుచున్నారు. కాని బ్రాహ్మణులుగూడ కృషి జేయవలయునని పరాశరుఁడే వ్రాసియున్నాఁడు.

షట్కర్మసహితోవిప్రః కృషివృత్తింసమాచరేత్.

పరా. స్మృ. అ. 3.

షట్కర్మసహితముగ బ్రాహ్మణులు కృషిగూడఁజేయవలయును. జీవికలయందలి తరగతులగుఱించి యాలోచించి చూడ విద్య, వ్యాపారము, కళాకౌశలము, కృషిలోనగునవియే యుత్తమములైనట్లు ప్రతీతమగుచున్నది. వీనిలోవిద్య తక్కినవానికి శిక్షవంటిదనుటకు సందియములేదు. విద్యవలన నవీనయంత్రనిర్మాణమున కవకాశముకలుగుటచే దన్మూలమున గ్రొత్తజీవికలుద్భవించుటకు గూడఁ వీలుకలుగును. రెండవదియగు వ్యాపారముయొక్క యాధారము మీఁదనే రాజాప్రజలవ్యవహారములన్నియు నిలిచియున్నవి. వ్యాపారము దేశోన్నతికి ముఖ్యకారణము. వ్యాపారమున్నతినొందక తననేకదేశములున్నతియు నవనతినొందుటచేత నవనతియునొందియున్నవి. ఇంతయేల? కొన్నిజాతులవారలు వ్యాపారమువలన గొన్నిదేశములలో సామ్రాజ్యపదముగూడ నందియున్నారు. కావుననే

నమన్యేవాణిజ్యాత్ కిమపిపరమంవర్తనమిహ. పంచ. 1.

వ్యాపారముకంటె శ్రేష్ఠమైనదేదియు లేదని పంచతంత్రము పేర్కొనుచున్నది. ఇఁకఁ గలాకౌశలములవలన వెయ్యిమందిమనుష్యులచేత నొక్కసంవత్సరమునకుఁ బూర్తియగు కార్యము ఒక్కమనుష్యునివలన నొక్కదినమందో లేక యొక్కగడియయందో పూర్తియగుటకు వీలుకలుగును. ప్రతిఆజీవికకు సహాయభూతంబగు కారణమున దీనివలన దేశమునకుగలుగు లాభమింతింతయనవీలు లేదు. నాలుగవదియగు గృషివలన భోజనాచ్ఛాదనాదులకు గావలసిన సమస్తపదార్థము లుత్పన్నములగుచుండుటచే మనుజమాత్రులకది ప్రాణాధారమనియే యననొప్పు. ఒక్కమనుష్యులకేయన నేల? పశుపక్ష్యాదులకుఁగూడ గృషి జీవనాధారమైయున్నది. కృషివిద్యానుసారము వ్యవసాయాదులొనరింపఁబడునేని లాభమమితముగ గలుగుచుండును. ఇఁక బశుపాలనంబునఁ బాలు నెయ్యి మొదలగు బదార్థములు కలుగుటయగాక వ్యవసాయమొనరించు కర్షకులందరు బశువులమీదనే యాధారపడియుందురుగదా! కావున నుత్తమవిధానంబున గోఽశ్వాదిపశువుల నవశ్యము బాలింపవలయును. ఇట్లే తక్కినజీవికల గూర్చియు సుబుద్ధులగువారలు గ్రహించుకొందురుగాక. ఈజీవికలలో

అధికారిప్రభేదాన్న నియమః. సాంఖ్య. అ. 3.

అనుసాంఖ్యసూత్రములయందలి వాక్యానుసారము అధికారిభేదములుండియున్నందున సమస్తజీవికల సమస్తమాన

వులు సలుపఁజాలరు. మనుష్యులందరు నొక్కయుత్తమజీవికనే చేయఁబూనుకొనిన యెడల ప్రపంచమొక్కదినమైనను సాగనేరదు. తన్మూలమున నుత్తమజీవిక లధమములగుటయు నధమంబులుత్తమంబులగుటయు నెప్పుడుసంభవించనేరదు. ప్రతిజీవికయు దానిదాని యోగ్యతననుసరించియే యుండును. అదియుంగాక శాస్త్రకారులు మనుష్యులందరుగూడ నేదియోయొక జీవికావిశేషముమాత్రమే చేయవలయునని యాజ్ఞాపించియుండలేదు. కాని గుణకర్మస్వభావములకనుకూలముగ నెవరికేజీవికయందు రుచికలుగునో వారలాజీవికగావింపవలయునని వ్రాసియున్నారు. ఇంతియకాక యొకానొకజీవికవలన మనుజులకు నీచత్వము కలుగుననియు వారలువ్రాసియుండలేదు.

కృషిపాశుపాల్య వాణిజ్యరాజోపసేవాదీని
యానిచాన్యాన్యపి సతామగర్హితానికర్మాణి
వృత్తిపుష్టికరాణి విద్యాత్తాన్యారభేతకర్తుం
తథాకుర్వన్ దీర్ఘజీవితమనువసతః పురుషోభవతీతి.

చ. సూ. అ. 11.

వ్యవసాయము, గోవృషభాశ్వాది పసుపాలనము, వ్యాపారము, రాజసేవనము మొదలగునవన్నియు నాజీవికలకుతోడ్పడుచుండుగావున నట్టియనిందితకర్మంబులనే చేయుచుండవలయునని చరకమాజ్ఞాపించుచున్నది. ఇట్టికార్యములొనరించు

చుండుటచేతనే మనుష్యుఁడు దీర్ఘజీవియై పురుషుఁడనిపిలువఁబ డుటకు యోగ్యుఁడగును. ఇంతయేల?

యయాకయాచాపివృత్త్యాధనవాన్ స్యాత్ తథాచరేత్.

శు.నీ. అ. 3.

ఎవనికేజీవికవలన లాభముచేకూరి ధనవంతుఁడగుచుం డునో యతఁడాజీవికనలుపవలయును. కాని

నలోకవృత్తం వర్తేతవృత్తిహేతోః కథంచన

మను. అ. 4.

వృత్త్యుపాయాన్ నిషేవేత యేస్యుర్ధర్మావిరోధినః.

చ. సూ. అ. 5.

లోకాచారమనుతలంపుతో నిందితములైన వేదవిరుద్ధా చరణంబులనవలంబించి జీవనముసేయుటొంతమాత్రముదగదని చరకమనుస్మృతులు విధించుచున్నవి. కావున ననిందితంబులైన యుత్తమజీవికలవలననే జీవనముసేయవలయును. భిక్షావృత్తి మొదలగు గర్హితంబులు, నీచతమంబులునైన జీవికలనొంతమాత్ర మొనరింపఁగూడదు. ఎందుచేతననఁగా

ప్రతిగ్రహః ప్రత్యవరః ప్రేత్యవిప్రస్య గర్హితః

మను. అ. 10.

ప్రతిగ్రహించుటత్యంతనీచమని మనుస్మృతియందును న టులేభారతంబునను వ్రాయఁబడియున్నది. ఎట్లనఁగా

లుబ్ధైర్విత్తపరైర్బ్రహ్మన్ నాస్తికైః సంప్రవర్తితం
వేదవాదాన విజ్ఞాయాసత్యాభాసమివానృతం
ఇదందేయమిదందేయ మితిచాయంప్రశస్యతే
అతస్తైన్యంప్రభవతి వికర్మాణిచజాజలే.

భార. శాం. బ. 264.

వేదమందలి సిద్ధాంతముంగుర్తెరుఁగక ధనలోభులైనా స్తికులనఁదగినకొందరు మాకది తెమ్మిది తెమ్మనియు, నదియిచ్చిన నాఫలము కలుగుననియు, నిదియిచ్చిననీఫలముకలుగు ననియు, నబద్ధములఁ బ్రచారముగావించియున్నారు. అట్లొసంగుట వలనమనుజుఁడాలసుఁడై దొంగతనమాదిగాగల యనేకదుష్కార్యములొనరింపఁ బాలుపడుగావున నట్టివ్యవహారముల సేయఁగూడదని భారతమువక్కాణించుచున్నది. కావున బిచ్చమెత్తునతఁడును, నెత్తించువాఁడును, బిచ్చమునొసంగునతఁడును బ్రపంచమునకుహాని జేయువారలేగాని వేరుకాదు. ఇట్టిగర్హితంబులు, హానికారకంబులునగు జీవికలవదలి మనుజులుత్తమజీవికలసలుపుచుండవలయును. జీవితమందలి సకలవ్యవహారంబుల నొనరించుకొనుటకు మనుష్యుడు సమయవిభాగము జేసికొనవలయును. ఎందుచేతనన

కాలేమనః కాలేప్రాణః కాలేనామసమాహితం
కాలేనసర్వానందాం త్యాగతేన ప్రజాఇమాః.

అథ. కాం. 19. అను. 6. వ. 53.

మానవునిమనస్సు కాలచక్రముపైనిలచియున్నది. మరి యు ప్రాణముయొక్క గతియు, మనుష్యునకు ప్రశంసకలుగుట యు సమయమందేకలదు. కాలమునందే మానవులంగరానంద ముంబొందుచుందురు. అనఁగా నేమనుష్యుఁడు విచారపూర్వ కంబుగ నాయాసమయములందాయాకార్యముల సలుపుకొను చుండునో యతఁడే సౌఖ్యమునకును, ప్రశంసమునకును భాగి కాఁజాలును. కావునకాలమును వ్యర్థముగగడపుట తగదని వే దమాజ్ఞాపించుచున్నది. ఏమనుష్యుఁడు నిరర్థకంబుగ గాలము వెడలనడచుచుండునో యతఁడుతనజీవితమును వ్యర్థముజేసికొ నుటయేగానివేరుకాదు. సకలకార్యములకు సమయమావశ్య కమగుటంజేసి మొట్టమొదలు మనుజునకు కాలముయొక్క ప రిజ్ఞానముకలుగుటత్యంతముఖ్యము. ఇంతకుమున్ను ప్రఖ్యాతి గాంచియుండిన వారందరు సమయమునకు ప్రతిష్ఠగలుగ జేసి యుండిరి. సమయమాహాత్మ్యమెఱిగి యెవరట్లు దానికి ప్రతిష్ఠ గావించిరో వారలే కృతకృత్యులైరిగాని యితరులుగాదు. ఉ చితమగు సమయము తప్పినయెడల నేకార్యముగాని గానేరదు. ఈవిషయమై సృష్టిక్రమమెట్లు మనకుశిక్షనొసంగుచున్నదో చూడుడు. సూర్యాదిగ్రహంబులయొక్క యుదయాస్తమాన ములకును, వృక్షాదులుత్పత్తియై యభివృద్ధినొంది ఫలవంతము లగుటకును నెంతకాలమావశ్యకమో యంతకుదక్కువసమ

యములోపల సూర్యాదులయుదయాస్తమానములుగాని వృక్షాదులయొక్క పుష్పఫలప్రాదుర్భావంబుగాని గాఁజాలవు. ఇదేవిధంబున మనముకావించుచుండు ప్రతికార్యమునకెంతసమయమావశ్యకమో యంతకుఁదక్కువకాలములోపల నదికానేరదు. ఏపదార్థనిర్మాణంబునకెంతదేశకాలంబు లెట్టిసాధనంబు లవసరములో యంతదేశకాలంబు లట్టిసాధనములులేక యాపదార్థము యథాయోగ్యముగ నేర్పడజాలదు. ఇదియీశ్వరీయ నియమము. ఈయఖండమైన నియమంబును గుర్తెరుంగని కతమున ననేకులాయానియతసమయములందాయా కార్యంబుల నొనరించుటలేదు. ఇంతియగాక అనేకకార్యము లొక్కసర్యాయముగఁ జేయవలయునని యతిత్వరితముగూడఁదగదు. అట్లు తొందరపడుటవలన నుచితసమయమునందు గావింపఁబడు కార్యములందుసయితము సమయముచాలమి కార్యసిద్ధికలుగుటకు మారుగ నవిపాడగుట సంభవించుచున్నది. ఏదేనిగార్యముభంగమైనయెడల దాని చేయువారలకు ప్రాప్తమగు దుఃఖమింతింతయన నలవిగాదు. కార్యభంగముచేఁ బశ్చాత్తాపతప్తులుగాఁ దన్మూలమున వారియందలి బలబుద్ధివీర్యపరాక్రమంబులు నాశంబులై పో సమస్తవ్యవస్థలకు నష్టముకలుగుచుండును. దొరతనపుఁ గార్యాలయమందలి యుద్యోగియొకఁడు పదిగంటలకుఁ గార్యస్థానము సేరవలయుననుకొనుఁడు. అతఁడు పదిగంట

త్తైనతరువాత గార్యాలయమున కేగినయడల సమయమునకు పస్థితుండుగాని కారణంబున నతనికి శిక్షగలుగును. ప్రమాదవ శుడై నురలనదేవిధమున నియతసమయమునకు కార్యస్థాన ము జేరడని కార్యాధ్యక్షుండతని నిలయమునుండి వెడలనడచు ను. నియతకాలమున జేయవలసినపనిని జేయకపోవుటచేత ని ట్టివేయగు నీచపరిణామంబులనేకములు గలుగుచుండును. ఇట్టి దుఃఖములనుండి తప్పించుకొనియుండునిమిత్తముపరమేశ్వరుండు

యథాహాన్యనుపూర్వం భవంతియథాఋతవఋతుభిర్యంతి సాధుయథానపూర్వమపరోజహాత్యేవాధాతారాయూంషి కల్పయైషాం. ఋ. అ. 7. అ. 6. వ. 26.

ఎట్లు దివస మనుపూర్వకమగుచున్నదో యనఁగా నెట్లు పగటితరువాత రాత్రియు, రాత్రితరువాత మరలపగలును గలు గుచుండునో, యెట్లు ఋతువులొకదానివెనుక మరియొకటి మర ల మరల వచ్చుచుండునో యట్లే నియతసమయములందగుచుం డెడు ప్రపంచమందలి సమస్తకార్యములభంగి మనుజుఁడు తా ను జేసికొనవలసినకార్యంబులనయితము నియతముదప్పక ప్ర తిదినముచేసికొను చుండవలయునని దృష్టాంతపూర్వకముగ నుపదేశముఁగావించియున్నాడు. ఏమానవుడీవేదమందలి యా జ్ఞననుసరించి నిర్ణీతసమయంబుల గార్యములనెరవేర్చుకొనుట యను సౌకర్యాశ్రయించునో యతఁడే కార్యసముద్రంబుదాఁటు

గలుగును. కాని యనియతసమయరూపకహస్తములతో నీది పోవదలచునతఁడు కార్యసముద్రంబున మునిఁగియే తీరును. ఏకార్యమైన నియతసమయంబునఁగావింపఁబడక సమయము మిగిలిపోయెనేని అనంతరము పృథివీమండలమంతటి రాజ్యమొసంగుట కొప్పికొనినను ఆకార్యముకానేరదు. సామ్రాజ్యాధిపతియొకఁడు పరోపకారార్థమొక స[illegible] నను కొని ప్రమాదవశుఁడై యతఁడాకార్యమును ద్వరలోఁగావింపక యిదిగోఁ రేపుచేయుదును, మాపుచేయుదునని యూరక దినములుగడుపుచుండెనేని నతఁడాకార్యము నవసానకాలము సమీపించి ప్రాణము కంఠగతమగునంతవరకుఁగూడ జేయజాలకయుండును. తుదకు బ్రాణముపోవుతఱుణమున నెవరైన దన నొక్కక్షణమాత్రము బ్రతికియుండునట్లు చేసినయెడల నట్టివారలకర్థరాజ్యమొసంగెదనని వచింపఁబూనిన నట్లతని మరణమునుండి నెవరైనదప్పించఁగల్గుదురా? చివరకు మనస్సు మనస్సులో బెట్టుకొనియే మృతినొందుగాని యేమియుఁజేయఁజాలఁడు. కావున సమయమునెప్పటికి వ్యర్థముగ బాపఁచేయగూడదు. పంటయెండిపోయిన పిదప వర్షముగురియుటయు, మనుజుఁడు మునిఁగిపోయినతరువాత బడవవచ్చుటయు, రోగముచే తఁజచ్చినతరువాత మందువేయుటయు, నింటికి నిప్పంటుకొనిన మీఁద బావిద్రవ్వబూనుటయు, లోనగునపాయంబులన్నియు

నిరర్థకంబులేగదా! ఇటులే తక్కిన సమస్తకార్యముల వ్యవస్థ లగురించియు దెలిసికొనునది. దేశాధిపతి మొదలుకొని పరిచారకునిపర్యంతము గల యుద్యోగులందరు వారివారి యధికారములననుసరించి నియమితసమయములందు యథావిధికార్యము లొనరించుచుండుటచేతనే నిర్వాహకమగుచున్నది కాని యితరవిధమునగాదు. సమయము మిగిలిపోయినతరువాత నెవరుగాని యేమియుజేయఁజాలరు. కావుననే

యావత్ స్వస్థమిదం కలేవరగృహం యావచ్చదూరేజరా,
యావచ్చేంద్రియ శక్తిరప్రతిహతా యావత్ క్షయోనాయుషః, ఆత్మశ్రేయసి తావదేవవిదుషా కార్యఃప్రయత్నో
మహాన్, సందీప్తేభవనేతుకూప ఖననం ప్రత్యుద్యమఃకీదృశః.

భ. వై. శ.

ఇంటికి నిప్పంటుకొనినపిదప బావిని ద్రవ్వబూనుట నిరర్థకంబగుగాన నెంతపర్యంతము శరీరము రోగరహితముగనుండునో, యెంతపర్యంతము ముదిమియావేశింపకయుండునో, యెంతపర్యంతమింద్రియము లన్నియు సమర్థవంతములై యుండునో, యెంతపర్యంతమాయువు క్షయముగాకుండునో యంతపర్యంతము మానవుండాత్మకళ్యాణార్థము ప్రయత్నముల సలుపుచుండవలయునని భర్తృహరి వచించియున్నాఁడు. సమయముమిగిలిపోయినతరువాత వచ్చుటచేత ధూమశకటము నందుకొనలేని

వారలు వెనుకబడియుందురులాగున నియతకాలంబుల గార్యము లొనరింపని వారుసయితము సకలవిషయంబుల వెనుకబడియే యుందురు. కావున సమస్తకార్యముల నియతసమయంబుల జేసికొనుచుండవలయును. మనుజుని సమయమందు గడచిపోవు నట్టి ప్రతిక్షణములోనొక్కటియైన వెనుకకురానేరదు. కాలమును వ్యర్థముగఁబోఁగొట్టు మనుజుల మహామూర్ఖులనవలయు. మనుష్యునకు సమయమొక శ్రేష్ఠమైన జాగీరువంటిది. దీనియందుగావలసినపదార్థము లన్నింటినుత్పన్నము చేసికొనవచ్చును. సమయంబను భూమిని బ్రయత్నంబనెడు నాగలితోడ దున్నకపోవుటవలన బంజరనేలయందు ముండ్లచెట్లు మొలచులాగున మనుష్యునందుగూడ దుర్గుణంబులను కంటకవృక్షము లుత్పన్నములగుచుండును. ధనాదిపదార్థంబులొకవేళ నష్టమైనను మరల బ్రయత్నము జేసి పొందనగునుగాని కడచిపోయినసమయముమాత్రము మరలదొరకనేరదు. ఆలోచింప సమయము నాయుపునొకటియేగాని వేరుకాదు. ఎవరునిరర్థకముగ సమయము బాడుచేయుదురో వారుపాడుచేయునది నిజమునకు సమయముకాదుకాని వారియాయువునే నష్టముచేసికొనుచున్నారనవలయును. దీపమునందలి తైల మనుక్షణముదిగులబడుచు నంతయుగాలిపోయినతరువాత దీపమారిపోవుచొప్పున మనుష్యుని యొక్క యాయువునందుగూడ క్షణక్షణము నష్టమగుచుండుట

చే నాయుఃవృక్షియమైనవెంటనే మనుజుండు మృతినొందును. వెండియుననేకులు సమయముపోవుచున్నదని వచింపుచుందురు గాని యట్లనుటసరిగాదు. ధూమశకటంబుపైగూరుచుండి బండిపరువెత్తుసమయమున గ్రిందజూచితిమేని భూమియతిత్వరితగమనంబునబరుగెత్తుచుండినట్లు గన్పడునుగాని పరుగెత్తునది మనమెక్కియున్న శకటమేగాని భూమిగాదనిమనకు దెలిసియేయున్నది. అదేవిధమున నఖండమును నేకరసంబును నగుటవలన సమయమెంతమాత్రము పోవుటలేదు. కాని యాయువుఃక్షోపాటు మనుష్యులమైనమనమే పోవుచున్నాము ఈవిషయము జనులందరు సర్వసాధారణముగఁ దెలిసికొనఁజాలరు. వెండియు మఱింతఆశ్చర్యముగొల్పు విషయంబేమన బెద్దలగువారలేయనేకులు దీనయు ననాథయునైన మనభారతవర్షమందలి రాష్ట్రంబుల వేనవేలుగ బరదేశములకంపి గడియారములందెప్పించికొని, యెంటులయొక్కయు నేనుగులయొక్కయు మెడలలో వ్రేలాడఁదీయబడు గంటలంబోలి వాని దామునతగిలించుకొని తిరుగుచున్నారు కాని యెందుకొరకు గడియారము దాల్పఁబడుచున్నదో దానివిషయమై ధ్యానములేదు, కేవలముశోభాసౌందర్యాదులకొరకే ధరించుచున్నారు, గడియారమొక ప్రకారంబగు సమయమాపక యంత్రము. ఎవరుతమకాలమును వ్యర్థముగ బాడుచేసికొనక నియతసమయంబుల కార్యములసలుపుచుందురో యట్టివారలు గడియారములుంచుకొనుటుచితమౌ.

కాని యితరులకు వ్యర్థమే. ఎవఁడూరక కూరుచుండియుండునో యట్టివాఁడే దురాచారియు, నాలసియు, మహాపాపియునగుచుండును. ఎవఁడు తన సమయమునువిభాగించుకొని యెల్లప్పుడు సత్క్రియాచరణమందు మగ్నుఁడై యుండునో యట్టివాఁడే యుద్యోగియు, సుశీలుఁడు, జ్ఞానవంతుఁడు, సదాచారి, పరోపకారి, ఉదారుఁడు, దయాళుఁడు, విద్వాంసుఁడు, బుద్ధిమంతుఁడునగును. కావున ప్రతిమనుజుఁడు తన సమయంబును విభాగించుకొని సర్వకార్యంబుల నియతసమయములందు జేసికొనుచుండుటయోగ్యము. గ్రంథకారులనేకులు మనుష్యులందరికొరకు నొకేవిధమగు సమయవిభాగముం జేసియున్నారు కాని యందరకునొకప్రకారము సరిపడనేరదు. ఒక యుద్యోగియునకు జీవికనిమిత్తము పదిమొదలు నాలుగుగంటలవరకుఁ గలకాలముగావలసివచ్చును. మరియొకనికి పదిమొదలారుగంటలవరకును, వేరొకనికి బండ్రెండుమొదలు మూడుగంటలవరకును గలసమయమేసరిపోవును. జీవికాభేదములవలనను, వ్యక్తిభేదములవలనను సమయవిభాగము సమస్తమానవులకు నొకరిమాదిరి మరియొకరికి గాఁజాలదు. కాని జీవికనిమిత్తముపోవ మిగులుసయమును విభాగించుకొనుచో నిట్లుచేసికొనవచ్చును.

బ్రాహ్మేముహూర్తే ఉత్తిష్ఠేత్ స్వస్థోరక్షార్థమాయుషః
శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచ విధిస్తతః.

అష్టా. సూ. అ. 2.

మనుష్యుఁడు తన యాయువుయొక్క రక్షణార్థము ప్రాతఃకాలమునందు నియతసమయంబున శయనమునుండిలేచి మలమూత్రవిసర్జనాది శారీరకక్రియల నిర్వర్తించుకొని దినకార్యంబులఁ బ్రవృత్తుఁడు కావలయును. ఆలస్యవశులై కొందరుమలమూత్రముల వేగము నాపుకొనుచుందురు. అదిమిగులహానికరము.

న వేగాన్ ధారయేద్ధీమాన్ జాతాన్ మూత్రపురీషయోః
చర. సూ. అ. 7.

మలమూత్రములయొక్క వేగము నెప్పుడుగాని యాటంకపరచఁగూడదు. కారణమేమనఁగా

వస్తిమేహనయోః శూలం మూత్రకృచ్ఛ్రం శిరోరుజా
వినామోవఙ్క్షణానాహః స్యాల్లింగం మూత్రనిగ్రహే.
చర. సూ. అ. 7.

మూత్రనిరోధమువలన మూత్రాశయమందును, గుహ్యేంద్రియమందు నూలజనించును. మూత్రకృచ్ఛ్రము. శిరోరోగము, పొత్తికడుపు మొదలగు స్థలములలో ననేకరోగములుత్పన్నములగును. గుహ్యేంద్రియము బలహీనమైసడలిపోవును. కావున మూత్రవేగంబు నెప్పుడుగాని యాపఁగూడదు. ఇకమలవేగముబంధించుటం జేసి

పక్వాశయశిరశ్శూలం వాతవర్చోనిరోధనం
పిండికోద్వేష్టనాధ్మానం పురీషేస్యాద్విధారితే.

చర. సూ. అ. 7.

పక్వాశయమందును, శిరమందును వేదనగలుగును. అపానవాయువు, మలమునిలచిపోవును. వెన్నునందు నొప్పిపుట్టును. హస్తపదాది యవయవములయొక్క సంధులలోఁబోట్లుజనించును. ఇంతయేల? మలమునిరోధింపఁబడుటవలననే సమస్తరోగములుపుట్టుచుండుగావున మలవిసర్జనంబున శరీరము బహిశ్శుభ్రము జేసికొనుట మనుష్యునకు మిగులయవసరము ఇదేవిధమున దగ్గు, తుమ్ము, త్రేపు, ఆవలింత, దుర్వాయువిసర్జనము, మొదలగువానింగూడ నాపదగదు. మలవిసర్జనానంతరము సబ్బుతోడనైన మరిదేనితోనైన హస్తపదాదుల శుభ్రముగ గడిగికొని తరువాత బటిక, బొగ్గు, మిరియాలు, కర్పూరము, లవణములోనగు పదార్థములగలిపి నూరినచూర్ణముతో దంతధావనము జేసికొనవలయును. దంతధావనంబున

నిహంతిగంధవైరస్యం జిహ్వాదంతాస్యజం మలం
నిష్కృష్యరుచిమాధత్తే సద్యోదంత విశోధనం.

చర. సూ. అ. 5.

ముఖము, దంతములు, నాలుక మున్నగువాని మైలనాశనమయి నోటికిస్వాదుత్వమేర్పడుటవలన భోజనమందు రుచియెక్కు

వగును. దంతధావనము జేసికొననివారి నోళ్ళనుండి,యుత్తమపు రుషులుచెంతగూర్చుండ గూడనియంత మిక్కుటమైన దుర్గంధ ము వెలువడుచుండును. మఱియు దంతధావనముచేసికొననిచో దంతములతిశీఘ్రకాలములోనే యూడిపోవును. అనంతరము శరీరము బట్టించుకొనవలయును.

దౌర్గంధ్యంగౌరవంతం ద్రాంకండూమలమరోచకం
స్వేదంబీభత్సతాం హంతిశరీరపరిమార్జనమ్.

శరీరపరిమార్జనమువలన దేహమందలి దుర్గంధము, భారము, నుసి, గజ్జి, మైల, చెమట, కురూపత మొదలగునవ న్నియు నశించుగావున ప్రతిదినముగాని,వారమునకొకపర్యాయ ముగాని, నెలకొకమారుగాని యొడలుపట్టించుకొని పిదపనూనె తోమర్దనముచేయించుకొనవలయును. తైలమర్దనమువలన లా భములు విస్తారముగగలవు.

స్నేహాభ్యంగాద్యథాకుంభశ్చర్మస్నేహవిమర్దనాత్
భవత్యుపాంగాదక్షశ్చదృఢఃక్లేశసహోయథా,
తథాశరీరమభ్యాంగాద్దృఢంసుత్వక్ప్రజాయతే.

కుండలు, చర్మము, బండియిరుసులు లోనగునవి నూ నెబూయుటవలన నెట్లు దృఢములగునో యట్లేదేహముగూడ దృఢవంతమై సుందరమగును. శీతలజలశీతవాయువులాశరీరము న కెట్టిబాధయు గలిగింపనోపవు. ఆయాసముకలుగదు. వ్యా

యామము జేయువారల వశ్యముగ దైలమర్దనము చేయించుకొన వలయును. నూనె దేహమున నింకిన యనంతరము స్నానమొన రించవలయు.

పవిత్రంవృష్యమాయుష్యం శ్రమస్వేదమలాపహాం
శరీరబలసంధానంస్నానమోజస్వరంపరం.

చర. సూ. అ. 5.

స్నానముచేయుటచే దేహము పవిత్రమగును. వీర్యవృద్ధి యు, నాయుర్వృద్ధియుగలుగును. ఆయాసము, చెమట, మైల మున్నగునవి నశించును. తేజోబలంబులు పెంపొందు. కావున ననుదినము దప్పక స్నానము జేయుచుండవలయును. మరియు స్నా నముచేయనియెడల శరీరమందలి రంధ్రములు మలినపదార్థము తో మూసికొనిపో వానినుండి చెమట వెలువడజాలదు. మురి కిచేతను, చెమటయొక్క దుర్గంధముచేతను రోగములుత్పన్న ములగును. స్నానమువలన నీరోగములన్నియు దూరంబులగు నుగావున బలహీనుఁడు వేడినీటితోడను, సబలుఁడు చల్లనినీటి తోడను స్నానముచేయుచుండవలయును. తలకెల్లప్పుడు శీత లజలమే యుపయోగింపవలయునుగాని వేడినీరుగూడదు. స్నా నాంతరము దేహము బాగుగ తుడిచికొని పరిశుభ్రములైన వస నంబులదాల్పవలయు. మలినపూరితములైన కంపుగొట్టుబట్టల ధరింపగూడదు. అట్టు మాసినవానినే కట్టుచుండిన రోగములు

లుద్భవించును. ఇంచుక సుగంధద్రవ్యమునుగూడ నుపయో గించుటొప్పు. శిరోజములుంచుచో నాని గడునుత్తమరీతి ము డుచుకొనుచుండవలయుఁ గాని యుపేక్షించి గాలికివదలఁగూ డదు. వలసినవేళల మృదువులై దృఢముగనుండు పాదరక్ష లను, ఛత్రంబులను, దండములను నుపయోగింపవలయు. స్నానమునిర్వర్తించుకొని శ్రీమత్పరమహంస పరివ్రాజకాచా ర్యస్వామి దయానందసరస్వతి ప్రకాశపఱచిన పంచమహాయ జ్ఞవిధానము ననుసరించి సంధ్యావంద నాగ్నిహోత్రాదుల సలుపలయును.

తరువాత వ్యాయామమవసరము. అందువలనఁగలుగు లాభములు వ్యాయామమొనరించు వారలకనుభవసిద్ధములు. మరియు వైద్యశాస్త్రమందు వ్యాయామమువలన ననేకలాభ ములు గనుపఱుపఁబడియున్నవి. ఎట్లనఁగా

శరీరాయాసజననం కర్మవ్యాయామసంజ్ఞితం
తత్ కృత్వాతుసుఖం దేహంవిమృద్నీయాత్ సమన్తతః.
సు.శు. చి. అ. 24.

దేనివలన సకలాంగములకు శ్రమకలుగునో యదియే వ్యాయామము. వ్యాయామముచేసినతరువాతఁ గొంతవిశ్రాం తింగైకొని పదంపడి యదివఱకు స్నానమొనరింపకుండనుండి నచోఁ దైలమునమెుడలుమర్దించుకొని స్నానముచేయుచుండవ

లయును. మరియు,

శరీరోపచయః కాంతిర్గాత్రాణాం సువిభక్తతా
దీప్తాత్వగ్నిమ నాలస్యంస్థిరత్వంలాఘవంమృజా,
శ్రమక్లమపిపాసోష్ణ శీతాదీనాంసహిష్ణుతా
ఆరోగ్యంచాపి పరమంవ్యాయామాదుపజాయతే,

సుశ్రు. చి. అ. 24.

వ్యాయామంబువలన హస్తపదాద్యవయవంబులకుఁ బుష్టియు, మంచియాకృతియు, సౌందర్యము, జీర్ణశక్తికివృద్ధి, ఆలస్యమునకభావము, స్థిరత, లాఘవము; శుద్ధి, ఆఁకలిదప్పుల కును శీతోష్ణములకును సహించుకొనగలుగు శక్తియున్నగున వి కలిగి శరీరము రోగరహితమై యారోగ్యస్థితియందుండును.

నచవ్యాయామినం మర్త్యమర్ధయంత్యరయోభయా।
నచైనంసహసాక్రమ్య జరాసమధిరోహతి
స్థిరోభవతిమాంసంచవ్యాయామాభిరతస్యచ
వ్యధయోనోపసర్పంతి సింహంక్షుద్రమృగాఇవ
వయోరూపగుణైర్హీన మపికుర్యాత్ సుదర్శనం॰

సుశ్రు. చి, అ. 24.

వ్యాయామముఁ జేయువానికి ఇతరులవలన నంతగభ యము కలుగనేరదు. త్వరితముగ ముసలితనమురాదు. శరీరమం దలి మాంసమత్యంత కఠోరమగును. సింహముంగాంచి మృ

గములు భయమందులాగున వ్యాయామముఁజేయువానికి రో
గములు వెఱచుచుండును. కురూపియైనను, ముసలివాఁడైన
నువ్యాయామంబున మనుజుఁడు దర్శనీయుఁడగును మరియు.

* వ్యాయామంకుర్వతో నిత్యంవిరుద్ధమపిభోజనం
విదగ్ధమవిదగ్ధంవా నిర్దోషం పరిపచ్యతే.

సుశ్రు. చి. అ. 24.

ఎవఁడెల్లకాలము వ్యాయామమొనరించు చుండునో
యట్టివానికి నుడికియు నుడకని యాహారంబైనజీర్ణమగును.
ఒకవేళ జీర్ణముకాకపోయినను జ్వరము మొదలగు రోగములె
వ్వియుఁ గలుగవు. కావున

సర్వేష్వృతేష్వహరహః పుంభిరాత్మహితైషిభిః
బలస్యార్ధేవకర్తవ్యో వ్యాయామోహంత్యతోన్యథా.

ఆత్మహితంబు నభిలషించునతఁడు సకలఋతువులయందు దనశ
క్తి ననుసరించి వ్యాయామముఁ జేయుచుండవలయు. అనఁగా
నూఱుదండెములఁ దీయగలుగునతఁడు ఏఁబదిదండెములమాత్ర
ము తీయవలయును.

హృదిస్థానస్థితో వాయుర్యదా వక్త్రంప్రపద్యతే.
వ్యాయామంకుర్వతో జంతోస్తద్బలార్ధస్యలక్షణం.

సుశ్రు. చి. అ. 24.

వ్యాయామముం జేయం జేయ ముఖమునుండి నిశ్వాస

మతివేగంబున నెప్పుడుబయలు వెడలనారంభించునో యప్పుడే వ్యాయామమాపవలయు. అట్లుమానకమిక్కుటముగఁ జేయుట వలనఁగూడ ననేకరోగములుకలుగును. వెండియు వ్యాయామంబున ననేకలాభములు కలుగుచాడ్పున జేయనందువలన ననేకవిధంబులహానియుఁ గలుగుచుండును.

దివాస్వప్న వ్యాయామాలస్యప్రసక్తంపురుషం
జానీయాత్ ప్రమేహీ భవిష్యతీతి. సుశ్రు. ని. అ. 6.

ఎవఁడు వ్యాయామమొనరింపక పగలునిద్రించునో, యెవఁడాలస్యవశుఁడై యూరకపడియుండునో యట్టివాఁడవశ్యముగఁ బ్రమేహియగును. అనఁగా ధాతుక్షీణరోగమతనికి జనించును. కావున ననుదినము వ్యాయామమొనరించుట ముఖ్యము. మఱియు సృష్టిక్రమము వీక్షించినప్పటికి మనుజునకు వ్యాయామ మనవసరమైనటులే ప్రతీతమగుచున్నది. ఎట్లనఁగా మనుజులుకొందఱు కుర్చీలపైఁగాని మఱిదేనిమీఁదఁగానికూర్చుండియుండు సమయమున వారిపాదములాడుచుండుట గాంచుచున్నాము. కారణంబేమన వారలశరీరమందలి క్రియాజనకతంతువులును, హస్తపదాద్యవయవంబులునువ్యాయామముఁ జేయవలయునని యభిలషించుచుండును. కాని యాలస్యవశులై వారట్లు భ్రమణాది వ్యవహారంబుల సలుపకపోవుటవలన నెక్కడనోకూరుచుండియుండు సమయమునఁ గాలు సేతులు

చాని పని నవి చేసికొనుచుండును. ఇట్లూరక కూరుచుండి పాప
ములాడించుటకూడదని మనుస్మృతియందు వ్రాయఁబడియు
న్నది. వ్యాయామములుపువారల కిట్లుపాదములాడించుకొన
వలసిన యవసరము లేదు. పనిపాటల వారందఱు శారీరకపరిశ్ర
మసలువుచుండు కారణమున నేవారికిఁ బాదములాడించు కొనన
వసరము కలుగకున్నది. కావున నట్లుచేయువారలను శారీరక
పరిశ్రమసలుపునట్లుచేసిన వారికుచేష్టలడగును. ఇందువలన
సృష్టిక్రమముననుసరించి వ్యాయామమొనరించుట మనుజున
కుముఖ్యమనిస్పష్టమగుచున్నదికదా! వ్యాయామమనేక ప్రకా
రములు. వానిలో దండెములు, బస్కీలు, మల్లయుద్ధము, గద
లద్రిప్పుట, క్రికెటునాడుట, పరుగిడుట, తిరుగుట, బరువునెత్తి
యిటటు విసరుట లోనగునవి యుత్తమములు. వీనిలో బాలు
రకు పరుగిడుట, దుముకుట, క్రికెటునాడుట, సమానవయ
స్కులతో మల్లయుద్ధము మొదలగునవి మంచివి. వృద్ధులకుఁ
గేవలము తిరుగుటయే యుత్తమము. వయోవంతులకన్ని ప్రకా
రములు ముఖ్యము లేకాని తలమీఁద భారము వహించుటెవరికి
ఁగాని మంచిదికాదు. ఎవరికేవ్యాయామంబులు తగునని మేము
సూచించితిమో వారలవిచేయుచుండుట సముచితము. వీనియ
న్నింటిలో తిరుగుటయుత్తమోత్తమనుటకు సందియము లేదు.
స్థూలశరీరుఁడు కనీసమైదుమైళ్లు ప్రతిదినము దిరుగవలయు. ఎ

క్కువకుఁ బదిమైళ్లుచాలును. ఎట్టిస్థూలశరీరుఁడైన ననుదినము దప్పక యెనిమిదిమైళ్లుతిరుగుచుండినచో వానిశరీరమతని యిష్టమునకుమించిపెఱుఁగదు. శుష్కాన్నము భుజించువారలు వ్యాయామము కొలఁదిమాత్రముగఁ జేయనగుఁగాని యుత్తమభోజనమొనరించువారలవశ్యముగ సంపూర్ణపరిశ్రమ సలుపవలయును. కూరుచుండి పనిచేయువారును అధిక పరిశ్రమచేయవలయు. వ్యవసాయాది కృషులసలుపు వారలకు వ్యాయామముతో నవసరములేదు. ఏప్రకారంబగు వ్యాయామంబైనను మొట్టమొదలు కొలఁదిమాత్రముగ నారంభించి క్రమక్రమముగ నభివృద్ధిజేసికొనుచుఁబోవలయును. అట్లగుటచేత హానియేమియుఁగలుగదు. వ్యాయామముచేతఁ జెమటపట్టియున్న శరీరమున కాకస్మికముగ నత్యంతశీతలమైన జలముగాని వాయువుగాని సోకుటతగదు. ముఖ్యముగశీతకాలమందు శ్లేష్మము, కాసశ్వాసము, వమనము, విరోచనము, ఉదరరోగము లోనగు వ్యాధులనొంది యున్నపుడును, భోజనమొనరించినపుడును వ్యాయామము జేయఁగూడదు. వెండియు దేశకాలస్వభావబలంబుల విచారించుకొని చేయుచుండవలయు. శరీరమందలి చెమటయంతయు నారిపోయి స్వస్థతగలిగిన తరువాతఁ దక్కిన యావశ్యకకార్యంబుల నెఱవేర్చుకొని యనంతరము భోజనమొనరింపవలయు. భోజనమేగదా మనుష్యునకు జీవనాధారము.

విధివిహితమన్నపానం ప్రాణినాంప్రాణ
సంజ్ఞకానాం ప్రాణామాచక్షతే కుశలాః
ప్రత్యక్షఫలదర్శనాత్తు ఇంధనాద్ధ్యంతరాగ్నేః స్థితిః.
చ. సూ, అ. 27౹

భుజించుటకును, త్రాగుటకును నియమింపఁబడియున్న యన్నపానంబులు ప్రాణములకుఁ బ్రాణములు. ప్రాణము శరీరంబునకాధారమగు చాడ్పునఁ బ్రాణమునకాధారమన్నంబని వైద్యవేత్తలు వక్కాణించియున్నారు. వైద్యులు వచించుదాని "బాబావాక్యం ప్రమాణం" అనునట్లు నమ్మనవసరము లేదు. దీనిప్రత్యక్షఫలము మనము కనుఁగొనవచ్చును. ఎంతపర్యంతము కట్టెలుండునో యంతవఱకే యగ్నిమండుచుండుఁగాని యింధనములు లేక ప్రజ్వలింపదుగదా. అటులే యెంతవఱకాహారరూపకమైన యింధనములు శరీరముననుండునో యంతవఱకు జఠరాగ్నిమండుచుండును. కాని యాహారముపూర్తి యగుటతోడనే ప్రాణముకూడఁబోవును. ఇందులకు విస్తారముగఁ బ్రమాణములియ్య నవసరములేదు. అనుభవసిద్ధముగనిది యందఱకు దెలిసియేయున్నది. కాని యిట్టిప్రాణాధారమైన యాహారమెట్టిదిగ నుండవలయునో యనుటను గుఱించి జనులకేమఁదక్కువజ్ఞానముంగలిగియున్నారు. మనుజమాత్రుల జీవనమాహారముమీఁద నాధారపడి యుండుటవలన నత్యావశ్య

హారాధారములఁగూర్చిన పరిజ్ఞానమతని కవశ్యముగఁ గలుగవల యును. మనుజుఁడుపయోగించు భోజనమునసురించియే బల బుద్ధివీర్యపరాక్రమాదు లుత్పన్నములగుచుండును. ఎట్లనఁగాఁ బాంచాలురు, రాజపుత్రులు, పురబీయులు లోనగువారు గోధుమల భుజించుచుందురు. బంగాళులు ద్రావిడులు, దాక్షిణాత్యులు, గుజరాతీయులు మొదలగువారలు పప్పునన్నముప యోగింతురు. వీరిఁబరస్పరముఁ బోల్చిచూతుమేని గోధుమ లాదిగాఁగల గరిష్ఠపదార్థములదిను వారలుబలిష్ఠులు, శూరులు వీరులుఁసాహసులునై యుండుటయు, దేలికయగునన్న ముందిను వారలు కాతరులు, నిర్బలులు,భయానకులునై యుండుటయు గాననగుచున్నవి. ఇంతయేల? ఒక్కదక్షిణప్రాంతములఁజూడుఁడు. బ్రాహ్మణులు మొదలగువారలన్నము దినుచుందురు. మహారాష్ట్రీలాదిగాఁగలవారలు రొట్టెనుదినెదరు. వీరిరువుర బలసాహసములందు నెక్కుడగు దారతమ్యముగలదు. సత్వముతక్కువయు నసత్వమెక్కువయుఁగలపదార్థముల దినుటజేసి బలముతక్కువగుచుండును. అట్టిలఘుపదార్థములఁ దినువాని పక్వాశయము పెఱుగుచుండు కారణమున నుదరముకూడ బెంపొందుచుండును. అట్టివాఁడునెయ్యి, పాలు, మీఁగడ మున్నగు గురుత్వపదార్థముల జీర్ణము జేసికొనఁజాలఁడు. తేలికయగు భోజనమువ శరీరావయవములన్నియు సడలిబలహీనంబులగు

ను. ప్రాణి యేయే పదార్థముల భుజించుచుండునో యవియ స్నియుఁ బక్వాశయంబునఁ బరిపక్వములై రసముగను బిప్పి గను మారుచుండును. అట్టిరసమువలననే రుధిరమాంసమే దాస్థిమజ్జలును, వీర్యమును నేర్పడుచున్నవి. లఘువైన యా హారమందలి పరమాణువులు పరస్పరముగలసి సాంద్రముగఘ నీభవింపనేరవుకాని గురుపదార్థములే యట్లుఘనీభవించుచుం డును. వెండి, బంగారము, రాగి,యినుము మొదలగువానియం దలి పరమాణువులు గురుత్వము కలవగుటచేతఁ బరస్పరముగ లసి సాంద్రతరముగ ఘనీభవించుచున్నవిగాని గడ్డిలోనగు దేలి కపదార్థములలోని యణువులట్లగుట లేదుగదా. అదేవిధమున గోధుమలు, నెయ్యి, పాలు, మీఁగడ, వెన్న మున్నగువాని యందలిపరమాణువులు గురుత్వముగలిగి యుండునవియగుట చే శరీరావయవరూపక పరిణామముంబొంది పరస్పరముంగల సి కఠోరములగుచుండును. అట్లుపెఱుగు, అన్నము యొక్క పర మాణువులుకానేరవు. మరియునేపదార్థము కఠోరముగనుండు నో యదియే ప్రౌఢము, బలిష్టమునైయుండును. ఏది ప్రౌఢము బలిష్టముగనుండునో యదియే విస్తారకాలము విద్యమానమై యుండును. మట్టిముద్దను, గాష్ఠమును నిదర్శనములుగఁ గైకొ నిచూడఁడు. అదియుంగాక దేశకాలములయొక్క వ్యక్తిభేదం ములననుసరించి భోజనమందనేక విచిత్రములు పొడముచున్న

వి. ఎట్లనఁగా శీతకాలంబునఁగాని లేక శీతప్రధానమగుదేశంబు నఁగాని యేపదార్థములోకమనుజున కారోగ్యము గలుగఁజేయునో యవియే యుష్ణకాలమున లేక యుష్ణప్రధానమగుదేశంబున రోగమునకుఁగారణములగును. ఇటులే పిత్తప్రకృతిగలవారలకు సరిపడుభోజనము కఫవాతప్రకృతులవారలకు సరిపడదు. ఇదేవిధమున దక్షిణవ్యవస్థలఁగూడ గ్రహింపుఁడు. దేశకాలంబుల ననుసరించియు, మానవుని ప్రకృతి, ప్రవృత్తి, అవస్థాభేదములననుసరించియు నాహారపదార్థములు సుఖప్రదంబులుగ విశేషదశలయందగుచున్నను సామాన్యముగా,

భక్ష్యాః క్షీరకృతా బల్యావృష్యాహృద్యాః సుగంధినః
అదాహినః పుష్టికరా దీపనాః పిత్తనాశనాః

సుశ్రు. సూ. అ. 46.

పాలతోఁ జేయఁబడునట్టియు, బలము గలిగించునట్టియుఁ, బ్రియమైనట్టియు, మంచివాసనగలిగి దాహముబుట్టింపకుండునట్టియు, బుష్టినొసంగి ప్రకాశము గలుగఁజేయునట్టియు, పిత్తనాశకములు నగు బదార్థములతో సిద్ధముచేయఁబడు భోజనము శరీరమునకు హితకారకమని సుశ్రుతంబున వ్రాయఁబడియున్నది. అట్టి పదార్థముల నుత్తమరీతి బచనము జేయించుకొని కొంచె ముష్ణముగ నున్నపుడే మనోహరంబగు బ్రదేశమున గూరుచుండి యనుదినము వేళదప్పక నియతసమయం

బున భుజించుచుండవలయును. ఏయాహారంబున దనకుచిత రీతిఁ బోషణముకలుగుచుండునో యట్టి యాహారమునే మను జుఁడు పుచ్చుకొనుచుండవలయు. క్రమముగ సత్వ్రదవ మిష్ట స్నిగ్ధములైన గోధుమలు, పాలు, పంచదార, నెయ్యి లోనగు వాని మూలముననే మనుష్యపోషణము యథావిధిగ నగు చుండును. మరియుఁ బప్పు, గూరలు మున్నగువాని నవశ్యము గ నుపయోగింపవలయు. కడుపునిండ నన్నముదినినచో రోగ మువచ్చునను భయంబున గొందఱు కావలసినదానికంటెఁ ద క్కువ తినుచుందురు. ఇది యట్టివారలకు భ్రమయేగాని వే ఱుకాదు. ఆఁకలియెంతయుండునో యవశ్యముగ నంతయు భు జించుచుండవలయును. కడుపునిండ నన్నముదినుటచేత జనులు రోగగ్రస్తులు కానేరరు. కాని తక్కువయో యెక్కువయో తినుటవలన నట్లగుచుందురు. ఇది వైద్యనియమమే. మను ష్యున కేపదార్థము రుచించునో యట్టిదాని నతఁడు ముఖ్యము గఁ దినితీరవలయును. కాని యది హానికారకము మాత్రము కాఁగూడదు. అనుదినము నొకేవిధంబగు నాహారంబు గైకొం టయుఁ దగదు.

ఏకధాన్య మేకదేశ మే ఏకవస్త్రంచ వర్జయేత్.

గోభి. గృ. సూ, ప్ర. 3. కాం. 2.

ప్రతిదినము మార్పుజేసికొనుచు నాహారముం భుజిం

పవలయుఁగాని యొకేమాదిరికూడదు. మరియు

ఉష్ణం స్నిగ్ధం మాత్రావత్ జీర్ణే వీర్యావిరుద్ధమ్
ఇష్టేదేశే ఇష్టసర్వోపకరణాం నాతిద్రుతం
నాతివిలంబితం అజల్పన్ అహసన్ తన్మనా
భుంజీత ఆత్మానమభి సమీక్ష్యసమ్యక్

చర. చి. అ. 1.

వేఁడిమికలిగి మెఱమెఱలాడుచుండునట్టియు, శరీరమం దలిరుధిరాదులఁ బాడుచేయక శుద్ధపఱచునదియు, నెయ్యి పాలు, పెఱుగు, కూర మొదలగు నుపకరణములతోఁగూడి యుం డునదియునైన యాహారము భుజింపవలయును. భోజనము చేయుచోటు పవిత్రమైనదై యుండవలయు. ఎట్లనఁగా.

భోక్తారం విజనేరమ్యేని స్వాంతేచశుభేశుచౌ
సుగంధిపుష్పరచితే సమేదేశేథభోజయేత్.

సుశ్రు. సూ. అ. 46.

మిక్కుటంబుగ రాకపోకలు కలుగనట్టియుఁ బువ్వువా టికలకంటెఁగూడ నతిమనోహరముగ నిర్మింపఁబడి విచిత్రములై న సుగంధద్రవ్యంబులతోడ నలంకరింపఁబడి యుండునట్టియు, గడ్డి, దుమ్ము మున్నగు పదార్థము లెగురులాడుచుండక నిర్మ లముగ నుండునట్టియుఁ బవిత్రమగునట్టియు శుద్ధప్రదేశంబున భోజనముచేయుచుండవలయును. భోజనముచేయు సమయ

మతిశీఘ్రముగఁ గాని యత్యాలస్యముగ గాని యుండఁదగదు. మరియు నాసమయంబున నెక్కువగ మాటలాడుటయు, నవ్వుటయు లోనగు వ్యవహారముల సలుపఁగూడదు.

ఏపదార్థము దినుటవలన శరీరము నీరోగముగనుండునో విచారించి చూచికొని యట్టిదానినే తినుచుండవలయును. ఈప్రకార మొకపర్యాయము భుజించి యది జీర్ణమైన పిదప స్థిరచిత్తమున మరల భుజింపవలయును. నిషేధాన్న మెప్పుడు గాని తినఁగూడదు.

అభోజ్యం దుష్టముచ్ఛిష్టం పాషాణతృణలోష్ఠవత్
ద్విష్టంవ్యుషితమస్వాదు పూతిచాన్నం వివర్జయేత్
చిరసిద్ధం స్థిరం శీతమన్న ముష్ణీకృతంపునః
అశాంతముపదగ్ధంచ తథాస్వాదు నలక్ష్యతే.

సుశ్రు. సూ. అ. 46.

ఏయన్నము మలినమగునో, దేనియందు విషాదికుత్సితపదార్థంబులు కలసియుండునో, యెయ్యది యెంగిలిచేయఁబడునో, దేనియందు రాలుగడ్డిపెల్లలుండునో యేయన్నము పాసిపోవునో, యెయ్యది స్వాదురహితమగునో, దేనివీక్షించుటవలన లాలాజలమూరుట యాగునో, పచనము జేసి చాలసేపగుటచే నేయన్నము కఠోరమగునో, యేది చల్లారిన తరువాత మరల వేడిజేయబడునో, దేనదినుటచే బాధకలుగు

నో, యుష్ణాధిక్యంబున నెయ్యది చిమిడిపోవునో యట్టి యన్న
ము నెప్పుడును భుజింపఁ గూడదు.

హితాశీస్యాన్మితాశీస్యాత్ కాలభోజీ జితేంద్రియః
పశ్యఁ రోగాఁ బహూన్ కష్టాఁ బుద్ధిమాఁ విషమాశ
నాదితి చర. ని. అ. 6.

భోజనమందు వ్యత్యయము కలుగుటంజేసి యనేకరో
గము లుత్పన్నములగుచుండును. కావున నాఁకలి ననుసరించి
యనఁగా నాఁకలికాకపూర్వమేగాని, యాఁకలియైన తరువాతఁ
జాలసేపునకుఁ గాని భుజించుచుండక నియతసమయంబున భో
జనము సేయుచుండవలయును. సమయవ్యతిక్రమణంబున హా
నికలుగుట నిశ్చయము. ఎట్లనఁగా.

అప్రాప్తకాలేభుంజానః శరీరేహ్యలఘానరః
తాంస్తాన్ వ్యాధీనవాప్నోతి మరణంవానియచ్ఛతి
అతీతకాలేభుంజానో వాయునోపహతేనలే
కృచ్ఛాద్విపచ్యతే భుక్తంద్వితీయంచనకాంక్షతి.
సుశ్రు. సూ. అ. 46.

శరీరమస్వస్థమై యాఁకలిగలుగకయున్నతరి నన్నముది
నుటవలన మనుజుఁడు విస్తారమైన దుఃఖమనుభవింపవలసివ
చ్చును. అట్లొనరించుటంజేసి శరీరముమరింత రోగగ్రస్తమగు
టయగాక అకాలమరణముగూడఁగలుగును. అదేవిధమున నాఁ

కలిమైనవెంటనే భుజింపకపోవుటచే జఠరాగ్ని మందగిల్లును. తరువాతనన్నము దినుచో నతికష్టముమీఁద జీర్ణమగును. రెండవపర్యాయము భుజించుటకును మనసుగోలుపదు. నియతకాలములందు భోజనముచేయనియెడల నిటులే యనేకవిధములైన యుపద్రవంబులు సంభవించుచుండుఁగావున నట్టివ్యవహారంబులన్నియు వానివాని నియతసమయములందుఁగావించుకొనుచుండుటత్యంతముఖ్యమైయున్నది. మఱియు నాయాఋతువుల లో దొరకునట్టి ఫలములనవశ్యముగఁ దినుచుండవలయును. వానివలన రక్తశుద్ధియు, శరీరపుష్టియు, రోగనివృత్తియుఁగలుగును. గ్రంథవిస్తరభీతినీవిషయమై యింకనధికముగ వ్రాయజాలము. విశేషములనెఱుఁగఁగోరిన వైద్యులవలనఁగాని స్వయముగ వైద్యగ్రంథముల నుండిగాని తెలిసికొనుఁడు. దక్షిణస్వరమాడుతఱి భోజనము సేయవలయుననియు, ననంతరమొకటి రెండుగంటలకు వామస్వరమాడునపుడు నీరుద్రావవలయునని యు స్వరోదయమను గ్రంథముస వ్రాయఁబడియున్నది. వెండియు నీభోజనవిషయమైన విశేషవ్యవస్థ చరకవిమాన స్థానము యొక్క ప్రథమాధ్యాయమందును, సుశ్రుతసూత్రస్థానము యొక్క 46 యధ్యాయంబుననుగలదు. మఱియు,

హేయమ్ దుఃఖమనాగతమ్. యోగ. పా. 2.

ఏదైన దుఃఖము రాకమునుపే దానిరాకుండఁజేసి కొన

వలయునని యహర్నిశము ధ్యానముగలిగియుండవలయును. అట్లుముందు జాగరూకతపడునతఁడే బుద్ధిమంతుఁడు. మనుజులురోగగ్రస్తులైనతోడనే యశక్తులై సకలకార్యముల వదలుకొని యూరకకూరుచుండి యుండవలసివచ్చును. మొట్టమొదలురోగి కత్యంతమైన దుఃఖముకలుగును. రెండవది రోగికి స్వశరీరమే యప్రియముగను, దుఃఖదాయకముగను బ్రతీతమగుచుండును. అట్టిచో నాలుబిడ్డలఁగూర్చియు, ధనము మొదలైన యితరపదార్థములఁ గుఱించియు వచింపనేల? మూఁడవది రోగనివృత్తికొఱకు వైద్యు నారాధింపవలయుఁగదా! రోగమునయమగునదియుఁగానిదియు నెవరునువచింపఁజాలరు. కానిముందుధనముమాత్రమువ్యయమగును. నాలుగవది జీవికకుభంగముకలుగును. అందుమూలమునఁ దక్కిన కార్యములన్నియు నిలిచిపోవును. భార్యాపుత్రుల కమితములైన కష్టములు వాటిల్లును. వెండియు శరీరమొకపర్యాయము రోగగ్రస్తమయ్యెనేని మరలఁబూర్వపుస్థితి నెప్పటికిఁ బొందనేరదు. గడియారమొకమారుచెడిపోయినయెడల బాగుచేయించినచో మరలఁదిరుగనారంభించునుగాని క్రొత్తదానియంత బాగుగానేరదు. అట్లే ప్రకారము శరీరవ్యవస్థయునైయున్నది. శరీరమురోగగ్రస్తమగుచో మనుజుఁడు త్వరలోనే మృతినొందును. కావున బ్రతిమనుష్యుఁడు సాధ్యమైనంతవరకు రోగమురాకుండ దనదేహము

రక్షించుకొనుచుండవలయును. అట్లుకాపాడుకొనుటకుఁ గొన్ని సాధనము లిందు వ్రాసెదము.

1. నివాసముజేయు ప్రదేశముత్తమమైనదిగా నుండవలయును. ఒక్కొక్కమనుష్యుఁడు నివసించుగది తక్కువకు దక్కువ పండ్రెండడుగులపొడవును, నెనిమిదియడుగుల వెడల్పు బదునైదడుగులయెత్తు గలిగియుండుటుచితము. వాయుప్రధారాళముగ రాకపోకలుసేయుటకై నాలుగుప్రక్కల కిటికీలుండవలయును. శీతప్రధానమైన దేశమందింతకు సగముపరిమితిగలదైనను హానిలేదుకాని యుష్ణదేశంబునందింతకుఁ దక్కువ కూడదు.

2. వాసముజేయుచోటెల్లప్పుడు శుద్ధముగను, బవిత్రముగను నుంచుకొనుచు దుర్గంధము కలుగకయుండులాగున మలవిసర్జనముసేయు పెరడులను, జలదారులను శుభ్రముజేయించుచుండవలయును.

3. గృహములు మరింత దగ్గరదగ్గర నింటిమీఁదనిల్లుగ గట్టఁబడఁగూడదు. ఇంటిముందు పుష్పవాటికలఁగాని వృక్షాదులఁగాని పెంచ నగును.

4. పరిశుద్ధమైనవాయువు వచ్చునట్టియేర్పాటు జేసికొనవలయును.

5. వడియఁబోయుట మున్నగువానివలనఁ ద్రాగెడునీరు

నివ్వల్మషమైనదిగ నుంచుకొనవలయును.

6. వస్త్రములు, శయ్యలు, పాత్రములులోనగువస్తువులు నిర్మలినములుగనుండవలయును.

7. యుక్తాహారవిహారంబులనఁగా నాలుగంటలకుఁ దక్కువయు, నెనిమిదిగంటలకెక్కువయుఁ గాకయుండ నియతసమయంబుల నిదురించి మేల్కొనుచు, భోజనాదివ్యవహారంబుల నైతము నియతముదప్పక చేయుచుండవలయును,

8. బ్రహ్మచర్యము బాలింపుచు వ్యాయామమునలుపుచుండవలయు.

9. మాదకద్రవ్యములుపయోగింపగూడదు.

10. దుస్సాంగత్యమునుండియు, ద్యూత, వ్యభిచార మద్యపానాది దుర్వ్యసనములనుండియు దూరగులై యుండవలయును.

11. శరీరము మధ్యమస్థితియందుంచికొనఁ బ్రయత్నము సేయవలయును. ఎట్లనఁగా

అత్యంతగర్హితా వేతౌ సదాస్థూలకృశౌనరౌ
శ్రేష్ఠోమధ్య శరీరస్తు కృశః స్థూలాత్తుపూజితః.

సుశ్రు. సూ. అ. 15.

అత్యంతస్థూలకాయుఁడుగాని మరింత బక్కచిక్కియుండు నతఁడుగాని యుత్తములనఁబడరు. ఎందుచేతనన స్థూలశరీ

రుఁడు కదల మెదలలేకయుండును. శక్తిలేక సన్నగనుండువాఁ డును గదలమెదలఁజాలఁడు. కావున నాతికృశంబును, నాతి స్థూలంబును నగు శరీరము గలిగియుండుటకుఁ బ్రయత్నము జేయుచుండవలయును. యుక్తాహార విహారంబులవలనను, వ్యాయామాదులవలనను నట్లుండుటకు సాధ్యమగును. ఇంతవ ఱకు వచించినరీతులకు వ్యతిరేకముగ నడుచుకొనుచుండుటం జేసియే పట్టణవాసులగు మనుజులనేకులు పాలిపోయిన మొగ ములతో, హీనగాత్రులై, వీర్యశూన్యులై రోగగ్రస్తులును మందులునునై యున్నారు. అట్టివారికి క్షయమగుచుండును. నికృష్ట సంతానము కలుగును. సౌఖ్యమనునదివారికి లేనేలే దు. కావునఁ బూర్వోక్తరీతి ననుసరించి యాహార, నిద్రాసన, స్థాన, స్నాన, యానపానాది సకలవ్యవహారంబుల యుక్తమా ర్గముగఁ జేసికొనుచుండుట శ్రేయస్కరము.

12. మనస్సును స్థిరపఱచికొని దాని నెల్లవేళల శోక ము, కోపము మొదలైన వానికి దూరముగ నానందమందుం చవలయును.

యస్మాన్న ఋతే కించన కర్మక్రియతే.

యజు. అ, 34.

మనస్సులేనిచో మనుజుఁ డేకార్యంబును నలుపఁజాలఁ డు రెండియు స్థిరతలేనియెడల మనస్సునకు శోకము కలుగును

యేశోక మనువర్తంతే నతేషాం విద్యతేసుఖం
తేజశ్చక్షీయతే తేషాం నత్వం శోచితు మర్హసి
శోకేనాభి ప్రసన్నస్య జీవితేచాపి సంశయః

వా. రా. కి. కా. స. 7.

ఎవఁడు శోకాకులుఁడై యుండునో వానికి సౌఖ్యము లభింపదు. అట్టివాని తేజస్సు నాశనమగును. మీరు సీతావియోగంబున దుఃఖింపకుఁడు. ఎందుచేతనన శోకవ్యాకుల చిత్తుఁడు జీవించుట దుర్ఘటము. త్వరలోనె మరణమొందును, కావున శోకముమానుఁడని యంజలిబద్ధుఁడై సుగ్రీవుఁడు రామునితో వచించియుండెను. మరియు క్రోధముగూడ నిట్టిదియే.

క్రుద్ధఃపాపంనకుర్యాత్కః క్రుద్ధోహన్యాత్ గురూనపి
క్రుద్ధఃపురుషయావాచానరః సాధూనధిక్షిపేత్
వాచ్యావాచ్యం ప్రకుపితోనవిజానాతికర్హిచిత్
నాకార్యమస్తిక్రుద్ధస్యనావాచ్యం విద్యతేక్వచిత్

వా. రా. సుం. కాం. స. 55.

కోపమూనుటం జేసి యెవఁడు పాపమొనరింపకుండఁగలుగు! కోపముఁ కలిగిన మనుష్యుఁడు తనగురువునైన జంపివేయును. సజ్జనుఁడయ్యుఁ గినుకవొడమిన దుర్వచనము లేవచించును. కోపముకలుగుటతోడనే మనుజుఁడొకవిధముగ బుద్ధిహీనుఁడై వాచ్యావాచ్యములఁ బెక్కింటి వదరును. అందువల్లన విద్వాం

షము వ్యాపించును. తన్మూలంబున శారీరక, మానసిక, సామాజికహాని చేకూరును. కావున ననుచితమైన క్రోధమూనఁదగదని హనుమంతుఁడు తనకుఁదానే బోధించుకొనియుండె. అటులే

లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః
ప్రజాయతే
లోభాన్మోహశ్చ నాశశ్చ లోభః పాపస్య కారణం.

హి. మిత్ర. 1.

లోభమువలననే కామక్రోధమోహము లుత్పన్నములగును, లోభమునదనకే హానిచేకూరును. లోభమే సకలపాపములకు మూలము.

పీత్వా మోహమయీం ప్రమాదమదిరా
మున్మత్తభూతం జగత్. భర్తృ. వై.

మోహముకల్లుతో సమానముగ మానవుని ప్రమాదవశునిఁ జేయును. వెండియు నున్మత్తుఁడగును.

సమ్మోహాత్ స్మృతివిభ్రమః. భ. అ. 2.

మోహమున స్మృతియు నాశనమగును. దానివలన మనుష్యునియందు మనుష్యత్వమే యుండదు. కావున దుష్టమైన మోహముం బరిత్యజించుట యయోగ్యము. ఇటులే యహంకారాది తక్కిన దుర్గుణంబులన్నింటివలనగూడ రోగముద్భవించుచుండును.

ఈర్ష్యాభయక్రోధపరిక్షతేన లుబ్ధేనరుగ్దైన్యనిపీడితేన
ప్రద్వేషయుక్తేనచసేవ్యమానమన్నంనసమ్యక్పరిణామమేతి
సు.శు. సూ. అ. 46.

ఈర్ష్య, భయము, క్రోధము, లోభము, దైన్యము, ద్వేషము మొదలైనవానిఁ బొందియుండినయెడల నట్టిపురుషుఁడు భుజించు నాహారము తగురీతి జీర్ణముగానేరదు. తిన్న యన్న మరుగనిచో మనుజుఁడు కొలఁదిదినములలోనే ప్రపంచమును వదలవలసివచ్చును. కావున సీనమస్త దుర్వ్యసనములనుండియు దుర్వ్యసనములచేఁగలుగు ఆగంతుకరోగముల నుండియుఁ దప్పించుకొనుచు సంపూర్ణమైన యాయువు ననుభవించుటకు బ్రయత్నము జేయుచుండవలయును. అమాయికులయిన జనులు కపాలమందెంత వ్రాయఁబడియున్నదో యంత ఆయువేగాని కొంచెమైనఁ దగ్గుటగాని, యెక్కువగుటగాని లేదనుతలంపు గలిగియున్నారు. ఇట్లుతలంచుట శాస్త్రవిరుద్ధంబును హానికారకంబునునై యున్నది. ఎందుచేతనన నాయువునభివృద్ధి చేసిలనుటవలన నభివృద్ధిబొందును. పాడుచేసికొనుటచేఁ దగ్గియుఁబోవును. ఇందువిషయమై చరకమందు గాలమృత్యువు నకాలమృత్యువు ననుపేర వివరముగ లిఖింపఁబడియున్నది ఎట్లనఁగా.

యథాయానసమాయుక్తోక్షః ప్రకృత్యైవాక్షగుణై.

రుపేతః, సర్వగుణోపపన్నో వాహ్యమానో యథాకాలం
స్వ ... వావసానం గచ్ఛేత్.

తథాయుః శరీరోపగతం ప్రకృత్యా యథావదుపచర్య
మాణం, స్వప్రమాణక్షయాదేవ అవసానం గచ్ఛతి సమృ
త్యుఃకాలే, యథాచస ఏవాక్షోతి భారాధిష్ఠితత్వా ద్విషమ
పథాదపథా దక్షచక్రభంగా ద్వాహ్యవాహకదోషాదనిర్మో
క్షాత్ పర్యసనాదను పాంగాచ్చాంతరా వ్యసనమాపద్యతే.

తథాయు రప్యయథా బలమారంభాదయ థాగ్న్య
భ్యవహరణా ద్విషమాభ్యవహరణా ద్విషమశరీర స్యాపాదతి
మైథునాదసత్ సంశ్రయాదు దీర్ణ వేగవిన్నిగ్రహా ద్విధార్య వేగా
విధారణాత్ భూతవిషాగ్న్యుప తాపాదభి ఘాతాదాహార వివ
ర్జనాచ్చాంతరావ్యసనమాపద్యతే సమృత్యురకాలే.

చర. వి. అ. 3.

బండి మంచియిరుసుగలిగియుండి సరియగురీతిఁ బోవు
నెడల నెంతపర్యంతమా యిరుసు దృఢముగనుండునో యంత
పర్యంతము బండియు సరిగబోవుచు నిరుసువిరిగినంతనే బండి
యుఁగూలును. అద్దేప్రకారముగ నాయువుగూడ శరీరముయొ
క్క దృఢత్వముమీఁద నాధారపడియుండి శరీరదార్ఢ్యముపో
యినతోడనే యాయువునయితము నాశనమగును. ఇట్లుసంభ
వించు మరణమునకే కాలమృత్యువనిపేరు. బండియందు మి

కుట్టంబగు భారము వేయుట వలనఁగాని, మిట్టపల్లములుగల పాడునేలపై నడచుట చేతగాని, నడపించువాని తెలివి తక్కువ చేత నిక్కడనక్కడఁ బల్లములందుఁ గూలుటవలనఁగాని, యేప్రకారముగ బండిని సమాళింపవలయునో యది సారథికి దెలియక పోవుటచేఁగాని బండియొక్క యిరుసువిరుగును. అంతబండియు గూలిపోవును. అదేప్రకారఁ మాయువుకూడ శరీరబలమునకు మించిన పనులుచేయుట చేతను, జఠరాగ్నికిఁ గావలసినంత యాహారము దొరకక పోవుటచేతను, అకాలములందు భోజనముచేయుటంబట్టియు, దేహమునువిపరీతదశలలో మగ్నముచేయుట చేతను, మితిమీఱిన మైధునంబునను, దుష్టులసంసర్గంబునను, బూర్వోక్తములైన వేగముల నాపుటంజేసియు, నేయే వేగంబుల ధరింపవలయునో యట్టివాని బూనని కారణంబునను, జలము, అగ్నిలోనగువాని చేతను, మనుష్య పశుపక్ష్యాదుల వలనను, విషమాగ్నులతాపంబునను, నేదేనిపదార్థ విశేషముయొక్క యాఘాతంబునను, లంఘనములు, నుపవాసములు మున్నగు వాని గావించుటంబట్టియు క్షీణించి మనుష్యుఁడు శీఘ్రకాల మందమృతినొందుచుండును. ఇట్టిదానికే యకాలమృత్యువని పేరు మనుజుఁడేప్రకారంబగు సంయమమువలన నుండవలయు నని వైద్యగ్రంథములలో వ్రాయఁబడియున్నదో యాప్రకారము యుండవలయును, మరియు యోగాభ్యాసము మొదలగు

నవి చేయునెడల మనుష్యుని యాయువు నిశ్చయముగ నభివృద్ధి బొందును. విపరీతప్రవర్తనంబుల మూలమున నాయువు క్షీణించియుఁ బోవును. ఆయువు న్యూనాధికంబులగుట శరీరముయొక్క ప్రౌఢతా దార్ఢ్యములమీఁదను, మిథ్యాహారవిహారంబుల నుండి తప్పించుకొని శరీరమును సరియగు నియమంబుల నెల కొల్పుకొనుటమీఁదను నాధారపడియున్నది. కపాలమందా యువు వ్రాయఁబడియున్నదను మాటలన్నియు నబద్ధములే. కావునఁబూర్వోక్తవిధానంబున భోజనాదికార్యంబుల నిర్వర్తించుకొని యనంతరమాజీవికనిమిత్తమెంతకాలము గావలయునో యంతకాలము దానికి వినియోగించుకొనవలయును. అటుపిమ్మట మరల నావశ్యకములైన కార్యములను, భోజనాదులను దీర్చికొని కొంత సమయమును స్వసంతానముయొక్క రక్షణశిక్షణముల కుపయోగించుకొనవలయును. అనంతరము కొంచెముకాలము సార్వజనికహితకార్యములలోఁ గడపి మరి కొంతసమయమును విశ్రాంతిగైకొనుటయందును, మనోరంజనములైన వ్యాయామాదులయందును బుచ్చవలయును. తరువాత గృహకార్యవిశేషములేమైనఁ గలుగుచో వానిందీర్చికొని సాయంకాలభోజనమొనరించి కొంచెముసేపు పుస్తకావలోకనాది కార్యంబులఁ బ్రవృత్తుఁడై తదనంతరము శయనింపవలయును. నిద్రించుట రాత్రిపదిగంటలకుఁ దగ్గరగనే యుండవల

యును. దినమంతయుఁబనిచేయుటంజేసి మానవునిజ్ఞానజనక, క్రియాజనకతంతువు లలసియుండును. వానికి విశ్రాంతి నవసరముగ నొసంగవలయుగాన మనుజునకు నిద్దురపరమావశ్యకము. నిదురలేనిచో మనుష్యుఁడు కొలఁదిదినంబులలో రోగగ్రస్తుఁడగును. కాని యెనిమిదిగంటల కెక్కువయు, నైదుగంటలకుఁదక్కువయు నిదురింపఁగూడదు. నిద్రించుటయందట్టి వ్యత్యాసము గలుగుటచేతను రోగములుత్పన్నములగును. ఎట్లనఁగా

విశృతి ర్హి దివాస్వప్నో నామతత్రస్వపతామ ధర్మః
సర్వదోషప్రకోపశ్చ, తత్ప్రకోపాచ్చ కాసశ్వాస
ప్రతిశ్యాయశిరోగౌరవాంగమర్దారోచకజ్వరాగ్ని
దౌర్బల్యానిభవంతి.
రాత్రావపిజాగరితవతాం వాతపిత్తనిమిత్తాస్త
ఏవోపద్రవాభవంతి తస్మాన్నజాగృయాద్రాత్రౌ
దివాస్వప్నంచ వర్జయేత్ జ్ఞాత్వాదోషకరావేతౌ
బుధః స్వప్నం మితంచరేత్. సు. శా. అ. 4-

పగటివేళ నిదురించుటచే వికారముకలుగును. మరియు వట్లు దినమందు నిద్రించుట అధర్మంబును, రక్తమందలిదోషములకు బ్రకోపకారియునైయున్నది. రక్తమందలి దోషములు హెచ్చుపెఱుగుటవలనను గాసశ్వాసము, ముక్కునుండినీరుకారుట, తలభారముగనుండుట, హస్తపదాద్యవయవంబుల

నొప్పులుపుట్టుట, ఏవస్తువుమీఁదఁగాని రుచిలేకపోవుట, శరీర మందు జ్వరముకలుగుట, జఠరాగ్ని మందగిల్లుటలోనగు రోగ ములనేకములుత్పన్నములగును. రాత్రులందు నిదురింపక మే ల్కొనియుండుటచేత గూడ నీరోగము లేజనించును. కావుననిట్టి రోగములు కలుగకయుండ వలెనని కోరునతఁడు రాత్రులందు జాగరణ మొనర్చుటయుఁ, బగలు నిద్రించుటయు మానవల యును. పనిలేనివార నేకులు పగలంతయు నిదురించి గుడ్లగూఁబ లలాగుః రాత్రియంతయు మేలుకొని తిరుగుచుందురు. బుద్ధి మంతులగు వారలట్లెన్నఁడు జేయఁగూడదు. నిమిత్త విశేషముల వలన బూర్వోక్త నియమంబులకు వ్యతిరేకముగ నిదురించుటం జేసి శరీరమున కారోగ్యము కలుగునెడల నట్లుచేయవచ్చును గాని నిద్రావ్యసనంబునకులోనై పగలు నిదురించుటవలన మాత్రమనేకరోగములుకలుగును. మరియు

అకాలేతి ప్రసంగాచ్చ న చనిద్రా నిషేవితా
సుఖాయుషీ పరాకుర్యాత్ కాలరాత్రిరివాపరా.

అష్టా. సూ. అ. ౼.

వేళగానివేళ నిదురించుటవలనను, మిక్కుటంబుగ నిదు రించుటవలనను, మొదలు నిద్దురయే పోకుండుట మూలము నను మనుజునిసౌఖ్యమునకు నాయువునకు నాశనము కలుగున ని యష్టాంగహృదయమున వ్రాయఁబడియున్నది. కావున

బుధః స్వప్నం మితంచరేత్.

అను నీసుశ్రుతవాక్యము ధ్యానమందుంచికొని యుక్తి పూర్వకముగ శయన జాగరణాదులసలుపుచుండవలయును.

యదాతు మనసిక్లాంతే కర్మాత్మానః క్లమాన్వితాః
విషయేభ్యో నివర్తంతే తదాస్వపితి మానవః

ఏసమయమందు మనస్సు, నింద్రియములు వానివాని కార్యములం దలఁతనొంది విషయములనుండి నివృత్తములై యుండునో వానికే నిద్రావస్థయనిపేరు. మరియు

అభావప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా. యో. పా. 1.

ఇంద్రియాదులమూలముననే యితరపదార్థములయొక్కయు జ్ఞానముకలుగకయుండుట నిద్దురయని యోగశాస్త్రము నలిఖింపఁబడియున్నది. నిదురింపవలసినకాలమున నిదురించుట వలన శరీరమారోగ్యవంతమైయుండుఁగావున నియమానుసారము మనుజుఁడవశ్యము నిదురసేవింపవలయును.

మనుజునకు మూఁడవకర్తవ్యమపత్యసంగోపనమని యిదివఱకే వ్రాసియుంటిమిగదా. ఈయపత్యసంగోపనము గర్భాధానము మొదలుకొనియే గణింపవలసియున్నది. ఎందుచేతననఁగా నేదైననొక వృక్షముయొక్కబీజము మంచిదికాకపోవుటచేతను, విత్తనము వేయఁబడు భూమి బాగుపఱచినది కాకపోవుటచేతను, విత్తనమునాటి వానికేరీతినాటవలసినదియు దెలి

యుకపోవుటవలనను, రీతి తెలిసియుండియు నేదేని నిమిత్తవిశే షంబున విధికి విరుద్ధముగ నాటుటచేతను, ఏసమయంబున వి త్తనము నాటఁదగునో యాసమయంబున సరిగనాటకపోవుట మూలమునను, నాటినతరువాతఁ దిన్నగరక్షింపని కారణంబున ను నిట్టివేయగు పెక్కుహేతువులవలన నుత్తమమైన మొక్క మొలవజాలదు. పుట్టుకతోడనే పాడయిన మొక్కను తరువా తఁబోషించునతఁడెంత నేర్పుగలిగి యెంతజాగరూకుఁడై రక్షిం చినను నదియుత్తమఫలదాయకమెప్పుడునుగానేరదు. అదేవిధ మునగర్భాధానము మొదలుకొని యపత్యసంగోపనము కావిం పఁబడదేని దరువాతఁగూడ నుత్తమరీతికలుగఁజాలదు. కావున మొట్టమొదలు మనుష్యులు గర్భాధానసంస్కారమునకే యాఁ దున యోగ్యులగునదియు దెలిసికొనియుండవలయును. తక్కు వకుఁదక్కువ స్త్రీపురుషుల గర్భాధానమునకు దగినయీడు గుఱించి

పంచవింశేతతోవర్షేపుమాన్ నారీతుషోడశీ
సమత్వాగత వీర్యౌతౌజానీయాత్ కుశలోభిషక్.

సుశ్రు. సూ. అ. 35.

ఇఱువదియైదుసంవత్సరముల పురుషుఁడును బదియాఱు సంవత్సరములస్త్రీయు నైనయెడల నాయీడునందిఱువురియొ క్క వీర్యము పక్వమైయుండుటంజేసి యదే వయసునందు స్త్రీ

పురుషుల కుక్తసంస్కారము చేయుట యోగ్యము. మరియు

ఊనషోడశవర్షాయామప్రాప్తః పంచవింశతిం
యద్యాధత్తేపుమాన్ గర్భంకుక్షిస్థఃసవిపద్యతే.
జాతోవానచిరంజీవేజీవేద్వాదుర్బలేంద్రియః
తస్మాదత్యంతబాలాయాం గర్భాధానంనకారయేత్.

సుశ్రు. శా. అ. 10.

పదియాఱుసంవత్సరములు రాకపూర్వము స్త్రీకిని, ని ఱువదియైదేండ్లురాకపూర్వము పురుషునకును వీర్యమపక్వమై న స్థితియందుండునుగావున నట్టితక్కువ వయసువారలకు గ ర్భాధానముచేయఁగూడదు. అజ్ఞానవశంబుననట్లు చేయుటవల న గర్భమునకు విపత్తుసంభవించును. దైవసంయోగంబున నొ కవేళ గర్భమునిలచినను శిశువుపుట్టుటతోడనే మరణించును. అట్లువెంటనే చావక బ్రతికియుండినయెడల దుర్బలేంద్రియం బులఁగలిగియుండును. కావునబదియాఱేండ్లకుఁ దక్కువయీడు న స్త్రీకిని, నిఱువదియైదేండ్లకు దక్కువప్రాయమునఁ బురుషున కును గర్భాధానముచేయఁగూడదని ధన్వంతరి సిద్ధాంతము గా వించియున్నాఁడు. ఇటులే, యష్టాంగహృదయములోఁగూడలి ఖింపఁబడియున్నది చూడుఁడు.

తస్యాం షోడశవర్షాయాం పంచవింశతివర్షః పురుషః
పుత్రార్థంప్రయతేత్,

తదాహితౌ ప్రాప్తవీర్యావీర్యాన్వితమపత్యం జనయతః
ఊనపంచవింశతి వర్షేణోనషోడశవర్షాయామాహితో గర్భః
కుక్షిస్థవవినాశమాప్నుయాదల్పాయుర్బలారోగ్య
విభవోవాస్యాద్వికలేంద్రియోవా.

అష్టా. శా. అ. 1.

పదియాఱువర్షముల స్త్రీయు, నిఱువదియైదుసంవత్సరము లపురుషుఁడును సంతానమునిమిత్తము ప్రయత్నముచేయవల యును. ఆయీడునందు స్త్రీపురుషులువీర్యవంతులై యుండు కారణమున వారికిజనియించుసంతానము సయితము వీర్యవంత మైయుండును. పదియాఱేండ్లకుఁ దక్కువప్రాయంబున స్త్రీయు, నిఱువదియైదేండ్లకుఁదక్కువప్రాయంబున బురుషుఁడును గర్భా ధానమందు బ్రవృత్తులగుదురేని గర్భముపడియేపోవును. ఒక వేళ సంతానము కలిగినయెడల నట్టివారల్పాయువులు, దుర్బ లేంద్రియులు, బలహీనులు, తేజోరహితులునై యుందురు. కాన బదియాఱేండ్లలోపలస్త్రీయు, నిఱువదియైదేండ్లలోపలఁబురు షుఁడును సంతానమునకై ప్రయత్నముచేయఁగూడదు. అపరిప క్వమైనవిత్తనమును బాడునేలయందు వైచుటవలన బాడు చెట్టుమొలచి పాడుపండ్లనొసంగులాగునఁ దక్కువయీడుగల స్త్రీయనుపాడునేలలోఁ దక్కువవయసుగల పురుషునియొక్క యపక్వవీర్యంబను బీజమునాటఁబడుట మూలమున నుత్ప

న్నమగు బాలకుఁడను వృక్షమునుండిగలుగు ఫలములును చెడ్డవియై ప్రపంచమునకుహానికారకములగును. ధన్వంతరిమొదలగు మహానుభావులు వచించియున్న యిట్టిసిద్ధాంతంబులకు విరుద్ధముగ నడుచుకొనుచుండుటంజేసియే నేఁడుముఖ్యముగ మన హైందవజాతికి మహానీచదశ సంప్రాప్తమైయున్నది. నూటికిబదిలేక ఇరువదిమందికి గర్భమునిలచిన నిలచునేమోకాని మిగిలిన స్త్రీలకు గర్భస్థాపనయేకాదు. అయినప్పటికి మధ్యకాలమందేపడిపోవును. గర్భపాతంబున స్త్రీయొక్క శరీరముభ్రష్టమైపోవును. మరియుఁదక్కువయీడునందు గర్భముధరించుటంజేసి పాపమనేకస్త్రీలు మృత్యుదేవత పాలగుచున్నారు. ఇందువలన నింతకంటెఁగూడ నధికభయంకరమైన పరిణామము కలుగుచున్నది. ఇట్టివారల కుత్పన్నమగుసంతానము రోగగ్రస్తమై యల్పాయువు దారిద్ర్యము మొదలగుననేక దుర్లక్షణములతోఁ గూడుకొనియుండును. మరియునిట్టి న్యూనావస్థలయందు గర్భాధానముచేయఁబడుచుండుటమూలన, మనుష్యజాతి పాడగుచువచ్చుచున్నది. ఆలోచించిచూడ మనుష్యజాతియొక్క సముద్భవంబునకు స్త్రీలు మూసముల వంటివారలు. ఈమూసము (పోతపోయుటకగునచ్చులు) లెంతవిశాలములెంతదృఢవంతములై యేప్రకారముగనుండునో యట్టిపరిమాణములే గలపదార్థము లేర్పడుచుండును. పదియాఱేండ్లకుఁ ద

క్కువయీడునందు స్త్రీయొక్క గర్భాశయము చిన్నదిగనుం డుకారణమున నందుత్పన్నమగు సంతానము గొప్పశరీరముగ లదిగ నెట్లుకాఁగలుగును? చిన్నతనమందిట్లు గర్భాధానములు చేయఁబడుచుండుటచేతనే మనుష్యులు హ్రస్వగాత్రులగుచు న్నారు. ఇక స్త్రీపెద్దదై పురుషుఁడు తక్కువవయసువాఁడ య్యేనేని నప్పుడుగూడ నికృష్టసంతతియే కలుగుచుండును. ఎట్లనఁగా

అతిబాలోహ్యసంపూర్ణసర్వధాతుఃస్త్రియోవ్రజన్
ఉపతప్యేత సహసా తటాకమివకాజలం.

చర. చి. అ. 2.

పురుషునివీర్యము మిక్కుటముగ క్షయమై కొలఁదిమా త్రపు నీరుగలిగియుండు చెఱువుంబోలి శరీరముశోషించిపోవు ను. అటులే స్త్రీచిన్నదై పురుషుఁడు మరింతపెద్దవాఁడయ్యేనే ని నప్పుడును నికృష్టసంతానమేకలుగును. మరియు నీవిధాన ము స్త్రీకత్యంతహానికారకము.

మైథునాదతిబాలాయాః పృష్ఠజంఘోరువంక్షణం
రుజయన్దూషయేద్యోనింవాయుఃప్రాక్చరణాత్తుసా.

చర. చి. అ. 30.

పదియాఱేండ్లకుఁ దక్కువయీఁడుగల స్త్రీయట్టికార్య మందుఁ బ్రవృత్తయయ్యేనేనిఁ బొత్తికడుపు, జంఘులు మున్నగు

స్థలములలో రోగముద్భవించును. గుహ్యస్థానము దూషితమై శరీరమునకన్నివిధముల నపాయమేకలుగుచుండును. ప్రసవము గుతరుణంబున స్త్రీకి భరింపశక్యముగాని దుఃఖముకలుగును. వెండియు రోగములనేకములుకలుగును. అట్టిప్రసవవేదన సహింపనోపని కారణంబుననే పాప మబలలగు వారలనేకమంది ప్రాణములసయితము గోల్పోవుచున్నారు. కావునఁ బదియారు తేండ్లకుఁ దక్కువయీడున స్త్రీయట్టికార్యమందుఁ బ్రవృత్తురాలుగాఁగూడదు. మఱియుఁబదియారేండ్లుదాఁటినతరువాత స్త్రీకిజనించు సంతానమే యారోగ్యవంతమైయుండునని ప్రపంచమంతటంగల వైద్యశాస్త్రవేత్తలనుభవపూర్వకంబుగ సిద్ధాంతముజేసియున్నారు. బాల్యమందే స్త్రీయొక్క బ్రహ్మచర్యమునష్టమగునో యామెయెవ్యభిచారిణియు, వంధ్యయునగునుం కావుననట్టియామెతో సంగమముచేయఁగూడదు.

వెండియు వృక్షముయొక్క యపక్వబీజపు దృష్టాంతము ప్రకారము చూచినను స్త్రీపురుషుల యపక్వరజోవీర్యములచేఁగలుగుసంతానము మహాఽధమంబును, దూషణయుక్తంబును నగునని యే ప్రతీతమగుచున్నది. కావునబాల్యావస్థయందు స్త్రీపురుషులు గర్భాధానసంస్కారమునుండి దూరగులైయుండవలయును. అల్పవయస్కయగు స్త్రీతోడసంసర్గముగావింపఁగూడదని నిషేధింపఁబడియున్నది. వైద్యగ్రంథములందు మాత్రమేగాదు.

న్యాసేవై రేతః సిక్తం మధ్యం స్త్రియం ప్రాప్యస్థవిష్ఠం భవతి.
ఐ. బ్రా. పం. 6. అ. 3.

పురుషునకంటెం దక్కువయీడుగల తరుణవయస్కురాలైన స్త్రీయందు గర్భాధానము జేయుటవలన నుత్పన్నమగు బాలకుఁడు స్థవిష్ఠుఁడనఁగాఁ బుష్టశరీరియు దీర్ఘజీవియునగు నని, ఐతరేయమందును,

ఆసాం ప్రథమే వయసి రేతః సిక్తం నసంభవతి
మధ్యమే వయసి రేతః సిక్తం సంభవతి. గో. బ్రా. పూ. ప్ర. 3.

స్త్రీలకుఁ బ్రథమవయస్సునందు, అనఁగాఁ జిన్నతనమందు బీజము ప్రజోత్పత్తి జేయుటయందు సామర్థ్యము కలిగియుండదనియు మధ్యమవయసునందు అనఁగా నిండు జవ్వనంబున రజమందలి బీజములు సంతానము నుత్పన్నము జేయుటయందు సమర్థములైయుండునని గోపథంబునను వ్రాయఁబడియున్నది కావునఁ దరుణావస్థయందే స్త్రీపురుషులు సంతానమునకుఁ బ్రయత్నము చేయుటుచితము. ఇందలి ముఖ్యప్రయోజనంబేమనఁగా హీనపక్షము ముప్పదియాఱు పర్యాయములు స్త్రీధర్మము గాంచుచుండినచో నందుమూలమున స్త్రీశరీరమందలి యత్యుష్ణరజమంతయు బయటవెడలిపోవ దరువాత నట్టి స్త్రీకిజనియించు సంతానమునకు స్ఫోటకము, దద్దుమొదలగు పెద్దరోగములంతగఁ గలుగనేరవు. ఈప్రజోత్పత్తి విషయమై సు

శ్రుత శారీరస్థానమందలి రెండవ యధ్యాయంబునను, సూత్ర స్థానమందలి 14 వ యధ్యాయమందును వ్రాయఁబడియున్నది. వృక్షశాస్త్రము నెఱిఁగియుండు మాలియే వృక్షములబాగుగ నాటి పెంపఁగలుగు సామర్థ్యముం గలిగియుండును. అదేవిధమున మనుష్యరూపక వృక్షముల నుత్పన్నము జేయువిద్యయు మనుజుల కవశ్యముగఁ దెలిసియుండవలయును. ఇట్టివిధానము నెఱిఁగియుండనివారలు గర్భాధానసంస్కారమున కధికారులు కాజాలరుగావున నట్టివారలచేత నట్టిసంస్కారము జేయింపఁగూడదని చరకశారీరస్థానమందలి 2 వ యధ్యాయమందును, 8 వ యధ్యాయమందును, స్పష్టముగ నిషేధము చేయఁబడియున్నది. మరియు

యంగం గాగర్భవిధి నాధారయా మాసపార్థివం.

భార. శాం. అ. 46.

గర్భాధానవిధానము ననుసరించియే గంగ భీష్మునిధరించెనని కృష్ణుఁడు యుధిష్ఠిరునితో వచించియుండెను. గర్భాధానరీతి ప్రకార మాసంస్కారము చేయఁబడుచుండుటచేత నెట్టి జితేంద్రియులెట్టి శూరవీరులెట్టి ధర్మాత్ములైన పురుషులు జనియించుచువచ్చిరో యోజింపుఁడు. ప్రస్తుతకాలమందట్టి విధానమునకు వ్యతిరేకముగఁ గార్యములు జరుగుచుండుటంజేసియే యనేకులు దురాచారులు, వ్యభిచారులు, బహునారులు, అబ

వ్మాచారులు, బికారులు, పరధనాపహారులు, దుర్గుణకారులు, అవిచారులు, మాంసాహారులు, అసారులునై పశువులకంటెఁ గూడ బశువులగుచున్నారు. ఇందువలనఁ బ్రపంచమునకుఁ గలుగుహాని యింతింతయన నలవికాదు. కావున సంస్కారవిధుల ననుసరించియే యాయాసంస్కారములఁ జేసికొనుచుండవలయును. గర్భాధాన సంస్కారమునకుఁ బూర్వము, దరువాతఁ గూడ స్త్రీపురుషులిరువురు మనోహరమైన యుత్తమోత్తమ భోజనము జేయుచుండవలయును. ఎందుచేతననఁగా

ఆహారాచార చేష్టాభిర్యాదృశీభిః సమన్వితౌ
స్త్రీపుంసౌసము పేయాతాంతయోః పుత్రోఽపి తాదృశః
సు. శా. అ. 2.

స్త్రీపురుషులెట్టి యాహారములెట్టి యాచారములెట్టి చేష్టలఁగలిగియుందురో యట్టివేవారలకు జనించు సంతానమునకుఁగూడ గలుగును. కావున గర్భాధానమునకుఁ బూర్వమునుండియు స్త్రీపురుషులాహారాది వ్యవస్థల యుక్తప్రకారము చేసికొనుచుండవలయును. మరియుఁ బురుషుఁడు వ్యర్థముగ దుశ్చేష్టితము సలుపఁగూడదు. అట్లుచేయుటమూలమున సంతానము బలహీనంబును, జేయకుండుటవలనఁ బలిష్ఠమునునగును. మరియు గర్భస్థాపనాంతరముగూడ స్త్రీపురుషులు పశుధర్మమందు బ్రవృత్తులు కాఁగూడదు. అట్లుచేయుటవలన గర్భము

ధరించిన స్త్రీకిని, ధరింపఁబడిన పదార్థమునకును నష్టముకలుగును. స్త్రీ గర్భముదాల్చినది మొదలుకొని యీక్రిందివిధమున నడచుకొనుచుండుట యోగ్యము.

తదాప్రభృత్యేవవ్యాయామం వ్యవాయమపతర్పణ
మతికర్షణందివాస్వప్నం రాత్రిజాగరణంశోకం
యానావరోహణం భయముత్కుటకాసనం చైకాంతతః
స్నేహాదిక్రియాం శోణితమోక్షణం బాధాకాలే వేగవిధార
ణంచన సేవేత. సుశ్రు. శా. అ. 3.

శరీరమునకు మించినశ్రమచేయఁగూడదు. సుద్దలోనగు పదార్థములనుగాని యత్యుష్ణకారకములైన మిరపకాయలు మొదలగువానింగాని దినరాదు. మఱియుఁ బగటియందునిదురించుటయు, రాత్రులందుమేల్కొనుటయు, నేడ్చుచుండుటయు, వాహనమునుండి దుముకుటయు, భయపడుటయుఁ, బర్వతము మున్నగునెత్తగువానిపైనెక్కి కూరుచుండుటయు, రుధిరపాతంబుచేయుటయు, మలమూత్రాదుల నిరోధించుటయు మొదలగుకార్యములనెప్పుడుగాని చేయగూఁడదు. ప్రమాదంబునఁగాని తెలివిలేనికారణంబునఁగాని గర్భిణిపూర్వోక్తకార్యంబు లొనర్చినయెడల

గర్భోమ్రియతే అంతఃకుక్షేర్వాలకాలే
స్రంసతేశోషీభవతి వా. చర. శా. అ. 8.

లోపలిపిండములోపలనే మరణించును. గర్భముపకిస్రావ
మంబోవును. లేనిచో గర్భిణికిమూర్ఛమొదలగు రోగములైన జ
నించును. ప్రస్తుతకాలమందిట్టి దురవస్థలుకలుగుచుండుట మన
ముకనులారం గాంచుచున్నాముగదా? మరియు,

వివృతశాయినీ నక్తంచారిణీ చోన్మత్తంజనయ
త్యపస్మారిణం పునఃకలికలహాశీలా వివాదశీలా
దుర్వ్యపుషమహ్నీకం స్త్రైణంవాశోకనిత్యాభీత
మపచితమల్పాయుషం వాఅభిధ్యాత్రీపరోప
తాపినమీర్ష్యుం స్తైణంవాస్తేనానాన్వాయాసబహుల
మతిద్రోహిణమకర్మశీలంవాఅమర్షణాచండామా
పధికమసూయకం వాస్వప్ననిత్యాతంద్రాలుమబుధంఅల్పా
గ్నిం వామద్యనిత్యాపిపాసాలు మనవస్థితమ్వోత్యాది.

చర. శా. అ. 8.

ప్రతిదినము పగలునిదురించుచు, రాత్రులుజరించుచుం
డు స్త్రీకి బుద్ధిహీనతయు, నపస్మారరోగముగలసంతానము జని
యించును. పోరాటములు, వివాదములు, అతిసంభోగము
మొదలగువానియెడల నిచ్ఛగలిగియుండు కామినికి స్త్రీయా
ధీనమై లజ్జాహీనమై దుర్బలమైయుండుసంతతియు, శోకతప్తురా
లగు కాంతకుఁబిరికితనము, దౌర్బల్యము, అల్పాయువుగలసంత
తియు, భోగింపఁబురుషునినెక్కువగఁబురికొల్పుచు ధనాదిపదా

ర్థములయెడల నత్యాశగలిగియుండు మదవతికి నితరులకు దుఃఖముకలుగఁజేయునట్టియు వసూయగలిగియుండునట్టియు స్త్రీకి వశులగునట్టియు బిడ్డలును,దొంగతనము జేయుస్త్రీకి నాలసులు కుకర్ములు, ద్రోహులుఁలోనగువారలును, కోపముగలిగియుండునామెకు క్రోధాత్ములు, కపటాత్ములునైన బిడ్డలును, నిద్రావ్యసనముంగలిగియుండు స్త్రీకిఁ గూరుచుండి కునుకుపాట్లు బడు తంద్రాలువులు, మూర్ఖులు, మందాగ్నులునగు వారలును, మద్యపానాసక్తయగు మదిరాక్షికివిదాహము. అజాగరూకతగలసంతానఁబును జనించుచుండునని యిట్లే యీయధ్యాయము నందంతటను వ్రాయఁబడియున్నది. ఇందలిముఖ్యతాత్పర్యమేమనఁగా గర్భవతియగు స్త్రీయెట్టియాచరణంబుల సలుపుచుండునో, యామెమనస్సున నెట్టిసంకల్పవికల్పంబులు కలుగుచుండునో యట్టిసంతానమే యామెకుఁగలుగుచుండును. ఇందులకిటీవలి చరిత్రాంశమొకటి నిదర్శనమిచ్చెదము. ఫ్రాన్సుదేశముపై జర్మనీదేశమువారు దండెత్తిన యొకసమయమందు ఫ్రాన్సుదేశముఁలోని గర్భవతులైనస్త్రీలుకొందఱుభయాకులులగాఁదరువాతవారికిఁ బుట్టినవారలుపిరికిఁవారయినట్లు,యూరూపాచరిత్రమున వ్రాయఁబడియున్నది. కావున స్త్రీలకు మొట్టమొదటినుండియు నుత్తమోత్తమమైన శిక్షకలుగుచుండవలయుఁగాని దుష్టాచరణంబుల నెప్పుడును నేర్పఁగూడదు. స్త్రీయం

దు దుష్టములైన సంకల్పములే కలుగఁగూడదు. గర్భిణియాని యమములయెడల మరింత జాగరూకురాలై యుండవలయును. చెడుమాటలవిననైన వినఁగూడదు. శోకము, మోహము, లోభము, ఈర్ష్యలోనగునవి గర్భవతి కెంతమాత్రము గలుగఁగూడదు. మరియు,

ప్రియహితాభ్యాంగర్భిణీం విశేషే
ణోపచరంతి కుశలాః. చర. శా. అ. 4.

గర్భవతి యెల్లవేళలఁ బ్రసన్నముగనుండవలయును. గర్భమునకు హాని కారకములైన కటు, కషాయ, తిక్త, అత్యుష్ణామ్ల, అతిక్షార, రూక్ష, దాహకములైన గురుపదార్థంబులఁబరిత్యాగము చేయవలయును. అంతగ నీపదార్థములఁ దిననెంచిన నిమ్మపులుసు, సైంధవలవణము, మిరియాలు మొదలగువాని యథోచితముగ నుపయోగించుకొన వచ్చును. అజీర్ణము కలుగకుండునట్లుగ మెలకువతో నుండవలయు. భోజనముతోడఁ గొలఁదిమాత్రముగ నీరుఁద్రావవలయును. భోజనమైన తోడనే యతిత్వరితంబుగ గబగబ నీరుద్రాగఁగూడదు. పరిశుద్ధమైన జలమే త్రాగుచుండవలయు. భోజనమైన వెనువెంటనే యేకార్యమందుఁగాని ప్రవృత్తురాలు కాఁగూడదు. మితాహారము గైకొనుచుండవలయు. అవసరమునుబట్టి ప్రాతఃకాలంబునఁ బాలు పుచ్చుకొనవచ్చును.

సాయద్యదిచ్ఛేత్తత్తదస్యైదద్యాదన్యత్ర గర్భోపఘాత
కారేభ్యో భావేభ్యః చర. శా. అ. 4.

గర్భమునకపాయముం గలిగించు పదార్థముల వదలి గర్భిణి యేయేపదార్థముల నిష్టపడునో వానినన్నిటి నామెకొసంగుచుండవలయును. కాని యాపదార్థములు

మృదుమధుర శిశిర సుఖసుకుమార ప్రాయైరౌష
ధాహారోపచారైరుపచరేత్. చర. శా. అ. 8.

మృదువులు, దియ్యనివియు, శీతలములు, సుఖప్రదములు, కోమలములునగు నౌషధతుల్యములై యుండవలయును. భోజనమునకు ముఖ్యముగఁ ద్వరితముగ జీర్ణమగునట్టియుఁ బుష్టికారకములునైన వస్తువులకొలఁది మాత్రముగ నొసంగుచుండవలయును. మరియు

హృద్యంద్రవంమధురప్రాయం స్నిగ్ధందీపనీయంసంస్కృతంచ
భోజనం భోజయేత్ సామాన్యమే తద్ప్రాప్రసవాత్.
సుశ్రు. శా. అ. 10.

గర్భవతిహృద్యములు, ద్రవములు, మృదువులు, మిష్టములు, స్నిగ్ధములు, కాంతికారకములు, బాగుగఁబక్వములునైన పదార్థములఁదిన్నగ నమలి మ్రింగుచుండవలయును. ఇంతియగాక నెలనెలకు మార్పుజేసికొనుచు వేఱువేఱు భోజనపదార్థముల నుపయోగింపవలయునని సుశ్రుతశారీరస్థానమందలి

10 వ యధ్యాయమందును, జరకశారీరస్థానమందలి 8 వ యధ్యాయంబునను, వ్రాయఁబడియున్నది. మరియు గర్భిణీస్త్రీ వస్త్రశయ్యాఽసనాది సకలపదార్థంబుల శుద్ధములు, బవిత్రములు, మనోహరములు, నుత్తమోత్తమములుగ నుంచికొనవలయును. తడిసియుండునవియు, మైలగలిగియుండునవియునగు వస్త్రముల దాల్చుటతగదు. వస్త్రములబిగించికట్టుకొనఁగూడదు. మలబద్ధకము గాకుండ జాగరూకత కలిగియుండవలయును. గర్భిణులకు మలనిరోధము విస్తారముగఁ గలుగుచుండును. దాని నివారించుకొననియెడల గర్భసహితముగ గర్భవతి కేహానిచేకూరును? స్వల్పమాత్రముగ నాముదమునుగాని దోసకాయలంగాని చటాకు ఆముదమును చటాకు వేడిపాలలో గలిపిగాని పుచ్చుకొనవచ్చును. ఇందువలన శరీరమున కపాయమేమియుఁగలుగదు. మరియు మూత్రముకూడ నాఁగిపోవుచుండును. అందులకుఁజల్లనినీరుగాని, బార్లినీరుగాని, పాలునీరుగలపిగాని త్రాగుచుండవలయును. వెండియు నన్యంబులైన మూత్రద్రావకౌషధంబులవలన మూత్రాశయమును బరిశుభ్రముగ నుంచుకొనవలయును. ఏదైనరోగము సంప్రాప్తమయ్యెనేని తీక్ష్ణములైన మందులను మాని మృదువులైన యౌషధంబుల నవశ్యము దీసికొనవలయును. కొంఁదిమాత్రము వ్యాయామము జేయవలయును లేనిచో నాహారము జీర్ణముగాదు. కానియధిక

వ్యాయామమెంతమాత్రము చేయఁగూడదు. శీతమునుండి కాపాడుకొనుచు శరీరమునకుఁ జెమటపట్టు నుపాయము జేసికొనవలయును. చెమట బాగుగ వెల్వడుటచే ననేకలాభములుగలవు. ఊలు మొదలగు వానితో సేయఁబడు వస్త్రములదాల్చిన జెమటవెల్వడును. గర్భవతి రోగరహితయై యుండుటంజేసి జనించు బాలకుఁడుగూడ నీరోగియు బలవంతుఁడునై యుండఁగావున సాధ్యమైనంతవఱకు స్త్రీరోగమేమియుఁ గలుగకయుండలాగు మెలకువతో నుండవలయును. కడుపుసడలినట్లుండినచోఁ గొబ్బరినూనెతో నించుకరాచి మెత్తనిగుడ్డను జుట్టవలయును. గర్భిణుల నొంటరిగ నెచటికిని బంపగూడదు. భయముకలుగుప్రదేశములకుఁ బోనిచ్చుటతగదు. భయముకలిగిన నపాయముకలిగియేతీరును. రోగగ్రస్తులచెంతకుఁగూడ గర్భిణులు పోఁగూడదు. నెల నెలకు స్త్రీధర్మవతియగు కాలమునకు గర్భముపడిపోవుటయు సంభవించుచుండుఁగాన నాసమయములందు గడుమెలకువకలిగి ప్రవర్తింపవలయును. ప్రదరరోగము నుండితప్పించుకొనియుండుటకై సాధ్యమగునన్ని యుపాయముల జేసికొనుచుండవలయును. గర్భస్థాపనానంతరము మూఁడుమాసములవఱకు గర్భముపడిపోవుట కధిక భయముకలదు కావున యుక్తాహారవిహారముల నొప్పియుండవలయును.

[illegible] మనదేశమందుఁ బ్రసూతగృహములలో జరుగునపరాధ

ముల మూలంబున శిశువులు మిక్కుటముగ మరణముగాంచు చున్నారు. ఇంచుక సేపునకుఁ బ్రసవించుననఁగా నప్పుడే యొక యింటిని బేడతోనలికి గర్భవతినందు బ్రవేశింపఁజేయుదురు. ఇందుమూలమున నమితమైన హానికలుగుచున్నది. తల్లియొక్క యుదరమందల యత్యంతతీక్ష్ణంబగు నుష్ణంబునుండి వెలువడి వచ్చిన శిశువు, ఒక్కపర్యాయముగ నింతటిశీతలము సహింప నోపని కారణమున రోగియైననగును; కానిచో మరణమైనఁగాం చును. ఇట్టిదురవస్థలనుండి తప్పించుకొను నిమిత్తము చరకసి ద్ధాంతానుకూల మీక్రిందివిధమున నడచుకొనవలయును.

ప్రాక్ చైవాస్యానవమా న్మాసాత్ సూతికాగారం
కారయేత్ అవహృతాస్థిశర్కరాకాలదేశప్రశస్త
రూపరసగంధాయాంభూమౌప్రాగ్ద్వార
ముదగ్ద్వారం వా. చర. శా. అ. 8.

గర్భిణికిఁ దొమ్మిదవనెల ప్రవేశించిన వెంటనే సూతికా గారమేర్పాటుచేయవలయును. ఎముకలు, కంకరరాళ్లులోనగు నవిలేనట్టియు, ఋతువులన్నిఁటియందు సౌఖ్యముగనుండునట్టి యు, శీతోష్ణములచే బాధకలుగనట్టియు, మిట్టపల్లములులేక చదరమై చూడమనోహరముగనుండునట్టియు, దుర్గంధరహిత మైనట్టియుఁబ్రదేశమునందుసూతికాగారము నిర్మింపవలయును. ఇంటికినలుప్రక్కల బహిఃప్రదేశముండవలయు. దుర్వాసనలేమి

యునుండఁగూడదు. తగినంతవిశాలములైన ద్వారములు తూర్పునఁగాని యుత్తరమందుఁగాని యుండవలయు. గర్భిణిప్రసవించుటకుఁ జాలదినములు ముందుగనే యాయింటిని శుభ్రపఱిచి తోపలశృంగారముచేసిచూడ సుందరముగ నుంచవలయు. అప్పటికప్పుడే యలుకఁబడుప్రదేశము తడిదిగనుండుకారణంబున నట్టిచోట శైత్యము, దుర్గంధము మొదలైనవిపుట్టును. వాని మూలమున బాలెంతలకును, శిశువులకును రోగములు కలుగుటయేకాక మరణముగూడ సంభవించును. కావుననిట్టిగృహాదులవిషయమై తగుజాగరూకతగలిగియుండుట యుక్తము.

అనేకవిధినా అధ్యర్థమాసముపసంస్కృతా
విముక్తాహారాచారా విగతసూతికా విధనాస్యాత్.

సుశ్రు. శా. అ. 10

తథాఊర్ధ్వంచతుర్భ్యోమాసేభ్యోనియమం
పరిహారయేత్. బావప్ర. ఖం. 1. భా. 45.

నియమానుసారము నాల్గునెలలవఱకు విశేషించి 45దినములవఱకు బ్రసూతనుక్తప్రకారంబునఁ బాలింపవలయును. బాలెంతయు నియమముదప్పగూడదు. ఏవిధానంబులవలనఁబ్రసూతశరీరము బాగుగనుండునో యట్టివానినే యవలంబింపవలయు. పదిదినములతరువాతఁ గ్రమక్రమముగఁ జౌష్టికపదార్థములియ్యవలయును. అందుమూలమున నామెశరీరము మరల

బలిష్ఠమగును. ఈవిషయమై యింకను దెలియఁగోరువారలు వైద్యగ్రంథములనుండి తెలిసికొనవచ్చును. ఒకవేళతల్లియేదే ని వ్యాధిగలిగియుండినయెడల శిశువును దాదిదగ్గర మంచ వలయును. ఆదాది,

సమానవర్ణాంయువాం వనస్థాం త్రివృత్తామనాతురా
మవ్యంగా మవ్యసనా మవిరూపామవిజుగుప్సామజు
గుప్సితదేశజాతీయామక్షుద్రామక్షుద్రకర్మణాం
కులేజాతాంవత్సలాం జీవితవత్సాం పుంవత్సాం
దోగ్ధ్రీమప్రమత్తామశాయినీం కశలోపచారాం
శుచిమశుచిద్వేషిణీం స్తనస్తన్య సమ్యగుపేతామితి.

చర. శా. అ. ౧.

శిశువుదేహముతో సమానమగు వన్నెగలదియు, జ వ్వనియు, రోగములేనిదియు. హీనాంగికానిదియు, నిర్వ్యసన యుననఁగా నల్లమందు, కల్లు, పొగాకు, వ్యభిచారము లోనగు సమస్తదుర్వ్యసనములులేనిదియు, సుందరియు, అనిందితురాలు ను, మంచిదేశమునజన్మించినదియు, నీచత్వము, కృపణత్వము, దారిద్ర్యము, క్రూరత్వములోనగు దుర్గుణములులేనిదియు, గుణ లీనయు, శిశువునెడలఁ బ్రేమగలిగియుండునదియు,ఁ గొలఁదిదిన ములక్రిందనే నీలాడినదియు,ఁ బుట్టినబిడ్డ బలికియున్నదియు, ప్ర మాదముగాని యతినిద్రగానిలేనిదియు,ఁ జతురభాషిణియు, శి

శువును బోషించుటయందును, మందులు వేయుటయందును, బిడ్డనెల్లవేళలఁ బ్రసన్నముగనుంచుటయందును నిపుణయుఁ బరిశుభ్రతయెడలఁబ్రీతియు, మలినతయెడల విరోధముబూనియుండునదియు, దీర్ఘములో, సన్నములో, అతిస్థూలములోఁగాక స్తన్యమియ్యఁదగిన స్తనములనొప్పియుండునదియు, నీరోగమైనపుష్కలమైన పాలుకలదియునై యుండవలయును. దాదిపాలుపరీక్షించువిధానమెట్లనిన

అథాస్యాః స్తన్యమప్సు పరీక్షేతత చ్ఛేచ్ఛీతలమమలం
తనుశంఖావ భాసమప్సున్యస్తమేకీభావం గచ్ఛత్య
ఫేనిలమతంతు మన్నోత్ప్లబతేనసీదతివా
తచ్ఛుద్ధమితివిద్యాత్.

సుశ్రు. శా. అ. 10.

పాలనునీటిలోవైచుటవలన శంఖమువలెఁ దెల్లగనుండవలయుఁగాని నల్లగనో లేకపచ్చగనోమారిమలినములు, దుర్గంధితములుగాఁగూడదు. మరియుఁ బాలునీటితో నేకత్వమునొంది కలిసిపోవలయుఁగానినురుగు.గట్టఁగూడదు. దారములు దారములుగ నీటియడుగుననో మీఁదనో తేలఁగూడదు. దాదిపూర్వోక్తములైనయుక్తాహార విహారంబుల, ను త్తమనియమంబులఁగలిగియుండవలయును. దాదినియమములకు వ్యతిరేకముగ నడచుకొనినయెడల శిశువునకనేక రోగములుకలుగును. ఎట్లనఁగా

ధాత్ర్యాస్తు గురుభిర్భోజ్యైర్విషమైర్దోషలైస్తథా
దోషాదేహప్రకృత్యంతి తత స్తన్యంప్రదుష్యతిః
మిథ్యాహారవిహారిణ్యా దుష్టావాతాదయఃస్త్రియః
దూషయంతిపయ స్తేన శరీరంవ్యాధయఃశిశోః.

సుశ్రు. శా. అ. 10.

గురుత్వములు, కఠోరములు, విషమంబులు, దేశకాల ప్రకృతులకు విరుద్ధములునగు నాహారంబులభుజియించుటంజేసి దాదికిరోగముకలిగి పాలుపాడగును. అట్టివానింద్రావినయెడల శిశువుకూడరోగగ్రస్థమగును. ఇంతయేల? అతికామముగలదాదుల మిథ్యాహారవిహారంబులమూలమున శిశువులుమరణముగూడనందుచుందురు. శిశువులకువచ్చు రోగములన్నియు దాదులప్రమాదంబున గలుగునవియేగాని యితరవిధమునగాదు. కావునదాదిని యుక్తిపూర్వకముగనుంచుట యజమానులకుముఖ్యము. దాది బాలునినెల్లప్పుడు గుమారాగారంబున నుంచిపోషించుచుండవలయును.

వాస్తువిద్యాకుశలప్రశస్తం రమ్యతమస్కంనివాతం
ప్రవాతైకదేశం దృఢమపగతపశుదంష్ట్రిమూషికా
పతంగంసుసంవిభక్తసలిలోలూఖల వర్చస్కస్థానస్నాన
భూమిం మహానసమృతుసుఖం యథర్తుశయనాసనా
స్తరణసంపన్నం సువిహితరక్షావిధానబలిమంగలహోమా

మప్రాయశ్చిత్తం శుచివృద్ధవైద్యానురక్తజనసంపూర్ణమితి

చర. శా. అ. 8.

నివాసముచేయుటకు యోగ్యమైన ప్రదేశంబని తెలిసియుండు శిల్పిచే నిర్మింపఁబడి, ప్రశస్తమై, విశాలమై, ఆటలకు గావలసిన సకలసాధనంబులనొప్పి, మనోహరమై యాటంకమేమియులేక వాయువురాకపోకలుచేయుటకు వీలైనకిటికీలంగలిగి, దృఢమై, క్రిమికీటకమూషిక పశ్వాది దుష్టజంతుసంతానవిదూరంబై, యాడుకొనుటకు, గూరుచుండుటకు, శయనించుటకు, జదువుకొనుటకు, వ్రాసికొనుటకు, నౌషధాదుల భద్రపరచికొనుటకు గావలసినసాధనములనొప్పి, స్నానాదికార్యముల కవసరములైన వేరువేరుగదులంగలిగి, పుష్పవాటికాసమేతమై, సకలసౌఖ్యసంధాయకంబై, భయవిదూరమై; సంధ్యోపాసనాగ్నిహోత్రాది గృహవిరాజితంబై, చతురుఁడైన వృద్ధవైద్యనివాసమై యొప్పుకుమారాగారంబున ధాత్రీసహితంబుగ బాలకునుంచవలయును. ఇట్లుదాదిని, గృహమును నేర్పాటుచేసికొనఁజాలనియెడల స్వగృహమున తల్లియేపోషించుకొనవచ్చును. తల్లిపాలు బిడ్డకెన్నఁడు గుణకారకములై యుండునుకావున బాలుతల్లియిచ్చుటయేమంచిది. తల్లిదగ్గర బాలుండనిచో దాదియియ్యనగును? కాని తల్లిపాలంతగుణకారకములుకానేరవు. తల్లిపాలవలన బాలునకు యోగ్యవిధానం

బునఁ బోషణముకలుగును. మలోత్సర్గముగూడ బాగుగనగు చుండును. మలోత్సర్గముగానియెడల మూఁడుమాషముల శుద్ధిచేయఁబడిన యాముదము దేనెలోఁగలపి యియ్యవలయును. తన్మూలమున మలోత్సర్గమగును. బాలుఁడు జనించినదినమున మలోత్సర్గము కానిచో రోగముసంభవింప నాకారణమున శిశువుయొక్క శరీరము బిగిసికొనిపోవును. శరీరమందెల్లెడల నాడులులాగికొనిపోవ గాలుసేతులు ముడుచుకొనిపోవును. శిశువునిట్టిరోగమునుండి తప్పించునిమిత్తము మలోత్సర్గముకలుగునట్లుచేయుటావశ్యకము. ఇందులకు పైనవ్రాసినరీతి నౌషధముపయోగింపవలయును. ఈయౌషధమువలన బిడ్డకేమియు నపాయముకలుగనేరదు. శిశువునకు ముఖ్యముగ మలోత్సర్గమగుచుండుట మంచిదియగుగావున జనించిన 24 గంటలలోపల నట్లుకానిచో బూర్వోక్తమైన యౌషధమిచ్చితీరవలయును. దాదియొక్కయు, దల్లియొక్కయు పాలుదక్క దక్కినవి శిశువున కపాయముగూడగలిగించుగాన నట్టివానినియ్యఁగూడదు. అంతగవిధిలేక యితరవిధమైన పాలియ్యవలసివచ్చినయెడల నప్పుడు పిండినయావుపాలలో మంచినీరు మూడవవంతు గలిపి కొంచెముగ జక్కెరవైచి యియ్యవచ్చును. బిడ్డకుదల్లిపాలు కలుగనిచో దాదిచేత నిప్పింపవలయును. దాదిపాలునయితము లభింపనియెడల గాడిదపాలు ద్రాగింపవలయును. వైద్యశాస్త్ర

మెరుగనివారలకీ విషయము విపరీతముగను హాస్యముగను దో
చవచ్చునుగాని యదిసరిగాదు. గాడిదపాలు బిడ్డలకుబాగుగజీ
ర్ణమగును. ఆవుపాలట్లు జీర్ణముకాజాలవు. మరియు దల్లిదగ్గర
బాలులేనియెడల యూమెచేత నెయ్యి, శర్కర, గోధుమలు,
మోదకములాదిగాగల పదార్థములఁ దినిపించవలయును. ఆ
ముదపుటాకుల నీటిలో నుడుకబెట్టి తరువాత జల్లారి గోంచెము
గోర్వెచ్చగనుండుసమయమున నానీటితో నరగంటవరకు స్త
నములగడిగి యనంతరమాయుడికిన యాకులనె వానిపైవైచిక
ట్టవలయును. ఇట్లుచేసినయెడల 10 లేక 12 దినములలో బా
లుకలుగును. పాలుచెడిపోకుండుటకై తల్లిగాని దాదిగాని
క్రోధకలహాశోకేర్ష్యాదులనుండియు, శుష్కములైన మాద
కద్రవ్యముల సేవించుటనుండియు దూరగులైయుండవలయు
ను. క్రోధకలహాశోకములతోగూడుకొని యుండుతరుణమున
దల్లిబిడ్డకు బాలిచ్చిన నవి జీర్ణముగాక అధోముఖముననో లేక
వమనముగనో బయటకువచ్చును. మరియు బిడ్డలకాలుసేతులెం
డిసన్నగిల్లును. పొట్టపెద్దదియగును. కావున దల్లికుచేష్టలనుం
డియు, దుర్గుణములనుండియు, దుర్వ్యవహారములనుండియు
దూరముగనుండవలయును. బిడ్డకెప్పుడెప్పుడు పాలియ్యవలసి
వచ్చునో యప్పుడంతయు స్తనములగోర్వెచ్చని నీటితోగడగి
కొనుచుండవలయు. ప్రతిపర్యాయమట్లుచేయజాలనియెడల ది

నమునకు రెండుమారులైన గడుగుకొనుటయోగ్యము. మరియు బిడ్డకు నియమప్రకారము బాలిచ్చుచుండవలయును. పుట్టిననాడొకమారును, రెండవనాఁడు రెండుమారులు, మూఁడవదినము మూఁడుపర్యాయములు, నాలుగైదురోజులలో నాలుగుసారులు, ఆరవయేడవదినములందు ఆరుతడవలును, ఎనిమిదవతొమ్మిదవదినములలో నేడుమారులును, బదియవనాఁడెనిమిదిపర్యాయములును రాత్రిందివములనియతసమయములందు రెండుగంటలకొకమారు ద్రావించుచుండవలయును. ఒకప్రహరముదాటినదరువాత రాత్రులందు బిడ్డనుపాలు ద్రావింపగూడదు. అందువలన జీర్ణశక్తియు, స్వభావంబును బాడగును. రాత్రులందు బిడ్డను లేపవలసివచ్చుటచే నింకనునసేకప్రకారములగు హానికలుగును. నియతసమయములందు బాలు ద్రావించుచువచ్చినయెడల బిడ్డకేడెనిమిదిదినములలో నలవాటుపడి, తిరుగ రాత్రులందు బాలనపేక్షించకుండును. నిదురించునప్పుడు దల్లి బిడ్డకుగొంచెము దూరముగబరుండవలయును. అనఁగా బిడ్డకు దల్లికి మధ్యనొకవస్త్రముండినఁజాలును. అందువలనరాత్రులందు బిడ్డపాలు త్రాగనేరదు. అధికముగ బాలు త్రాగుటవలన దల్లి బలహీనమగుటయు, బిడ్డకురోగముకలుగుటయు సంభవించుగాన సాధ్యమైనంతవరకు యుక్తిపూర్వకముగ రక్షణముసేయుచుండవలయును. బిడ్డకురోగములెవ్వియు గలుగకుండు

టకు ముఖ్యోపాయము నియమానుసారము పాలుద్రావించు టయే. మలోత్సర్గము క్రమముగ నగుచున్నదియు లేనిదియు ధ్యానమందుంచికొని యెప్పుడుకాదో యప్పుడు పైనవచించిన యూషధముపయోగించుచుండవలయును.

శయనాస్తర ప్రావరణానికుమారస్య మృదులఘుశుచి సుగంధీనిస్యుః స్వేదమలజంతుమంతి మూత్రపురీషోప సృష్టానిచవర్జ్యానిస్యుః అసతిసంభవేన్యేషాం తాన్యేవచసుప్రక్షాళితో పవనోపధూపితాని సుశుద్ధ శుష్కాన్యుపయోగంగచ్ఛేయుః. చర. శా. అ. 8.

ఆయాఋతువుల కనుకూలములైన, పవిత్రములు, సుగంధితంబులునైన మెత్తని తేలికబట్టల వేయవలయును. ఆవస్త్రములు చెమటమైలతోడను, నల్లులు మొదలగువానితోడను నిండియుండఁగూడదు. మలమూత్రంబులస్పర్శ మెంతమాత్రముగూడదు. అట్టిమైలతగిలినయెడల నుడుకబెట్టించి యుతికి యారవెచిన యనంతరమే వాని నుపయోగించవలయును. మఱియు,

క్షౌమంక్షౌమపరివృతం క్షౌమవస్త్రాస్తృతాయాం శాయయేత్. సుశ్రు. శా. అ. 10.

సంపాదించగలిగినచో బిడ్డలకు గప్పుటకును, దొడుగుటకును, ప్రక్కకును బట్టబట్టల నుపయోగింపవలయును.

దాదిలోనగువారలు బిడ్డయొక్క యాచ్ఛాదనాదులయెడల జాగరూకత బుచ్చుకొననికారణమున వారలకు శైత్యము మున్నగునవికలిగి గొప్పహాని సంభవించుచుండును. శైత్యమువలన శరీరమందలియుష్ణము బయటవెలువడిపోవ దన్నాలమున నాకలినశించి యాహారము సరియగురీతి జీర్ణముకానేరదు. శరీరమున నుష్ణము నిలువకపోవుటవలన నవయవము లభివృద్ధింజెంది బ్రాఘతగాంచనేరవు. మఱియు శ్లేష్మము, శైత్యము, జ్వరము మున్నగుపీడ లనేకము లుప్పతిల్లును. కావున ముఖ్యముగ శీతకాలములందు బిడ్డలకు సంపూర్ణమైన యాచ్ఛాదనము కలుగఁజేయుచుండవలయును. ఉష్ణకాలములందంతగ లేకపోయినను భయములేదు. సమస్తకార్యముల నాయాఋతువుల ననుసరించి చేసికొనుచుండుట యోగ్యము. శీతకాలమున గోర్వెచ్చని నీటితోడను, నుష్ణకాలంబున నప్పుడుతోడిన బావినీటితోడను బ్రతిదిన మవశ్యముగ స్నానము జేయించుచుండవలయును. శరీరమం దెట్టిమాలిన్యము గలుగకయుండులాగున స్నానము చేతులతో దేలికగఁజేయించవలయును.

బాలం పునర్గాత్రసుఖం గృహ్ణీయాన్నచైనంతర్జయేత్స
హసాన ప్రతిభోధయేత్ విత్రాసభయాత్
సహసాన్నావహారేదుత్ క్షిపేద్వా వాతాదివిఘాత

భయాన్నోపవేశయేత్ కౌబ్జ్యభయాన్నిత్యం చైన
మనువర్తేత ప్రియశతైర జిఘాంసుః ఏవమనభిహాత
మనా స్త్వభివర్ధతే నాశుచావిస్సృజేద్బాలం నాకాశేవిష
మేనచనోష్మమారుత వర్షేషురజోధూమోదకేషుచ.

సుశ్రు. శా, 8.

శిశువుల కోమలాంగములకు బాధకలుగని చొప్పున వారి లేవదీయుచుండవలయును. మూర్ఖులగు దల్లిదండ్రులు కొందరు చప్పునచేతులబట్టియు నింకను ననేకగతుల లేవదీయుచుందురు కాని యందువలన బిడ్డలకాలుసేతులు క్రిందుమీఁదగుటయో విరుగుటయో లేక బెణకుటయో సంభవించును. శిశువుల శరీరము నాకస్మికముగ బట్టుకొనుటయు, చెంతజేరి బిగ్గరగ నరచుటయు, నున్నచోటనుండి బలవంతముగఁద్రోయుటయు, నొకచోటనుండి బలాత్కారముగ లేవదీయుటయు లోనగు వ్యవహారములు హానికారకములగును. శిశువుల విస్తారము సేపు కూరుచుండబెట్టుట తగదు. లేతనడుమగుటవలన కుబ్జత్వముకలుగును. దాదిమొదలైనవారందరు బిడ్డల నెల్లవేళల ప్రసన్నులుగ నుంచవలయును. వారిమనసున కెప్పుడుగాని క్షోభముకలుగురీతి చేయఁగూడదు. అట్లుమంచిగ నుంచుట వలన శరీర బల బుద్ధి వీర్య పరాక్రమాదు లభివృద్ధినొందుచుందును. మాలిన్యపూరితములైనస్థలములు, నెగుడుదిగుడు నేలలు,

నెడారులు, జలము, వాయువు, రాళ్లు, మంచుగడ్డలు, ధూళి, విద్యుత్తు, శీతోష్ణములు మొదలగు వానివలన గలుగు నుపద్రవములనుండి బిడ్డల నవశ్యముగ రక్షించుచుండవలయును. ఇదే విధమున సమస్తజనులు దమతమ బిడ్డలఁబోషించుకొను చుండవలయును.

క్రీడనకాని ఖల్వస్యతు విచిత్రాణి ఘోషవం
త్యభిరామాణి అగురూణ్యతీక్ష్ణాగ్రాణి అనాస్యప్రవే
శీని అప్రాణహరాణి విత్రాసనానిస్యుః నహ్యస్య
విత్రాసనం సాధుతస్మాన్నతస్మిన్ రుదత్యభుంజానే
వాన్యత్రవా విధేయతా మాగచ్ఛతి రాక్షసపిశాచ
పూతనాద్యానం నామాన్యా హ్వాయతాసాం
కుమారస్య విత్రాసనార్థం నామగ్రహణం కార్యంసాత్.్య
చర. శా. అ. 8.

చిత్రవిచిత్రములైన రంగులుకలిగియుండునవియు, లోపలినుండియే నానావిధములైన ధ్వనుల జనింపజేయునవియు, జూడమనోహరంబులును, బరువుగాక తేలికగనుండునవియు, పదునుగల యంచులుగాని మొనలుగానిలేనివియు, నోటనిడుకొని మ్రింగుటకు వలనుగానివియు, ప్రాణము హరింపనివియు, భయముకలుగఁజేయనివియునగు రకరకంబుల యాటవస్తువులు బిడ్డలాడుకొనుట కుండవలయును. మూర్ఖులగు దలిదండ్రు

లు, వన్నెలులోనగువారనేకులు భూతములనియు, డాకినులని యు బిడ్డల భయపెట్టుచుందురు. ఇట్లుబిడ్డల భయపెట్టుట మహానీచమని చరకాచార్యుఁడు వక్కాణించియున్నాఁడు. ఘోరు వెట్టియేడ్చుచుందురుగాక! అట్టివారియేడ్పుమాన్పించుట కుగాని, దేనినైనదినుపించుటకుగాని, త్రాగించుటకుగాని, మ రియే ప్రయోజనంబునకైనగానిందు, భూతప్రేతపిశాచ డాకి న్యాదినామంబులతోడ బిడ్డలనెంతమాత్రము జడిపింపఁగూడ దు. మఱియు బిడ్డలయెదుట గల్పితంబులైన భూతాదినామం బుల నెత్తరాదని యాత్రేయమహర్షి వక్కాణించియున్నాఁ డు. ఇట్టికల్పితనామంబుల నెత్తుటవలన బిడ్డలసంస్కారము చెడి భయముత్పన్నమగును. అందువలన నారిశరీరమనోబుద్ధి విజ్ఞానంబుల యభివృద్ధికి బాధకలుగును. యోచించిచూడ నే యేప్రకారముల భూతపిశాచాదులుండునని జనులను కొను చుందురో యట్టివేమియు లేవనుటయే నిక్కువము. కేవలము బాలురను, మూర్ఖులను భయపెట్టునిమిత్తమే యివి ప్రచార ము చేయఁబడినట్లు తోచుచున్నది. వీనిమూలమున జనుల భ య పెట్టుట మహానీచము. ఈభూతాదులయెడల గలిగియుండు భయమున బాలురనేకులు మరణముగూడ నందుచున్నారు. బాలకులేయననేల? పెద్దవారలగు స్త్రీపురుషులు నయితము ప్రాణముల గోల్పోవుటలేదా? ఎవరికైన నెప్పుడైన రోగమే

దైన గలుగుటతోడనే తందరబిందరలాడుచు వారిబంధుగులు మంత్ర, యంత్ర, తంత్రముల గావించు వారలంబిలువ వారలే తెంచి తలలు త్రిప్పిత్రిప్పి రోగియొక్క ప్రాణంబులహరించు కొని పోవుచుందురు. ఇదిమహామూర్ఖశాలత్వణముగాని వేరు గాదు. మంత్రతంత్రాది భ్రమలలో దగుల్కొని స్వార్థులగు వారలు స్వార్థమునిమిత్తమౌషధము వేయకపోవుటచే మూర్ఖులు తమమూర్ఖ్యముచే బ్రాణముల వదలుచుందురు. బుద్ధిమంతులగువార లిట్టిమిథ్యాజాలంబుల దగులువడక బాలుర సర్వవిధముల రక్షించుకొనుచుండుట సముచితమైయున్నది. బిడ్డలకు బసితనమందనేకరోగములు కలుగుచుండు గావున నట్టివి కలుగకుండు నుపాయమును, గలిగిన దప్పించుకొను వెరవును చేసికొనుచుండవలయును. శీతల (స్ఫోటకము) మొదలగు రోగములు బిడ్డల ప్రాణములఁ దీయునంతటి ఘోరశత్రువులు. అట్లయ్యు నాశీతల యొకదేవియనియు, నామెంబూజించి స్తుతిచేయుటచేతను, నామెవాహనంబైన గాడిదలమేపుట వలనను నామెశాంతించి బిడ్డలవిడచిపోవునను దలంపుగలిగి జనులట్లుచేయుచుందురు. ఇదివారికి మతిభ్రమయేగాని వేరు గాదు. శీతలయనునది యొకరోగము. దీనినే జనులమ్మవారనియుఁ బిలుచుచుందురు. మూర్ఖులగువారలే యీరోగమునకు శీతలయనిపేరు పెట్టియుండవచ్చును. ఎందుచేతనన నీరోగము

నందు శైత్యమావంతయుగలుగదు. అమితముగవిదాహముద్భ
వించును. ఈరోగము చరక సుశ్రుతాది వైద్యగ్రంధములలో
విస్ఫోటకమనుపేర వాడబడియున్నది. చరకసూత్రస్థానము
యొక్క 20 వ యధ్యాయంబునను, సుశ్రుతనిదానస్థానము
యొక్క 13 వ యధ్యాయమందును ,భావప్రకాశముయొక్క
నాలుగవభాగంబునను నీవిస్ఫోటకరోగమనేక ప్రకారములని
యు, సాధ్యాసాధ్యకృచ్ఛసాధ్యాది భేధముల లక్షణములగూ
ర్చియు, నందుల కుపయోగింపవలసిన మందుల గూర్చియువ్రా
యఁబడియున్నది. కావలసినవారలక్కడ జూచికొనవచ్చును.
సమస్తమానవులకు దొరకగలట్టియొక్క యౌషధముగురించి
మాత్రము మేమిందువ్రాసెదము. ఆయౌషధమేదన టీకాలు
వేయించుకొనుటయే. టీకాలువేయించుకొనుటచేత నీరోగ
ము విస్తారముగ గలుగదు. ఒకవేళగలిగినను బాలకుఁడు మర
ణించుననిగాని, గ్రుడ్డివాఁడగుననిగాని భయముండదు. ప్రస్తుత
కాలమున మూర్ఖులనేకులు తమ బిడ్డలకు టీకాలను వేయనీ
యరు. దొరతనమువారిచేబంపఁబడు టీకాలు వేయునతఁడు వ
చ్చినతోడనే తలిదండ్రులు బిడ్డలదాచిపెట్టుచుందురు. టీకా
లువేయుచో హానికలుగునెడల నాంగిలేయ ప్రభుత్వమువారు
పసిబిడ్డలకేల వేయింతురు? మెండియు గొన్నిదేశములలో
నీ టీకాలు వేయువిషయమై మూఢాభిప్రాయ మొకటికలదు.

దయాళురగు నాంగ్లేయ దొరతనమువారు భయంకరమైన యీవిస్ఫోటకమునుండి బిడ్డలఁగాపాడునిమిత్తము టీకాలువే యు వైద్యుల నేర్పరచియుండ జనులు వారొనరించు నుపకారము దెలిసికొనజాలక ఆంగ్లేయరాజ్యనాశన మెవఁడుచేయునో యట్టివానిశరీరంబున నుండి పాలువచ్చుననియు, నట్టితమ రాజ్య నాశకారకుని గనుగొను నిమిత్తము దొరతనమువార లిట్టి టీకాలువేయు పద్ధతియు వైద్యులను నేర్పరచిరనియుఁ జెప్పుకొనుచుందురు. ఇంతకన్నమూర్ఖత్వమేమైనగలదా? రక్తపూరితమైనశరీరమును బొడిచిన బాలువచ్చుననుకొనుటెంత వెర్రితనము? ఇట్టిదురభిప్రాయంబులనెల్ల వదలి శీతకాలంబున బిడ్డపుట్టినయెడల స్ఫోటకము సంభవింపగల ఫాల్గునచైత్ర వైశాఖమాసములకు ముందే టీకాలువేయించుటయోగ్యము. నెలలోపలి బిడ్డకువేయించకపోయినను చింతలేదు. మొదటనొకపర్యాయము సంవత్సరము నిండులోపల బిడ్డకు టీకాలు వేయించవలయును. అయిదారేడుల యీడున నొక మారును, వైద్యుడవసరమనినయెడల బదిసంవత్సరముల ప్రాయమున నొకమారును వేయించుకొనవలయును. అటుతరువాత నీరోగమేమియు జేయఁజాలదు. బిడ్డలకు దవడపల్లులందు గలుగురోగములలోగూడవైద్యులచే మందువేయించి బాగుచేయించుచుండవలయును. పండ్లువచ్చుసమయమున బిడ్డల

చిగుళ్లమీఁద నుప్పుజల్లవలయును. అందుచే జిగుళ్లుపగులువారి త్వరితముగ దంతములు బయటబడును. ఆరుమాసములుగడచుటతోడనే బిడ్డలకు విస్తారభాగము దంతములువచ్చును. ఆసమయంబున సంస్కారవిధి ననుసరించి యన్నప్రాశనము జేయవలయును. మొదలుక్షీరములోనగు మిష్టాన్నములనొసఁగి తరువాత లవణతిక్తాదిభోజనము దినిపించవలయును. బాలకునకొక్కపర్యాయముగ బాలుమాని యన్నము బెట్టుటకూడదు కావున దల్లిపాలొసంగుచునేయుండవలయును. మరియుకొంచెముకొంచెముగ నన్నముగూడ నలవాటు చేయవలయును. క్రుక్కి క్రుక్కి మరింతయన్నము బెట్టఁగూడదు. అందువలన నజీర్ణముకలుగును. ఆకలిచేమాడి దుర్బలుఁడై పోవునట్లు మరింతదక్కువగను బెట్టఁగూడదు. బాలుఁడు కొంచెమెదిగి కూరుచుండుటకు శక్తివచ్చినతోడనే కూరుచుండనేర్పవలయును. అయిదారుమాసములైనది మొదలుకొని శిశువుగర్భమందు దనంత దానేదియో నేర్చుకొనప్రారంభించును. చేతనత్వము గర్భస్థాపన మాదిగనుండియుండును గాని నాలుగునెలలు మొదలుకొని జ్ఞానప్రాదుర్భావమగుటవలన నాటినుండి మాతృగర్భంబున నిటునటుబొరలుటకు మొదలిడును. గర్భమునుండి వెలువడివచ్చినతోడనే శ్వాసముతీసికొనుట, ఏడ్చుట, పాలుత్రాగుట, కూరుచుండుట, నిలచుట, నడచుట, మాటలాడుట

లోనగువాని నేర్చుకొనుచుందురు. అటులే బాలకుఁడే యేపదార్థముల జూచునో యాయాపదార్థములగురించి జ్ఞానముబొందుచుండును. బిడ్డయేదువ మొదలిడినప్పుడా యేడుపుమానిపించుటకు దల్లియేదైన వాయింప బిడ్డదప్పున నేడ్పుమాని యాశబ్దమునే యాలకించుచు నిదియేమగునోయని యాలోచించుచుండును. ఇటులే పెద్దవారియొక్కయు, శిశువులయొక్కయు నెట్టయెదుటి కొకదీపిక కొనిరాబడెనేని దీపముంగూర్చిన సంపూర్ణజ్ఞానము కలిగియుంటంజేసియు పురుషులు దానివైపు జూడనైన జూడరుకాని శిశువులకదియేమగునదియు దెలియక పోవుటవలన దదేకధ్యానముతోడ దానిదేరిపారజూచుచు దాని నిజస్వరూపముంగూర్చి తెలిసికొనవలెనని కోరుకొనుచుందురు. మాటలాడుటకు, నడచుటకు శక్తివచ్చినపిదప నేదైన నొకక్రొత్తవస్తువుకంటఁబడినతోడనే దానింగొని తెచ్చి తల్లికి జూపించి యిదియేమివస్తువమ్మాయని యడుగుదురు. పనితొందరవలన దల్లి బిడ్డయడిగినదానికి బ్రత్యుత్తరమొసంగనిచో దల్లిని మరింతబలవంతముగ మాటిమాటికదియేమని యడుగుచు తుదకామె దానిపేరుదెల్పినతోడనే తూష్ణీభావము జెందిపోవుచుందురు. ఇందువలన జిన్నతనమునుండియు బిడ్డలుతమ జ్ఞానము నభివృద్ధిజేసికొన నభిలషించుచుందురని విదితమగుచున్నది. కానియెంతపర్యంతము బిడ్డలకుఁ దల్లిమొదలగు వా

రిసహాయము దొరకకయుండునో యంతపర్యంతమువారికి శారీరక, మానసిక, ఆత్మకోన్నతి కలుగఁజాలదు. బిడ్డలయారోగ్యము, భావిసౌఖ్యములోనగునవి తలిదండ్రులు, ఆచార్యుడు, సోదరీసోదరులు మొదలగువారిమీదనే యాధారపడియుండును. ఈసంబంధులందరిలోపల దల్లిమీాద మరింతయెక్కువ యాధారపడియుండుననుట నిక్కువము. బాల్యావస్థయందు తండ్రి గురువు మొదలగు వారితోడకంటె దల్లితోడనే యెక్కువ సంబంధముకలిగియుండును. బాలునియొక్క వర్తమాన భావి సుఖదుఃఖంబులన్నియు నేతల్లిపై యాధారపడియుండునో యట్టితల్లి యెట్టివిదుషీమణియై యుండవలయునో యోచింపుఁడు. సమస్తప్రపంచంబునందు దల్లియెట్టిదిగనుండునో యామెబిడ్డలుగూడ నట్టివారలేయగుచుందురు. తల్లివిదుషియైనచో బిడ్డలు విద్వాంసులును, మూర్ఖురాలైన మూర్ఖులు నగుచుందురు. కావుననే మహాభారతమునందు,

నాస్తిమాతృసమోగురుః

భార. అను. అ. 10.

బాలకునకు దల్లితోసమానమగు గురువులేడనియు,

ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాంశతంపితా
సహస్రంతు పితౄన్ మాతాగౌరవేణాతి రిచ్యతే.

మను. అ. 2.

ఉపాధ్యాయునికంటె దల్లిపదివేలరెట్లెక్కువయని మనుస్మృతియందును వ్రాయఁబడియున్నది. బాలకునియొక్క శారీరకాత్మికోన్నతిగావించు మాతయే పదివేలమంది యుపాధ్యాయులకంటె నెక్కువకాఁగలుగునుకాని యున్నతిగలిగింపని మాతకాదు. ఉన్నతిజేయలేనితల్లికంటె నుపాధ్యాయుఁడే యుత్తముఁడు. ఈశ్లోకము తరువాతజూచికొనుఁడు. విదుషియగు దల్లిమూలమున గలుగునంతటిలాభము బాలకునకు మఱి యేమనుజునివలనను గలుగఁజాలదు. ఎందుచేతననఁగా బాల్యావస్థయం దుపదేశము జేయఁబడు విషయములన్నియు బాలకునియొక్క కరగిన ధాతువుంబోలు కోమలాంతఃకరణమందు మోహరంపుటక్కరంబులం బోలిగుమిగూడును. ఆసంస్కారములా బాలునియొక్కయంతఃకరణమునుండిజన్మమున్నంతవఱకు తొలువడిపోనేరవు. సంస్కృతమందుఁగాని, ఇంగ్లీషునందుగాని ఖ్యాతివడసిన వేదాచార్యులయంతటివారుగాని, యం. ఎ. పట్టమువందినవారలుగాని తమ విద్యాప్రభావంబున భూతప్రేతాదులెవ్వియు లేవని గుర్తెఱిగియుండియు, రాత్రులయందొంటరిగ స్మశానభూములకేగుట సంభవించినయెడల జప్పున భూతములయొక్క స్మరణముకలిగి భయభ్రాంతులగుచుందురు. భూతములను పదార్థములు లేవని వారలకు దెలిసియేయున్నదికాని బాల్యావస్థయందు కల్పితభూతంబులసంస్కారము

మూఢురాలైన తల్లివలన వారియాత్మలకు గలిగియుండును. ఆకారణమున భూతములు సర్వవిధముల మిథ్యలనియెఱిగియు న్నప్పటికి నంతఃకరణమునుండి యాభూతములభయము దూర ముగానేరదు. కావున బాల్యమందు బిడ్డలకత్యుత్తమంబగు శిక్షకలుగవలయును. వర్తమానకాలమునందు మనదేశమున గొప్పగొప్ప విద్వాంసులునయితము పశువులభంగినుండుట కిదియేకారణము.

కారణానురూపం కార్యమితి. సుశ్రు. శా. అ. 1.

కారణముంబోలి కార్యము కలుగుచుండునని ధన్వంత రి వక్కాణించియున్నాఁడు. కావునబిడ్డలకు గారణభూతలగు దల్లులు మూఢురాండ్రయి యుండ కార్యరూపక సంతానంబు లు విద్వాంసులెట్లగుదురు? ఎంతవరకు దల్లి విదుషికాకయుం డునో యంతవరకామె బిడ్డలు విద్వాంసులు కాజాలరు. కావు న స్త్రీశిక్షణమత్యంతావశ్యకము. ప్రస్తుతకాలమున జనులు మోహావశులై పశుధర్మముల మూలమున బిడ్డలగాంచుచు న్నారు. కాని వీరల యీకర్తవ్యము హాస్యాస్పదమైయున్నది. ఎందుచేతననఁగా మనుజులెంతవరకు ద్వివిధసంతానరక్షణంబు ల సమర్థులుకాకయుందురో యంతపర్యంతమట్టివారలు సంతా నోత్పత్తి కధికారులు కాఁజాలరు. శస్త్రవైద్యమెరుగని పురు షుఁడు రోగియొక్క యంగచ్ఛేదము గావించుట కధికారము

లేకయుండియు మూర్ఖమూనియట్టి పనిఁజేసినయెడల లోకము నకు హానికారకమగుగదా? అదేవిధమున దమబిడ్డలకు శారీర కాత్మికోన్నతినొసంగజాలని మాతాపితరుల యవస్థయు నింత యేయైయున్నది. మనుష్యులకంటె దక్కువజ్ఞానముగలిగియుం డు పశుపక్ష్యాదులుసయితము దమపిల్లల నెంతజాగరూకతతో డ రక్షించుకొనుచుండునో చూడుడు. పెంటి గర్భముదాల్చి నదిమొదలు పోతు పెంటియు రెండునుంగూడి గూడు నిర్మాణ ముచేసికొనును. గ్రుడ్లుపెట్టినతరువాత పెంటి వానికి గొంచె ముమాత్రపు భారమును వేడియుదగులురీతి దనరెక్కలతో నదుముచు గూరుచుండును. అంత వేడిమిచే నండములు పక్వ ములై వానినుండి పిల్లలు వెలువడివచ్చును. అనంతరము పెంటి మేత నేరితెచ్చి చంచుపులతో నమలి పిల్లలనోళ్ళకంది చ్చును పిల్లల గూటినుండి నెంతమాత్రము గ్రిందఁబడనియ్య దు. ఇతరములైన హింసకజంతువులనుండి వానిగాపాడుచుం డును. పెద్దవియగునంతవఱకు సమస్తప్రకారముల వానిరక్షిం చుచుండును. ఇందులకాపిల్లలు వానితలిదండ్రులకు రవ్వంత యేని ఫలమొసంగునా? పెద్దవియైనతోడనే తల్లినొక్కపో టుబొడిచి యెగిరిపోవును. కాని మనుష్యసంతతులన్న వృద్ధు లై నవిదప మాతాపితరుల సేవసలుపుచుందురు. మనుష్యులకం టె నత్యంతహీనమగు జ్ఞానముగలిగియుండు పక్షులే తమపిల్లల

నట్లు పాలనము జేసికొనుచుండ మనుజులు బుద్ధిమంతులయ్యు స్వదమసంతానంబుల నుత్తమవిధానంబున బాలింపకుండుట మహాశోకకరమైనవార్తగనున్నది. మూఢులగు తలిదండ్రులనేకులు తమబిడ్డలకు యథోచితరీతి దినుటకు భోజనంబును గట్ట వస్త్రములనుగూడ నియ్యరు. దరిద్రులైన సరియే; మొదలు తలిదండ్రులకే లేకపోవ బిడ్డల కేమియ్యఁగలుగుదురుగాని కలిగియున్న వారుకూడ బిడ్డలయెడ నుపేక్షవహించుట కడుశోచనీయము. కొందరు గుఱ్ఱముల బెంచు వ్యసనంబునదగుల్కొనియు, గొందఱు కుక్కలు, పావురములు, తిత్తిరిపిట్టలు, డేగలు మొదలగువానిసాకు వ్యసనంబునఁబడియు ననవరతము వానికి మేత నీళ్ళు పెట్టుటయందును, స్నానాద్యుపచారములు చేయించుటయందును మగ్నులై యవసరమైన యౌషధంబుల నుపయోగించుచు దానిపోషణము కడురకంబగురీతి గావించుచుందురు. ఆజంతువులకై నియోగింపఁబడిన పరిచారకులు కొంచెము శ్రద్ధగ వర్తించుమానినట్లు గాన్పించినచో వారికి శిక్షయు విధింపుచుందురు. మరియు నీజంతువుల బెంచుటయందనుభవశాలులైనవార లేతెంచిన వారినుండి తమకుగావలసిన సంగతులగ్రహించి యట్లుగ్రహించిన విధానముల దమవానికిగూడ శేయించుచుందురు. ఈపశుప్రాణుల నిమిత్తమిట్లమితమైన శ్రమజేయుచుందురుగాని యెవరుప్రాణి మాత్రంబులం

దెల్ల నత్యుత్తములో, యెవరికికేవలము దరిద్రులు యాశ్ర యము దక్క యితరుల యాశ్రయము కలుగజాలదో, యెవ రుమనుష్యజాతికి నేడు గడలగుదురో, యెవరు బాగొందుట ప్రపంచము బాగగుటయు నెవరు పాడగుట ప్రపంచము బాడ గుటయో యట్టిబాలకుల యుచితపోషణము నిమిత్తము దరి ద్రులు ధ్యానమూనకుండు టత్యంతాశ్చర్యకరంబును శో కకరంబునునగు వార్తయైయున్నది. కడుపునిండ నన్నముదిన్న యెడల రోగగ్రస్థులగుదురను భయంబున దరిద్రులు కొంద రు తమబిడ్డల కడుపు మాడ్చుచుందురు ఇదియేవిధమున జూ చినను మానవధర్మశాస్త్రమునకు విరుద్ధమైయున్నది. ఎం తయన్నము జీర్ణము జేసికొన గలుగుదురో యంతయన్నము బాలురకు బెట్టుచుండవలయును. బాల్యావస్థయందాకలి వి స్తారముగనుండును. ఆకలితీరులాగున గడుపునిండ నన్నము బెట్టకుండినచో బాలకుని శరీరము సరియగురీతి వృద్ధినొందనే రదు. తక్కువభోజనమొసంగుట మూలమున బాలురకెట్టిహాని సంభవించునో యట్టిదియే యెక్కువ భుజింపజేయుటవలనగూ డ గలుగు గావున యథాయోగ్యమగురీతి నొసంగుచుండవల యును. మరింత శిశువుగ నుండినపుడు మిష్టాన్నఫలములు, కఠోరాహారములు గడుదక్కువగ నొసంగుచుండవలయును. మూడునాలుగు సంవత్సరములువచ్చిన తరువాత నట్టివాని

నవశ్యముగ బెట్టవచ్చును. మిష్టపదార్థములఁ దినవలయునని బాలకులు మిక్కుటముగ నభిలాషపడుచుందురు. రోగము కలుగునను భయంబున దలిదండ్రులు వారలమిష్టాన్నంబుల దిననియ్యరు. ఇదిమాతాపితరులకు మహాపరాధము. స్వాభావికముగ మిష్టాన్నము దినుటయందభి రుచిగలిగియుండు వారలకందువలనఁ జాల లాభములుగలవు. మిష్టాన్నముచే బాలుని యెముకలు వృద్ధిపొందునని మానవధర్మశాస్త్రమున లిఖింపఁబడియున్నది. మిష్టాన్నమువలనను, మేదవర్ధకములైన పాలులోనగు వాని సేవించుటవలనను ప్రాణవాయువులకు సంయోగము గలుగఁ దన్మూలమున శరీరంబున నుష్ణముత్పన్నమగును. దానిచేనాహారము సరియగురీతి జీర్ణమగును. కావున బాలురకు మిష్టాన్నముల నవశ్యముగ నిచ్చుచుండవలయును. బిడ్డలకన్నపానంబులొసఁగుటయందుగూడ విస్తారము నియమములఁ బెట్టికొనుటుచితముకాదు. మిష్టాన్నము దిన నభిలషించువారలకది లభింపనియెడల శారీరకవృద్ధిసరియగు రీతిగాఁజాలదు. మరియు నాయాఋతువులలో దొరకునట్టి ఫలములగూడ నిచ్చుచుండవలయును. అందువలన బాలుఁడారోగ్యవంతుఁడై యుండును. తలిదండ్రులు మిష్టాన్నములు, ఫలములు మున్నగువాని దినుటకొసంగక పోవుటవలన బిడ్డలువానియెడల నమితమైనయాస బెట్టుకొనియుండి దైవ సంయోగమున నెప్పు

డైన దొరకినయెడల నొక్కపర్యాయంబుగ దెగతిందురు. అం దువలన వారికి రోగముకలుగును. అంతదలిదండ్రులు మితా యి దినుటవలననే తమబిడ్డనికి రోగమువచ్చెనని తలంతురుగా ని మితాయిదినకుండ దాచిపెట్టినందున నిట్టియనర్థము మూడె ననుకొనరు. బాలురకు యథోచితముగ గావలసిన పదార్థం బుల నొసంగకపోవుటంజేసి యిట్టివేయగు దుష్పరిణామం బులనేకములు కలుగుచుండును. కావున రెండుసంవత్సరములు వచ్చినది మొదలుకొని బిడ్డలకు స్నిగ్ధములు, గురుత్వములు న గు మిష్టాన్న ఫలంబుల నవశ్యము నిచ్చుచుండవలయును. ఆ హారము కేవలాధికము కూడదు. అనుదినముకొంతవ్యాయామ్ము గలిగి యుండవలయు. బాలకుడేడు సంవత్సరములవరకు కేవలము తల్లి వద్దను, 16, 18 సం౹౹డ్లవరకు దలిదండ్రుల యాధీనమందు ను నుండును. గృహకార్యములందు దండ్రియంతగ సంబంధ ము గలుగఁజేసి కొనియుండడు. తల్లియే గృహకార్యముల యెడల నధికసంబంధము కలిగియుండును. కావున తల్లి కొడు కులకే విస్తారసంబంధముండును. కుమారుఁడే పదార్థమునైననొ సంగుమని తల్లినడుగు నెడల నామెయతని కావస్తువునిచ్చుటకు మారుగ రెండు తన్నుల నొసంగెనేని పాపమాబాలుఁడుదాసీ నుఁడై యుత్సాహమెల్లపోవ నావలకు వెడలిపోవును. ఎంత పర్యంతము మరింత పసివాఁడుగ నుండునో యంతవర కాబా

లుఁడేమియుఁజేయుఁజాలక యూరకుండును కాని పది పంద్రెం డు సంవత్సరములు వచ్చినతరువాత దల్లితనయెడల గావించు క్రూరవ్యవహారంబు గనిపెట్టి తనకు గావలసిన దాని దండ్రి నడుగును. తండ్రియు నజాగరూకుఁడై యతఁడడిగినదానియెడ ల ధ్యానమూనకపోయినచో నంత దండ్రియందుగూడ విశ్వా సముదప్పి నిరాశుఁడై దుర్మార్గమునకు దిగి కానిపోని కార్య ములఁ జేయ మొదలిడును. ఆకలియైనప్పుడేమైన బెట్టుమని తల్లి నడుగ నామె యేమియు నియ్యకపోయెనేని యింటిలోని యా హారపదార్థములు, వస్త్రములు, సొమ్ములు, ధనములోనగు వానిలో దొరకిన దానిదొంగలించితీసికొనిపోయి యథేచ్ఛము గ గావలసిన వానిగొనితినును. ఏమియు దొరకకపోయిన జిట్ట చివరకు దల్లికట్టుకొనుచీరయో దండ్రిపెట్టుకొనుపాగయో చేతికందినదాని గైకొనిపోయి వెచ్చపెట్టుచుండును. అవియు లభింపనియెడల నిరుగుపొరుగువారి గృహములలో దొంగతన ము జేయనారంభించును. ఇందులకత్యంతనీచమైన పరిణామము కలుగును. అట్లితరులయిండ్లలో దొంగతనము చేయుటకుగూడ వీలుకానిచో దుస్సాంగత్యమొనరించి వారివెంటజని దుర్వ్యస నంబులలో దగులువడును. ఇట్టిదశకలుగుట వీక్షించి తలిదం డ్రులు పీపు బద్దలగునట్లు తన్నుచుందురు. అందువలన బాలున కపరిమితమైన దుఃఖముకలుగఁ దనన్నాలమున శారీరకమానసి

కాభివృద్ధికి భంగమువాటిల్లును. హింసించుటవలన బాలుని స్వభావమే పాడగును. అందువలన భయముపోయి తలిదండ్రులసంచునైన లక్ష్యముచేయక "అంతగమితిమీరిన నన్నుఁజావఁగొట్టదురుకాని యంతకన్న నాతలిదండ్రులు నన్నేమిచేయఁగలరు?" అనిబాలుఁడు రూఢిపరచుకొనును. ఇట్టిసంస్కారము బాలుని యంతఃకరణంబున నెలకొనినచో మొండిబారి మొదలకు గొరకాకుండఁబోవును. మఱియు బాలకులనేకు లిదే విధంబున శిక్షింపఁబడుచుండుటం జేసి యాదుఃఖము సహింపనోపక యిల్లు విడచిపరుగెత్తియేబావాజినో మౌల్వినో లేక యేమిషనరీనో శరణు జొచ్చుచుందురు. అంతటవారల తలిదండ్రులు మొఱ్ఱో యని విలపించుచు న్యాయస్థానములకు బోవలసివచ్చుచున్నది. ఎంతకష్టపడినను క్రైస్తవాచార్యులచేత బడ్డబాలుఁడు మాత్రము తిరిగి తలిదండ్రులకు దొరకుటదుర్ఘటమే అట్టివారలబెంచి పెద్దచేసినందులకుఁ బడినకష్టమంతయు వ్యర్థమైపోవఁ గులమునకుఁ గళంకితముకలుగును. బాలకుఁడుఁ జావదన్నుట మూలమున నిట్టివేయగు ననేకోపద్రవంబులు పొడముచుండును. కొట్టుటవలన బాలుఁడొకవేళ పారిపోకపోయినప్పటికి నతనికపరిమితమైన దుఃఖముకలుగును. అందుచే శారీరకమానసిక వృద్ధి యుక్తమార్గమునఁ గాసేరదు. తలిదండ్రులయెడ వైరభావమూని పెద్దవాఁడైన తరువాత మాతాపితరులకు దుఃఖము కలిగించు

ను. ఆకారణంబున దలిదండ్రులు బ్రతికియున్నంతవరకు దుఃఖ మునొందుచుండవలసియేవచ్చును. కావున బిడ్డలఁ గొట్టుట తలిదండ్రులకును వారికుటుంబమునకును హానికారకమే కాని వేరుగాదు. బాలురఁగొట్టుట కవకాశము గలుగజేయు ముఖ్య కారణములేవనఁగా:—

1. ఏదైననొక కార్యము జేయుమని బాలునాజ్ఞాపింప నతఁడు దాని జేయకుండుటవలనను,

2. ఇతరులయొక్క బాలురతోఁ గలహించునప్పుడును,

3. మోటుతనముగ నాటలాడుచు గంతులు వేయున పుడుగాయములు తగులుటచేతను,

4. తినుటకో లేక యాడుకొనవలెననియో యేదైనవస్తు వులనిండనియడుగనియ్యక పోవుటచే హఠముపట్టుటవలనను॥

5. తలిదండ్రులులోనగువారు గృహము వెలువడి బయట బోవుసమయమున వెంటవచ్చెదమనిహఠముానుటచేతను,

6. చదువుకొనఁబోవునపుడును,

7. ఇంటియందో లేక యిరుగుపొరుగువారలగృహము లందో దొంగతనము చేయుటం జేసియు,

8. ఇంటిపదార్థములఁ బాడుచేసి పగులగొట్టుటచేతను,

9. ఆటలాడుకొనునపుడు దాగట్టుకొన్న వస్త్రంబులఁ జించుకొనుటఁబట్టియు, నిటులే పుస్తకములు లోనగువాని బాడుచేసికొనుటవలనను,

10 మరికొన్ని యితర కారణములవలనను బాలకుల తలిదండ్రులుగాని సోదరీసోదరులుగాని కొట్టుచుందురు. పూర్వోక్తకారణములవలన బిడ్డలశిక్షించుటంజేసి యుపద్రవముల నేకము లుత్పన్నములగుగావున మేమిట్రవ్రాయురీతి నడచుకొనినయెడల వారినట్లుహింసింపకయే సకలకార్యంబుల జాలభాగము సిద్ధములగునట్లు చేసికొనవచ్చును. ఎట్లనఁగా,

1. బాలునిచేనేదైన బనిజేయించుకొన వలసివచ్చిన మిక్కిలి మక్కువతోడ వారలకాకార్యముః చేయువిధానము జూపించి చేయించుకొనవలయును. అట్లునెమ్మదిగ ఁజెప్పుటచేత వారెట్టియాటంకము జెప్పకచేయుచుందురు. మరియు నేదైన గార్యముజేయునప్పుడు బాలకులకుదుఃఖము కొంచెమైనఁగలుగఁగూడదు. మూర్ఖులగు దలిదండ్రులనేకులు ప్రీతిపూర్వకముగ బదులుచేయించుకొనక బాలురపై దమయాజ్ఞలఁ జెల్లించుచుందురు. పరాధీనుఁడుగ నుండునంతకాలము బాలుఁడాజ్ఞవలననే పనిచేయుచుండును. కానియీయాజ్ఞలకు ఫలము దలిదండ్రులు ముదుసలివారైన తరువాత గాంచుచుందురు.

2. తల్లియుత్తమంబగురీతి శిశువునుసంగుచుండినచో బాలకుఁడితరబాలురతో నెంతమాత్రముగలహింపఁడు. ఒకవేళనట్లుపోరాడినను దలిదండ్రులు స్వయముగ గుమారుని దండింపక యెవనితో బోరాడునో వానితలిదండ్రులచే భయపెట్టిం

చవలయును. అట్లుచేయుటవలన బాలునకుఁ దలిదండ్రులపై విరోధముకలుగదు.

3. మోటుఁతనముగ నాటలాడునపుడుగాని గంతులువేయునపుడుగాని బాలునకేమైన గాయముతగులుచో నతనిగొట్టగూడదు. అతనికట్టియాటవలన గలుగునష్టమును బాగుగదెలియఁజెప్పి మరలనట్లుచేసినచో నప్పుడుగలిగినదశయే సంభవించునని మనస్సున నాటునట్లుపదేశము చేయవలయును. ఆటలాడునపుడు గాయముతగిలినమీఁద గొట్టుటవలన నాటదెబ్బమరచిపోయి తల్లికొట్టినదానినే జ్ఞాపకముపెట్టికొనియుండును. అందువలన బాలునకు దల్లితోవైరముకలుగును. బాలురనాడుకొననియ్యక పోవుట మాతాపితరులకుమహాప్రమాదము. బాలకులకు ఆడుకొనవలయునని స్వాభావసిద్ధముగనుండునభిలాషము మిగులలాభదాయకమైయున్నది. బాల్యావస్థయందు బాలురదేహంబు లాటలవలన నుత్తమరీతి నభివృద్ధి పొందుచుండును. కొన్నిసమయములందు వారుభోజనము నయితముమాని యాటలకు బరువెత్తుచుందురు. ఆహారము బాలురదేహాభివృద్ధికి గారణంబగుచాప్పున నాడుకొనుటయు దదభివృద్ధికి హేతువైయున్నది. సర్వాంతర్యామియగు జగన్నియంతబాలకులయందాడుకొను స్వభావము సృజించియుండని మొదల విజ్ఞులైన మాతాపితరులెంతగ నుపదేశము సేసినను వా

రట్టికార్యము జేయకయేయుందురు. ఈశ్వరునియొక్క సృష్టి క్రమముయెడల ధ్యానములేనివారలై, మూర్ఖులగు మాతాపితరులు బాలురనాడుకొననియ్యకుండు టత్యంత శోచనీయమై యున్నది. సృష్టిక్రమమున కనుకూలముగ వర్తించువారలే యీజగంబున సౌఖ్యమందుదురుగాని యందులకు వ్యతిరేకముగ నడచుకొనువారలు దుఃఖమందుటయే నిశ్చయము. కావున బాలురయొక్క స్వాభావికప్రవృత్తి గనిపెట్టి తదనుకూలంబుగ సృష్టిక్రమానుసారము నడచుకొనుట తలిదండ్రులకు ముఖ్యకర్తవ్యమైయున్నది.

4. తినుటకుగాని, యాడుకొనుటకుఁగాని యేమైననడిగినయెడల వారలకవి తెచ్చి యియ్యవలయును. తెచ్చియిచ్చుటకుశక్తిలేనిచో యుక్తిపూర్వకముగ సమాధానముచేయవలయును. అట్లు తెలియజెప్పి సమాధానపరుపఁజాలకపోయిన నింకను వేఱ్వేరు ఉపాయంబుల నూరకొనునట్లు చేయవలయును. ఏయుపాయమును బనికిరానియెడల నటులేయేడవనియ్యవలయుగాని కొట్టఁగూడదు. కొంతసేపునకు వారంతవారలే యేడ్పునుమానుదురు.

5. తలిదండ్రులు బయటబోవుసమయమున బాలకులు తాముగూడ వెంటవచ్చెదమని పట్టుబట్టినయెడల వీలైనంతవరకు వెంటదీసికొని పోవలయును. తీసికొనిపోవవీలులేనిచో మరపించి వారికెరుకలేకుండ బోవలయును.

6. చదువుకొనుటకుఁ బోవనియెడల యుక్తిగనాశ్వాసముచేసి పంపవలయును. అట్లుచేసినను బోనిచో నాకస్మికముగ నాదినమందే పంపక నాటికిఁసెలవిప్పించి చదువుకొనకపోయినయెడల మనుజులు మూర్ఖులు, దరిద్రులు, పరాధీనులు, ధర్మరహితులునై యుందురని బాగుగ నాటఁజెప్పవలయును.

7. ఇంటియందలి వస్తువుల దొంగిలెనేని నట్లుచేయుటకూడదనిచెప్పి యేవస్తువు దొంగిలునో నావస్తువతనికి తరుచుగ నిచ్చుచుండవలయును. అందువలన దానికొరకు దొంగతనముచేయుటమానుకొనును. పొరుగిండ్లలో దొంగిలించిన నట్టి శిశునే యొసంగవలయును. మరియు నెవరియింటదొంగిలించునో వారివలననే దండనము కలుగులాగు జేయవలయును.

8. ఇంటియందలి వస్తువులఁ బగులగొట్టి పాడుచేసిన నాపగిలినవాని యెదుటబెట్టి బాలకునే మరలవానిబాగుచేయుమని యడుగవలయును. మరలబాగుచేయనోపకయున్న సమయమున నందుమూలమునగలిగిన నష్టముంగూర్చి బాగుగజెప్పిన మరియొకపర్యాయమట్లుచేయఁడు. వెండియు నట్టివస్తువుల బాలురకందనియట్టి యెత్తైనప్రదేశములలో భద్రపరచుకొనవలయును.

9. బాలురు కట్టుకొనువస్త్రములగాని, పుస్తకములు, కాగితములు లోనగువానిగాని చించి పాడుచేసికొనుచున్న చో

నొకటికి నాలుగుమారులు "నాయనా! నీవిట్లుప్రతిదినము బా ధు జేసికొనుచుందువేని ననుదినమునీకుగ్రొత్తవాని నెక్కడ నుండి తెచ్చియియ్యఁగలము?" అని శాంతములైన మంచిమా టలతో మనస్సునకు నాటులాగునఁ జెప్పవలయును. ఇదియ టులుండ వర్తమానకాలంబున కొందరుమాతాపితరులు తమ బాలకులకు గాగితములు లోనగువాని మొదలే యొసంగక యే యేడ్పించుచుందురు. అట్లుచేయఁగూడదు.

10. ఇంక నేయితరకారణములున్నను నిటులేశాంతవ చనములతో నోదార్చుచుండవలయుగాని బాలకులనెంతమా త్రము గొట్టఁగూడదు. ఏవిశేషకారణములవలననైన గన్నులు మి బెదరించుటమూలమున సరియగునేని యుక్తిపూర్వకము గ నట్లుబెదరించవచ్చును. మూర్ఖులైన తలిదండ్రులనేకులు బాలుర ననుదినము గొట్టుచుందురు. కొందరు దినమునకు మూఁడు నాలుగు మారులును మఱికొంద రపరాధములేక యును బాలకుల గొట్టుచుందురు. ఒకనాఁడొక గృహస్థుఁడు తనకుమారుఁడు నీరుదెచ్చుచుండఁ జేతిలోనికుండక్రిందబడి ప గిలిపోవుటవీక్షించి యత్యుగ్రుఁడై వెంటనేయాబాలుని మీఁ దికురికి సగముప్రాణముపోవునట్లు చావఁగొట్టెను. స్మృతితప్పి యతఁడు క్రిందఁబడిపోయినతరువాత రెండవవానిమీఁదికి బో యి హూన హూనముగ వానింగూడ జావదన్ని మూఁడవవా

నిదన్న తరువాత నాలుగవవానిమీఁదికి బోయి వానిజుట్టుకొ
శాది యనంతరమా బాలురతల్లి పైకురికి యామెనుమనసుదీర
గొట్టెను. తరువాతఁ గొంతసేపునకు కోపము శాంతించిన పిదప
గుండనొక్కఁడు బ్రద్దలుచేయ నింతమంది నేలతన్ని తివనియడుగ
దక్కినవారు ముందెప్పుడైన నపరాధము గావింపఁగూడదా!
అందులకు సగముశిక్ష నిప్పటికోపములో నే యిచ్చితిని. తక్కి
నసగముశిక్షను మరలదప్పుచేసిననప్పుడు గలుగుకోపములో
నుండి యిచ్చెదనని యతఁడు బదులుచెప్పెను. మూర్ఖులైనయి
ట్టి దుష్టాత్ములకు దయయాలుబిడ్డలఁ జావఁదన్నుటయేక ర్తవ్య
ము. తలిదండ్రులిట్టి దుర్వ్యసనంబులగలిగియుండి బాలకుల మి
క్కుటంబుగ హింసించుటం జేసియే తాము పెద్దవారైనపిదప
మాతాపితరులయెడ దాక్షిణ్యమావంతయు లేక వారి బడితెల
తోఁ బూజింపుచుందురు. ఇట్టినీచవిధానముకలుగకుండు నిమి
త్తము మాతాపితాది సమస్తబాంధవులు బాలురగొట్టఁగూడ
దు. బాలురగొట్టుటవలన గలుగు దుష్పరిణామంబుల గొన్నిం
టినింపు వ్రాసితిమి. మిగిలినవాని బుద్ధిమంతులు స్వయముగ
గ్రహించుకొందురుగాక.

బాలుర మూర్ఖత్వమునకు దాసులగావించి వారిజన్మ
మును భ్రష్టము చేయఁగూడదని సమస్తమానవులు ధ్యాసము
కలిగియుండవలయును. దేశకాలప్రకృతుల ననుసరించి తనమన

ధనంబులతోఁ దమప్రాణములకన్న మిన్నయనుకొని ప్రీతిపూర్వకంబుగ బాలురఁబోషించుట తలిదండ్రులకుచితము. అన్నపానములు, వస్త్రములు, భూషణములు లోనగువానినొసంగి బాలుర నానందితులఁజేయుటయే యపత్యసంగోపనమని కొందఱుతలంచుచున్నారు. కేవలమన్నపానాదులమాత్రమున వారిఁబ్రబసన్నులుగనుంచుట బాలసంరక్షణము కానేరదు. వర్తమానకాలముయొక్క శారీరకాత్మికోన్నతితోబాటు భావిశారీరకాత్మికోన్నతి గలుగఁజేయుటయే యపత్యసంగోపనమనబడును. బిడ్డలకు శరీరమునిండ సొమ్ములుంచుటవలన నపత్యసంగోపనమగునని తలంచుటమహాప్రమాదము. ఎదుగఁదగినబిడ్డలకు సొమ్ములువేయుట మూలమునఁ గాలుసేతులు మొదలగునవయవములు సరియగురీతి నభివృద్ధిబొందఁజాలవు. మరియుభూషణములమూలమున లెక్కలేని బిడ్డలప్రాణములు తీయఁబడుచున్నవి. కావున ధాతుసంబంధములైన భూషణంబులచే బాలుర విభూషితులఁజేసిన ప్రయోజనములేదు. కాని

వాగ్భూషణంభూషణం కింవాశీలంపరంభూషణం భ_ర్తృ.నీ.

సంస్కారముబొందినవాణియు, శీలమును రెండేమనుష్యునకు ముఖ్యభూషణములు. కావున విద్యయు, నీతియునను భూషణములతోఁ దమబిడ్డలనలంకరించుట మాతాపితరులకు ముఖ్యము. సత్యశాస్త్రములఁదనేకచోట్ల నిట్టిపుత్రసంగోప

ము తలిదండ్రులకు ముఖ్యకర్తవ్యంబని ప్రతిపాదనము చేయఁబడియున్నది కాని విచారకరమగు విషయంబేమనఁ బ్రస్తుతకాలమున నొకరిద్దరుపిల్లలు కలుగునంతవరకు మాతాపితరులే బిడ్డలుగనుందురు. అట్టివారలు బాలురకు రక్షణముగాని శిక్షణముగాని యుక్తవిధానంబున నెట్లుచేయఁగలుగుదురు? యోగ్యులగువారలే యితరుల యోగ్యులుగఁజేయగలుగుదురుగాని యయోగ్యులుకాదుగదా? ఇంగ్లీషుగాని సంస్కృతముగాని చదివియుండని యతఁడితరులచే నాభాషలనెట్లు చదివింపఁగలుగును? అటులే బాల్యావస్థయందుండెడు మాతాపితరులు తమకే శిక్షణముకావలసియున్నపుడు తమ సంతానములకే ప్రకారము శిక్షనొసంగఁగలరు? అట్టిదశయందపత్య సంగోపనమెట్లు కానోపును? వర్తమానకాలమందలి దంపతుల స్థితియిట్లున్నది. కానిమేమువ్రాయునది యీ బాలదంపతుల కొరకుగాదు. ఇదివరకు మేమువ్రాసియున్న ప్రకార ముత్తమలక్షణములతోఁ గూడుకొనియుండు సుశిక్షితులైన యువాదంపతులనిమిత్తమైయున్నది. కావున తమసంతానములయొక్క శారీరకమానసిక రక్షణశిక్షణంబులగావించుట కహర్నిశము పాటుపడుట పూర్వోక్తగుణ విభూషితులైన మాతాపితరులకుచితము. శారీరక రక్షణము గురించి యిదివరకే వ్రాసియున్నారము. మరియు నాశారీరక రక్షణము ముఖ్యముగఁ బ్రాణి ధర్మశాస్త్రము,

శారీరశాస్త్రము, రసాయనశాస్త్రము, వైద్యశాస్త్రము, మానసశాస్త్రము, జీవనశాస్త్రము మొదలగువాని ననుసరించి చేసికొనుచుండవలయును. భోజనాచ్ఛాదనంబుల కొరకును, రోగము లెవ్వియుఁగలుగకయుండుట కొరకును బాలకుల విషయమై చేయఁబడు ప్రబంధమే శారీరక రక్షణమనబడును. భయము, శోకము, క్షోభము, త్రాసములోనగునవి బిడ్డలకుఁ గలుగకుండఁగాపాడుట మానసికరక్షణము. ఇదేవిధమున వారికి శారీరక మానసిక శిక్షణముగూడఁ గలుగవలయును. ఈరెండువిధానములు సృష్టిక్రమము ననుసరించియుండును. బ్రహ్మచర్యము, ఉత్తమభోజనము, శుద్ధజలము, వస్త్రశయ్యాసనములు మొదలగు వాని నుచితరీతిసేవింపఁ జేయుటయు, మాదకద్రవ్యంబుల నిషేధించుటయు, దేశకాలముల ననుసరించి నడిపించుటయు, దుష్టప్రాణులనుండి తప్పించుటయు మున్నగునవి శారీరక శిక్షణములనఁబడును. విద్యానీతులనేర్పియభివృద్ధిపరచుటయే మానసికశిక్షణము. ఇవియన్నియు ముఖ్యముగఁ దల్లివలననే కలుగుచుండును. తల్లియీరెండు ప్రకారంబులగు రక్షణశిక్షణంబుల సృష్టిక్రమము ననుసరించి బాలునకుఁ గలుగఁజేయుచుండవలయును. సృష్టిక్రమమునకు వ్యతిరేకముగ నెవరేకార్యములఁ జేయఁబూనినను గృతకృత్యులుగాఁజాలరు. ఎవఁడైన గన్నులతో వినుటకును, చెవులతోఁ జూచుటకును

నభిలషించినయెడల నట్టివాని కోరికసఫలమగునా? అదేవిధము న బాలకులకు సృష్టిక్రమంబునకుఁ బ్రతికూలంబుగ రక్షణశిక్షణముల నొసంగనెంచినను గొనసాగనేరదు. బిడ్డలకెట్లు శారీరకశక్తి వృద్ధిగాంచుచుండునో యటులే మానసికశక్తియు నభివృద్ధి బొందుచుండును. కొంచెము మానసికశక్తి యెక్కువగుటతోడనే బాలునకు దల్లి మొట్టమొదలు స్థూలపదార్థములైన కాలుసేతులు, కన్నులు, చెవులులోనగు వానింగూర్చియు ననంతరము సూక్ష్మపదార్థంబులైన మనసు, బుద్ధి, జీవుఁడు, ప్రకృతి, పరమేశ్వరుఁడు మొదలగువాని గురించియు జ్ఞానము గలిగింపవలయును, బిడ్డ యేయేపదార్థములఁ దెలిసికొనఁ గోరుచుండునో వానినెల్ల దల్లిప్రీతిపూర్వకంబుగఁ దెలియఁజెప్పుచుండవలయును. బిడ్డయేదేని బుష్పముఁగాని పండుగాని తీసికొనివచ్చి యిదియేమిపదార్థ మమ్మాయని యడిగినచో నామె యాసమయమందే యావస్తువుయొక్క సకలావయవంబులఁ జూపించి దానిరూపము, రంగు, వాసనలోనగు వానిగురించి తెలియఁజెప్పి, తరువాత నాఫలముఁజేతఁ దీసికొని యిదిగో దీనినిట్లు ముక్కలుచేయవచ్చునని యట్లుచేసిచూపించి, యదియొకానొకపేరుగల పండనియు, దానిగింజల భూమిలో వేసిజలము పోయుటచేత మొలకెత్తి సూర్యునివేడిమిచేతను, జల్లదనము, వాయువుమున్నగువానిచేతను గొన్నిదినములకుఁ

గ్రమక్రమంబుగ శాఖోపశాఖాపత్రసహితంబుగఁ బెరుగుచుఁ బెద్దవృక్షమై పువ్వులుపూచి వానినుండి చిన్నపిందె వెలువడి తరువాతఁ బూలురాలి పోవుననియు, నావెలువడివచ్చిన పిందె క్రమముగ బెద్దదియై కొంతకాలములో బండి యిట్లేతియ్యదనము బొందుననియుఁ జూడుమని దానియందలి గింజలు చూపించి వానినిప్పుడు చెప్పినవిధానమున నాటుటవలన బూర్వోక్త ప్రకారంబున మొలకయై, వృక్షమై దానినుండి పూలు, వానినుండి పండ్లు, వానినుండి మరలనిట్లె గింజలు, చెట్లుగలుగుచుండునని సృష్టిక్రమమును సాధ్యమైనంతవరకు నిదర్శనపూర్వకముగ బిడ్డలకుఁదెలియఁజెప్పవలయును. ఇటులే తక్కంగల సకలపదార్థములగురించియు నెఱుఁగఁజెప్పవలయును. బాలకునందేప్రకారముగ గ్రహించుకొనుశక్తి యభివృద్ధి బొందుచుండునో యాప్రకారము ననుసరించి మనుష్య, పశు, పక్షి, వృక్ష, వన, పర్వత, పృథివి, జల, అగ్ని, సూర్య, చంద్ర, నక్షత్రాదులవిషయమై తెలియఁజెప్పవలయును. ఆయాపదార్థంబుల జూపించిచెప్పి తరువాత వానిగుణముల నెరుకపరచ వలయును. ఇటులేక్రమముగ వర్ణములగూడ నేర్పవలసియున్నది. అక్షరస్వరూపములగురించిన జ్ఞానముకలుగఁజేయు క్రమమునందు బిడ్డలమానసిక శక్తి వ్యయముకాఁగూడదు. బిడ్డలు చీట్లపేకలు మొదలగు నానాప్రకారములైన యాటలవస్తువులతో నాము

కొనుటయందెక్కువ మక్కువ గలిగియుందురు. కావున నా యా యాటలవస్తువులమీఁద నకారాదివర్ణములవ్రాసి వాని కాపేరులనే పెట్టవలయును. అనఁగా నొకచీటిపై 'అ' యని యు, రెండవదానిపై 'ఆ' యనియు నిటులే యన్నిపేకముక్క ల కన్నియక్షరముల పేరులు పెట్టవలయును. బాలునకు అకా రాదివర్ణములయొక్కయు, మాత్రలయొక్కయు స్వరూపజ్ఞాన ము నాటలవస్తువులవలననే కలుగఁజేయుటమంచిది. మెండియు బిడ్డలూరక గీతలుగీయుచుందురు. అట్లుగీయుటలో నకారాది వర్ణములవ్రాయుట నేర్పవలయును. మరియుస్వరములు, వ్యంజ నములు, హ్రస్వములు, దీర్ఘములు మొదలైన వానిగూర్చి తెలియఁబరచి యక్షరములలో నొకదానికి మరియొకదానికిగల సంబంధము తెలిపి యాటలమూలముననే పేరులవ్రాయనేర్పవ లయును. ఇటులే బాలోద్యానశిక్షణమను పుస్తకమునుండి పశుపక్ష్యాదినానాప్రకారములగు బొమ్మలఁజూపి చేతవ్రాయఁ బడువాని పేరులఁజూపించి తెలియజేయఁవలయును. ఇటులేమా నసికశక్తియొక్క యభివృద్ధిననుసరించి మానసిక శిక్షణము గూడఁ బెంపొందచేయవలయును. విద్యాభివృద్ధిజేయుటయే మానసికశిక్షణము. ఇందులకుఁ దోడుగ నీతిశిక్షణముగూడ నావశ్యకమైయున్నది. నీతిశిక్షణములేనిచో బిడ్డలుదురాచారు లు, దుష్టస్వభావులునై మొదులకుగొరగాని వారగుదురు.

వారికి నీతిశిక్షణముసేయుట మిగులకఠినము. ప్రసుతము విజ్ఞులైన తలిదండ్రులు "కుమారా! అబద్ధములాడుట కడునీచము. అటులే దురాచరణముల సలుపుటయు నీచమే. మోసము, కపటములోనగు దుర్వ్యసనంబులును నీచములేయైయున్నవి. కాన నట్టివాని నుండి దూరగుఁడవై యుండుము?' అనిబిడ్డలకు నీతి నుపదేశము జేయుచుందురు కాని యిట్లు కేవలము మాటల మూలమున నుపదేశము జేయుటచేత వారు నీతిమంతులెన్నటికిఁగాఁజాలరు. బాలురకు నేర్పునదంతయుఁ బ్రత్యక్షములైన నిదర్శనములఁ జూపి నేర్పు మండవలయునని యిదివరకే వ్రాసియుంటిమిగదా! కేవలము మాటలు చెప్పినంతమాత్రమున నీతిశిక్షణమునకుఁ గలుగవలసినంత ఫలముకలుగదు. ఊరకవినుటవలన కంటె కన్నులతోఁ జూచుటచేత గలుగు జ్ఞానము స్థిరముగనొప్పియుండును. కావున బ్రత్యక్షనిదర్శనములతో నీతిబోధించవలయును. బాలురమాతాపితరులే బాలకులు పొందు నీతిబోధనల కుదాహరణులు. ఎందుచేతననఁగా దలిదండ్రులే యేకార్యంబులఁ జేయుచుందురో వానినేబిడ్డలుకూడఁ జేయుచుందురు. ఒకబాలునితండ్రి చుట్టత్రాగువాఁడై యుండి కొడుకుతో "నాయనాఁచుట్టద్రాగుట మిగులచెడ్డదిగానఁ ద్రాగకుము"అని యుపదేశము జేసినను దండ్రియొక్క యాకథనము బాలకునేమియుఁ జేయఁజాలదుకాని తండ్రి చుట్టద్రాగుట, కుమారునకు

దాహరణపూర్వకముగ దండ్రిపక్షమున జుట్టద్రాగుమని యుప దేశము జేయుటతో సమానమగును. ఏలయన బాలుఁడు దేనిని జూచునో దానినేయనుకరించుచుండును. తండ్రి యేదేనికార్య ము నిమిత్తము గృహము విడచి వెలుపలికేగియున్న సమయం బున బాలుఁడు దొంగతనముగఁ దనతండ్రిచుట్టలలో నొకదాని దీసి త్రాగుటకారంభించి క్రమక్రమముగ బెద్దవాఁడైన దరువా త బహిరంగముగఁ ద్రావుటకు మొదలుపెట్టును. బాల్యావస్థ యందు బాలురకుఁ జెవులులోనగు నింద్రియములనుండి జ్ఞాన ము కడుదక్కువగనే కలుగుచుండును. కన్నులతోఁ జూచుట చేతనే యెక్కువకలుగును. బాలకులకెదురుగఁ గుంటివాఁడెవఁ డైన గుంటుచుఁబోవుచుండెనేని వారుగూడ నతనివలెనే కుం టుటకారంభింతురు. ఇట్టిప్రవృత్తి వారియందు స్వ . నుండునుగాన బాలురయెదుట దుర్వ్యవహారంబులగాని, దుచ్చే ష్టలగాని చేయకయుండుట తలిదండ్రులు, సోదరీసోదరులు మొదలగు వారలకందరకు యోగ్యమైయున్నది. బాలురకుప దేశము కావింపబడునదంతయు వారియొక్క నవనీతముంబోలు కోమలాంతఃకరణమందు ముద్రితంబగును. సాంగత్యముయొక్క ఫలితము మనుష్యమాత్రులకందఱకుఁ గలుగునదియేయైనను బెద్దవారలకంటె బాలకులకు సాంగత్యఫలితము మిగులద్వరిత ముగఁ గలుగుచుండును. గడ్డిమొదలగునవి మిక్కుటంబుగఁ

బెరిగియుండు నేలలో వేరొంకుపదార్థము లతికష్టముమీఁద మొలచునుగాని త్వరితముగ మొలవనేరవు. అటులే తరుణవయస్కులగు మనుజులయొక్క యంతఃకరణంబను భూమియందు నానావిధపదార్థములగూర్చి కలిగియుండు జ్ఞానసంస్కారంబను గడ్డి యేపుగఁ బెరిగియుండుటచే నట్టియంతఃకరణసీమలందు సాంగత్యమువలనగలుగు ఫలితములను వృక్షములు శీఘ్రముగఁ బ్రాదుర్భావ మందనేరవు. కాని సకలసంస్కారరాహిత్యమైయుండు బిడ్డలశుద్ధాంతఃకరణరూపకభూములందు సాంగత్యప్రభావంబున గలుగు ఫలితంబులను వృక్షములతిత్వరితంబుగ నభివృద్ధిజెందును. ఏదేశములోఁ బుట్టినబాలకున కాదేశమందలి భాష స్వయముగవచ్చుచుండుట మనము చూచుచున్నారము. పదిపండ్రెండు సంవత్సరములువచ్చినతరువాత నతని నితరదేశములకుఁ బంపినచో నాయన్యదేశపుభాషయు నతనికి శీఘ్రముగవచ్చును. కానియొక దేశమందలి వృద్ధపురుషునిగాని జవ్వనునిగాని యట్లు పంపినచో నతని కాయన్యదేశపుభాష వచ్చుట మిగులఁ గష్టమగును.

ప్రపంచమందెచ్చట జూచినను బాలురయొక్క యాచరణములు విస్తారభాగము వారితలిదండ్రుల కార్యములవలెనే యుండును. మహమ్మదీయబాలురు దేవునిదలపవలసివచ్చినప్పుడు 'అల్లా' 'ఖుదా' యనియు హిందువులు 'పరమేశ్వరా'

'ఈశ్వరా' యనియు బలుకుచుందురు. ఇందువలనను బాలకులు తలిదండ్రుల ననుసరించియుందురనియే తేటతెల్లమగుచున్నది. కావున బాలురకు నీతిశిక్షణ మొసంగుటకొరకు దలిదండ్రులత్యంతపరిశుద్ధమైన యాచరణంబులు కలిగియుండి వానినన్నిటి బిడ్డలకు నేర్పుచుండవలయును. ఉత్తమాచరణంబులవలన గలుగులాభములగూర్చియు, దుష్కార్యముల మూలమున గలుగు నుపద్రవంబులగూర్చియు బాలురకు మనస్సున నాటునట్లుపదేశముఁ జేయుచుండవలయును. బాలురకుపదేశము జేయఁబడునీత్యనీతిశిక్షణంబుల ననుసరించి వారలొనరించునట్టియుత్తమాధమాచరణంబులవలన ఫలితముకలుగునది వారితలిదండ్రులు మొదలగు బంధువులకును, వారికిని మాత్రమే కాదు. తత్ఫలము సమస్తప్రపంచమునకు గూడనగుచున్నది. సమస్తబాలకులకు నుత్తమనీతి శిక్షణముకలిగి వారందఱు ధర్మాత్ములగునెడలఁ బ్రపంచమంతయు ధర్మవంతమే యైనటులఁదలంపుఁడు. ఎవరు బాలురయొక్క శిక్షణము విషయమై ధ్యానమూనకయుందురో యట్టివారలీ సమస్తవిశ్వంబునకు శాత్రవులేగాని వేరుకాదు. ఎవరిని మంచిమార్గముల దిద్దిచక్కఁ జేయుట కుటుంబసహితంబుగ సమస్తప్రపంచమును దిద్దిచక్క జేయుటయో, ఎవరిని భ్రష్టము జేయుట జగత్తునంతను నాశనముచేయుటయో, యెవరు ముందురాగల మానవసమాజంబులకు మూల

కారణులగుదురో యట్టిబాలురకు మంచిమార్గముల నలవర్చు టంగూర్చి మాతాపితరులు ధ్యానమూనక యుండుటకంటె న ధికహానియేమికలదు? కావునను త్తమ విధానంబున బాలురకు శిక్షణమొసంగవలయును.

పుత్రమనుశిష్టంలోక్యమాహు స్తస్మాదేనమను శా స్తి.

బృ. అ. 3. బ్రా. 5.

శిక్షితు లైనపుత్రులు తమకును, ప్రపంచమునకును హిత కారకులగుదురు గాన దలిదండ్రులు వారికి శిక్షణమొసంగు దురని బృహదారణ్యకమునఁ బ్రతిపాదనము చేయఁబడియున్నది. మరియు మహారాష్ట్రిభాషలో బాలకులకు మూలాయనియు, బాలికలకు మూలీయనియు బేరులుకలవు. వీరలకీపేరు లెంత యుఁ దగియున్నవనుట నిక్కువము. ఆలోచించిచూడ మానవ సమాజంబులకు మూలకారణులు బాలికా బాలకులేగదా!

ఇటులుండ మనదేశమందలి యవిచారులు, పక్షపాత మనస్కులు, అదూరదర్శులు, దయావిహీనులునైన మాతాపి తరులనేకులు బాలకులైనవారిని గొంచెము జాగరూకతతోడఁ జూచుచుందురుగాని బాలికలైనచో వారినత్యంతనీచముగ జూ చుచున్నారు. వారికినుత్తమవిధానంబునఁ దినుటకన్నంబును, గట్టుకొనుటకు మంచిగుడ్డనుగూడ నియ్యరు. కడుపునబుట్టినప్రే మచేత గొందఱుబాలికలకు సన్నపానంబు లొసంగుటయందు

ను, గావలసిన వస్త్రముల నిచ్చుటయందును గొరతచేయరను కొందము. అట్టివారుకూడఁ గూఁతులయెడ గొంచెములక్ష్యభావ ముసేపూనియుందురుగాని కొడుకులయెడల గలిగియుండునంత టి యుత్తమాభిప్రాయము గలిగియుండరు. ఇఁకమూర్ఖులనిన నో వారినన్నివిధముల నవమానమే చేయుచుందురు. ఇంత మాత్రముకాదు. ఆడుపిల్లలు పుట్టుటతమయొక్క దౌర్భాగ్య మని కొట్టుకొనుచుందురు. వారికివిద్యాబుద్ధులగరపువిషయమై ధ్యానమే లేదు. అనదలైన యీకన్యకలవిషయమై యిదివరకుఁ గావింపఁబడియుండినట్టియు, వర్తమానకాలంబునఁ గావింపఁబ డుచున్నట్టియు నీన్యాయంబులనన్నింటి వ్రాయఁబూన హృద యముదీర్ణమైపోవఁ జేతియందలి లేఖినికంపితమగుచున్నది. క్రూరాత్ములైన హింసకులనేకు లమాయికలగువేలకొలఁది కన్యకలకు వివిధప్రకారముల దుఃఖముకలుగఁజేయుటయేకాక వారిప్రాణములనయితము దీసియుండిరి. వర్తమానకాలంబున గూడ విచారశూన్యులైన మనుజులనేకులు వీరినిదుఃఖపెట్టు చుండుటయే కాన నగుచున్నది. ఇంతయేల? యథోచితముగఁ దినుటకును గట్టుకొనుటకును వీరలుతగరట! పుత్రులతోస మానమైన స్వాతంత్ర్యము వీరికిలేదట! ఇంతియుకాదు. పక్షపా తపూరితులైన మనుజులు కన్యకలకుఁ దమచేతనయినవిధముల హానిమేచేయుచున్నారు. వానినన్నింటి మేమిటవర్ణింపనోపము.

ఈరీతిగ నన్యకల ననాదరణముచేయుచు వారినుచితమార్గమున బోషింపనందువలన దేశమునకు మహాహానియేగాని వేరుగాదు. బాలికలేమనుష్యసమాజంబులకు బుట్టినిండ్లు. వీరలకుసమస్త విధములబోషణము, శిక్షణము బుత్రులతో సమానముగ బ్రీతిపూర్వకంబుగ గాకపోయెనేని మనుష్యసమాజంబున కున్నతి యెప్పటికిఁగలుగఁజాలదు. మరియు మన్వాదిధర్మశాస్త్రములందు గుమారీ కుమారులనేకాంశములలో సమానులనియు,

యథైవాత్మాతథాపుత్రః పుత్రేణదుహితాసమా.

మను. అ. 9.

తండ్రితనయాత్మతో సమానముగ గుమారుని, గుమారునితో దుల్యముగ గూతురు నెంచవలయుననియు వ్రాయఁబడియున్నది. కావున గుమారీ కుమారుల నొక్కమాదిరిగ జూచుట తలిదండ్రులకు ముఖ్యము. రక్షణశిక్షణంబులలో బాలికాబాలకులయెడల నెట్టిభేదభావంబుగాని పూనఁగూడదు.

బిడ్డలు యోగ్యులగుటకు వారికి నీతిశిక్షణ మత్యంతావశ్యకమైయున్నది. అదిలేనిచో వారుభ్రష్టులగుట నిశ్చయము. మరియు సృష్టిక్రమంబునకు విరుద్ధమగు శిక్షణముకలుగుటచేతగూడ వారలుపాడగుదురు. మొదలుశిక్షణమే లేకపోవుటవలన బాడగుదురనుటకు నుదాహరణముగ ననాథులను, నడవిమనుష్యులను జూచి తెలిసికొనవచ్చును. సృష్టిక్రమంబునకు వ్య

తిరేకమైన శిక్షణముకలుగుటవలన బాధైనవారి కుదాహరణ
ముగ ధనాఢ్యులందును, దక్కినజనులందును గొందరుకలరు.
ఎట్లనఁగా మాతాపితరులుకొందరు తమబిడ్డలే యాహారంబుల
గావలయునని కోరుదురో యట్టివానిని రోగమువచ్చునను భ
యంబుననో మరియేకారణంబుననో బిడ్డలకియ్యరు. బిడ్డలుకో
రుకొను వస్త్రములనియ్యరు. ఆటలాడుకొననియ్యరు. వెలుప
లకుబోయి రానియ్యరు. దేనినిజూడనియ్యరు. బాలకులే యే
కార్యముల జేయవలయునని యుత్సాహపడుచుందురో వాని
నెల్ల దలిదండ్రులుచేయనీయరు. ఒకవిధమైన చెరసాలయందు
వలెవారినుంతురు. అట్టిబంధనములలోనుండు బాలకులమన
స్సులలో నేపదార్థములనైన దినవలెననియు, నేసుందరవస్త్ర
ములనైన ధరింపవలయుననియు, నాడుకొనవలెననియు, నేమై
నజూడవలెననియు నుత్పన్నములగు నానాప్రకారములైన మ
నోరథజాలములన్నియు భూమియొక్కయడుగుభాగమున గరిగి
నధాతువుల సంబంధమైన యావిరిప్రోవగురీతి గుమికూడుచుం
డును. భూమిలోని ధాతువుల సంబంధమైనయావిరి మరింతయె
క్కువగుటతోడనే యడికాశమును వెతకికొనుచు భూమినిబ్రబ
ద్దలుచేసికొని యొక్కపర్యాయముగ వెలుపలికితెంచి యాచు
ట్టుప్రక్కలనుండు పట్టణములఁ బల్లెలను, పవనంబుల మున్న
గువానినన్నింటి నాశనముచేయును. అదేవిధమున బాలుర

యొక్క మనస్సులలో మనోరథరూపక బాష్పమునయితము నుమికూడి కూడి బాలకుఁడించుక పెద్దవాఁడైనతోడనే స్వా తంత్ర్యంబను నవకాశముదొరక నొక్కపర్యాయముగ మన స్సులోని కోరికలన్నియు వెలుపలికిరా నతడింటిలోని ధనము ను, నగలను, భూమిని తుదకిల్లువాకిలిగూడ దెగనమ్మివైచియై నతనమనోరథముల బూర్తిచేసికొన మొదలిడును. ఈవిధా నంబాంతయుజూచి తలిదండ్రులు రోదనములారంభింతురు. రొ మ్ముబాదుకొనుచు “అయ్యో! మేమువీనికింతచదువుచెప్పించితి మే! వీనికిగొంచెమైన జ్ఞానముకలుగదాయెనే! మీఁదు మిక్కి లిచదువువలన వీఁడు పాడయిపోయెనే! మేమింతచెప్పించినదా నికి ఫలముగ సకలసామగ్రుల సమస్తసంపదను నాశనముజేసి కొంపకుగుండమువైచి కూర్చెనే! అయ్యో! యని నెత్తి నెత్తి గొట్టుకొని మొత్తుకొనుచుందురు. మరియు నిరుగుపొరుగువా రలదగ్గర జేరి చదువును నిందించుచు నొక్కపెట్టున రొమ్ము బాదుకొని రోదనముసేయుచుందురుగాని సృష్టిక్రమంబునకు వ్యతిరేకముగ బాలకుల నాడుకొననిచ్చుటలోనగు గార్యముల నుండి యాటంకపరచి వారినొకప్రకారంబగు బందిలోవైచుట వలన నిట్టియనర్థము వాటిల్లెగదాయని తమదోషమును తెలిసి కొని తమ్మునిందించుకొనరు. ఇందువలన సృష్టిక్రమాబునకు విరుద్ధముగ శిక్షణముచేకూరుటచేతను, మొదలు శిక్షణమేక

లుగకపోవుటవలనను నిట్టి భయంకరములైన దుష్పరిణామం
బులు కలుగుచుండునని మేమురూఢిగ వక్కాణించుచున్నాము.
కావున సృష్టిక్రమమునను సరించి నీతిశిక్షణమొసంగుచు, వేదా
దిసత్యశాస్త్రములనేర్చి బాలురమర్యాదయందు ప్రవృత్తులగు
నట్లుచేయుట తలిదండ్రులకు ముఖ్యకర్తవ్యము.

మర్యాదేపుత్రమాథేహితంత్వమాగమయాగమే.

అథ. కాం. 6. అ. 8. వ. 81.

మనుజుఁడా! యుత్తమవేదాది సద్విద్యలయొక్క శిక్ష
వలన నీపుత్రుని నీతినిపుణునిగ జేసి మర్యాదయందు నియుక్తుగా
వింపుమని యీశ్వరుడాజ్ఞయిచ్చియున్నాఁడు. బాలురకు ఈశ
మర్యాద, స్వాత్మమర్యాద, రాజ్యమర్యాద, భూతమర్యాద
మొదలగు సమస్తప్రకారములైన మర్యాదల నుపదేశము చే
యవలయునని యీమంత్రమందలి యభిప్రాయము. అట్లుచే
యుటవలన బాలకుఁడు బ్రతికియున్నంతకాలము సుఖియైయుం
డును. వీరిలో మొదటిది ఈశమర్యాద. వేదమునుండి పరమే
శ్వరుఁడు మనుజులకొరకే యేయాజ్ఞలగావించియుండెనో వా
నిసృష్టిక్రమము ననుసరించి పాలించుటయే యీశమర్యాదనఁ
బడును. స్వాత్మమర్యాద యెట్టిదనగా

యత్కర్మకుర్వతోఽస్యస్యాత్ పరితోషోంతరాత్మనః
తత్ప్రయత్నేనకుర్వీత విపరీతంతువర్జయేత్.

మను. అ. 4.

ఏకార్యము జేయుటవలన నాత్మకు సంతోషముకలుగునో యేకర్మము సత్యమని యాత్మదలంచునో, దేని జేయుట మూలమున నాత్మకు కళ్యాణముసమకూరునో యట్టికార్యమునే చేయుచు నాత్మకువిరుద్ధములైన కర్మముల నొనరింపకుండవలయును. రాజ్యసంబంధములైన నియమములు, చట్టములులోనగువానికి వ్యతిరేకముగ బ్రవర్తింపక స్వరాజ్యము నెడల ద్రోహ మొనరింపకుండుట యేమూడవదియగు రాజ్యమర్యాద. సత్యములైనసామాజిక నియమముల కనుకూలముగవర్తించుట సమాజమర్యాద. సమస్తభూతసంచయంబుల గుణకర్మస్వభావంబులగుర్తెరిఁగి వానివలన నుచితరీతి సహాయము బడయుచు దీనములైన జంతుజాలములకెట్టి యపరాధముచేయకుండుటయే భూతమర్యాద. వెండియు నిదేవిధమున మిథ్య, కపటము, మోసము, ఈర్ష్య, ద్వేషము, రాగము, అహంకారము, దురభిమానము, హింస, వ్యభిచారము, చౌర్యము, జూదము, మద్యమాంసాదిసేవనము, భంగు, గంజాయి, పొగాకు లోనగు దుర్వ్యసనములనుండియు, దుష్టములైన పదార్థముల నుండియు దూరగుఁడై యుండులాగున నుత్తమమైన నీతిశిక్షణ మొసంగవలయును. అటులే కూరుచుండుట, లేచుట, నడచుట, భుజించుట, వార్తాలాపముల జేయుట, సకలబంధువులతో యథోచితరీతివర్తించుట మొదలగువాని బాగుగ నేర్పవలయు

ను. దేశాభిమానపూరితములై దేశహితములైయుండు వాక్యం
బుల బాలకుల హృదయసీమల వేయుచుండవలయును. మరి
యు జగత్తునందలి సమస్తపదార్థము లుద్యోగసాధనములని
యు, నాలసులై ప్రారబ్ధముమీఁద భారమువైచుకొని కూరు
చుండుటచేత నేపదార్థము లభింపనేరదనియు బోధించి బాలు
రమనసులందు కర్తవ్యబుద్ధి నుత్పన్నముఁజేయుట తలిదండ్రుల
కు ముఖ్యకర్తవ్యము. అట్టికర్తవ్యబుద్ధి జనింపఁజేసి యాయా
పదార్థముల గుణములగూర్చియు వానిపరస్పరసాధర్మ్యవైధ
ర్మ్యములగురించియు దెలియజేసి కావలసినపదార్థముల నెల్ల
బ్రాప్తింపఁజేసికొననగు నుపాయములఁగూడ యుక్తవిధానము
న నెరుఁగఁజేయవలయును. మరియునాపద కలిగినపుడేవిధాన
మున నిర్వహించుకొనవలసినదియు, నెట్లునడచుకొనుటవలన
మానవులకాపద సంభవించక నిరంతరము విజయమే కలుగు
చుండునదియు, ధూర్తులు, దుష్టులునైన మనుజులనుండియు,
క్రూరములైన జంతువులనుండియు నెట్లుతప్పించుకొనవలసినది
యు, నేమార్గములనవలంబించుటవలన బాలురు స్వార్థులు, ని
ర్దయులు, కృతఘ్నులు, నిర్లజ్జులు, దురాచారులునై ప్రపంచ
మునకు హానికారకులు కాకుండనుండునదియు నిటులే యింక
ను నితరములైన యావశ్యకవిషయంబులఁగూర్చియు బోధిం
చవలయును. ఈశిక్షణములనన్నింటి మానసికశక్తియోగ్యత

వనుసరించి చేయుటయే సముచితము. తలిదండ్రులయుత్తమ శిక్షణము బాలికాబాలకుల పురోభివృద్ధి కత్యంతముఖ్యమై యున్నది. ఎట్లనఁగా

పుత్రాశ్చవివిధైః శీలై ర్నియోజ్యాఃసతతం బుధైః
నీతిజ్ఞాః శీలసంపన్నా భవంతికుల పూజితాః.

చా. నీ. అ. 2.

తలిదండ్రులు తమబాలకులను నానావిధములైన శిక్షణములచే శీలయుక్తులగునట్లు చేయుటవలన వారు కులమందు బూజ్యులగుదురని చాణక్యనీతియందును,

మాతృపితృకృతాభ్యాసో గుణితామేతిబాలకః
నగర్భచ్యుతిమాత్రేణ పుత్రో భవతిపండితః.
మాతాశత్రుః పితావైరీయేనబాలో నపాఠితః
నశోభతేసభామధ్యే హంసమధ్యేవకోయథా. హి. ప్ర.

తలిదండ్రులు శిక్షణమొసంగుట మూలముననే బాలురుపండితులగుదురుగాని గర్భమునుండి వెలువడివచ్చినంతమాత్రమున నూరక కాజాలరు. ఎవరుతమబిడ్డలఁ జదివింపకుందురో వారికిదాము శత్రువులేకాని వేరుకాదు. హంసములనడుమ గొంగలు ప్రకాశింపనేరనివిధమున విద్వాంసులమధ్య చదువులేనిబాలుఁడు కూడ శోభ గాంచఁజాలఁడని హితోపదేశమందును,

పుత్రాపరాధాక్షమతేయాపుత్రపరిపోషిణీ
సామాతాప్రీతిదానిత్యంకులటాన్యాతిదుఃఖదా.

శు. నీ. అ. 3.

ఏస్త్రీకుమారునియొక్క తప్పులక్షమించుచు శారీరక మానసిక రక్షణశిక్షణంబులమూలమున నతనిబోషించుచుండునో యామెయే తల్లియనిపించుకొనునుగాని యితరవిధమైన స్త్రీకాదని శుక్రనీతియందును,

విద్యాగమార్థం పుత్రస్యవృత్త్యర్థంయతతేచయః
పుత్రంసదాసాధుశాస్త్రిప్రీతికృత్ సపితాన్నృణీ.

శు. నీ. అ. 3.

ఎవఁడుపుత్రుని చదువుకొరకును, జీవికకొరకును బ్రయత్నము జేయుచుండునో యతఁడె తండ్రి. ఎవఁడుపుత్రులకును త్తమోత్తమమైన శిక్షణమిచ్చుచుండునో యాతండ్రియేయనృణియనఁగా దనకర్తవ్యముల నెరవేర్చుకొనినవాఁడగును. ఎవరుతమబిడ్డల జదివింపకుందురో వారు కాలముకడచినకొలఁది యవస్థలపాలగుటయే సత్యమనియు,

యత్రస్త్రీ యత్రకితవో బాలోయత్రాప్రశాశితః
తద్గృహం క్షయమాయాతి భార్గవో హీదమబ్రవీత్.

పంచతంత్రం. 5.

ఏయింటియందు జదువెరుగనిస్త్రీలును, విద్యాహీనులైన బాలురునుందురో, యేగృహమందు జూదరులు నివాసము జేయుచుందురో యాగృహము శీఘ్రకాలమందనాశనం బగునని పంచతంత్రమందును,

పుత్రఃశత్రురపండితః. హి. ప్ర.

విద్యాశూన్యులైన పుత్రులు తలిదండ్రులకు శాత్రవులేయని హితోపదేశమందును వ్రాయబడియున్నది. ఏతలిదండ్రులు తమ బాలుర జదివింపకుందురో వారలు జీవించియున్నంతవరకు దుఃఖపీడితులైయుంటుటయగాక వారిసంతానము సయితమాజన్మము నిడుమల గుడుచుచునేయుండును. కావున దమయొక్కయు దమబిడ్డలయొక్కయు గళ్యాణముగోరువారలవశ్యముగ బాలురజదివించవలయును. తలిదండ్రులెట్టి యాచరణంబులెట్టి ప్రవర్తనముల గలిగియుందురో బాలకులుగూడ నట్టివానినే యవలంబించుచుందురని యిదివరకే వ్రాసియుంటిమిగదా? ఈకారణంబున బాలకుల దగ్గర దలిదండ్రులు మొదలగు సమస్తబాంధవులు నుత్తమ ప్రవర్తనముల నొప్పియుండుట శ్రేయస్కరము.

అనువ్రతః పితుః పుత్రో మాత్రాభవతు సమ్మనాః
జాయాపత్యే మధుమతీం వాచం వదతు శాంతివాన్
మాభ్రాతాభ్రాతారం ద్విక్షన్మా స్వసారము తస్వసా

సమ్యంచః సవ్రతా భూత్వావాచం వదత భద్రయా.

అథ. కాం. 3. అ. 6. వ. 30.

మనుష్యులారా! తలిదండ్రులు, సోదరీసోదరులు, భార్యాభర్తలు మొదలుగాగల మీరందరన్యోన్య మనుకూల వర్తనముల మెలంగుచు, ప్రీతిపూర్వకముగ నొకరితోనొకరు మధురంబులు, గళ్యాణకారకములునగు సంభాషణముల జేసికొనుచు బరస్పరము ప్రేమఃగాని విరోధముల బెట్టుకొనక నడచుకొనుచుండుడని పరమాత్మ యుపదేశముఁ జేసియున్నాఁడు. స్త్రీపురుషులకు బరస్పరము గలహము కలుగుటచేత నగు నష్టమింతింతయన జాలము!

యథాసూర్యో నక్షత్రాణా ముద్యంస్తేజాం స్యాదదే
ఏవా స్త్రీణాంచ పుంసాంచ ద్విషతాం వర్చ ఆదదే.

అథ. కాం. 7. అను. 1. వ. 13.

ప్రాతఃకాలమునందు సూర్యుఁడెట్లు నక్షత్రముల యొక్క వెలుతురును నాశనముజేయునో యటులే స్త్రీపురుషుల యందలి విరోధము వారితేజంబు నాశనముఁ జేయునని యథర్వమందును,

సమితగ్ంసం కల్పేథాగ్ంసం ప్రియౌ రోచిష్ణూ
సుమనస్యమానౌ, ఇషమూర్జ మభి సంవసానౌ

య. అ. 12.

వివాహితులైన స్త్రీపురుషులు పరస్పరము సమాన ప్రవర్తనముల గలిగి, యొండొరుల కయిష్టములైన మాటల నాడుకొనుట మొదలగు దుర్వ్యవహారములనుండి దూరగులై నిందితములైన విషయంబుల మగ్నులుకాక బుద్ధీంద్రియ శరీరములందు దేదీప్యమానులై, వైమనస్యములు గలుగకయుండ మైత్రీభావంబున నొప్పుచుండవలయును. విద్యవలనను, పరిశుభ్రములైన వస్త్రంబులచేతను సుశోభితులై తమయొక్క న్యాయములైన యభీష్టంబుల నెరవేర్చుకొనుచుండవలయునని యజుర్వేదమందును,

తథానిత్యం యతేయాతాం స్త్రీపుం సౌతుకృతక్రియా,
యథా నాభిచరేతాం తౌవియుక్తా వితరేతరా.

మను. అ. 9.

ఏయేవాక్యముల మూలమున బరస్పరము ద్వేషము జనించునో యట్టివాని స్త్రీపురుషులు పరిత్యజించవలయును. అన్యోన్యముగలసిమెలసి ధర్మకార్యములందు బ్రవృత్తులైయుండవలయును. మూర్ఖులనేకులీదేశమందు స్త్రీలకిమితమైన దుఃఖముగలిగించుచు వారిని దమకాలిచెప్పులతో సమానముగ జూచుచుందురు. కాని యిట్లుచేయుట న్యాయవిరుద్ధంబును, మహాహానికారకమునునై యున్నది. స్త్రీమీద బురుషునకెంత స్వాతంత్ర్యముకలదో స్త్రీకి బురుషునిమీదగూడ నంత

స్వాతంత్ర్యముకలదు. స్త్రీకి దనమీఁద నుండు స్వాతంత్ర్యమునకంటె దనకామెమీఁదనుండు స్వాతంత్ర్యమెక్కువని యే పురుషుఁడు తలపోయునో యట్టివాఁడు కేవలమన్యాయకారి యే. వెండియు స్త్రీపురుషులకు సమాన స్వాతంత్ర్యముకలదని యనేక సత్యశాస్త్రములలో వ్రాయఁబడియున్నది. పక్షపాత మనస్కులైన మగవారలట్టి స్త్రీస్వాతంత్ర్యము వెల్లడిచేయు విషయముల బ్రక్షిప్తముల మూలమున గప్పిపుచ్చియున్నారు.

గృహపత్నీ యథాసా. అథ. కాం. 14. అను. 2. వ. 14.

పురుషుఁడెట్లుఁగృహమునకుఁ బతియగునో యట్లె స్త్రీయు గృహమునకు బత్నియగును. పత్నియనఁగా స్వామినియై యున్నది.

యోభర్తాసాస్మృతాంగనా. మను. అ. 9.

భర్తయే స్త్రీయని మనుస్మృతియందును- అనఁగా స్త్రీపురుషులిరువురు నొక్కటియేయని భావము.

పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా
పూజ్యాభూషయితవ్యాశ్చ బహుకళ్యాణమీప్సుభిః
మను. అ. 3.

తండ్రి, సోదరులు, పెనిమిటి, దేవరుఁడు మొదలగు బురుషులనవరతము స్త్రీలనాహార వస్త్రాభూషణాదులతో బూజించుచుండవలయునని మనుస్మృతియందును. పుష్పగంధా

తుతంబుల నెత్తినఁజల్లుట పూజగాదు. వారికి గావలసిన పదార్థంబుల నిచ్చి ప్రసన్నలుగనుంచుటయే స్త్రీలబూజించుట యగును.

శోచంతి జామయోయత్ర లివశ్యత్యాశు తత్కులం
నశోచంతితు యత్రైతా వర్థతే తద్ధి సర్వదా.

మను. అ. 3.

ఎచట జామలనఁగా అక్కచెల్లెండ్రు, పుత్రికలు, భార్య, కోడండ్రుమొదలగు స్త్రీలు వ్యాకులమానసలై యుందురో యాకులము నాశనమందుననియు, స్త్రీలుప్రసన్నచిత్తలై యుండు కులము వృద్ధినొందుననియు, నట్లగుటంజేసి వారినెల్ల కాలము సన్మానించుచుండవలెననియు,

ప్రజానార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః
శ్రియఃస్త్రియశ్చగేహేషున విశేషోస్తికశ్చన.

మను. అ. 9.

ప్రపంచస్థితికి మూలమైన సంతానోత్పత్తి స్త్రీవలననే యగుటంజేసి ప్రపంచమున కామె మహోపకారిణియు, బూజనీయయునై యున్నది. స్త్రీగృహమునకు శోభగలుగఁ జేయును. లక్ష్మికిని, స్త్రీకిని లేశమైన భేదము లేదు. లక్ష్మియన ధనమేవిధమున నింటికి శోభగలిగించునో యటులే స్త్రీయు గలిగించుననియు,

అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా
దారాధీన స్తథాస్వర్గః పితౄణా మాత్మనశ్చహ.

మను. అ. 9.

పుత్రోత్పత్తి, ధర్మకార్యాచరణము, సేవ, సౌఖ్యము, ప్రేమ మొదలగునవన్నియు స్త్రీయొక్క యాధీనమందే యున్నవనియు,

దారాధీనాః క్రియాః సర్వాః దారాస్వర్గస్యసాధనం.

కశ్య. స్మృ.

సమస్తధర్మకార్యములు, స్వర్గము స్త్రీయాధీనమందున్నవని కశ్యపస్మృతియందును లిఖింపఁబడియున్నది. కావున నామె నెల్లవేళల బ్రసన్నురాలిగ నుంచవలయును.

స్త్రీలయెడలఁ బురుషులేరీతికపటములేక ప్రీతిపూర్వకమైన వర్తనముల గలిగియుండవలయునో యటులే స్త్రీలుగూడ మగలయెడల నిష్కపటమైన ప్రేమఁబూని యుండవలయును. తలిదండ్రులు, సోదరులు, కుమారులు మున్నగువారందరు హితముసమకూర్చువారలె యైనను స్త్రీకివీరందరికంటె పెనిమిటివలననే యెక్కువసౌఖ్యముకలుగును.

మితం దదాతిహి పితామితం భ్రాతామితః
అమితస్యతు దాతారం భర్తారం కానపూజయేత్.

వా. రా. అయో. స. 39.

"తండ్రి, సోదరులు, కొడుకులు మొదలగు వారలు స్త్రీకొంత మితమైన సౌఖ్యము మాత్రమే కలుగఁజేయుదురు. పెనిమిటి యపరిమితమైన సౌఖ్యమునిచ్చును. అట్టియనంత సౌఖ్యము నొసంగుబతికి కెవతె సేవజేయకుండగలదు" అనిసీత కౌసల్యతో వచియించియుండెను.

సాభార్యా యాగృహేదక్షా సాభార్యాయా ప్రజా:
సాభార్యా యాపతిప్రాణా సాభార్యా యాపతివ్రతా.
హి. ప్ర. 1.

గృహకార్యముల జేసికొనుటయందు నేర్పుకలదియై, గొడ్రాలుగాక సంతానముగలిగి, పతికి ప్రాణమై, పతివ్రతయై యే స్త్రీయుండునో యామెయే భార్యయని పిలువబడుటకు దగియుండునుగాని యితరవిధమైన గాదని హితోపదేశమున వ్రాయబడియున్నది. మగనియొక్క యభీష్టంబునకును, ధర్మమునకును వ్యతిరేకముగ నిందమైన జేయకుండుటయే స్త్రీకి ముఖ్యకర్తవ్యము. అదేవిధముగబురుషుఁడుగూడ భార్యయొక్క యభీష్టమునకును, ధర్మమునకును విరుద్ధములైన కార్యముల జేయగూడదు.

సదాప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా,
సుసంస్కృతో పస్కరయావ్యయే చాముక్తహస్తయా.
మను. అ. 5.

స్త్రీ యెల్లప్పుడు ప్రసన్నతగలిగి గృహమునకు సంబంధించిన సమస్తకార్యముల బ్రీతిపూర్వకముగఁ జేసికొనుచుండవలయును. ధనాఢ్యులైన కొందరియిండ్లలో దప్పదక్కిన గృహములందు సాధారణముగ నన్నికార్యముల స్త్రీలే జేసికొనుచుందురు. వానినన్నింటిఁ గమనుత్తమరీతి జేసికొను నేర్పును గలిగియుండవలయును. తెలియనికారణమున గొందఱు స్త్రీలమితమైన వ్యయము జేయుచుందురు; కానియట్లుచేయుటకూడదు. సకలపదార్థముల యుక్తితోడ వాడుకొనుచుండవలయును. ఎట్లనఁగా

సాంవత్సరికమాయం సంఖ్యాయా
తదనురూపం వ్యయం కుర్యాత్.

వా. కా. సూ. అ. 21.

సంవత్సరమునకు వచ్చునాదాయము జూచుకొని వ్యయము చేసికొనుచుండుట గృహస్థులైన సమస్త స్త్రీపురుషుల కుచితమైయున్నది. మూర్ఖులుకొందరు భోగము లనుభవింపవలెనని ఋణముల జేయుచున్నారు. మఱికొందరు కుమారీకుమారుల వివాహములకొఱకును, కొందరు మాతాపితరుల ద్వాదశాదులకును, మఱియు ననేకకారణముల ఋణములఁ జేయుచుందురు. ఋణముయొక్క వడ్డిపెరుగుటతోడనే గృహమందుగల పదార్థముల నన్నింటి నమ్ముకొని తుదకుగాపుర

ము జేయునింటినిగూడ జోఁగొట్టుకొనుచుందురు. ఋణముల జేయుటవలన గాలక్రమమున గష్టములెక్కువయై యింటియం దు గల్లోలము లారంభమగుచుండ గృహపతి తనపుత్రులు మొదలగువారి జురచురజూచుచు "మీరందరు దుఃఖదాయకు లేగాని వేరుగాదు. మీయందరకు పెండ్లిపేరంటములు చేయు ట చేతనే యట్టిగతి సంభవించిన"దని కటువులగు వాక్యముల నాడుచు దాను దుఃఖితుడగుటయగాక తనకుమారులు మొద లగు వారింగూడ దుఃఖపెట్టుచుండును. జనులు తమచేతులా ర దాము ఋణముగావించి పుత్రులవివాహములందు ధనము నిష్టమువచ్చినట్లు వెచ్చముచేయుటచే నిట్టిదశసంప్రాప్తించెనని తమ మూర్ఖత్వమును నిందించుకొనరు. బాలకు లల్పవయస్కు లై వివాహమనిననేమో తెలియకుండు సమయమున వారు తమ వివాహము గావింపుడని తలిదండ్రుల నడిగియుందురా? మాతాపితరులే స్వమూర్ఖతవలన ఋణముల జేసి యిట్టికార్య ముల నొనరించి జీవించియున్నంతవరకు దుఃఖమనుభవించు చుందురు. ఋణము జేయుట మహాదుఃఖదాయకమైయున్నది. బుద్ధిహీనుండగు మనుజుండు తనతలను దాను ఖండించుకొను , బావియని గుర్తెరింగియు నందుఁగూలులాగున, చెరసాల లోబడినట్లుండునో చూచెదనని మూర్ఖుఁడొకఁడు నేరముజేసి బందియందుఁబడి స్వాతంత్ర్యంబు గోల్పోవునట్లు ఋణముజే

యునతఁడు గూడ దనయొక్క స్వాతంత్ర్యమును, దనపవిత్రజీవితంబును నితరుల చేతులలో బెట్టియసంఖ్యాకములైన దుఃఖముల ననుభవించుచుండును. మరియు నట్టిమనుజుఁడు సత్కార్యములు చేయుటవలన బ్రాప్తమగునట్టి సాంసారిక భోగములనుండి వంచితుఁడై యుండును. ఎవఁడితరులనుండి ఋణము గైకొనుచుండునో యతఁడు తేజము, సన్మానము, గౌరవము, స్వాతంత్ర్యము, సౌఖ్యములోనగువాని బోగొట్టుకొని నిరంతర మితరులకు దాసుఁడై యుండవలసివచ్చును. మరియునతఁడు ప్రపంచమున కుపయోగించు నేకార్యముగాని సలుపఁజాలఁడు. ఈఋణమాహాత్మ్యంబున గణనాతీతములైన రత్నరాశులు, గృహములు, కుటుంబములు, రాజ్యములుగూడ నాశనములగుచున్నవి. ఈనిందితకర్మము మూలమున వేలకొలఁది మానవులు సర్వార్థశూన్యులగుచున్నారు. ఆశాపూరితులైన ఋణదాతలమూలమున న్యాయస్థానంబులకు దఱచుగ దిరుగవలసివచ్చుటయు, బత్రములు, ప్రాడ్వివాకులు, సాక్షులు మొదలగు వారికొరకగు వ్యయము ఋణముచేసినవారిమీదనే బడుచుండుటయు సంభవించుచున్నది. ఇందువలన జనులు దినదినమునకు దీనులగుటయు, దేశమందు దారిద్ర్యము పెచ్చు పెరుగుటయు గలుగుచున్నది. కావున సమస్తమానవులు ఋణములు చేయకుండుట శ్రేయస్కరము.

పరంఋణాసాహీరధమత్ కృతాని
మాహాంరాజన్నన్య కృతేనభోజం.

ఋ. అ. 2. అ. 7. వ. 10.

అనృణాఅస్మిన్ననృణాః పరస్మిన్
తృతీయేలోకే అనృణాఃస్యామ.

అధ. కా. 6. అను. 12. వ. 117.

మనుష్యుఁడిహాపరలోకంబుల రెండింటియందు గూడ ఋణములేక యుండవలయునని వేదమందును,

అనృణీభూత్వాస్వర్గంలోకమేతి.

గోప. ప్ర. 43.

అప్పుచేయక యుండునతఁడే సౌఖ్యవంతుఁడగునని గోపథమందును,

లోకేషునిర్ధనోదుఃఖీ ఋణగ్రస్తస్తతోధికం.

సుభా. ప్ర. 3.

ప్రపంచమున దుఃఖమందువాఁడు నిర్ధనుఁడు. అంతకన్న నెక్కుడుదుఃఖము ఋణముచేయువాఁడు పొందునని సుభాషితమందును వ్రాయబడియున్నది. ఋణము చేయువానికేగాక ఋణమువాని సంతానములకు గూడ దుఃఖముకలుగజేయును. కావుననే

ఋణకర్తాపితాశత్రుః. చాణ. నీ. అ 6.

ఋణము జేయుతండ్రి వానిపుత్రులకు శత్రునితో సమా
నుడని చాణక్యనీతి వక్కాణించుచున్నది. మరియు

పుత్రేభ్యః పితరస్తస్య వస్వః ప్రయచ్ఛత.

అథ. కాం. 18. అను. 3. వ. 17.

తండ్రితనకుమారుల కవశ్యముగ గొంతధనమియ్యవల
యును. మనుజులు తమయాదాయమునకంటె దక్కువవ్యయ
ము జేసికొనుటయే యీఋణంబను మహారోగము నివారించు
కొనుట కౌషధమగుగాని వేరేదియుగాదు. ఆయమునకు మిం
చినవ్యయము చేయువారలే విస్తారముగ ఋణగ్రస్థులగుచుందు
రు. కావునన త్యిమితిమీరిన వ్రయములమాని శక్తిననుసరించి
సాధారణంబులగు నన్నవస్త్రములతో నిర్వాహకము చేసికొ
నుట సమస్తమానవులకు యోగ్యము. ఇతరులదగ్గరనప్పులు జే
సి లోకమునకు దమయాధిక్యము వెల్లడిపరచికొనుటయు, బ
రద్రవ్యములమూలమున నానందములదేలుటయు నీచులస్వభా
వమైయున్నది. మరియు రాగలకాలముంగూర్చియు గొంచెము
విచారించుకొనియుండుట ప్రతిమనుష్యున కుచితము. ఉద్యోగ
ముగాని వ్యాపారముగాని చేయువారలెప్పుడైన వానిమాను
కొనియుండవలసివచ్చుననుకొనుడు. లేనిచో నేదైనరోగముక
లిగినయెడల సమస్తకార్యములవదలుకొని మంచమునేయాశ్ర
యించి పడియుండవలసివచ్చును. అట్లుపడియున్నతరుణమందత

నికుటుంబపోషణ మెట్లుజరుగవలయు? ఇట్టివిషయములనుం దుగనే యాలోచించుకొని యందులకుదగిన ప్రబంధముగూడ మొదటినుండియే చేసికొనుచుండవలయును. ప్రపంచమందలి యుత్తమ పదార్థములన్నియు నట్లాదాయవ్యయములయెడల జాగరూకులై యాదాయమునకంటె దక్కువవ్యయము జేయు వారలచే గావింపఁబడినవేగాని వృథావ్యయము చేయువారల చేనైనవిగావు. సంపాదించునదంతయు వ్రయము జేయువారల ధమదశనుండి యున్నతస్థితి కెప్పటికిరాఁజాలరు. కావునదనయా దాయమునకు మించినవ్యయముగావింపక భావిసౌఖ్యమునిమి త్తము సకలపదార్థముల సమకూర్చుకొనియుండుట ప్రతిమా నవునకు ముఖ్యమైయున్నది.

తస్మాద్యయాకయాచాపి విధయాబహ్వన్నం
ప్రాప్నుయాత్. తై. అను. 9. భృగువల్లీ.

ఎందులకుఁగావలసిన నందుల కుపయోగించుటకై జేసి యెంతయెక్కువగనైనగానిండు! అన్నమును సమకూర్చవల యునని తైత్తిరీయమందును,

కుశూలధాన్యకోవాస్యాత్ కుంభీధాన్యకఏవవా.
త్ర్యైహైహికోవాపి భవేదశ్వస్తనికఏవవా.

మను. అ. 4.

భృత్యవర్గసమేతముగ సమస్తకుటుంబముయొక్క పో

షణమునిమిత్తము మూఁడుసంవత్సరములకెంతపట్టునో యం తధాన్యము సమకూర్చుకొని గృహమందవశ్యముగ నుంచుకొ నవలయును. మూఁడుసంవత్సరములకు సరిపోవు ధాన్యము నుంచుకొన జాలనియెడల నొక్కసంవత్సరమునకుగాని మరిం తబీదవారలైన మూఁడుదినములకుగాని యంతకంటెగూడ దీ నులైన నొక్కదినమునకుఁగాని సరిపోవునట్టి యాహారపదార్థ ములచేర్చి యుంచుకొనవలయునని మనుస్మృతియందును వ్రా యఁబడియున్నది. ఇందుమూఁడుసంవత్సరములకు సరిపోవుధా న్యము నిలవజేసికొనుట యుత్తమపక్షమును, నొకసంవత్సర ము, మూఁడుదినములు నొకదినమువరకు నుంచుకొనుట క్ర మముగ మధ్యమము, అధమము, అధమాధమంబునునైయు న్నవి. కావున వారివారిశక్తిననుసరించి కొంతకాలమువరకు సరిపోవునట్టిధాన్యము నిలవజేసియుంచుకొనవలయును. ఎందు చేతననఁగా రెండుమూడు సంవత్సరములపర్యంత మొక్కొక మారు దుర్భిక్షము సంభవించుచుండును. అట్టిచో బూర్వోక్త విధానమున సమస్తమానవులు ధాన్యముసంచయము జేసికొ నియుండినయెడల దుర్భిక్షసమయములందన్నము లేక చచ్చిపో వుదుమనుభయము మనుష్యులకుండదు. దరిద్రులైనవారలిట్టి యేర్పాటుల జేసికొనుటకు శక్తికలిగియుండనిచో నేమియుజే యఁజాలను కాని ధనవంతులు మాత్రమీవిషయమై ధ్యాన

మూనవలయును. ధాన్యముగూడ బెట్టుకొనులాగున దక్కిన యావశ్యక పదార్థములనన్నింటిగూడ సమకూర్చుకొనవలయు ను. అట్లుచేర్చినవానినన్నిటి యుక్తిపూర్వకముగ నుపయోగిం చుకొనుచుండవలయును. వృథావ్యయముఁ జేయఁగూడదు.

సంతుష్టోభార్యయాభర్తా భర్త్రాభార్యాతథైవచ
యస్మిన్నేవకులేనిత్యం కళ్యాణంతత్రవైధ్రువం.

మను. అ. 3.

ఏకులమందు దంపతులన్యోన్యప్రీతి కలిగియుందురో యాకులమునకే నిరంతరము గళ్యాణము కలుగుచుండుగావున స్త్రీపురుషులెల్లప్పు డన్యోన్యాను రాగము కలిగి యుండవ లయును.

ఋత్విక్ పురోహితా చార్యైర్మాతు లాతిథిసంశ్రితైః
బాలవృద్ధాతురైర్వైద్యైర్జ్ఞాతిసంబంధి బాంధవైః
మాతాపితృభ్యాం యామాభిర్భ్రాతా పుత్రేణభార్యయా
దుహిత్రాదాసవర్గేణ వివాదం నసమాచరేత్.

మను. అ. 4.

యజ్ఞాదిక్రియలఁ జేయించు ఋత్విక్కులు, పురోహితుఁ డు, ఆచార్యుఁడు, విద్యాగురువు, మామ, అభ్యాగతుఁడు, అతిథి, అనుజీవులు, బాలకులు, వృద్ధులు, రోగులు, వైద్యు లు, జ్ఞాతిసంబంధులు, తలిదండ్రులు, సోదరీసోదరులు, పుత్రు

లు, దౌహిత్రులు, సేవకులు మొదలుగాగల కుటుంబములో ని సమస్తజనులలో నెవనితోగాని గృహపతి కలహమాడ గూడదు. దంపతులు దేశోన్నతికారకములైన సాంసారిక కార్యంబులను, పారమార్థిక కార్యములను, నిత్యనైమిత్తిక కర్మంబులను సలుపుచుండవలయును. ఎట్లనగా

ఋషియజ్ఞం దేవయజ్ఞం భూతయజ్ఞం చసర్వదా
నృయజ్ఞం పితృయజ్ఞంచ యథాశక్తి నహాపయేత్.

మను. అ. 4.

ఋషియజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, అతిథియజ్ఞము, పితృయజ్ఞములనెడు నయిదుప్రకారంబులైన యజ్ఞముల మనుష్యమాత్రుఁడతని సామర్థ్యము ననుసరించి ప్రతిదినము జేయుచుండవలయును.

అధ్యాపనం బ్రహ్మయజ్ఞం పితృయజ్ఞస్తుతర్పణం
హోమోదైవో బలిర్భౌతో నృయజ్ఞోతిథిపూజనం.

మను. అ. 3.

చదువుటయు జదివించుటయు నటులే సంధ్యావందనాదులును బ్రహ్మయజ్ఞము లేక ఋషియజ్ఞమనఁబడును. తలిదండ్రులకు యోగ్యవిధానంబున నన్నవస్త్రములిచ్చి సేవజేయుట పితృయజ్ఞము. ఈపితృయజ్ఞమును మనుజుని ముఖ్యకర్తవ్యములలో నొకదానిగ నెంచవచ్చును. ఎందుచేతనన

యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం
నతస్యనిష్కృతిః శక్యాకర్తుం వర్షశతైరపి.

మను. అ. 2.

మనుష్యుని యొక్క యుత్పత్తిసమయమందే క్లేశమును దలిదండ్రులు సహించుకొనుచుందురో యట్టియాఋణమును నివృత్తిచేసికొనుటకొఱకు వందలకొలఁది సంవత్సరములు వారికి సేవజేసినప్పటికి మనుష్యుఁడా ఋణమునుండి విముక్తుఁడు గానేరఁడు. కావున

తయోర్నిత్యం ప్రియం కుర్యాదాచార్యస్యచ సర్వదా
తేష్వేవత్రిషుతుష్టేషుతపః సర్వం సమాప్యతే.

మను. అ. 2.

తలిదండ్రుల యాజ్ఞలఁబాలించుచు భోజనాచ్ఛాదనాదులమూలమున వారికెల్లవేళల హితము సమకూర్చుచుండవలయును. ఆటులే యాచార్యునకుఁగూడ సేవసలుపవలయును. తలిదండ్రులు, ఆచార్యుఁడు వీరలు ముగ్గురు సంతసించినచో మనుజుఁడు తపముఁగావించినటులే యైయున్నది. ప్రాతఃకాలమందును, సాయంకాలమందును నగ్నిహోత్రమున హోమము జేయుట దేవయజ్ఞమనఁబడును, కాని విగ్రహములపై పుష్పగంధాక్షతంబుల జల్లుటగాదు. ప్రపంచమున కుపయోగకరములైన గోశ్వాదిపశుపాలనము భూతయజ్ఞము. విద్వాంసు

లు, ధార్మికులు, పరోపకారులునగు నుత్తమపురుషులకు స త్కారము జేయుటయే నృయజ్ఞము లేక యతిథియజ్ఞమనఁ బడును.

తదస్యైవంవిద్వాన్ వ్రాత్యఏకాం రాత్రి మతిథిర్గృహేవసతి
యేపృథివ్యాం పుణ్యాలోకాస్తానేవ తే నావరుంధే.

అథ. కాం. 15. అను. 2. వ. 13.

ఏగృహస్థునియొక్క యింటియందు ధార్మికుఁడు, జి తేంద్రియుఁడు, సత్యప్రియుఁడు, పరోపకారరతుఁడు, దేశహి తాభిలాషి, సత్యోపదేశకుఁడు, విద్వాంసుఁడునగు నతిథి యొ క్కరాత్రి నివాసముచేయునో యతఁడే ప్రపంచమందలి యు త్తమ సౌఖ్యముల నొందఁగలుగును. అనఁగా విద్వాంసుఁడగు నతిథియొక్క సత్యోపదేశమువలన మనుజుఁడుత్తమ సౌఖ్య ముల నందునని దీనిభావము. మరియు

శిరోవాఏతద్యజ్ఞస్యయదాతిథ్యం. ఐ. బ్రా. పం. 1. అ. 3.

అతిథిసేవ యజ్ఞమునకు ముఖ్యభాగమని యైతరేయ మందు వ్రాయఁబడియున్నది. ఎవనియందతిథియొక్క లక్షణము లుండవో యట్టియతిథ్యాభాసులకు మాటమాత్రమైన సత్కా రము జేయఁగూడదు.

పాషండినోవికర్మస్థాన్ వైడాలవృత్తికాన్ఛఠాన్
హైతుకాన్బకవృత్తీంశ్చవాఙ్మాత్రేణాపినార్చయేత్.

మను. అ. 4.

మనుష్యులమోసము జేయు నిమిత్తమనేకవేషములదాల్చువారలును, దొంగతనము, వ్యభిచారము మొదలగు నిందితకర్మంబులఁ జేయువారును, ఛలకపటలోభాది దోషసంవృత్తమైనయంతరాత్మంగలిగి లోకులవంచనముసేయుటకొఱకు దాముసిద్ధులైనట్లు ప్రకటించుకొనువారలును, విద్యాదిగుణహీనులును, మూర్ఖులు, స్వార్థులు, కృత్రిమములైన శీలసంతోషసాధుత్వముల గనుబరచి విశ్వాసఘాతకులై స్వప్రయోజనంబుల సిద్ధము జేసికొనువారలునునగు మానవుల మాటమాత్రముననైన సత్కరింపఁగూడదు. వర్తమానకాలంబున నిందులకు విపరీతములైన వ్యవహారములు జరుగుచుండుట విచారకరమైయున్నది. ఎట్లనఁగా మూర్ఖులు, ఛలయుక్తులు, స్వోదరపరాయణులు, నిరుద్యోగులు, అనృతవాదులునైన దుష్టులకే సన్మానముకలుగుటయు, విద్వాంసులు, ధార్మికులు, సత్యవాదులు, ఉద్యములు, దేశహితమునకు స్వశరీరంబులనైన నర్పణము జేయువారలు, పరోపకారప్రియులు, విద్యాప్రచారకులైన సత్పురుషులకనేకులకు తిరస్కారముగలుగుటయుఁ జూడ శోకకరమగు వార్తగాకమఱేమికాఁగలదు? మూర్ఖమండలివారలిట్టి విపరీతకార్యముల జేయఁబూనినచో నంతగ దుఃఖింపవలసిన యవసరము లేదుకాని విద్వాంసులుసయితమిట్టి యనుచితకార్యంబులఁ జేయుచుండుట జూడ సాశ్చర్యఖేదముకలుగుచు

న్నది. మోసముజేసి పీసముగడింపుమను న్యాయమే దేశమున నే వర్ణమున నెంతకాలపర్యంతము నెలకొనియుండునో యంత పర్యంతమా దేశముయొక్కగాని యావర్ణముయొక్కగాని యున్నతికలుగఁజాలదు.

అపూజ్యపూజనాచ్చైవపూజ్యానాంచాప్యపూజనాత్
నృఘాతకసమంపాపం శశ్వత్ ప్రాప్నోతిమానవః

భార. శాం. అ. 285.

అవిద్యాదిదోషములచే గలుషితుఁడై సత్కారమునకర్హుఁడుగానిమనుజునకు సేవఁజేయుచు, విద్యాదిగుణభూషితుఁడై పరిచర్యకు యోగ్యుఁడైన యుత్తమపురుషునకు సత్కారము జేయకపోవుటవలన మనుష్యుని జంపినంతపాపము కలుగును. ఎవరుతమదేశమును జాతిని జిరకాలముపర్యంతము సంపదలకు నాకరమైయుండునట్లు చేయఁగలుగుదురో యట్టియుత్తమకార్యకర్తల "కార్యానురూపంఫలం" అనున్యాయమును మనసుననిడికొని పారితోషికంబులచే సత్కరించుచు, మూర్ఖులు, నిరుద్యములు, దాంభికులు లోనుగాగల దురాచారుల నెల్లవేళల దిరస్కరించుచుండవలయును. ఎంతవరకిట్టివిధానంబులవలంబింప బడకయుండునో యంతవరకు నీయాలసులసంఖ్యక్షీణించుటయు బ్రయత్నశీలురయొక్క యభివృద్ధియనుకటంబు తెరచుకొనుటయు సంభవింపనేరదు. కాననీరెండు

ప్రకారములగుగార్యంబుల సిద్ధింపఁజేసికొను నిమిత్తము పైన వచించిన యుక్తమార్గముల నవశ్యము గార్యములోనికిగొని రావలయును. ప్రస్తుతకాలమున స్త్రీపురుషులు విచారశూన్యులై యెట్లో కావలసిన కార్యముల జేసికొనుచున్నారు. గాని యదిసరిగాదు.

దివసేనైవ తత్ కుర్యాత్ యేన రాత్రౌ సుఖం వసేత్
అష్టమాసేన తత్ కుర్యాత్ యేన వర్షాః సుఖం వసేత్
పూర్వేవయసి తత్ కుర్యాత్ యేన వృద్ధః సుఖం వసేత్
యావజ్జీవేన తత్ కుర్యాత్ యేన ప్రేత్య సుఖం వసేత్

భార. ఉ. అ. 36.

రాత్రియంతయు సౌఖ్యముగ గడుపుటకు తగినకార్యంబుల బగటియందును, వర్షాకాలము నాలుగునెలలు విశ్రాంతి గైకొనుటకు వీలుకలుగఁజేయు నుద్యమంబుల సంవత్సరమందు దక్కినయెనిమిదినెలల పర్యంతమును, వృద్ధావస్థయందు సౌఖ్యమందుటకు దగినయుద్యోగంబుల బాల్యయౌవనములందును, నిహపరలోకంబుల రెండిటియందుగూడ నానందమనుభవించుటకు దగినపురుషార్థంబుల యావజ్జీవంబును సలుపుచుండవలయును. అట్లుచేయుటలో మూర్ఖులంబలెగాక బుద్ధిమంతులట్లు

కిన్ను మేస్యాదిదం కృత్వాకిన్ను మేస్యాదకుర్వతః

ఇతికర్మాణి సంచింత్యకుర్యాద్వా పురుషోనవా.

భార. ఉ. అ. 34.

ఈకార్యముఁచేయుటవలన గలుగులాభమేమి? చేయ నందువలన గలుగుహానియేమి? అనిముందుగనేచేయఁబోవు కార్యమందలి లాభనష్టంబుల విచారించిచూచికొని మరియు జేయుచుండుట శ్రేయస్కరము.

అనుబంధంచ సంప్రేక్ష్యవిపాకంచైవ కర్మణాం
ఉత్థానమాత్మనశ్చైవధీరః కుర్వీతవానవా.

భార. ఉ. అ. 34.

బుద్ధిమంతులగుపురుషులేదైన నొకకార్యము చేయుటకుముందే దానిఫలవంతముగ బూర్తిచేసికొన దమవద్దనేమి సాధనములున్నదియు, నందులకుగావలసినశక్తి యెంతయున్నదియు, దుదకదియెట్లు పరిణామమందునదియు బాగుగయోచించిచూచికొని యనంతరమేదాని నారంభింపవలయును. మూర్ఖులిట్లు హానిలాభములయెడల ధ్యానమూనక వారిచిత్తమునకువచ్చినట్లు చేయఁబూని యవియుత్తమరీతి నెరవేరకున్న దుఃఖించుచుందురు. ఎవరుబాలురపోషణాది సమస్తకార్యముల సలుప సమర్థులై యుందురో, యెవరువారి నుత్తమవిధానంబున విద్యాభ్యాసముఁ జేయింపగలుగుదురో యట్టివారలే గర్భాధానమున కధికారులని మేమిదివరకే వ్రాసియుంటిమిగ

దా! కాని ప్రస్తుతకాలమం దనేకులందులకు వ్యతిరేకముగ ప్రవర్తించుచున్నారు. ఉండుటకిల్లును, దినఁగూడును, గట్టగుడ్డయులేని యనాథులకు సంతానసంఖ్య సంవత్సరము సంవత్సరమునకు మితిమీరిపోవుచున్నది. బిడ్డలెక్కువయై ధనములేకపోవుటవలన వారికిబుట్టినవారలనేకు లన్నములేకమాడి చచ్చుచున్నారు. అనేకులు దొంగతనముమొదలగు దుష్కార్యముల జేయుటయందు ప్రవేశించి ధర్మభ్రష్టులగుచున్నారు. తమకడుపునబుట్టినబిడ్డలిట్లు ధర్మభ్రష్టులుకా దలిదండ్రులకు గలుగుదుఃఖమింతింతయన నలవికాదు కావుననే నిరుక్తములోని" యాఈంచకార" యను మంత్రముయొక్క వ్యాఖ్యయందు బిడ్డలెక్కువగగలిగినవారలు దుఃఖభాగులగుదురని ప్రతిపాదనము చేయఁబడియున్నది. ప్రతిమనుష్యుడిట్టి దుఃఖములేకుండ జేసికొనుటుచితముగదా! ఈదుఃఖము లేకుండ జేసికొనుటకనేకమార్గములుండవచ్చునుగాని మాకుసర్వోత్తమంబని ప్రతీతమగుచున్న యుపాయమేదన నెంతవరకు ధనాదిసకలపదార్థములవలన భార్యాపుత్రాదుల యథావిధి పాలింపశక్తి కలుగకయుండునో యంతపర్యంతము బ్రహ్మచర్యమునే యవలంబింపవలయును గాని కొలఁదిమాత్రము ధనమున్నతోడనే పెండ్లియాడగూడదు. ఎప్పుడపత్యసంగోపనమునకు సామర్థ్యముకలుగునో యప్పుడీమనువాక్యమునసుసరించి సంతానము

న్నైకె ప్రయత్నము జేయవలయును.

యస్మిన్నృణంసన్నయతి యేనచానంత్యమశ్నుతే
సఏవధర్మజః పుత్రః కామజానితరాన్విదుః.

మను. అ. 9.

ఏకుమారునివలన మనుజుఁడు పితౄణమునుండి విముక్తుఁడు కాగలుగునో యేపుత్రునివలననసంతమైన సౌఖ్యముచేకూరునో యాపుత్రుఁడే ధర్మపుత్రుఁడు. ఇతరులందరు గామజన్యులే. సకలగుణాలంకారుఁడగు కుమారుఁడొక్కఁడే మేలు. దుష్టత, నిష్ఠురత, దొంగతనము, వ్యభిచారము మొదలగు దుర్వ్యసనపూరితులైన మూర్ఖులగుసుతులు పెక్కండ్రుకలిగినను హానికారకులేయగుదురు.

పిత్రోర్ని దేశవర్తీయః సపుత్రోన్వర్థనామవాన్
శ్రేష్ఠఏకస్తుగుణవాన్ కింశతైరపిసిర్గుణైః.

శు. నీ. అ. 4. ప్ర. 1.

ఎవఁడుతలిదండ్రులసత్యములైన యాజ్ఞలజవదాటకుండునో, యెవఁడువిద్యాసద్వర్తనాది గుణభూషితుఁడై యుండునో, యట్టివాఁడే న్యాయమునకు బుత్రుఁడనిపిలువఁబడుటకు యోగ్యుఁడు. గుణవిహీనులై కొడుకులు వందమందియైనను వ్యర్థమే.

వరమేకోగుణీ పుత్రోనచమూర్ఖశతాన్యపి
ఏకశ్చంద్ర స్తమోహంతి నచతారాగణోపిచ.

హి. ప్ర.

చంద్రుఁడొక్కఁడే యంధకారమునంతను బటాపంచ లుజేయుఁగలుఁడుగాని నక్షత్రములు గుంపులుగుంపులుగనుండి యు చీఁకటిఁబోఁగొట్టఁజాలవు. అటులే గుణవంతుఁడైన కుమారుఁ డొక్కఁడైనను గుణమువంతను బ్రకాశింపఁజేయుఁగాని మూర్ఖులనేకులయ్యు నేమియుఁజేయఁజాలరని యిందలియభిప్రాయమై యున్నది. మరియు

ఏకేనాపిసుపుత్రేణ విద్యాయుక్తేన సాధునా
ఆహ్లాదితంకులంసర్వం యథాచంద్రేణశర్వరీ
కింజాతైర్బహుభిఃపుత్రైః శోకసంతాపకారకైః
వరమేకఃకులాలంబీ యత్రఃవిశ్రామ్యతేకులం.

చా. నీ. అ. 3.

చంద్రుఁడు ప్రాముర్భావమంది యంధకారముఁబోనడచి రాత్రిని బ్రకాశవంతము జేయులాగున సద్వర్తనముగల విద్వాంసుఁడైన కుమారుఁడుగూడ గులమునానందమంద జేయును. శోకసంతాపములగలుగ జేయు మూర్ఖులైనపుత్రులనేకులయ్యు నేపనికిఁగొఱగారు. కావున విద్యావంతుఁడగు బుత్రుఁడే యుత్తముఁడని చాణక్యనీతియు వక్కాణించుచున్నది. ఇంను

వలన దలిదండ్రులు తమబిడ్డలకు మొదటినుండియు నుత్తమ మైన శిక్షణమొసంగుచు వారు గొంచెముగ్రాయుటకును జదువుకొనుటకును నేర్చుకొనినతోడనే గురుకులమునకు పంపుచుండవలయును.

పదక్రమవిశేషజ్ఞో వర్ణక్రమ విచక్షణః
స్వరమాత్రా విభాగజ్ఞో గచ్ఛేదార్యసంసదమ్.
తై. అ. 24. సూ. 6.

అక్షరపదస్వరంబుల మాత్రలననఁగా స్వరములయొక్కయు, వ్యంజనములయొక్కయు వానికలియికవలన నేర్పడు పదములగూర్చియు నింటియందు దలిదండ్రులవలన నేర్చికొని యనంతరము బాలకుఁడు విశ్వవిద్యాలయముజేరి పూర్వోక్త విధానంబున విద్యాధ్యయనముఁ జేయవలయును.

మనుష్యుడీ యపత్యసంగోపనమను మూఁడవకర్తవ్యమునుండి విడివడి సమాజసంస్థయను నాలుగవ కర్తవ్యమందు ప్రవృత్తుఁడు గావలయును. సామాజికకార్యములుగూడ సమస్తమానవుల కావశ్యకకర్తవ్యములై యున్నవి. ఏయేకార్యముల చేయుచుండుటవలన సర్వసాధారణముగ మనుజులందఱకు సౌఖ్యముకలుగుచుండునో యవియే సామాజికకర్తవ్యకర్మలనఁబడును. ఒక్కనిలాభముకొఱకు ననేకమందికి హాని కలుగఁజేయుటయు, స్వార్థవశుఁడై సమాజోన్నతివిషయమై

ధ్యానమూనక కేవలము దనయొక్కనికి సౌఖ్యముగనుండుట చేతనే సంతుష్టుడై యుండుటయు లోనగునవి సామాజిక కార్యములకు హాని కారకములగుటం జేసి మనుష్యు లట్టివానియందు బ్రవృత్తులు గాఁగూడదు. ఎవఁడు సర్వసాధారణముగ నందఱకు జేకూరునట్టి సుఖోపాయమార్గంబు జేపట్టక కేవలము దనకొక్కనికిమాత్రము సౌఖ్యముకలుగునట్టి యత్నము జేసికొనుచుండునో యట్టివాఁడెప్పటికి సౌఖ్యవంతుఁడు గానేరఁడు. ఏసమయమందైన దేశమందెల్లయెడల రాజవిగ్రహాది ఉపద్రవంబు లేవైనసంభవించినయెడల వానినుండి యాధనికుఁడొక్కఁడు దప్పించికొని యుండగలుగునా? ఎప్పుడైన దుర్భిక్షము సంభవించి మనుజులందఱు గూడు లేక ప్రాణముల గోల్పోవవలసిన దురవస్థకలిగినచో నాభాగ్యవంతుఁడు సయితము గష్టపడవలసినదేగాని సౌఖ్యముగనుండుటకు వీలు లేదు. ఏలయన ధనహీనులైన దీనులందఱు క్షుధాతురులై ధనికుని సర్వస్వంబు గొల్లగొందురు. అప్పుడు ధనాఢ్యుఁడుగూడ నితరులతో సమానమగును. కావున నొక్కనియున్నతికొఱకు జాతికంతయు హానిగావించుటయు గేవలము, వ్యక్త్యున్నతియందె బుద్ధి గలిగి జాత్యున్నతియెడల ధ్యాసమూనకుండుటయు మహాహాని కారకములై యున్నవి. జాత్యున్నతివలన వ్యక్త్యున్నతియు నగుచుండును. కాని జాత్యున్నతి కలుగనియెడల నంతవఱకునై

యుండు వ్యక్త్యున్నతియు నాశనమగును. కావున జాత్యు న్నతినివిడచి కేవలము వ్యక్త్యున్నతియందుమాత్రమే ధ్యాన ముగలిగి యుండగూడదు. వెండియు వ్యక్త్యున్నతిమూలమున జాత్యున్నతియు సమకూరునని కొందఱు బుద్ధిమంతులయభి ప్రాయమైయున్నది. ఎట్లనఁగా నేదైన నొకసంపూర్ణరాష్ట్ర మందంతట మానవులందఱు నుద్యోగశీలురగుటవలన వారికం దఱకు నున్నతికలుగుటంజేసి జాత్యున్నతియు నగుచుండును. ఈసిద్ధాంతము కొన్నివిషయములలో సత్యమేయైయున్నది. రా ష్ట్రమందలి మనుజులందఱు నుద్యోగశీలురగుటవలన వారంద ఱు ధనాఢ్యులే యగుదురు. అప్పుడు దరిద్రులమూలమున ధనాఢ్యులకు సంభవించెడు నుపద్రవములుమాత్రము కలుగ నేరవు. కాని భిన్నభిన్నవ్యక్తులగుకారణంబున వేరువిధములైన యుపద్రవములు సంభవించుట కవకాశముగలదు. ఎట్లనఁ గా వ్యక్త్యున్నతి ప్రబంధమువలన సమస్తమానవు లుద్యోగశీ లురైయుండియు, జాత్యున్నతికి సంబంధించిన ప్రబంధమేమి యు లేని యొకరాజ్యమందుగల యొకనిపై శత్రువుకలహమునకు వచ్చినచో నాసమయమందొంటరిగ శత్రువును గెలువదగిన శక్తి యతనిదగ్గర లేకపోవచ్చును. కావున ముఖ్యముగ జా త్యున్నతియెడల శ్రద్ధవహించియుండుట శ్రేయస్కరమైయు న్నది. జగత్తునందలి సమస్తవిషయముల బరికించుటవలన

సమూజము లేక యేకార్యముగాని నెరవేరఁజాలదని స్పష్టమగు చున్నది. సర్వనియంతయు, సచ్చిదానందుఁడు నగుసప్పరమే శ్వరుఁడు పరమాణువుల సంయోగముననే యీపృథివినిర్మిం చియున్నాఁడు. దృష్టిగోచరంబగుచున్న యీజగత్తంతయు బరమాణువుల సముదాయమే. ఇటులే నీరు, వాయువు, సూ ర్యుఁడు మొదలగునవన్నియు వానివాని పరిమాణువుల సమూ హము లేయైయున్నవి. జలముయొక్క పరమాణువులు పరస్ప రమేకీభవించి సమూజరూపమై దప్పిదీర్చుట యనుకార్యమును జేయఁగలుగుచున్నవి. కాని యీపరమాణువులు గలసియుండ క యావిదిరూపమునగాని యింకను సూక్ష్మరూపమునగాని వే ర్వేరుగ నుండియుండినచో దాహముదీర్చుటయను గార్యము ను జేయఁజాలియుండవుగదా! ఇదేవిధముగ సమాజరహితమై న- అనఁగా బరస్పరముగలసియుండక పరమాణువులన్నియు వేరువేరుగ నుండినయెడల- పృథివీవాయుసూర్యాదుల వ్యవ స్థయు నింతయేయని తెలిసికొనుఁడు. శరీరమందలి హస్తప దాద్యవయవములయొక్క- పరస్పరసంబంధరూపమైన సమాజ మెంతపర్యంతము విద్యమానమైయుండునో యంతపర్యంతము మనుజుఁడు సకలవ్యవహారములఁ జేసికొనఁగలుగును. అవయ వములు వేరువేరైన యేమియుగావింపనేరఁడు. మనుష్యులలో గుట్టుపనివారలు, వడ్రంగులు, కమ్మరులు, రాళ్లమలచువారు

వ్రజములనోయువారు, గానుగవాండ్రు, సాలెలు, ముచ్చిపని వారలు, వర్తకులు, వైద్యులు, ఉపాధ్యాయులు మొదలగు వారి సమాజములేనిచో నేనుగునో యోచింపుఁడు. వీరందరు జేయుపనుల మనుష్యుఁడొక్కఁడు జేసికొనగలుగునా? కావున సమాజవ్యవస్థలేక మనుష్యజాతి యున్నతినందదు. వెండియు బశుపక్ష్యాదిప్రాణులలో జాత్యభిమాన మెట్లున్నదో చూతుము. కోతులగుంపులో నొకదానినెవడైన గొట్టినయెడల నాతక్షణ మె తక్కుంగలకోతులన్నియు నొక్కచోగుమిగూడి యొక్క పర్యాయముగ విజాతీయునిపైబడిహింసించిసజాతీయమైనవాన రమును దుఃఖమునుండితప్పించుకొనుచుండును. తక్కినసమస్త జంతువుల స్థితియు నింతయేయైయున్నది. వెండియు

బహూనామల్పసారాణాం సమవాయోహిదుర్జయః,
తృణైర్విధీయతే రజ్జుర్వధ్యంతే దంతినస్తయా.

భో. ప్ర.

సారములేని క్షుద్రవస్తువులయ్యు ననేకములొకటిగ గూడుటవలన మహాత్కార్యమునైనఁ జేయఁగలుగును. ఎట్లనఁగా బాలురునయితము ద్రుంపగలిగిన తుచ్ఛవస్తువులయ్యు,జంతువులు భక్షించు నీచవస్తువులయ్యు గడ్డిపరకలనేకములు గలసి సమూహము సేర్పడి మదోన్మత్తగజముంబోలు గొప్పజంతువునైన బాధింపఁగలుగుచున్నవి.

అథయేసంహితావృత్తాః సంఘశః సుప్రతిష్ఠితాః.
తేహిశీఘ్రతమాన్ వాతాన్ సహంతేన్యోన్యసంశ్రయాత్.
ఏవంమనుష్యమప్యేకం గుణైరపిసమన్వితం,
శక్యంద్విషంతోమన్యంతే వాయుర్ద్రుమమివైకజం.

భార. ఉ. అ. 36.

గుమిగూడి పెనవైచుకొనిపోయిన వృక్షసముదాయంబును వాయువు సమూలముగఁ బెకలింపఁజాలదుసరిగదా వానివిరుగునట్లును జేయనోపదు. వేరువేరుగనున్నచో నొక్కనిముషమున బేరులేకుండ జేయును. అదేవిధమున మనుష్యుఁ డెంత బుద్ధిమంతుఁడెంత విద్యాదిగుణసంపన్నుఁడైనను నేదైన నాపదగలిగినపుడొంటరిగ దానినుండి కాపాడికొనుటగష్టమగును. మరియు నీపైయుదాహరణంబు లెట్టివిషయంబుల స్పష్టము జేయుచున్నవో యోచింపుము. జడపదార్థము లేసముదాయముగఁ జేరి యెంతలెంతలో దుర్ఘటములైన కార్యములఁ జేయుచుండ జేతనత్వముగలమనుష్యులు సమాజముగగూడిన సాధింపరాని కార్యములేవైనగలుగునా? ఇందుచేతనే జాత్యున్నతికి ముఖ్యకారణము సమాజసంస్థయని మహాత్ములగువారలు నమ్మియుండిరి.

అన్యోన్యసముపష్టంభాదన్యోన్యాపాశ్రయేణచ
జ్ఞాతయఃసంప్రవర్ధంతేసరసీవోత్పలాన్యుత. భార.ఉ.అ.36.

ఒండొంటితోడఁ బెనంగొని సగోవరమున్నందు గలువలు వృద్ధియగుచుండుచాడ్పున బరస్పరముగలసి యొకరికొకరు సహాయము జేసికొనుటవలన మనుష్యజాతి యభివృద్ధి నొందుచుండును. ఇంతవరకు నభివృద్ధినందియున్న జాతులన్నియు సమాజములమూలముననేగాని యితరవిధమునగాదు. ఏదేశము సమాజశూన్యమైయుండునో యాదేశమన్యదేశీయ పాదాక్రాంతమగుటయే నిశ్చయము. మరియు,

సభాంసభ్యోభవతి ఏవంవేద.

అథ. కాం. 8. అను. 5. వ. 25.

సమాజమునవలన మనుజుడు సభ్యతనేర్చుకొనునని యథర్వమునందు బ్రతిపాదనము చేయబడియున్నది.

సభ్యసభాంమేపాహి. అ. కాం. 19. అను. 7. వ. 55.

సమాజముశ్రేష్ఠులైన పురుషులఁగలిగియుండవలయును. అందువలన బ్రపంచమందు సభ్యతయభివృద్ధిబొందుచుండును. వర్తమానకాలమందట్టి సభ యార్యసమాజమైయున్నది. ఎప్పుడార్యావర్తమునందార్యసమాజము ప్రాదుర్భావమందెనో యప్పటినుండియే దేశోన్నతి కవసరములైనమార్గములు బయలువెడలినవి, ఆర్యసమాజము భారతవర్షమందలి సమస్త జనులను మేలుకొలిపివారియందు గౌరవ్యబుద్ధిజనింపఁ జేసి సజ్జనత, దేశోన్నతి మొదలగు వానియెడల ధ్యానము బరపఁ

జేసినది. ఈయార్యసమాజమువలననే సమస్త ప్రపంచమునకు బరణోపాయంబు జేకూరునను నాశగలదు. స్వార్థము విడిచి యిట్టి సమాజములకు సహాయము జేయుట మనుజమాత్రునకు బరమకర్తవ్యము. అట్లు సాయము జేయుట ప్రపంచముయొక్క యున్నతికి దోడ్పడుటయేగాని వేరుగాదు. ఇల్లుగప్పించుకొను టకు గడ్డిని పైకెక్కించుటయను హీనకార్యము సయితము మ నుష్యసముదాయము దోడుపడనిచో గాజాలనియపుడు గొప్ప కార్యములెన్నడైన సమాజములేక నెరవేరగల్గునా? కావుననే

నవై భిన్నాజాతుచరంతి ధర్మం నవై సుఖం ప్రాప్నువంతి హాభిన్నాః నవైభిన్నా గౌరవం ప్రాప్నువంతీ నవైభిన్నాః ప్రశమం రోచయాంతి. భార. ఉ. అ. 36.

సమాజములేక- అనఁగా నైకమత్యములేకుండ- వే ర్వేరుగనుండి మనుజులు ధర్మోన్నతి జేయజాలరు. సౌఖ్యవం తులుగాఁజాలరు. గౌరవముగాని శాంతిగాని పొందనేరరు. కా వున మనుష్యులవశ్యముగ సమాజోన్నతి జేసికొనవలయును. ప్రాచీనకాలమునందీదేశవాసులందొక్క వైదికధర్మమే యుం డియుండె. ఇక్కాలమందువలె మతమతాంతరంబులును, ద న్మూలమున గలుగు బరస్పరవిరోధంబులును నాకాలమందు లేకుండెను. దేశమంతట సంస్కృతమొక్కటే మాటలాడబడు చుండెగాని యిప్పటివలె ననేకప్రకారంబులగు భాషలప్పుడు

లేవు. పూర్వముమానవజాతి యంతయు నొక్కటియే. ఇప్పుడనినలెక్కకు మీఱినజాతులేర్పడియున్నవి. పూర్వమందార్యగణములైన బ్రాహ్మణ క్షత్రియాదులందరు ఒకరిచేతియన్నము మరియొకరుదినుచుండిరి. నేఁడుబ్రాహ్మణులు తమలోదామేయనేకభేదముల గల్పించికొని యొకబ్రాహ్మణునిచేతి యన్నము మరియొకబ్రాహ్మణుఁడు దినుటపాపమని తలంచుచున్నాఁడు. పూర్వకాలమందొకరిసౌఖ్య మందరిసౌఖ్యముగను, నొకరికి దుఃఖముగలిగిన నందరకు దుఃఖముగలిగినట్లును భావింపఁబడుచుండెను. నేఁడందులకు విపరీతవిధానములు ప్రబలియున్నవి. వానిఫలితముల మనమందర మనుభవించుచునేయున్నారము. పూర్వమందొక్కయార్యులరాజ్యమే. నేఁడనేకభిన్నరాజ్యములు వ్యాపించియున్నవి. ప్రాచీనకాలంబున పక్షపాతరహితమైన యొకేవిధమగు న్యాయము సమస్తమానవులకు గలుగుచువచ్చెఁగాన నలుపనియు దెలుపనియు భేదమేమియు లేకుండెను. ఏసమయమందన్ని విధముల నైకమత్యముండియుండెనో యాసమయమందీదేశము సకలవిధముల నున్నతిశిఖరము నారోహించియుండెను. అవిద్యాకారణంబున దేశమందనేకమతములు వ్యాపింప నార్యులెప్పుడు వేర్వేరుగఁ జీలిపోయిరో యప్పటినుండి దేశమునకధోగతి సంప్రాప్తముగా దేశవాసులు దీనులు మలీనులునై పోయిరి. ఈబహుత్వజాల

మునుండి వెలువడి యెంతపర్యంత మైకమత్యము బూనకయుం దురో యంతపర్యంతమిచ్చటివారలు యథాభీష్టసిద్ధినొందజాల రు. కావున దేశోన్నతినిమిత్తము దనమనధనంబులతో సమాజోన్నతిం చేసికొనుట యీదేశవాసులకు ముఖ్యకర్తవ్యమైయున్నది. ఇందులకు మనుష్యులకు మానవశాస్త్రము, శారీరశాస్త్రము, సమాజసంస్థాశాస్త్రము- అనగానితిహాసము- మొదలగువానిజ్ఞానము గలుగనలయును. ఇతిహాసమువలన మనుజులకు నానానేకకాలమందొక సమాజమొక కార్యమునొకవిధముగ జేయుటచే నొకరీతి ఫలితము గలిగెనను జ్ఞానముకలుగును. అప్పటివానియందలి లాభాలాభముల నాలోచించికొని ప్రస్తుతకాలమునగూడ సమాజసంబాధమైన సకలకార్యములం జేసికొనవచ్చును.

ఈసామాజిక కార్యములనుండి నివృత్తినొంది మనుష్యుడు మనోరంజనకార్యములందు గొంత కాలముం గడపవలయును. మనోరంజనమందుగల సరియైన యభిప్రాయంబు దెలియనికారణమున ననేకులుదానితో నవసరము లేదనవచ్చును. కానవిచారించిచూడ మనోరంజనమునకు నెక్కుడగు నవసరముండియున్నది. ఏపనినైన జేయుటవలన శరీరమలసటనొందురీతి మనస్సుగూడ నలయుచుండును. శరీరమలసిన విశ్రాంతినొందువరకు మరల నాకార్యము జేయుటకు శక్తిగలిగియుం

డదు, అటులేమనస్సుయొక్క దశయునైయున్నది. మనస్సున కిష్టములేని పనినిదేనినైన బలవంతముగగాని, యేదేనివిశేషనిమిత్తంబునగాని చేయవలసి వచ్చినయెడల నది యుత్తమరీతి నెరవేరనేరదు. మరియు మూఁడునాలుగుపర్యాయములు మనస్సులేకుండ నొకకార్యము జేయుటవలన దుదకు మనస్సు ఆకార్యమునుండి విరిగిపోవును. మరల నాకార్యకరణమందు మనసును బ్రవేశింపఁజేయుట దుస్తరము. మనస్సులేనికార్యము జేయబూనువాని కమితమైన దుఃఖముగలుగును. ఏసమయమందేకార్యము జేయ జిత్తమభిలషింపదో యాసమయమందే యాకార్యము జేయుటవలన మనోశక్తియధికముగ వ్యయమగును. ఇంతియగాక యింకను ననేకవిధములైన యుపద్రవములు గలుగుచుండును. కావునమన మెప్పుడు పనిచేయుటకిష్టపడదో యప్పుడుదాని మనోరంజనకార్యములందు బ్రవేశపెట్టవలయును. మనోరంజనకార్యముల మనసుస్వయముగ గోరుకొనుచుండును. ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధమభేదములతో జగత్తునందు మనోరంజనము లనేకప్రకారములుగలవు. సత్సహవాసము, పుస్తకావలోకనము, శిల్పము, చిత్రలేఖనము, రసాయనవిద్య, వ్యాయామము, శుద్ధవాయుసేవనము మొదలగునవి యుత్తమమనోరంజన కార్యములైయున్నవి. గానము, వాద్యము, నాటకావలోకనము లోనగునవి మధ్యమ

ములు. చౌపదము, చదరంగము, చీట్లాట, అనియతప్రసంగము మొదలగునవి యధమములు, స్తేయము, జూదము, వ్యభిచారము, సురాపానము, మాదకద్రవ్యసేవనము, కలహము, హింస మొదలగునవి యధమాధమంబులు. వీనిలోనుత్తమ మధ్యమ మనోరంజనములవలన మానవున కెట్టిహానియు గలుగదు. అయినను రెండవదానికంటె మొదటిదానియందె ధ్యానము గలిగియుండుట శ్రేయస్కరము. అధమ, యధమాధమంబులు మిగులనీచములు. వీనిలో యధమాధమము కడునపాయకరమైయున్నది. ఇవిమానవులకు హానికారకము లగుటవలన వీని మనోరంజనములందు గణించుటయే యసమంజసము. ఏకార్యము జివరకు హీనముగ బరిణమించునో, దేనిమూలమున మనోశరీరంబులకు హానిచేకూరునో, యేదియవసానంబున సంతోషమిచ్చుటకు మారుగ దుఃఖముగలుగజేయునో యట్టిదానిని మనోరంజనముగ గణింపఁగూడదు. ధనాఢ్యులనేకులు ప్రాతఃకాలమున బడకవదలినది మొదలుకొని మనోరంజనకార్యములందేమగ్నులై వేరొండువిషయముపై ధ్యానమైనను లేక కాలమంతయు వానియందే గడపుచుందురు. కానియది సరిగాదు. ఆత్మరక్షణము, జీవిక, అపత్యసంగోపనము, సామాజికోన్నతి, ఈశ్వరారాధనము మొదలగుకార్యముల యథావిధి జేసికొనకుండునంతవరకు మనోరంజనకార్యములందు ప్రవే

శింపనట్టివారికిగాని యధికారము లేదు. అనేకులకు మనోరంజనము జీవిక, మనోరంజనము అపత్యసంగోపనము, మనోరంజనము సమాజసంస్థమున్నగునవి యొక్కటియేగావచ్చును. శిల్పకలాకౌశలమందును, గానమందును నెక్కుడభిరుచిగలవారలకవియే మనోరంజనములును జీవికయునగుగదా! కొందరకు సామాజిక కార్యములవలన మనస్సుప్రసన్నమగుచుండుటచే నవియే వారికి మనోరంజనములును సామాజికోన్నతి రూపక కర్తవ్యములునునగును. జీవికాదికార్యముల నొనరించుకొనదగినవేళలందు మనోరంజనమందు ప్రవృత్తుండై యుండుట మూర్ఖతయే. కాని మనోరంజనమును జీవికయు నొకటియే యగుచో

ఏకాక్రియా ద్వ్యర్థకరీ ప్రసిద్ధా.

అనుదృష్టాంతానుసారముగ నట్టికార్యములందు ప్రవృత్తులైన హానియేమియు లేదు. కాని మనోరంజనమే జీవికయైన ను నట్టిది కేవలము మనోరంజనమెుసంగు ఫలితమునియ్యక పోవచ్చును. అట్లుగలిగెడిచో జీవికయు మనోరంజనమును నొకటియగుట శ్రేయమేయగును. ఈపూర్వోక్తకర్తవ్యకర్మంబులను, వక్ష్యమాణకార్యంబులను మనుజుండు దనయొక్క సంపూర్ణమైన యున్నతికొరకు నియమపూర్వకముగ జేసికొనుచుండవలయును.

ఏకార్యము జేసికొనుటకైనను మనుజునకు స్వాతంత్ర్య మావశ్యకము. స్వతంత్రుఁడు గానిచో నందేమియు చేయుటకును శక్తుఁడుగాఁడు.

స్వతంత్రః కర్తా. అష్టా. అ. 1. పా. 4.

ఏపనినైన జేయుటకెవఁడు స్వాతంత్ర్యము కలిగియుండునో యతఁడే యాకార్యమును జేయగలుగును. మట్టితో గుండను జేయు స్వాతంత్ర్యము గలిగియుండుటచేఁ జేసియే కుమ్మరివాఁడు దానిచేయుచున్నాఁడు. మరియు సంపూర్ణమైన యున్నతి గలుగుటకు ముఖ్యకారణము స్వాతంత్ర్యమే. పూర్వకాలమునందీదేశవాసులకు సంపూర్ణమైన స్వాతంత్ర్య ముండినట్లు సంస్కృత గ్రంథావలోకనంబున విదితమగుచున్నది. అందువలననే యాకాలమందిచ్చటివార లత్యంత సౌఖ్యవంతులై యుండిరి.

సర్వంపరవశందుఃఖం సర్వమాత్మ వశంసుఖం
ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః.

మను. అ. 4.

పరాధీనతయే దుఃఖమునకు మూలము. స్వతంత్రతయే సౌఖ్యహేతువు. సుఖదుఃఖములయొక్క లక్షణము లివియేగాని వేరేమియు గాదని మనువు వక్కాణించియున్నాఁడు. దీని వలన నార్యులెంతటి స్వాతంత్ర్యప్రియులై యుండిరో యోచిం

పుచు. మరియు వారలు దమయొక్కరి స్వాతంత్ర్యము విషయ మై మాత్రమే ధ్యానము గలిగియుండలేదు.

సమంసర్వేషు భూతేషు. మను. అ. 6.

తమ కెట్లు స్వాతంత్ర్యమువలన సౌఖ్యముగలుగుచున్న దో యట్లె యితరులకుఁగూడ నగునను దలంపు నందరకు స్వాతంత్ర్యము గావలయునని యేర్పరచిరి. విద్య, బుద్ధి, న్యాయము, యోచన, దయాళుత్వము, సమదర్శిత్వము, సభ్యత, పక్షపాతరాహిత్యత, సురాజ్యము మొదలగునవి స్వాతంత్ర్యమునకు ముఖ్యకారణములు. ఇవి వృద్ధియగుచుండిన స్వాతంత్ర్య మభివృద్ధినందుచు నివిక్షీణించిన నదియు క్షీణించుచుండును. జీవిత్ర స్వాతంత్ర్యము, ఉద్యోగ స్వాతంత్ర్యము, ప్రవాసస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, లేఖాస్వాతంత్ర్యము, ధర్మస్వాతంత్ర్యములని స్వాతంత్ర్యమనేక ప్రకారములైయున్నది. దేనివలన జీవయాత్రగడుపుట యందెట్టిబాధగలుగకయుండునో యదియే జీవిత్రస్వాతంత్ర్యము. కొన్నివందల సంవత్సరములకుబూర్వము విదేశీయరాజులేగాక దేశీయాధిపతులు స యితము దేశీయులైన జనులలో నెవనినైన దలచినంత మాత్రమున గడ ముట్టించుచువచ్చిరి. మహాభారతము తర్వాత నింగ్లీషు రాజ్యపరిపాలనము రాకపూర్వము మనదేశములో మనుజులఁ జంపుటయనిన దృణప్రాయముగ నెంచబడుచు వచ్చెను

ఆంగ్లేయపాలకులీదేశంబున నెప్పుడు దమరాజ్యము స్థాపించిరో నాటినుండి మనుజులకఖండమైన జీవిత్రస్వాతంత్ర్యము సంప్రాప్తమైయున్నది. ఇతర రాజులకాలములందు సాధింపనలవికాని జీవిత్రస్వాతంత్ర్యము మనుజులకు సమకూరియున్నది, కాని ఆవులు మొదలగు పశువులయొక్క జీవిత్రస్వాతంత్ర్యము మాత్రము లభ్యముగాలేదు. అడవి మనుష్యుల కాలములందును, గొందరు క్రూరశాసకుల కాలములందులను నేవిధమున బశువుల ప్రాణహరణము గావింపఁబడుచువచ్చెనో యట్లే యాంగ్లేయరాజ్యము వచ్చినతరువాతగూడ వాని ప్రాణములు గైకొనబడుచున్నవి. ఇది మహాశోకకరమైన వార్తగనున్నది. ఆంగ్లేయపరిపాలనమందు గోవధయను నత్యాచార మిదేవిధమున జరుగుచు బోయినయెడల నేసమయమందైన దుగ్ధ ఘృతాదులభావములగుటచేతను, వృషభాదుల క్షయంబునను గృషికి భంగము గలుగుటవలన రాజప్రజలకు హాని సంప్రాప్తమగునని రాజ్యవిషయమై శుభచింతతోడ నాంగ్లేయపాలకులతో నివేదనము చేసికొనక యూరకుండజాలము. గోహత్యవలన రాజప్రజల కనేకోపద్రవంబులు గలుగుట సంభవమై యున్నది. ఇట్టి యత్యాచారంబుల మాన్పింప వారికి బరమేశ్వరుఁ డెప్పుడు బుద్ధిపుట్టించునో తెలియదు.

ఏమనుష్యునకేయుద్యోగమందభిరుచియుండునో యతనికి

దాని జేసికొనుటయందెట్టి ప్రతిబంధకము గలుగకూడదు. ఇదియే యుద్యోగ స్వాతంత్ర్యమనఁబడును. ఉద్యోగ విషయంబున బరాధీనత గలిగియుండుట న్యాయవిరుద్ధంబును, మహానికృష్టంబును, దేశముయొక్క యధోగతికి గారణంబును నై యున్నది. కావున వృత్తులవిషయమై మేమిదివరకు బ్రతిపాదనము చేసియున్న విధానంబులననుసరించి మనుజులు దమయిష్టమువచ్చినట్లు ధర్మయుక్తములైన యుద్యోగముల జేసికొనుచుండవలయును. జాతివలనను, రాజ్యమువలనను జేయఁబడు బాధనములీయుద్యోగ స్వాతంత్ర్యమునకు నాశకారణములై యుండును. కావున రాజ్యమునకు సంబంధించి యుండువారును, జాతిసంబంధులును ముఖ్యముగ నుద్యోగులగు సమాజపు సభాసదులును నట్టిబాధనముల సమయానుకూలముగ దూరము జేయుచుండవలయును.

మూఁడవదియగు బ్రవాసస్వాతంత్ర్యముగూడ సమస్త మానవుల కత్యంతావశ్యకమైయున్నది. ప్రవాస స్వాతంత్ర్యము లేనియెడల నుద్యోగస్వాతంత్ర్యమునకు నష్టము వాటిల్లును. దేశాటనము లేనిచో జనులు దయాళురు, బుద్ధిమంతులు, అనుభవశాలులు, ఉద్యోగశీలురు గాఁజాలరు. గమనాగమనములు చేయుట మనుజునకు స్వభావసిద్ధమైయున్నది. దొంగలు, సింహవ్యాఘ్రసర్పాదిక్రూరప్రాణులు, విషమంబులైన పర్వతము

లు, అత్యుష్ణతాతిశీతలములు, కుజలవాయువులు, సముద్రము లు, స్వజాతీయులైన మనుజులు మొదలగువారలు గిమనస్వా తంత్ర్యమునకు విరోధులైయున్నారు. ఎచ్చటను రాజ్యము నె లకొనియుండునో యచ్చటదొంగలు మొదలగువారియొక్క యు సింహవ్యాఘ్రాది క్రూరమృగములయొక్కయు భయము రాజ్యసంబంధమైన ప్రబంధమువలన దూరమగుచుండును. వి షమంబులైనపర్వతాదులలో రాజమార్గములనిర్మించుటవలనను విమానాదులవలననుగమనసౌకర్యము జేకూరును. ఇటులేయత్యు ష్ణప్రదేశములందును, కుజలవాయువులుగలచోట్లనుదగినయౌష ధసేవనంబునను, నధికశీతలప్రదేశములందుష్ణభోజనము నుష్ణవ స్త్రాదులమూలముననుగమనశ్రమము వినాశమొందును. సము ద్రములందు ధూమనౌకలవలన బ్రవాసప్రతిబంధకము దూర మగుచుండును. ఈశ్వరకృపవలన నాంగ్లేయదొరతనమువారి ప్రబంధముచేత సముద్రయాత్రాదులకు మంచియేర్పాటు గలి గియున్నవి. కాని

మూర్ఖస్యనాస్త్యౌషధం. భర్తృ. నీ.

మూర్ఖులమౌర్ఖ్యముబోగొట్టుటకెట్టియౌషధము లేదను నీవాక్యముననుసరించి సముద్రయాత్రవిషయమై యీదేశమం దలి మూర్ఖులజాతిబంధనములయొక్క నివృత్తికౌషధమేదియు లేకున్నది. ప్రస్తుతకాలమున బ్రవాసస్వాతంత్ర్యమును నాశన

ము జేయునవి జాతిబంధనములేవియైయున్నవి. ఏపురుషుఁడైన వి ద్యనభ్యసించు నిమిత్తముగాని లేక యేదైన వ్యాపారముకొర కుగాని సురూపమునందలి యాంగిలేయ దేశమునకుబోయి కొంతకాలమచటనివసించి మరలస్వగృహమునకు దిరిగివచ్చిన యెడల జాతివారతని బహిష్కారము జేయుచున్నారు. వారల నట్లు బహిష్కృతుల జేయుటకుగారణమేమని యెవరైననడిగి నచో భోజనప్రియులైన యీమహాబ్రాహ్మణపండితులు "ఆం గ్లేయదేశమున కేగి యీాయనమద్యమాంసముల సేవించియుం డవచ్చును. ఆంగ్లేయులు వండినయన్నమును దినియుండవచ్చు ను. మరియు శాస్త్రములందు సముద్రయానము నిషేధింపఁబ డియున్నది. కావున మేమితని జాతినుండిబహిష్కారము జేసి యున్నా" మని వచింపుచుందురు. నిష్పక్షపాతమైన నిష్కళం కమైన హృదయములనొప్పునో యార్యసోదరులారా! ఆలో చింపుడు! విదేశములకేగి యేనామనుజులు మద్యమాంసముల సేవించునది? ఈదేశమందు సేవించుటలేదో? నిక్కువమున కె వఁడు మద్యమాంసాదులయెడల నసహ్యముగలిగియుండునో యట్టివాఁడు స్వదేశంబునగాని పరదేశమునగాని వానిముట్టనైన ముట్టడు. వానియెడలనట్టియసహ్యములేని యతఁడువిదేశమందు మాత్రమేయుననేల?

ఈదేశమందుగూడ యథేచ్ఛముగ నారగించుచుండు

ను. బ్రాహ్మణాదివర్ణముల వారలనేకులీదేశమందే పూటకూ
లియిండ్లకేగి మాంసముదినుచుందురు. ఇంతయేల యవనవే
శ్యలదగ్గరకును, సురూపదేశపు గులటలవద్దకునుబోయి వారి
చేతియన్నము దినువారెందరో గలరు. ఊరక చేతియన్నము
మాత్రమేగాదు. వారెంగిలిజేసిన పదార్థములనయితము దిను
చున్నారు. కావున బరదేశమునకేగినంతమాత్రమున బాడగు
ననియు, స్వదేశమందున్నం బవిత్రుండై యుండుననియు దలంగ
చుటపొరబాటు. వివేకవంతుండగునతడు బరదేశమేగినను నిష్ట
ములేనిచో నాదేశవాసులయన్నము దినకయుండును. ఇం
దులకు మధ్యహిందూస్థానములోని మాలవదేశముయొక్క న
రసింహగఢాధీశులైన శ్రీమాన్ రాజాసాహెబ్ డి. సి. యల్
శ్రీప్రతాపసింహవర్మ మొదలగువారి నిదర్శనముగ దీసికొనవ
చ్చును. మద్యమాంసాద్యమేద్యపదార్థంబులను, దుష్కార్యప
రులు నతినీచులునైన చండాలురు వండుదానినిమాని బ్రా
హ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులందరు బరస్పరమొకరిచే
తియన్నము మరియొకరుభుజింపవచ్చుననియు నందువలన లేశ
మైనహానిలేదనియు శాస్త్రములందన్నపానములవిషయమై వ్య
వస్థయున్నట్లు బ్రతీతమగుచున్నది. శూద్రులు చేసినయన్నము
దినుట బ్రాహ్మణాదివర్ణములవారలకు శాస్త్రసమ్మతము.

ఆర్యాధిష్ఠితావాశూద్రాః సంస్కర్తారస్స్యుః

ఆప. ధ. సూ. ప్ర. 2. పట. 2. ఖం. 2.

ఆర్యులు భోజనమునకధిష్ఠాతలుగను, శూద్రులు భోజనమునండువారుగను నుండవలయునని యాపస్తంబధర్మసూత్రములందును,

జీవేత్ కారుకకర్మభిః. మను. అ. 10.

ద్విజులకు నుత్తమశుశ్రూష జేయుటవలన జీవనము గమనని యెడల దమకంటె దక్కువవారైన వర్ణసంకరాదులు జేయునట్టి వంటలులోనగువాని జేసిశూద్రులుజీవనము చేయవగునని మనుస్మృతియందును,

శతందాసీసహస్రాణాం యస్యనిత్యంమహానసే
పాత్రీహస్తందివారాత్రమతిథీన్ భోజయత్యుత.

భార. వి. అ. 18.

ఎవనిమహానసమందు వేలకొలఁదిదాసీలు రేయింబవలుఁను హస్తంబులఁ బాత్రములంబూని యతిథులకనేకులకు భోజనంబులనిడుచుందురో యట్టియుధిష్ఠిరమహారాజు నేఁడొకనికి సేవకుఁడయ్యెఁగదా యనిపాండవులు విరాటునిదగ్గరనున్నసమయంబున ద్రౌపది భీమునితో బలికినట్లు భారతమందును వ్రాయఁబడియున్నది. వీనివలన పూర్వకాలమున ద్విజులకువంటజేయునది శూద్రులేయైనట్లు వెల్లడియగుచున్నది. శ్రీకృష్ణుఁడు తుతుఁడనువాఁడొకఁడు వండినయన్నము బ్రాహ్మణులకుబెట్టించి తరువాతదానుగూడదినినట్లు భారతోద్యోగప

ర్వమందును, నాకుతుడు శూద్రుండు వైశ్యకన్యకవలన బుట్టి నవాఁడని మనుస్మృతియందును లిఖింపఁబడియున్నది. మరియు భారతములో

నిత్యంసంస్కృతమన్నంతువివిధం రాజ్యవేశ్మని.

భార. అను. ప. అ. 53.

చ్యవనుడనుఋషి భార్యాసమేతుఁడుగ కుశికరాజాంతఃపురమున సిద్ధముజేసినయన్నము దినుచు నటనివాసముండెనని యనుశాసనికపర్వమందును,

ప్రవిశ్యచగృహం రమ్యమాసనేనాభిపూజితః
పాద్యమాచమనీయంచ ప్రతిగృహ్యద్విజోత్తమః

భార. వ. అ. 27.

ఒకసమయమందు కౌశికుఁడనుఋషి యుపదేశమునిమిత్తము ధర్మవ్యాధుఁడను జాడాలుని గృహమునకేగ నతఁడాఋషికి అర్ఘ్యపాద్యంబుల నాతిథ్యసత్కారమొసంగ నాముని యతనిచేతి నీరుద్రావెనని వనపర్వమందును,

విప్రాణాంవేదవిదుషాం గృహస్థానాం యశస్వినాం
శుశ్రూషైవతుశూద్రస్య ధర్మోనైశ్రేయసఃపరః

మను. అ. 9.

పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావజం.

భగ. గీ. అ. 18.

ద్విజులకు సేవజేయుటయు, శుశ్రూషగావించుటయు శూద్రులకు బరమధర్మమని మనుస్మృతి భగవద్గీత మొదలగు గ్రంథములందును వ్రాయఁబడియున్నది, వంటకు సంబంధించిన పనులు జేయుట సేవజేయుటగాదా! స్నానము మొదలైనవాని జేయించుట సేవయు నన్నము జేసి భుజింపనిచ్చుట శత్రుత్వము నగునా? ఇంతియగాదు. వంటవండుట పౌరోగవులు, ఆంధసికులు నను పేరులుగల శూద్రులకంటె దక్కువవారైన వర్ణసంకరుల యొక్క పనియు నుత్తమములైన సాధారణశుశ్రూషల సేయుట శూద్రులపనియునై యున్నది. పైనవ్రాసిన మన్వాది ప్రమాణములననుసరించి శూద్రులు వంటవండి ద్విజులకు బెట్టుట చేహానియొంత మాత్రము లేదని విదితమగుచున్నది. మూర్ఖులగు వారందరు శూద్రులనియే మామతముగావున నట్టివారలు సకలకార్యంబులఁ జేయవచ్చును. అందువలన భోజనాదివ్యవహారంబులు యథోచితరీతి నడచుచుండును. పూర్వకాలమందు అంత్యజులు జేసినదానిగూడ నందరుదినుచుండినట్లు రామాయణమువలన దెలియుచున్నది చూడుడు.

పాద్యమాచమనీయంచ సర్వంప్రాదాద్యథావిధి
తాముహాచతతోరామః శ్రమణీంధర్మసంస్థితాం.

వా. రా. అరణ్య. స. 74.

శబరి దెచ్చియిచ్చిననీటితో రాముఁడాచమనము గావించెను. మఱియు

"రాఘవః ప్రాహవిజ్ఞాసేతాం నిత్యమబహిష్కృతాం" అను శ్లోకార్థమందు టీకాకారుఁడు

"తద్దత్తమాహారాదిఅంగీకృత్యేతి"

అనగా మతంగాదిమహాత్ములందరు శబరిచేతియాహార మునుదినుచుండినటుల వ్రాసియున్నాఁడు.

జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తియతస్తతః

ఆకాశమివపంకేన నసపాపేనలిప్యతే. మను. అ. 10

బురదయందాకాశముండినప్పటికి నది మలీనముగాని వలెనే నాపత్కాలమందు బ్రాహ్మణుఁడు దనయిష్టమువచ్చి నవారిచేతియన్నము దినినను నట్టివానికి లేశమాత్రమైన దోష ముగలుగనేరదు. ఈరీతి మనువుమొదలగు ధర్మశాస్త్రకారు లందరు బ్రాహ్మణులు సమస్తమైనవారిచేతి యన్నమును దిన వచ్చునని యాజ్ఞాపించియుండ నే బ్రాహ్మణుఁడైన నాపద్ధసంభ వించి విద్యనభ్యసించు నిమిత్తము ఇంగ్లేయు దేశమునకు బోయి యేశాఖభక్తుకభోజనశాలయందో భుజించినయెడల మనుస్మృ తిసిద్ధాంతముప్రకారమట్టివాఁడు దోషభాగియెంతమాత్రముగా నేరఁడు. సాధ్యమైనంతవరకు నీచులు మలీనులునైన చండాల యవనాదులు వండినయన్నముదినకుండుట మాకునుసమ్మత మే. కాని ప్రస్తుతకాలమున బ్రాహ్మణాదివర్ణములవారల భో జనవ్యవస్థమిగుల విపరీతముగనున్నది. ఎట్లనఁగా గాన్యకుబ్జులు,

మైథిలులు, బంగాలీలు, సారస్వతులు, కాశ్మీరులు మొదలగు పేరులంబరగు బ్రాహ్మణులు మాంసముదినుచుందురు. గౌడులు, పంచద్రావిడులు మొదలగువారు మాంసముఁదినరు. సారస్వతులు ఖాత్రీలుచేసిన పచ్చిరొట్టెనదినరు. గౌడులు మిఠాయియంగళ్ళలో బక్ష్యముజేయబడు రొట్టెదినుచున్నారు. వ్యాకుబ్జులు పంచద్రావిడులు మొదలగువారలంగడివాండ్రుజేసిన బర్ఫీ, పేడాలోనగు నీరుగలయక నేతితో బక్ష్యముజేయబడు పదార్థములదెచ్చికొని తినుచుందురు. ఇఁక కాశ్మీరబ్రాహ్మణులనిన నాహారపదార్థముల నాలుగుడ్డలోఁజుట్టబెట్టి దానిమహమ్మదీయులచే మోయించికొనిపోయి తినుచుందురు. కాశ్మీరబ్రాహ్మణులలో వంటయింటిపట్టింపులు మొదలులేనేలేవు. మహమ్మదీయులువండుకొనినప్రొయ్యిమీఁద నట్లేవీరుగూడవండుకొనుచుందురు. వీరలయిండ్లయందు నీరు మొదలగువానిని దెచ్చు నౌకరులుమహమ్మదీయులే. దాక్షిణాత్యులలోననేకులు గోమటియంగడినుండి వండినపదార్థములదెచ్చికొని తినుచుందురు. ఆసేతుహిమాలయముపర్యంతముగల బ్రాహ్మణులాంగ్లేయుల యౌషధముల ద్రావుచున్నారుగదా. వానిలో నింగ్లీషువారలంటుకొనిననీరులేదా? మాలమాదిగలచేయంత్రశాలలందు సిద్ధముచేయఁబడు బెల్లము, పంచదార మొదలగువాని నందరుదినుచుందురు. కాని కొన్నిసంప్రదాయములవారియందెట్టి

లీలలు గాననగుచున్న వృాచూనుడు. ప్రాయ్యలోఁ బెట్టికొను గట్టెల నీటితోఁగడిగి వంటయింటవేసికొనుచుండువారలు గొం దరుగలరు. అట్టివారు మాలమాదిగలచే జేయబడుబెల్లము, పంచదార లోనగువాని నీటితోఁగడుగక నే యుపయోగించు కొనుచుందురు. యంత్రశాలలందు మాలమాదిగలొక్కొక్క పర్యాయము రొట్టెల బెల్లపురసములోముంచి చేసికొనుచుం దురు. ఒక్కొక్కసమయమున రొట్టెలదినుచుండ నోటినుండి జారిపడుముక్కలా బెల్లపురసములో బడుచుండును. అట్లపవి త్రములగుచుండు గుడశర్కరల గడుగకయేయింటబెట్టుకొనవ చ్చును. మూర్ఖతాకారణంబున నీదేశమందనేక సంప్రదాయ ములు బయలువెడలుటం జేసి భోజనవిషయమైయున్న తారు మా రులు సంప్రాప్తములైయున్నవి. వీని కెక్కడను నంత మే లేదు. ఒకయింటిలో స్త్రీ వల్లభసంప్రదాయుల శిష్యురాలై యుండు ను. ఆమెమగఁడు రామానుజమతస్థుఁడై యుండును. వారిద్దరు భార్యాభర్తలయ్యు నొకరిచేతియన్నము మరియొకరుదినరు. ఇది మూర్ఖతగాకపోయిన మరేమికాఁగలదు? కావున మద్య మాంసాద్యభక్ష్యపదార్థముల వదలిమాలిన్యముగలిగియుండు మ్లేచ్ఛ చండాలాదులచే వండబడు నన్నము విడచి యార్యులంద రు బరస్పరమొకరిచేతియన్నము మరియొకరు దినుటవలన లవ మాత్రమైనహాని లేదు. ఇంతియకాక యవనాదులందరు క్షత్రి

యులనియు, సర్వకర్మముల బరిత్యజించి బ్రాహ్మణులదర్శింపక పోవుటవలన శూద్రభావముబొందిరనియు మనుస్మృతిలోని 10 వ యధ్యాయమందలి 43, 44 శ్లోకములవలన విదితమగు చున్నది. ఇందువలన వీరలువిరుగ సత్క్రియలొనరించుటవలనను విద్వాంసులదర్శించుటవలనను మరల క్షత్రియులగుదురు గదా! అట్లుగానియెడల 11 వ యధ్యాయములోని 191 వ శ్లోకమునకనుసరించిమూడుకృచ్ఛ్రవ్రతములు జేయించి యుపనయనము గావించుటవలన వీరందరుద్విజులగుదురు. మనుస్మృతి యొక్క సిద్ధాంతముననుసరించి వీరలువండినయన్నము దినుట చేత ననాచారముగాని దోషముగాని గాజాలదు. మరియు గల్పితములైన యేస్మృతుల నాధారములుగదీసికొని సముద్రయానము బనికిరాదనుచున్నారో యాస్మృతులయందు యంగ, వంగ, కళింగ, సింధు, సౌరాష్ట్రాదిదేశములకుగూడ బోగూడదని వ్రాయబడియున్నది. అట్లుండినను మనమచటికిబోవుట లేదా? అచటిబ్రాహ్మణులబ్రాహ్మణులుగనెంచుట లేదా? సముద్రయాత్రమాత్రమేల పనికిరాకపోయెను? చూడంజూడ నిట్టివిపరీత వార్తాసమేతములైనస్మృతులన్నియు మహమ్మదీయులకాలమందు రచింపబడినట్లుస్పష్టమగుచున్నది. ఆకాలమునందుయవనులత్యాచారంబుల గావించియుందురు.అందువలన బండితులగువారలచటికి బోగూడదనియు నిచటికిబోగూడదనియు

వ్రాసియుందురు. నిజమునకు సముద్రయాత్రవిషయమైననిషేధ ములేదు. వేదమందు సముద్రయాత్ర జేయవలయునని యాజ్ఞా పింపఁబడియున్నది.

సముద్రంగచ్ఛస్వాహా. యజు. అ. 6.

సముద్రయాత్ర జేయుము, సుందరవచనంబులనాడుమని యజుర్వేదమందును, శతపథమందలి మూఁడవకాండమందు ను లిఖింపఁబడియున్నది.

సముద్రయానకుశలా దేశకాలార్థదర్శినః
స్థాపయంతితుయాం వృద్ధింసాతత్రాధిగమంప్రతి.
మను. అ. 8.

నావ మొదలగు సముద్రయానంబుల నడపించుటయం దు గుశలుఁడును దేశకాలంబుల, లాభాలాభంబుల నెఱిఁగియుండు వాఁడును- అనగా నేసమయమందేదేశమునకుసముద్రమువీఁ దబోయిన నెంతధనములభించునో యెరిగియుండువాఁడును-నగు మనుజుఁడు నిర్ణయము జేయుసుంకమునంగీకరించి దానిని రాజు నియతము జేయవలయునని మనుస్మృతియందు వ్రాయబడి యున్నందున దీనినుండియు సముద్రయాత్ర జేయనగునని స్పష్ట మగుచున్నది. కేవలమిట్లు సముద్రయాత్ర జేయవలయునని వ్రాయబడియుండుట మాత్రమేగాదు. ప్రాచీనమందార్యులు సముద్రయాత్రచేసిన నట్లనేకచోట్లగలదు.

ఆమ్లేచ్ఛావధికాన్ సర్వాన్ సభుంక్తేరిపుమర్దనః
రత్నాకరసముద్రాంతాం శ్చాతుర్వర్ణ్యజనావృతాన్
భార. ఆది. అర. 68.

ఎంతవరకుమ్లేచ్ఛులు వాసముచేయుచుండిరో, యెంత వరకు బ్రాహ్మణాదులుగాపురముండుచువచ్చిరో యంతపర్యంతముగల సముద్రమందలి దీవులన్నిటిపై దుష్యంతుఁడు రాజ్యమొనరించెను.

స తు వాజీసముద్రాంతాం పర్యేత్యవసుధామిమాం.
అశ్వమే. ప. అ. 81.

సముద్రముయొక్క యంతమువరకు యుధిష్ఠిరునశ్వము ప్రయాణమొనరించెను.

వణిగ్యథా సముద్రాద్వైయథార్థం లభతేధనం.
భార. శాం. అ. 299.

మహాభారతకాలమువరకు వణిజులు సముద్రయాత్రవలన ధనమునుపార్జించుచుండిరి. ఇటులే యనేకగ్రంథములలో వ్రాయఁబడియున్నది. మరియు,

మనోనివిష్టమను సంవిశస్వయత్రభూమేర్జుష సేవతత్రగచ్ఛ-
అథర్వ. కాం. 18. అను. ౪. వ 13.

మనుజుఁడా! నీకెచటికిఁబోవలయునని యభిలాషయుండునో యచటికిఁనెల్లఁబొమ్ము. ఈపృథివియంతయు నీవునివాసము

జేయుటకొరకేర్పడియున్నదని యీశ్వరుఁడాజ్ఞాపించియున్నాఁడు. కలియుగమునకు బ్రమాణమనుకొనునట్టి పారాశరస్మృతియందునుజూడుడు.

వసన్యాయత్రతత్రాపి స్వాచారం నవివర్జయేత్.
బృహత్పారాశరస్మృతి. అ. 1.

బ్రాహ్మణుఁడేదేశమున నుండనెంచిన నాదేశముననుండవచ్చును. కాని తనయాచారము బాడుజేసికొనగూడదు. పరదేశయాత్రవలదనువారందరు గూపస్థమండూకంబులేయైయుందురు. ఈకూపమండూకములు వచించుదానినే నమ్ముకొని యాంగ్లేయదేశమునకుపోవక యూరక కూరుచున్నయెడల జనులు సివిల్‌సర్వీస్, బారిస్టర్, డాక్టర్, ఇంజనీర్ మొదలగు నుత్తమపదములనెట్లుబొందగలుగుదురు?

విద్యావిత్తంశిల్పం తావన్నాప్నోతిమానవః సమ్యక్
యావద్ర్వజతి నభూమౌదేశాద్దేశాంతరం హృష్టః
పంచ. 1.

ఎంతపర్యంతము మనుజులుత్సాహపూర్వకముగ నొకదేశమునుండి మరియొకదేశమునకు బోవకయుందురో యంతపర్యంతము విద్యాధనశిల్పములలో నుత్తమరీతి నభివృద్ధిబొందఁజాలరు. ఈశ్వరకృపవలన నేడు బుద్ధిమంతులగువారలనేకులీకూపమండూకములాడు వాక్యముల బ్రమతాలాపంబులుగ గ

ణించి పరదేశములకేగుచున్నారు. ఇట్టులేముందునుబోవుచుం దురు. ఏదైన హితమని తెలిసినతరువాత దానివిషయమై యె ట్టిప్రతిబంధకములు లేకుండెనేని నట్టిదాని నవలంబింప మను జుఁడు నడుముగట్టుటయగాక సాధ్యమైనంతవరకు దానినుండి ఫలముగూడనొందును. ఇది మనుజులకు స్వాభావికమైనట్లు ప్ర తీతమగుచున్నది. ఒకదారి వెంట బహుగురుమనుజులొకరితరువా త నొకరుగనడచిపోవుచుందురనుకొనుము. ఆతరుణమునందంద రికంటె ముందునడుచునతఁడు నడక గొంచెముమందము జేసిన యెడల వెనుకనడచువారతని నించుక హెచ్చరిక సేయుదురు. దాని గమనించి యతఁడు త్వరితముగనడిచినయెడల నందరుగ లసియే ప్రయాణమునుబూర్తి జేసికొన గలుగుదురు. కాని ముందునడచునతఁడు వెనుకవచ్చువారిమాటల లక్ష్యముసేయ క యాలస్యముగనడచినగాని లేక మార్గమధ్యమున గూరుచు న్నగాని తత్క్షణమందవానివిడచి వెనుకవారలుముందుబోవుదు రు. అదివరకు ముందునడచునతఁడు వెనుకనేపడియుండును వర్తమానకాలమందలి బ్రాహ్మణులదశయిట్టిదియేయైయున్న ది. బ్రాహ్మణులు చెప్పినట్లుదక్షిణమూఁడువర్ణములవారలు ను వీరలననుసరించినడచుచుందురు. ఈమూఁడువర్ణములవా రు దేశోన్నతినభిలషించి తమ పురోగాముల బరదేశములకేగు డనియు, దమకుగూడనట్లుబోవుట కనుమతినొసంగుఁడనియు

వేసుకొన నవిద్యాజాలమున మునిఁగియున్న కారణమున బ్రాహ్మణులు వారి దిరస్కరించి పరదేశముల కెవరుబోఁగూడదనిరి. అంత నవశిక్షితులైనజనులు వీరివాక్యముల బాటింపక విదేశముల కేగుట మొదలిడి యీవిద్యాగంధములేనిబ్రాహ్మల వెనుకఁబడవైచిరి. ఇట్టివ్యవస్థకలుగుటవీక్షించి కొందరు పాపమున సముద్రయాత్రచే దోషములేదనదొరకొనిరి. వివేకవంతులగు శాస్త్రవేత్తలుగొందరు సముద్రయాత్రశాస్త్రానుసారము నిర్దోషమని రూఢిపరచియున్నారు. కాని భోజనప్రియులైన శాస్త్రిమండలివారుమాత్రము నేటికిని నీవిషయమై నమ్ముటలేదు. ఏకారణముచేతనైననేమి వీరలునమ్మకుండిన నమ్మకుందురుగాక. వీరిబిడ్డలుమాత్రము నమ్మవలసివచ్చును.

మనుజునకు గమనస్వాతంత్ర్యమెట్లవసరమో యటులే వాక్స్వాతంత్ర్యము, లేఖాస్వాతంత్ర్యములుగూడ నవసరములైయున్నవి. ఈరెండుప్రకారంబులగు స్వాతంత్ర్యములులేనియెడల మనుష్యులేదైన మాటలాడుటకుగాని యేదైనగ్రొత్తగ్రంథము వ్రాయుటకుగాని యధికారముగలిగియుండరు. ఆంగ్లేయరాజ్యమందీ రెండుస్వాతంత్ర్యములు గొంతవరకు గలిగియున్నవి. వీనియెడలగల ప్రతిబంధములింకనుదక్కువగుగాక.

పూర్వోక్తస్వాతంత్ర్యములవలెనే మనుజునకు ధర్మస్వాతంత్ర్యముగూడ బరమావశ్యకము. భారతయుద్ధానంతర

మన్యధర్మమునవలంబించి యుంకువారలు భారతీయులయొక్క ధర్మస్వాతంత్ర్యమును సర్వవిధముల నాశనముగావించియుండిరి. ఈవిషయమై యితిహాసవేత్తలందరు దెలిసియేయున్నారు. అన్యమతమునవలంబించినట్టియు నన్యాయకారులునునైన రాజులకాలములందే హైందవార్యులు తమధర్మస్వాతంత్ర్యమువిడనాడక నిలిచియుండిరో యట్టివారల నాయితరమతస్థులు మొగములపై నుమిసియు, జందెములద్రెంపియు, గృహములనాశనము జేసి దోచుకొనియు నిట్లేనానావిధములైనబాధలబెట్టి, వారిస్త్రీలను జెరపట్టుకొని పోవుచువచ్చిరి. హిందువులయెడల నిట్టిక్రూరకర్మముల గావించుటయుగాక తుదకువారి ప్రాణములసయితము దీసియుండిరి. ఒక్కపర్యాయమేగాదు, ఈదేశవాసులకిట్టిదశ న్యాయహీనులైనరాజులచే ననేకపర్యాయములు సంభవించియున్నది. ఆర్యధర్మమును ద్వేషించునట్టి దోపిడిగాండ్రు జెలరేగి చెంతనున్న నొకగ్రామమునుద్రోచిరను వార్తచెవినిబడినతోడనే యాప్రాంతగ్రామములందలి జనులు తమతమగృహములయొక్క ద్వారములబిగించుకొని తాము లోపలనేయుండుచువచ్చిరి. అంతనాదోపిడిజేయు దురాచారులేతెంచి పైనవచించినవిధమున భంగపరచి చేతజిక్కినంత గొల్లగొని వెడలిపోవుచుండిరి. హిందువులటుతర్వాత ద్వారములదెరచికొని వారివారికార్యముల బ్రవృత్తులగుచువచ్చిరి. మొ

చలుమొదలు హిందువులు యవనుల నెదిరించియుండవచ్చును గాని కాలక్రమమున మూర్ఖత్వమెక్కుడుగా ధైర్యమెల్లఁ గోల్పోయి పుంస్త్వహీనులై యవనులు బెట్టినబాధలనెల్ల ననుభవించుచు వచ్చిరిగాని యొక్కపర్యాయమైన యథావిధి వారి నెదిరించి పోరాడియుండిన పాపమునఁబోరైరి. ఎదురించుమాట యటులుండనిండు! ఆయన్యాయకార్యములు గావించు నత్యాచారములనుండి తప్పించుకొనియుండుటకు దగినమంచికట్టుదిట్టములనైన జేసికొనఁగలిగిరా? దోపిడిగాండ్రుడువచ్చి వారియిష్టమువచ్చినట్లు గ్రామములంగొల్లగొని యెవరిదారినివారు బోయినతరువాత నప్పటియన్యాయములవలనను, నత్యాచారంబులవలనను గలిగిన ఘోరదుఃఖములనుండి విముక్తినొందియుండుటకని జనులకుబోధించి, మూర్తీభవించినయవిద్యారూపులు, ధర్మాంబురూపుమాపుపోవులు గోముఖములందు జేతులనైచికొని

తాడయ తాడయ మారయ మారయ

అనిశాంతిజపముల నొనరించుచువచ్చిరి. కానిలాటిప్రేటులతోనగు గార్యము నోటిమాటలతో నెట్లుగాఁగలుగును? వీరిట్లు గోముఖములో జేతులనైచికొని జపములు జేయుచుండిన ను దోపిడిగాండ్రు ప్రతిపర్యాయము గ్రామములపై దండెత్తి ధర్మనాశనముగావించి పోవుచునేయుండిరి. ఈయత్యాచారంబులవీక్షించి శూరులైన క్షత్రియులుగొందరు వారలతో యు

ద్ధములఁజేసి యోడించి తరుమఁగొట్టియుండిరిగాని యైకమత్యము లేనికారణమున దరువాత బాగుపడుటకుదగిన మార్గములఁజేసి కొనఁజాలకపోయిరి. శ్రద్ధాళురు సమాయికులునైన క్షత్రియు లనేకులు యుద్ధముజేసి దోపిడిగాండ్రు దరిమినైచెదమనివచిం పమూర్ఖబ్రాహ్మణులు గొందరుదాముజపపురశ్చరణంబుల స లుపుచుంటిమనియు నందువలన మ్లేచ్ఛులు చెల్లా చెదరై పోవు దురనియు జెప్పుచువచ్చిరి. ఇట్టిమాటలనాలకించి క్షత్రియు లువానియెడల విశ్వాసముగలవారలై యూరకయుండుచువ చ్చినందునగలిగిన ఫలమిపుడందరకు విదితమైయేయున్నదిగ దా! వారలయీప్రమాదమువలనగలిగిన ఫలముగలకాల మనుభవించు చుండకపోయినను విస్తారకాలము వరకైన ననుభవింపక తప్పించుకొనవలనలేదు మనదేశవాసు లైన బ్రాహ్మణులిట్టి వాక్యములనమ్ముటవలన నిట్టియనిష్టము లైనఫలంబుల ననుభవించుచుండియు నీయంత్రతంత్రమంత్రా ది మిథ్యావాక్యములయెడల నేటికిని వీరికివిశ్వాసము దూరము గాకయున్నది. వివేకవంతులెవరైన నీయంత్రతంత్రాదిలీలల న్నియు మిథ్యలనిగుర్తెరిఁగి వానినమ్మనియెడల నట్టివారినిప్పటి బ్రాహ్మణులు నాస్తికులని నిందించుచు గులమునుండి వెలివై చెదమని బెదరించుచుందురు. ఇందులకుగారణము విద్యలేమి యు, స్వార్థపరత్వమునై యున్నది. కావున దేశమునుండి

యిట్టియవిద్యను రూపుమాపుటకై పరమేశ్వరుబేడుకొను టయగాక జనులతోడగూడ నివేదనము జేసికొనుచున్నా రము. అందువలన దేశోన్నతిగలుగ సౌఖ్యము జేకూరును. ధ ర్మస్వాతంత్ర్యమునకు విరోధులితర దేశములలో గూడగలరు. యురూపఖండమునందలి పోపులు ధర్మస్వాతంత్ర్యమునకు గొం తవరకు విరోధులైనట్లు దానియితిహాసములజూచినవారికి విది తముగావచ్చును. కాని యవనులనినధర్మస్వాతంత్ర్య విరోధు లలో నగ్రగణ్యులనుటకు సందియములేదు. మరియు గొందరు బ్రాహ్మణులుగూడ ధర్మస్వాతంత్ర్యమునకు విరోధులై యుండిరి యవనులువారికాలములో గురానుమతమును స్వీకరించని వేల కొలది మనుష్యులనేప్రకారముజంపియుండిరో యటులేకొంద రు వేష్యాలసమయములలో నాకస్మికముగ వేదమంత్రమేశూ ద్రునిచెవిలోనైన బడుటసంభవించెనేని భోజనభట్టులట్టివానిం బట్టి యత్యంతముగ హింసింపుచువచ్చిరి. కాని యవనులంత నిక్కుటముగ హింసువులే ప్రాణినిగాని హింసించియుండలేదు. ప్రస్తుతమందుసయితము వీరికితరుల హింసింపవలయునను బు ద్ధిలేదు. విద్యలేనికారణంబున హిందువులు ధర్మస్వాతంత్ర్య మునకు విరోధములైనకార్యంబుల జేయ బాల్పడుచున్నారు. ఇటులుండుట మనుష్యత్వమునకు విరుద్ధమైయున్నది. ఏధ ర్మాభాసము కారణమున ననేకప్రాణులకు హింసగలుగుచుం-

దునో, దేనిమూలమున మనుష్యసమాజమందు విద్వేషము వెచ్చుపెరుగునో, దేనివలన దయ యనుమాట యటులుండ మీఁద మిక్కిలి హింసనే ధర్మముగ గణింపవలసివచ్చునో, దేనివలన మానవుఁడు బరతంత్రుఁడగునో, దేనిమూలమున స్త్రీలమీఁదను, నింకను ననేకప్రాణులమీఁదను నత్యాచారములసలుపవలసివచ్చునో, దేనివలన బదార్థవిద్యయు, బ్రహ్మవిద్యయు బ్రచారములుగాక మనుజులయొక్క గుణకర్మస్వభావములు భ్రష్టములగునో, దేనివలన న్యాయమురూపుమాసి యన్యాయమువిజృంభించునో, దేనివలన మానవోన్నతియు దేశోన్నతియు గాక జనులుభయలోకభ్రష్టులగుట సంభవించునో యట్టిదానిని బుద్ధిమంతులు ధర్మమనివచింపసాహసింతురా? ఇట్టిధర్మములనుపేర బ్రచారములైయున్న యధర్మజాలములందు దగులుకొనినకారణముననే వేలకొలఁది మనుజులుకాశిపాలయిపోయిరి. వేలకొలదిమనుష్యులు హిమాలయప్రాంతములబ్రాణత్యాగముగావించిరి. వేలకొలదిమానవులు పదునైనఖడ్గంబులకు బలియొసంగఁబడిరి. లెక్కలేనిగృహములు కొల్లగొట్టఁబడినవి. వేలకొలఁది స్త్రీలపాతివ్రత్యము భ్రష్టముగావింపఁబడియె. ప్రస్తుతకాలమందు సయితము వేలకొలఁది మనుష్యులు ధర్మవ్యాజమున గొల్లగొనబడుచున్నారు. కావున దమజన్మమును సఫలముగావించుకొనుటకుమిత్తము తనమనధనం

ములతో సదార్యవైదిక ధర్మమును బాలించుటసమస్తమా నవులకు నుచితమైయున్నది. సత్యధర్మమును నిర్ణయించుకొను నిమిత్తము మనుష్యులు హఠ, దురాగ్రహ, పక్షపాతధర్మ తాభిమాన, ఛల, కపట, దంభ, పాఖండాది దుర్గుణంబుల బరిత్యజించి న్యాయశీలురు, విద్వాంసులు, పరీక్షకులు, సరళస్వభావులునై విద్యార్థులరీతి ధర్మజిజ్ఞాసగలిగి దానిబరీక్షించుకొనవలయును. ప్రత్యక్షాది ప్రమాణముల ననుసరించి ధర్మంబును బరీక్షించికొను టుచితమని ప్రపంచమందలి ధర్మావలంబు లనేకులు వచింపుచుందురు మన యపౌరుషేయగ్రంథమున వ్రాయబడియున్నదంతయు సత్యధర్మ బగు కారణంబున దానిస్వీకరింపవచ్చును. ఆర్యులునప్ప దక్కిన ధర్మాభాసాభిమానుల యందరిలీలయొక్కటియే ఎల్లనగా ధర్మమువిషయమునగుతర్కముగావింపగూడదట. "విశ్వాసఃఫలదాయకః" అనగా విశ్వాసమే ఫలమునొసంగునని యుంచుటుంజేసి గురువుయొక్కయు శాస్త్రముయొక్కయు వచనములయెడల సందేహింపగూడదనియు నట్లుసందేహించినచో బాపముగలుగుననియు ప్రస్తుతమందలిధర్మాభిమానులు వచించుచుందురు. ఈయన్యదేశీయధర్మాభిమానులయొక్క ధర్మమునంచట్టి తికమకలుండియున్నవో యటులే హిందువులలోగూడగలవు. ఇతరమతస్థుల ధర్మగురువులెట్లుధర్మమును పేర ధనహార

ణార్థమనేకలీలల గల్పించియున్నారో యందులకనేకగుణములె క్కువగ హిందూధర్మగురువులు ధర్మవ్యాజమున లీలల రచి యించి యితరులధనము హరించుచున్నారు. ఇందువలన శి ష్యులకు గురువులకు నిరువురకుగూడ మహాహానిగలుగుచున్న ది. ఇట్టిలీలలనుండి జనులెల్లరుదప్పించికొనియుండుటముఖ్యము. వర్తమానకాలంబున నవ్యమతస్థులు ధర్మమునుబరీక్షించుకొ నుటకొరకు ప్రత్యక్షాది ప్రమాణములయొక్క యావశ్యకతలే దని వచించుచున్నటుల హిందువులుగూడ చెప్పుచుందురు. ఈ హైందవార్యులయొక్క ప్రాచీనులనిననో ప్రత్యక్షాదిప్రమాణ ములతోడనే నిర్ణయము జేసికొనవలయునని వ్రాసియున్నారు. ఆర్యసంతతులకిది గౌరవదాయకంబును నానందమునుంగూర్చు విషయమునునై యున్నది. ఆర్యులయొక్క పూర్వీకులు సమస్త దుష్కర్మములనుండియుఁ బైనవచించిన ధనాపహారణలీలల నుండియు దూరగులై

ప్రత్యక్షంచానుమానంచ శాస్త్రంచవివిధాగమం
త్రయంసువిదితం కార్యంధర్మశుద్ధిమభీప్సతా. మను.అ.12

స్వర్ణకారుఁడెవిధమున బంగారమును రాతిమీదరాది గాని లేక కరగించిగాని పరీక్షసేయునో యటులే ప్రత్యక్షాది ప్రమాణములవలన ధర్మమునుబరీక్షించికొని సత్యధర్మమునే స్వీకరించుట సమస్తమానవులకు ముఖ్యకర్తవ్యంబని యుపదే

శముగావించియున్నారు. కాని "బాబావాక్యంప్రమాణం" అనఁగా దండ్రిచెప్పినదే ప్రమాణమని వారెన్నఁడువచించియుండలేదు. గౌతమ, కణాదాదిప్రాచీనులు పృథివి మొదలుకొని పరమాత్మపర్యంతము గల సమస్తమైనవానిలక్షణంబులఁబరిశీలించి

లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిః.

ఏయది లక్షణములవలనను బ్రత్యక్షాదిప్రమాణముల వలనను సిద్ధమగునో దానినేనమ్మఁడని యుపదేశించిరి. ఇంతియే కాదు.

అపిపౌరుషమాదేయం శాస్త్రంచేద్యుక్తిశోధకం
అన్యర్షమపిత్యాజ్యం భావ్యంన్యాయైకసేవినా.
యుక్తియుక్తముపాదేయం వచనంబాలకాదపి
అన్యత్తృణమివత్యాజ్యమ ప్యుక్తంపరమేష్టినా.

ఏమనుజునియొక్క యేశాస్త్రముయొక్క వచనమైనను యుక్తియుక్తముగనున్నచో దానినవశ్యముగ గ్రహింపవలయుననియు, యుక్తికివిరుద్ధమైన వాక్యమును ఋషిచెప్పినను నార్షగ్రంథమందుండినను నమ్మగూడదనియు, బాలుఁడైనను యథార్థమగుసంగతి చెప్పినచో దానిస్వీకరింపవచ్చును గాని యుక్తిశూన్యమైనదాని బ్రహ్మచెప్పినను విశ్వసింపవలదనియు బూర్వీకులుపదేశము జేయుచువచ్చిరి ప్రస్తుతకాలమందమాయకులనేకులు దమ పితాపితామహాదులెట్లువర్తించియుండిరో

యుంటులే తాముగూడనుండవలయునని యనుచున్నారు. ఇది వారలకేవిధమునజూచినను బ్రమాదమే. ఏలయన పితాపితామహాదులు వామమార్గమతస్థులై పరస్త్రీగమనంబును, మద్యమాంసాదిసేవనంబును మోక్షప్రాప్తికిసాధనములని నమ్మియుండినచో వారిసంతానములు సయితమట్టి యత్యాచారంబులొనరింపవలసియుండునా? ఇది యెట్లున్నదన

తాతస్య కూపోఽయమితి బ్రువాణాః
క్షారంజలం కాపురుషాః పిబంతి. పంచ. 1.

గంగాజలమునైన బరిత్యజించి తనతండ్రి త్రవ్వించిన బావియనునభిమానంబున నందలియుప్పునీటిని ద్రాగుమూర్ఖునికార్యముంబోలియున్నది. విజ్ఞులిట్టి కార్యంబులనొనరింప దగవగునా? మనపూర్వీకుల సిద్ధాంతమనాదినుండియు నొకటియే.

అంత్యాదపిపరంధర్మం.

నీచుఁడైన చండాలుఁడుగానిండు! మ్లేచ్ఛుఁడుగానిండు! వానిదగ్గరసత్యధర్మముండినయెడల దానినవశ్యముగ గ్రహింపవలయును. సమస్తమతములవారలు దమతమమతములమాత్రమే సత్యమైనదనియు దక్కినవన్నియు మిథ్యలనియు వచింపుచుందురు. కాని యదిసరిగాదు. ప్రత్యక్షాదిప్రమాణములు, యుక్తి, తర్కము, లక్షణము, ఈశ్వరగుణకర్మస్వభావములు, సృష్టిక్రమము, విద్య, బుద్ధి, న్యాయము, విచారము మొదల

గుదానితో బరీక్షించుకొనిన నెయ్యదిసత్యధర్మముగ నిలచు నో యట్టిదానినే స్వీకరించుటయోగ్యము. మరియు సత్యధర్మముయొక్క లక్షణమెట్టిదన

యతోభ్యుదయనిః శ్రేయససిద్ధిఃసధర్మః.

వై శే. అ. 1. ఆ. 1.

దేనివలన మానవునకీయిహలోకమందున్నతి గలుగునో దేనివలన బరలోకసంబంధములైన యతీంద్రియసౌఖ్యములు సిద్ధించునో యనఁగా దేనిమూలమున లౌకికసౌఖ్యములతో బాటుమోక్షప్రాప్తిచేకూరునో యదియేసత్యధర్మము. కావున ప్రపంచమునకు హానికారకములైన కుకర్మంబుల బరిత్యజించిదేనివలన జగత్తున కుపకారముగలుగునో దేనివలనమనుజులకున్నతి కలిగి యుభయలోకంబులదరింప గలుగుదురో యట్టియుత్తమధర్మమునే యవలంబింపవలయును.

సంగచ్ఛధ్వం సంవదధ్వమ్ సంవ్రోమనాంసిజానతాం.

ఋ. అ. 8. అ. 8. వ. 49.

మనుజుఁడా! నీవుసమస్తపదార్థములగూర్చియుత్తమరీతి జ్ఞానముంబొందుము. సమస్తదేశదేశాంతరములకేగి విద్యావ్యాపారంబుల నభివృద్ధిబరచుము. సకలపదార్థములనుపార్జింపుము. ఉభయలోకంబులంనుగూడ మేలొనగూనుమార్గమెయ్యదిగలదో దాని నవలంబింపుము. కుమార్గమును బూనకు

మని యీశ్వరుఁ డాజ్ఞాపించియున్నాఁడు. సకలజనులతో ఛల కపటపాఖండరహితంబును, సత్యము, సౌఖ్యదము, హితకరము, మితము, మిష్టము, శుద్ధమునైన సంభాషణము జేయుచు రాగ ద్వేష వైరదంభాహంకార మదమాత్సర్యకామక్రోధాద్యవి ద్యాపరివారమును మనసునుండి తొలగించికొని

సర్వభూతాన్యపీడయన్. మను. అ. 4.

ఏప్రాణికిగాని దుఃఖముగలిగింపక,

మైత్రీకరుణాముదితోపేక్షాణాం

సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం

భావనాతశ్చిత్తప్రసాదనం. యోగ. పా. 1.

సౌఖ్యవంతులగు బురుషులవీక్షించి యీర్ష్యనొందక వారితోడస్నేహముచేయుచు, దుఃఖితులయెడల గరుణవహించి, పుణ్యాత్ములగాంచి ప్రసన్నతగలిగి పుణ్యములఁజేయుచు బాపాత్ములయెడ నుపేక్షబూని వారలొనరించు బాపములపై నసహ్యమూని యట్టికార్యములనుండి దూరగులైయుండవలయును. మరియు

యత్ కర్మకుర్వతోస్యస్యాత్ పరితోషోంతరాత్మనః
తత్ ప్రయత్నేనకుర్వీత విపరీతంతువర్జయేత్,

మను. అ. 4.

ఏకార్యము జేయుటవలన నంతరాత్మ సంతోషించునో

యట్టిదానినే చేయుచుండవలయుగాని యంతరాత్మకు విరుద్ధములైనకార్యములఁ జేయగూడదు.

ఆత్మనతుష్టి రేవచ. మను. అ. 2.

తనయాత్మ కెయ్యది యానుకూల్యముగనుండునో య దియేధర్మము. దెబ్బదగులుటవలన దనకెట్లుదుఃఖముగలుగునో యటులే యితరప్రాణులకుగూడ గలుగుగదా! దుఃఖమనుభవించుట ఆత్మకువిరుద్ధమగుటచేత నట్టిదుఃఖమును హృదయమభిలషింపదు.ఇటులేసమస్తప్రాణులస్థితియునై యున్నది గావున

ఆత్మవత్ సర్వభూతేషు. హి. 1.

సకలప్రాణులుగూడ దనతో సమానమనుకొని యటులేవర్తింపుచుండవలయును.

ధృతిక్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః
ధీర్విద్యాసత్యమక్రోధో దశకంధర్మలక్షణం మను. అ.6.

ధృతి—మనోవాక్కాయంబుల ధారణాశక్తినభివృద్ధిపరచికొని ధీరత్వమూనియుండుటయు, క్షమా—దుష్కార్యములఁజేయువారలను సుకర్మపరులుగఁజేయుటయందు సంభవించునట్టిశ్రమమును సహింపగలిగియుండుటయు, దమ—మనసునువశముజేసికొనుటయు— ప్రపంచమందలి సకలకార్యంబులు మనస్సునకాధీనములై యున్నవి. కావుననే

యత్ ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చయజ్జ్యోతిరంతరమృతం

ప్రజాసు, యస్మాన్నఋతే కించన కర్మక్రియతే తన్మేమనః శివసంకల్పమస్తు. యజు. అ. 34.

ఏయదియుత్తమజ్ఞానంబును ధృతిరూపకచిత్తంబునునై యున్నదో, యెయ్యదిజ్యోతులకెల్ల జ్యోతియై సమస్తప్రజాసంతతులయొక్క యభ్యంతరములందు విద్యమానమైయున్నదో, యెయ్యది ఇష్టపడనిచో మనుజుఁడేకార్యమునుగాని జేయఁజాలఁడో యట్టిమనస్సు శుభసంకల్పముతోఁగూడుకొన్నదియగుకాక యని యజుర్వేదమున బ్రతిపాదనము జేయఁబడియున్నది. మనసు పరిశుద్ధమై మానవునియొక్క వశమయ్యెనేని సకలదుష్కార్యములనుండి దూరగుఁడై మనుష్యుఁడుధార్మికుఁడు గావచ్చును. అట్టియీమనస్సును వశము జేసికొనుటకు ముఖ్యోపాయమేదనఁగా

అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః. యోగ. పా. 1.

అభ్యాసమున ననఁగా మనసును గ్రమక్రమంబుగ బ్రాణాదులయందు లీనమగునట్లుజేసికొని స్థిరపరచుకొనవలయును. నేడొకనిమిషమువరకును, మరునాఁడు రెండునిమిషములవరకును, మూఁడవనాఁడు మూఁడునిమిషములవరకును నిటులే యథాశక్తి మనసునునిలిపికొనియుండుట కభ్యాసము జేయవలయును. మనస్సు ఏదైనదుష్కార్యమునిఁదికి బోయినయెడల వైరాగ్యముతోఁదానివెనుకకు లాగికొనుచుండవలయును. ఎట్లు

నఁగా నేదుష్కర్మమునైన జేయవలయునని మనసు అభిల
షించునప్పుడు "ఏశరీరమునిమిత్తము నేనింతటిఘోరములైనడి
యత్యాచారంబుల నొనరింపనెంచుచున్నాడనో యట్టికార్య
ములవలన లోకమునకు మహోపకారముగలుగును. శరీరము
నాశనమునొందు స్వభావముగలుగుటచే నెప్పుడో యొకప్పుడిది
నశించును. కానిచేసినపాపము ప్రాణినివెన్నంటియేయుండును.
కావున నట్టియనిత్యమైన యీశరీరముకొఱకు నేనుపాపమేలచే
యవలయు?" అనియిట్లుబోధించికొని దుష్కార్యములనుండి మన
స్సును వెనుకకులాగికొని యుక్తిపూర్వకముగ స్థిరపఱచుకొనవ
లయును. అస్తేయం—ఇతరులయొక్క వస్తువులను వారియను
మతిలేక తీసికొనకుండుటయు, శౌచం—మనోవాక్కాయం
బుల బరిశుద్ధముగనుంచుటయు, ఇంద్రియనిగ్రహః—ఇంద్రి
యములజయించియుండుటయు, ధీః—బుద్ధినభివృద్ధిపరచికొ
నుటయు, విద్యా—చదువుకొనుటయు, సత్యం— సత్యంబును
సేవించుటయు- సత్యమును సేవించుటంజేసి మనుజుఁడు పర
మధార్మికుడగును. ఎట్లనఁగా దొంగతనము మొదలగుదు
ష్కర్మములు జేయునపుడబద్ధమాడవలసివచ్చుచుండును. అబ
ద్ధములు లేక దుష్కర్మములజేయుట కవకాశమేలేదు. మ
నుజుఁడెప్పుడబద్ధములాడుట బరిత్యజించునో యప్పుడే దుష్కా
ర్యము లొనరించుటఁగూడ ద్యజించవలయును. అట్లుదుష్కా

ర్యముల వదలుటతోడనే ధార్మికుఁడగుట కవకాశముగలుగు
ను. కావున సత్యమేవచింపుచు, సత్యమేనమ్మచు, సత్యము
గవర్తించుటయే మనుజులకు బరమధర్మము.

సువిజ్ఞానం చికితుషే జనాయసచ్చాసచ్చవచసీ పస్పృధా
తే తయోర్యత్సత్యం యతరదృజీయస్తదిత్సోమోవతి
హంత్యసత్. అథ. కాం. 8. అను. 2. వ. 10.

అత్యుత్తమమైన జ్ఞానంబును బొందవలయునని కోరు
చుండు మనుష్యునకు సత్యాసత్యములు రెండు వానివాని ప్ర
భావము గనుబరచుచుండును. వీనిలో సత్యమే పరతమైన ధ
ర్మము. ఇదియే మనుజుని గాపాడుచుండును. అసత్యము మా
నవుని దుర్వ్యసనములలో ముంచి యుభయలోకములకు గాని
యట్లతని జన్మమును నాశనము జేయును. కావున నెల్లవేళల స
త్యమునే గ్రహించుచు నసత్యమును విడచుచుండుట సకలమా
నవులకు ముఖ్యమైయున్నది.

సత్యమే వేశ్వరో లోకే సత్యే ధర్మః సదాశ్రితః
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తిపరంపదం.
వా. రామా. అయో. స. 109.

జగత్తునందు సత్యమే పరమేశ్వరుఁడు. ధర్మమె
ల్లప్పుడు సత్యమునే యాశ్రయించికొనియుండును. సమస్తప
దార్థములు సత్యమూలములై యున్నవి. సత్యమునకంటె వే

రైన పరమపదమేదియులేదు అనఁగా బరమేశ్వరుఁడును, బరమే శు నాశ్రయించి యుండు ధర్మము, ప్రకృతి, మోక్షము మొదలగునవన్నియు సత్యరూపములై యున్నవి. కావున నెల్లప్పుడు సత్యమునే గ్రహింప వలయును. మరియు

సత్యంబ్రూయాత్ ప్రియంబ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియం ప్రియంచ నానృతం బ్రూయాత్ ఏషధర్మ సనాతనః. మను. అ. 4.

సత్యమును బ్రియమును నైన వచనము జెప్పవలయును గాని యప్రియంబగు సత్యమును జెప్పఁగూడదు. ప్రియమైన యసత్యముగూడ జెప్పఁటదగదు. ఇది సనాతనధర్మము. ఇందలి యప్రియమగు సత్యమెట్టిదన దేనివలన వినువానికి గొంచెమైన లాభము లేకపోవ మీఁదుమిక్కిలి యుద్వేగముగలుగునో యట్టిదానిని జెప్పఁగూడదు. గ్రుడ్డివానిదగ్గరకుఁబోయి "నీవు గ్రుడ్డివాఁడ"వనినయెడల నది సత్యమేయైనను నప్రియమగుటచే నతనికుద్వేగము గలుగును. అప్రియ సత్యకథనంబున వినువానికి లాభముగలుగునెడల నట్టిదానికి నిషేధము లేదు. అబద్ధములుగొన్ని తాత్కాలిక ప్రియముం గలిగింపనోపును గాని యట్టివాని వచించుటతగదు.

భద్రంభద్రమితి బ్రూయాద్భద్రమిత్యేవవావదేత్
శుష్కవైరం వివాదంచ నకుర్యాత్ కేనచిత్ సహ.
మను. అ. 4.

ఎల్లప్పుడందరితో కళ్యాణప్రదములైన మాటలనే యాడుచుండవలయును, నిష్ప్రయోజనమైన వకవాదంబును, విరోధంబును నెవరితోగాని యెప్పటికిఁ జేయగూడదు. ఎంతటిరాజాధిరాజయినను, నెట్టియోగి, యెట్టియతి, యెట్టిధనాఢ్యుఁడైనను, నెట్టిప్రతిష్ఠగల బురుషుఁడైనను నబద్ధములాడుట మొదలిడినయెడల నాసంగతిబయటబడిన తత్క్షణమందె జనులకతఁడు దుచ్ఛుఁడుగ గన్పించును. అసత్యమభివృద్ధినొందుటవలన మనుష్యసంఘమున కమితమైన హానికలుగుచున్నది. ఈయపాయమునుండి తప్పించుకొనుటకు మనుష్యులందర రన్నివిధముల నసత్యమును నాశనముజేయవలయును. అట్లే యక్రోధ — కోపము నశింపజేసికొనుటయు మొదలగునవి ధర్మలక్షణములైయున్నవి. మనుష్యుఁడు క్రోధముచే నొడలుమరచి కారణములేకయే తలిదండ్రులు గురువు లోనగువారల నిష్ఠురవాక్యంబుల నొప్పించుటయేగాక దండప్రహారంబులచేత నయితము వారలకు దుఃఖము గలిగించును. కావున గోపంబును రూపుమాప బ్రయత్నింపవలయును. మఱియు,

వేదః స్మృతిః సదాచారః స్వస్యచప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం.

మను. అ. 2.

వేదమందు బ్రతిపాదనము జేయబడియున్నట్టియు, వే

దానుకూల్యములైన స్మృతులయందు జెప్పబడియున్నట్టియు, సత్పురుషు లాచరించునదియు, దనయాత్మకిష్టమగునదియు నేదిగలదో యదియే ధర్మము. దేని నవలంబించుటవలన మనుజులు సకల సుగుణాలంకృతులగుదురో, యేదిలేకయుండిన గుణములన్నియు నవగుణములగునో యదియే సత్యధర్మము. ఎవనియందట్టి సత్యధర్మముగలుగదో యతఁడు పేరునకుమాత్రము మనుజుఁడు జగత్తునందు గలుగు సౌఖ్యమంతయు ధర్మముయొక్క ఫలితమేగాని యితరముగాదు. నిక్కమాలోచింప సత్యముతో సమానముగ మనుష్యునకు దోడుపడునది వేరేదియులేదు.

ధర్మంశనైః సంచినుయాద్ వల్మీకమివపుత్తికాః
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్.
నాముత్రహి సహాయార్థం పితామాతాచతిష్ఠతః
నపుత్రదారా నజ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః.
ఏకంప్రజాయతే జంతురేక ఏవప్రలీయతే
ఏకోను భుంక్తే సుకృతమేక ఏవచదుష్కృతం.
మృతం శరీరముత్సృజ్యకాష్ఠలోష్ఠసమంక్షితౌ
విముఖాబాంధవాయాంతి ధర్మస్తమనుగచ్ఛతి.
తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యంసంచినుయాచ్ఛనైః
ధర్మేణహి సహాయేనతమస్తరతిదుస్తరం.

మను. అ. 4.

చలిచీమలు మెల్లమెల్లగ నొక్కొక్క మృత్కణము తోడ గొన్నిదినములలో బెద్దపుట్టను నిర్మాణముజేయులాగున మనుజుడుగూడ నేప్రాణికిని దుఃఖము గలిగింపకుండ క్రమక్రమముగ ధర్మమును సమకూర్చుకొనవలయును. పరలోకంబున మనుజునకు ధర్మముదప్ప భార్యాపుత్రులు, తలిదండ్రులు మొదలగు బాంధవులెవ్వరు సహాయమునకురారు. మానవుడీప్రపంచములోనికి నొంటరిగవచ్చి మరల నొంటరిగనే పోవుచుండును. ఎవడుచేసికొను బుణ్యపాపముల ఫలములైన సుఖదుఃఖములను నతడే యనుభవించుచుండును. మనుజుడు మరణించినతోడనే యతనికి గావలసిన వారలాదేహమును దగులనైచియో లేక నేలలో బూడ్చియో యెవరియిండ్లకు వారలు దిరుగజనుచుందురు. ధర్మమొక్కటియే యతని వెనువెంట బోవును. కావున మనుజులు తమసహాయార్థము ధర్మముగావించుటత్యంత ముఖ్యమైయున్నది. ధర్మసహాయంబుననే మనుజుడు గొప్పగొప్పదుఃఖములనుండి విముక్తినొంది సౌఖ్యము ననుభవింపగలుగును ధర్మముతో సమానముగ మనుష్యునకు దోడ్పడు వస్తువు వేరేదియులేదు. కావున సదార్యవైదికధర్మము నవలంబించుట సమస్తజనులకు యోగ్యమైయున్నది. అట్టిధర్మము నార్యసమాజము ప్రచారముసేయుచున్నది గ్రహింపుడు. మనుజులు తమహితార్థము వేదధర్మము

నవలంబించి నడచుకొనుట ముఖ్యకర్తవ్యము. మేమీగ్రంథ
మున బ్రతిపాదనముజేసియున్నవానినెల్ల స్వీకరించి పాఠకులు
భయలోకంబుల దరించెదరుగాక యనిన మ్మచున్నారము.

1. అవనియః సతతం సమనుష్ఠితః
సముచితైర్వివిధైశ్చతురాశ్రమాః,
సకలసౌఖ్యకరః సగృహాశ్రమో
బహుధనైః సుజనైః కిలసేవ్యతాం.

2. మునిభిరప్రతిమోద్ధృతయోగజైః
రవిరతం పరమాత్మని నిష్ఠితైః,
వననివాసిభిరప్యురరీకృతాః
సచజనైః సుజనైరివసేవ్యతామ్.

3. ప్రియతమాకర ఏషగుణాకలః
సుఖకరఃసచ సంతతివిస్తరం,
బహుతరం విదధాతి సుకర్మభిః
సచజనైః సుజనైరివసేవ్యతాం.

4. ఉపగతైః సమయోచితవస్తుభిః
ప్రసృభసత్ ప్రియతామను సేవిభిః,
సుఖమతిప్రమితం సులభంయతః
సచజనైః సుజనైరివసేవ్యతాం.

5. ప్రియజనేష్వపి దుర్జనతామను

ప్రవిశతి ప్రియతాం నచయన్మః,
సముచితం ద్రవిణంచనసంచితం
నచనరైరవరైః స సుఖాయతే.

6. ఆర్యావర్తః పతతినితరాంయేన సంతప్యమానం
మన భూయోభూయః ప్రబలరిపుణానిత్యమాలస్యనామ్నా,
దలగ తస్యత్యాగః పరమపురుషార్థస్యచాదానమాత్రం
పం శ్రౌతైః స్మార్తైర్నిగమవచనైర్వర్ణితం పుస్తకేస్మిన్.
స మనుష్యజన్మార్జితపుణ్యకర్మణా
విధీయతాంకింకిమతిక్రమాగతం,
సమంతతోవర్ణ తమంత్రపుస్తకే నిరీక్ష్యలోకవ్యవహారచేష్టితం.

8. ససంసారోత్పన్నం చరితమనుకూలం కిమపివైః
విధాతుంసంశక్తః సుమతిరపియస్యానభిముఖః
క్రమాదస్మింస్తస్య ప్రకరణకలాపః సముదిత
ప్రకాశేనైవాతః సయుతపురుషార్థేనగదితః.

9. అవిదితమిహాలోకేస్యార్య దేశస్యకస్య
ప్రతివిషయసమృద్ధిః సర్వవృద్ధిర్యథాధూత్
సముదితపురుషార్థేనైవ నిశ్శేషతస్తాం
కథితుమచలబద్ధిత్తశ్చిత్తవాన్ కఃసమర్థః.

10. నివేద్యతేంతే వినివేదనీయం

జహీంఘీం సర్వాలసతాంసతాంచ
సమున్నతోయః పురుహోర్థమార్గః
ప్రవృత్యతాం తత్రసుఖాయనూనం.

పశ్యేమశరదఃశతం జీవేమశరదఃశతం
బుధ్యేమశరదఃశతం రోహేమశరదఃశతం
పుష్యేమశరదఃశతం భవేమశరదఃశతం
భూషేమశరదఃశతం భూయసీఃశరదఃశతం

అథర్వ. కాం. 19. వ. 67.

ఇది శ్రీమద్విశ్వేశ్వరానంద నిత్యానందవిరచి
తంబైన పురుషార్థప్రకాశమందు
గృహస్థాశ్రమప్రకరణము
సర్వము సంపూర్ణము.

అనేక వేలు విక్రయము.

ప్రయివేట్లకు — కరణములకు

వర్తకవ్యాపారస్థులకు — భూస్వాములకు

# బొటనవ్రేలి ముద్రపెట్టెలు

పూర్వము ప్రామిశరీనోట్లు, ఖాతాఅక్కౌంట్లు, కౌలు ఖత్తులు యీ మొదలైన దస్తావేజులపైని చదువను వ్రాయను రానివారల సంతకములకుబదులు ఆపత్రములను వ్రాసినవారలే ఆనిశానీదార్ల నిశానీలను చేయుచుండెడివారు. అట్టి వాడుక వలన క్రమ క్రమముగా అనేకయిబ్బందులు కలవని గవర్నమెంటువారు తెలిసికొని నిశానిదార్ల నిశానిలతోపాటు వారి ఎడమచేతి బొటనవ్రేలి ముద్రనుకూడా వేయవలసినదిగా నేర్పరచినారు. అట్టి ముద్రలు లేనిచో నిశానిదార్లు ఆ నిశానీలు తమ అనుమతిమీద కావని వాదించుటయేకాక, గవర్నమెంటువారు నమ్ముటకుకూడా వీలు లేకున్నది. ఈసంగతి తెలిసిన కొందరు పత్రములు వ్రాసిన సిరాతోనే బొటనవ్రేలి ముద్రలు వేయించుచున్నారు. అట్లు వేయుటచే స్పష్టముగ కనుపడక, అలికినట్లుంటచే న్యాయాధిపతులు మొదలగువారు ఆముద్రలు నిశానీదార్లవేయని నిరూపించుటకు సంకోచించి త్రోసివేయుచున్నారు. అందుచే వ్యవహారముగల ప్రతివారును చాలనష్టపడుచున్నారు. కావున అట్టినష్టము తొలగించుటకయి ,,వి.వి. ప్రసాద్ అండ్ కో" వారు అట్టిముద్రలకు పనికివచ్చు మేలైన సిరాయున్నూ దానితో అద్దవుపెట్టె పిడివేసిన రబ్బరు రోలరు యీ మొదలైనవి యొకచిన్న చక్కని పెట్టెయందిమిడ్చి, ఆపె

ట్టె నందరికి సులభ సాధ్యమగునటుల 1 కి రు 1 8 0 నా॥ విక్రయించుచున్నారు. వాడెడువిధము దెలుపు కాగితము పెట్టెలోనుండును. ఒక్కొక్క పెట్టె సుమారు 10 సం॥ల వరకు పనికివచ్చును. పోస్టుఖర్చులు వేరు.

వి. వి. ప్రసాద్ అండ్ కో, గుంటూరు.

ఒకేసారి డజను లుకొనువారికి మంచిడిస్కౌంటుయివ్వబడును.

ప్రతియూరియందును ఏజంట్లు కావలయును.

. All Stamps are mounted upon Rubber cushions Rubber stamps of line, circle, oval, garter, Fancy, & facsimilies for, private, business & office use are prepared at very short notice charges very cheap. Catalogue on Application

Fancy Ivory fans in plain while Ivory folding comqaet & beautiful. Rs. 8 each.

మాచేజేయబడు రబ్బరు స్టాంపులు, అక్షరములు స్ఫుటముగానుండి చాలకాలమువరకు చెడిపోకయుండెడి పరిశుద్ధమయిన రబ్బరుతో చేయబడుచున్నవి. ప్రతి ముద్రయున్ను రబ్బరుమెత్తలుగల పిడలకు అంటించబడి చాలాచవుకధరలకు అమ్మబడుచున్నవి. క్యాటలాగు ఉచితముగా పంపబడును.

షర్బత్తులు:—గులాబీ, చక్రకేళి, షర్బత్తులు వంటికి చాలా చలవచేయును. పరిశుభ్రముగానుండును. ఖరీదుసీసా 1 కి రు 1-0-0.

వి. వి ప్రసాద్ అండుకంపెని, గుంటూరు.

SYRUPS:— of Rose, Banana, cooling and refreshing cost. Rs. 1 per bottle.

THUMB IMPRESSION Sets:—Each set contains Ink, Handled roller & glass slab. The Ink supplied is sufficient to take 10000 Impressions.

Price per set Rs. 1-8-0 Postage Extra.

శ్రీ

1 తాలుకుట్టనము. వెంకటరామకృష్ణకవుల యట్టహాసమునకు విమర్శనము

2 బిడాలోపాఖ్యానము

3 గుంటూరు కాలేజి శతావధానము

4 కొవ్వూరు శతావధానము

5 తెనాలి శతావధానము

6 బెజవాడ శతావధానము

## IN THE PRESS.

1 వివాహకాల విమర్శనము. (Telugu translation to the "Marriageble age of Dvija girls by Sreenivas Saastri, Proffessor Sanskrit College Mylapore.

2 హస్తిపుర సామ్రాజ్యము

3 బాటసారి

4 పూరూదయము (చక్కని నాటకము)

Apply to
V. Siva Ramasastri,
Sathavadhani,
Aukiripalli,
Kistna.

# శ్రీసత్యహరిశ్చంద్రీయము

ఈపుస్తకము బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిరత్నప్రణీతంబైన చక్కని నాటకరాజము. ఆరంకములు మాత్ర మేకలిగి ప్రతినాటకశాలకు కొంగుబంగారమై విలసిల్లు. పుస్తకముయొక్క సుగుణ మింతింతయని పొగడనావశమా? శ్రీహరిశ్చంద్రచక్రవర్తియొక్క రాజ్యబరిపాలనము. పరిపాలనమందలి జనులవిశ్వాసము ఇన్నింటికి మించిన దుఃఖరసము వర్ణింప నేరితరము. జూచినపిమ్మట చదువరులే గ్రహింతురుగాక

సీ॥ కొడుకా! యటంచు నాఁపడునవస్థకు జాలిగొనియేడ్చు నలదిశాంగనలతోడు
తనజంటబాసి మింటను ఱెక్కపూపుచు శోకించునలచక్రవాకితోడు
ననునూఱడింప పారరనియేడ్చు లోకపావనియగు గంగాభవానితోడు
ననుజూచిబొటబొటఁ నునుమంచుకన్నీళ్లలంగార్చురతి వెయిల్లాంద్రతోడు
ఆపదకైనవారి నాఁయన్నవారి
దిక్కులేకట్టి నావంటిఁదీనలతికి
కాశికావిశ్వనాథుడేఁకలఁడుతోడు
కడమతోడేడ నాకునూఁకాటికేఁడ।

మ॥ కడప్రాణంబుననున్న వాడొ విసమెఁ తక్కర్ జచ్చెనో కాసలో
గొడుకమ్మా! ననుబంపకుండిననుయోఁగ్యుండైన వైద్యాద్వరం
బడియుచ్చోటికినంపవమ్మ బ్రతికింఁపర్ జాలునేమో సుతుర్
గడకాళ్ళందినమస్కరింతు సుతఁభిక్షం బెట్టిరక్షింఁపుమా॥

వలయువారు

వి. వి. కే. లక్ష్మాజీరావు,

గుంటూరు.